




చెన్నపట్టణము సెప్టెంబరు ౧౯౨౬

సంపుటము 3 అక్షయ సంవత్సరము భాద్రపదమాసము సంఖ్య ౯

# శ్రీ దేవీ మానసిక పూజ

విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రి గారు

శ్రీలసమానలోచనమరీచులఁ బ్రేమము జాలువాఱఁగా
హేల సమస్తలోకము లహీనసుఖంబులఁ గావఁగా నుషః
కాలిక మంగళధ్వనులఁగావిరికన్నుల నల్లవిచ్చుచున్
బాలశశాంకమౌళివరభామిని, మేల్కనుమమ్మ! వేకువన్.

క. కనకవితర్దివిశోభిత, మును బూర్ణసువర్ణకుంభభూషితమును నా
మణిమంటపమధ్యమునకు, జననీ, నాపూజలందఁ జనుదేవమ్మా!

శా. చంచత్కాంచనవేదికావిహితమున్ స్వర్ణాంబుజాకీర్ణమున్
బ్రాంచత్కోటినవార్కరమ్యము సుతూలాఢ్యమ్మునై యొప్పు ర
త్నాంచత్సింహవరాసనమ్మున మదంబా! ప్రీతిఁ గూర్చుండి నీ
యంచత్పాదయుగమ్ము నీకనకపీఠాఢ్యమ్ముఁ గావింపుమా!

మ. ఘనముక్తామణినిర్మితంబయి సదా కల్యాణసంధానమై
కనకస్తంభచతుష్టయీకలితమై కమ్రాతికమ్రంబునై
జనతాపాప వినాశకంబయి మహాంచద్దీప్తి దైవాఱు నీ
కనకోల్లాభము నందుమమ్మ, దయతోఁ గామారిభామామణీ!

క. దూర్వాసరసిజపరిమళ, ఘూర్వహ మిదె కొనుము పద్మతుల్యంబగు నీ
చార్వంచితపదయుగమున, సర్వేశ్వరి ! పాద్య మమరచయహృద్యమ్మున్.

చ. జనని! యవాక్షతాకలితసర్షపపుష్పతిలాంచితమ్ము చి
ద్ఘనఘనసారమిశ్రితము కాంచనపాత్రసురక్షితమ్ము స
త్కనదురురత్నసంయుతము కైకొను మర్ఘ్యము భక్తపాపసం
హననధురీణ దాసజనతావనరీణకృపాణ పార్వతీ !

క. సరసిజశోభాకరమగు, కరమున జాతీలవంగగంధిల మమృతా
దరమగు నమృతమ్మున నో, పురహరసతి! యాచమనము పొనరుపఁగదవే!

గీ. కనకసంపుటమున నుంచి కమ్రరత్న, మయపిధానకమున మూఁత మలఁచినాఁడ
జనని, మధుపర్క మిదె కొమ్ము శారదేందు, కుందసితహాస ప్రత్యగ్రకుందరదన!

మ. తతనానావిధపుష్పవాసితము రత్నస్వర్ణపాత్రాహిత
మ్మతిసౌరభ్యచరద్ద్విరేఫ మమకీహస్తాంబుజాతావళీ
ధృత మీచంపకతైల మల్దుము భ్రమద్భృంగాంగనాపాళి సం
చితచారూపమకేశపాశమున సుశ్రీమీఱ మాహేశ్వరీ!

సీ. జనని! కుంకుమపంకమున హేమరజమున, నవ్యకేసరముల నలుఁగు వెట్టి
కేశమ్ము లామలకీరసమ్మున రుద్ది, విశదకస్తూరికాన్వితములైన
నవరత్నకుంభకాంచతోష్ణజలముల, దధిదుగ్ధఘృతమధుశర్కరా
రామృతములతోడ నభ్యంగ మొలార్చి, యేలానలదసుమహీరమౌక్తి
కాయుతమ్మైన స్వర్ణోదకమ్ముతోడ, వేదతంత్రాద్యమంత్రముల్ వించు నధిక
సాదరమ్ముగ మజ్జన మ్మాచరింపు, మఖిలలోకైకధాత్రి, యహార్యపుత్రి!

మ. ఇదె బాలార్కసమానవర్ణము జపాప్రీదమ్ము సర్వోత్తమ
మ్మది శౌచిత్రము దివ్యవస్త్ర మొగి సొంపుల్మీఱఁ గైసేయుమా
చిదచిద్రూపిణి, మౌక్తికగ్రథితసుశ్రీ కంచుక మ్మిదె తో
డ్గ దయన్ బ్రావ రణాంశుకమ్ముతటిదంకూరాభము గొమ్మజా!

క. చంచత్కాంచనరత్నా, భ్యంచిత మిదె పాదుకాద్వయము దీన దయో
దంచితపదయుగ్మ మ్మిడి, క్రౌంచఘ్నజనీ! మదర్చఁ గైకొను మంబా!

సీ. బహుళదశాంగధూపమ్ముల నర్పించి, కంకతమ్ముల కైశికమ్ము దువ్వి
యురుతరాంబుజచంపకోత్కరముల చర్చి, కనకదామములవేణిని ఘటించి
కనులసౌవీరంపుఁ గాటుక నలరించి, కమలాసనాదికోత్కంఠఁగూర్చి
మంజీరములఁ బాదకంజమ్ములకుఁ దార్చి, కటిని గాంచీదామకమ్ముఁ బూన్చి
ముత్తియమ్ములపే రురమున గళమున, చుక్కలసరమ్ము ముంజేత శుభ్రరత్న
వలయములు బాహుపురులు శుంభద్భుజముల, చెవుల రతనాలకమ్ములు శీర్షమంద
హీనరించోళిచూడామణీంద్ర మిడుదు, వానిఁ గైసేయు మమ్మ పర్వతకుమారి!

సీ. కాశ్మీరకర్పూరకస్తూరికాగురు, వుల ఫాలతలమునఁ దిలక మలఁది
తనులతఁ గలఁపంబు స్తనముల యక్షక, ర్దమసుమరజముల నమరఁ జల్లి
పదముల గంధంబుఁ బారాణియు నలంది, యక్షతమణుల ముక్తాక్షతముల
నక్షతయవల శాల్యక్షతంబులఁ బూజ, లర్పింతు మానసాహ్లాదగరిమ
సుదతి సంపఁగినూనె కస్తురిరజమ్ము, సరసచందనమును జతుస్సమము గాగ
భక్తి నర్పింతుఁ గైకొమ్ము పర్వతేంద్ర, వంశముక్తామణీ, త్రిభువనసవిత్రి!

క. పాపట నిడుసిందూరము, తాపాపహమై ప్రహర్షదమ్మై బాలా
ర్కోపమమై స్మృతిమాత్రన, పాపాంధతమసమడంచుఁ బర్వతపుత్రీ!

సీ. మందారకరవీరకుందలవంగచం, పకజపావకుళకైతకసుజాతి
కాంచనకర్ణికారాంచితకరవీర, మల్లికాశతపత్రమాధవీసు
పారిజాత సుకోవిదారాంబుజమ్ముల, నర్పించి లాక్షాసితాభ్రకలిత
శ్రీవాసకర్పూరశివమధుగోసర్పి, రాక్తశ్రీఖండదార్వగురుగుగ్లు
ప్రభృతివస్తుంధూపముల్ పరగఁజేసి, కనకమణిపాత్రికాఘృతాక్తప్రదీప
ములను రత్నోజ్జ్వలద్దీపముల నివాళి, సేయుదును గొమ్ము గిరివరశాయిదయిత!

గీ. అమలమణిపాత్రమున విశాలముల ఢమరు, రూపములఁ బక్వగోధూమ దీపముల గ
వాజ్యసంప్లుతముల నుంచి సాదరముగ, నిత్తు నారార్తికమునందు మీశపత్ని!

గీ. జానుయుగళంబు భూస్థలి నూని శిరము,నందు నారతిపళ్లెర మంద మలరఁ,
దాల్చి ముమ్మారు నీముఖతామరసము,నకు నివాళించు ననుగావు నగకుమారి!

మ. పెరుగుం బాలును శాలికాన్నము ఘృతాభిఘార్యాత సంతానికా
వరసూపంబు లపూపము ల్వటుకము ల్వాసించు సుక్షౌద్రముల్

నురుగల్ బూరెలు నప్పడంబులును మణ్గుంబూవులుణ్ లడ్డువుల్
వరరంభాఫలముల్ సితాయుతముల౯ భక్షింపుమా శంకరీ!

క. జీరకనాగరహింగు, క్షారసశైలామరీచసంస్కృతములు స
ద్ధారాఘృతతులితములగు, కూరల భుజియింపు మమ్మ, కుధరకుమారీ!

క. మందావులక్షీరంబిదో, మందారసుమోద్భవమ్ము మధువిదె యమ్మాతా
మందోపమజంబిదె యా, నందంబునఁ గ్రోలుమమ్మ, నగరాజసుతా!

గీ. వెండిపాత్రమందు వేఁడినీట ముఖమ్ము, చేయిదోయి కడిగి సిరులుదొల్కు
కప్పురంబు మంచిగంధమ్ము కుంకుమ, మలఁదుమమ్మ, కరరుహాళి మెఱయ.

మ. అతిశీతమ్ము నుశీరవాసితము వస్త్రాపూతముణ్ గాంచనా
యతపాత్రీవినివేశితమ్ము జల మంబా, త్రావుమీ క్షౌద్రసం
యుతరంభాఫలముల్ రసాలములు ద్రాక్షోపేతనారంగముల్!
వితతాస్వాదసునారికేళములనోలిం బ్రీతి భక్షింపుమా!

గీ. సరసదాడిమజంబీరజాంబవముల, చూతకూశ్మాండపనసకోశాతకముల
నారికేళాతిమధుర ఖర్జూరకముల, ఫలము లర్పింతు కొమ్ము పర్వతకుమారి!

సీ. ఏలాలవంగతక్కోలకర్పూరజా, తీపూగఖదిరహూర్తికసుధాఢ్య
మతివేలసౌరభాంచితఘనసారక, స్తూరికానాగదళారచితము
తాంబూల మర్పించి ధౌతముక్తారత్న, ముల నేన లిడి వస్త్రముల నొసంగి
మాణిక్యదివ్యముక్తానీకమహితమౌ, కనకవృష్టిని కానికల నొసంగి
కనకదండకలితఘనహేమకలశంబు, వివిధరత్నయుతము విధుసదృశము
త్వష్టృరచిత మిదె సితచ్ఛత్ర మర్పింతు, నాదరమున నందుమా భవాని!

క. శారదచంద్రమరీచీ, గౌరము లురుహూర్తికప్రకాండమ్ములు నా
చారుచమరవాలమ్ముల, గౌరవమున వీచు నన్నుఁ గరుణింపు ముమా!

గీ. తపనమండలసదృశ మ్మదగ్రరత్న, దర్పణ మ్మిదె పూర్ణచంద్రప్రభ మగు
నాననముఁ జూచికో మదంబా! రవీందు, మండలము లొక్కెడం గూడియుండినట్లు.

శా. వేయింగన్నులవేల్పుదొట్టి సుర లేవేళ న్నమస్కారముల్
సేయ౯ వారి కిరీటపంక్తులు భవచ్ఛ్రీపాదపీఠంబుచే
శ్రీ యింపార నివాళినందు గిరిపుత్రీ, నీమసర్వాంగముల్
వేయు౯ దీపికలు౯ సుపూర్ణముగ నేవేళ న్నివాళించెదన్.

మ. వరసౌవర్ణవిభూషణమ్ము సుమణీపల్యాణసన్నద్ధమున్
బురుహూతార్వసమానవేగ మచలప్రోత్తుంగముం గర్ణభా
స్వరహేషారవ మశ్వరాజ మిదె సంవాహ్యంబు గావింపుమీ
తురగప్రేష్ఠసహస్రసేవితము నిర్ధూతాహితా, శ్రీనుతా!

సీ. మొకరి తేఁటులపాటలకుఁ దానకంబైన, దుగకుంభముఁను సిందుర మలంది
బంగారుగంటలపసిఁడిమువ్వలఁ గ్రాలు, కనకదామము కంఠమున ఘటించి
చెవిదోయి నతిసితచ్ఛవి చామరయుగమ్ము, లడరించి సొమ్ముల బెడఁగుఁ దీర్చి
డాలు మీఱెడు రతనాల దుప్పటి మును, బొడుపుఁ గొండను సంజవోలెఁ గూర్చి
మించి కైసేసి నీకు నర్పించినాఁడ, నింద్రునైరావతమ్మున కిది కడింది
భద్రసామజశతపరివారితమ్ము, మత్తమాతంగరాజ ముమా! గ్రహింపు.

గీ. పవన జవనాశ్వకలితము భర్మశృంగ, మమలహీరవరూథ మ్మహార్యతులిత
మురుమణివితానలలిత మనూనరత్న, చక్రయుక్తము రథ మిదె సరవిఁగొనుము!

మ. కరులుం దేరులు గుఱ్ఱముల్ భటు లసంఖ్యాస్ఫూర్తిఁ దైవాఱఁగా
వరభేరీనినదంబు నల్దెసలఁ బర్వం ధీరతారంగితో
ద్ధురమా సైన్యము నీకు నర్పణము సేతుం దీనిగైకొమ్ము దం
తుర మందస్మితసుందరాననము దీప్తుల్ దేర మాహేశ్వరీ!

క. పరిఘీకృతసాగరమై, పరసాపత్నహితమై విభాగదృఢమ్మై
ధరణీశలాభిధంబగు, వరదుర్గ మ్మిది మహేశి! వసియింపు మిటన్!

గీ. లాసకవిలోలకుంతలభాసమాన, గళితమాల్యవికీర్ణరంగప్రవేశ
రుచిరలావణ్యవతి జాతరూపగాత్రి, నటి విలోకింపుమా నగనాథతనయ!

క. కలువలతో నైజమ్మగు, చలువలతో హృదయహారి సౌరభములతో
నలి ఝూంకృతివ్యంజనమ్ముల, నలరఁగవీచెద ముదంబు నందుము జననీ!

సీ. కొదమ తుమ్మెదచాలు నదలింపఁగాఁ జాలు, జడలతోఁ గలహంసనడలతోడఁ
బండు వెన్నెలడాలు నిండింపఁగాఁబోలు, నగవుతో జిగికొను బిగువుతోడ
దబ్బపండులతళ్కు నుబ్బార్పఁ గుల్కు పా,లిండ్లతోఁ గను బొమవిండ్లతోడ
నల్లచీమలబారు వెల్లసేయఁగఁ గేరు, నారుతో మురిపెంపు సౌరుతోడఁ
గళల నీనెడు ముద్దుమొగములతోడ, యువజనంబుల మనము లుఱ్ఱూఁత లూఁచు
బాలికలు నర్తనములను బాటలను భ, వన్మతిని సంతసము నింత్రు వారిఁ గనుము.

గీ. నీగృహద్వారమున విపంచికల మీటి, కమ్రసప్తస్వరముల నఖండగతులఁ
బాడుచుందురు గంధర్వ బాలికలు మ, హేశి, వీరలగాంచు మహీన దయను.

గీ. అచ్చరలనాట్యములఁ జూచి మెచ్చు నీదు, నెదరు నచ్చెరువు ఘటింప హృద్య గీత
నృత్తవాదిత్రములను సంప్రీతిఁ గూర్తు, నేను నిదె కనుమా మహేశానుదయిత!

క. ఆనలువఁ దొట్టి వేలుపు, లూని భవద్గుణము లెన్న నోపరన మహా
జ్ఞానాత్మైక వదనుఁడ, నే నెంతటివాఁడ నమ్మ, యిభముఖజననీ!

గీ. పదపదమ్మున హయమేధఫల మొసంగు, నేది యాప్రదక్షిణమును సాదరముగ
నాచరించి యఘావళిఁ ద్రోచి ముక్తి, లలన బిగియూరు కౌఁగిలి నలముకొందు.

గీ. కోకనదరక్తతలము లస్తోకదీప్తి, రేఖికాధ్వజకులిశసుహృద్యతరము
లఖిలబృందారకాళిసమర్పితములు, నైన నీపదముల కిదె యంబ మ్రొక్కు!

ఆ. అడుగుదామరల నవాంబుజములఁ బూన్చి, కనకకమలమాలగళమున నిడి
శిరమునందు మణివిశిష్టపుష్పాంజలి, నుంతుఁ బాపములఁ ద్యజింతు జనని!

క. మణిమంచకాభిరామము, కనకమయవితానరాజకాంత మగురుధూ
పనితాంతవాసితమ్మగు, ఘనమద్గేహమున వసతిఁ గావింపు ముమా!

మ. మణిపర్యస్తసువర్ణపీఠమున శుంభల్లోకపాలావళీ
ప్రణతంబుల్ జకదేకరక్షకము లౌ పాదంబు లర్పించి కాం
చనపర్యంకమునందు నూత్నమృదువస్త్రప్రావృత మ్మొంచు నో
జననీ, లోకములెల్ల నొక్కవడిఁదోషం బొందఁ గూర్చుండుమీ.

ఆ. పద్మరాగరక్తపాదకంజంబుల, రక్తిమంబు లాక్షరసముతోడ
నినుమడింపఁ బూసి కనకపట్టముఁ గం,ధూపమునకు నిత్తుఁ దోప మలర.

ఉ. బంగరుకోళ్లు రత్నములపట్టెలు పట్టనవారు మేలుక
ట్లుం గల పట్టిమంచమునఁ గోరిక లీరిక లెత్త నీసుతో
డం గవఁగూడి చొక్కుచు నెడంద ననుం దలపోయు చల్లపీ
కంగనుదమ్మి మోడిచి సుఖంబుగ నిద్దురసేయు మమ్మరో!

గండకమ్. జయజయమహాదేవి దుర్గే త్రిలోకేశి నందాంగనాగర్భసంభూత ముక్తామణీ బ్రహ్మ
విష్ణ్వర్చితాంఘ్రిద్వయే నందగోపాన్వయాబ్దీందులేఖే సదామంగళే వంశవృద్ధిప్రదే క్రూర
కంసాది విద్రావణే రాక్షసానీకనాశంకరే వాసుదేవానుజే దివ్యమాల్యాంచితే ఖడ్గఖేటాది
దివ్యాయుధౌఘాన్వితే సర్వభారావతారక్షమే స్మర్తృపాపప్రణాశంకరే, భక్తలోకైక

సంరక్షణే, తేనమాతః పదాంఘ్రిద్వయీసేవయా దుర్లభం వస్తు కిం వర్తతే, సర్వవేదాః పురాణం స్మృతిశ్శాస్త్రజాలం సమస్తం త్వదీయాకృతిస్త్వత్కృపాలేశ మాలభ్య బ్రహ్మ హరి శ్శంకర స్సృష్టిసంరక్షణే, నాశనం చాపి కుర్వంతి త్వల్లీలయా కల్ప్యతే, లోక జాలం వినా త్వాం న కించి ద్దరీదృశ్యతే, వస్తుశస్తం భవత్పాదపద్మం సదా సంస్మరామి త్వదీయోఽహ మన్యత్ర మే రక్షణం నాస్తి మాం పాహి దీనం సదా త్వత్పదాధీన మాం కార విద్యావయోబుద్ధి సంపద్విహీనం సదా పాహి మాంపాహి మాం తే నమస్తే నమః.

మ. ఇదె భక్తిన్ విరచించినాఁడ సకలాభీష్టప్రదంబైన పూ
జదయన్ దీని గ్రహించి మామకప్రదోషవ్రాతమున్ సైఁపుమీ
కొదువల్ గల్గినఁ బూర్తిసేయుము కృపన్ గోత్రేశసత్పుత్రి, నా
హృదయం బంద భవన్నివాస మతిసంప్రీతిం బొనర్పన్ దగున్.

క. ఈపూజ త్రికాలంబుల, నేపురుషుండు పఠియించు నిహమున వానిం
బ్రాపించుం బురుషార్థము, లోపి శివైక్యమ్ముఁ గలుగు నుసురు విడుచుడున్.

గీ. సకలపరికరములఁ బూజ సల్పలేని, మానవులు దీనిఁ బఠియించి మానసమున
దేవి నర్చించిరేని యుదీర్ణపూర్ణ, ఫలములం బొంది వాంఛితమ్ముల గడింత్రు.

సీ. సకలసురాసురాళికి మూలబీజంబు, కశ్యపుం డెవని వంగడపుఁ గర్త
భిషగలంకారంబు పీయూషకరుఁడు జగన్నాథుఁ డెవ్వాని కెన్నఁ దాత
సాహిత్యసాహిత్యసారవిజ్ఞాతసు, బ్రహ్మణ్యుఁ డెవ్వానిఁ బ్రభవహేతు
వతివినయోపేత నుతగుణవ్రాతవేం, కమసతి యెవ్వానిఁ గన్నతల్లి
గీ. యాంధ్రగీర్వాణవిద్వాంసు లతిసుగుణులు, కామ వేంకటసుబ్బరాట్కవు లనుజులు
నెవని భక్తి భజింతు రాయిద్ధగుణుఁడు, సాంబమూర్తి రచించె నీస్తవము భక్తి.





# అలంకార గ్రంథ తత్త్వము

[వెనుకటి సంచిక తరువాయి]

## విద్వాన్ డి. రామమూర్తి శాస్త్రి గారు

మఱియు దండి రాజపుత్రుల కీగ్రంథమును జెప్పుటకు రచించెను గాన సుకుమారబుద్ధులగువారలచే విపులముగా విషయములఁ బ్రదర్శించిన సులభముగా గ్రహింపఁబడవని తలంచి చర్చావిషయములను నిరూపింపక ప్రతివిషయమును సంక్షేపించి ప్రదర్శించెను గాన నింతమాత్రమున దండి భామహునికన్నఁ బూర్వుఁడు కానేరఁడని యొకరిద్దరు వ్రాసియున్నారు. కాని సుకుమారబుద్ధులగు రాజపుత్రుల కలంకారగ్రంథపఠనమే యావశ్యకమగునపు డందలి విపులాంశములును, చర్చావిషయములను గూడ గ్రహింప నావశ్యకములే యగును. సామాన్యముగా రాజపుత్రులకు నీతిశాస్త్రవిషయములును, మనోహరకావ్యవిషయములును సుబోధములును గ్రాహ్యములునునై యుండును. కాని వ్యాకరణాలంకారాద్యతిదురవగాహశాస్త్రవిషయము లగ్రాహ్యములే యైయుండును. సాహితీజ్ఞానసంపాదనార్థ మెన్నఁడైన నొకప్పుడు శాస్త్రవిషయములను గ్రాహ్యములనుగాఁ దలంచిన నందలి విపులాంశములును చర్చావిషయములును గూడ గ్రాహ్యములే యైయుండును. కావున నుపరి నిరూపితవాదము న్యాయ్యముగా లేదని తోఁచుచున్నది. నండికంటెఁ బూర్వపుగ్రంథములలో నిట్లే సంక్షేపముగా నలంకారవిషయములు వర్ణింపఁబడియుండుటం జేసి దండియు నట్టి సూక్ష్మమార్గమునే యనుసరించెననుట యుచితము. మఱియుఁ జమత్కారకారణములనుఁ గొన్ని జెప్పిన నవాంతరభేదము లభ్యాసవశమునఁ దమంతట దామే శిష్యబుద్ధులఁ బ్రతిఫలించునని తలంచియు విషయవిస్తృతి శిష్యబుద్ధిని జీకాకుపఱచునని తలంచియుఁ బ్రాచీనాలంకారికు లతిసంక్షేపముగాఁ జమత్కార బీజములగు ధర్మములను గొన్నింటిని మాత్రమే నిరూపించి విరమించిరనుట యుచితమని తోఁచుచున్నది.

ఇట్లు కావ్యస్వరూప కావ్యరచనామార్గ ప్రతిపాదకములగు నలంకారగ్రంథములు రానురాను దమవిధిని మఱచి పూర్వపూర్వలక్షణముల నధిక్షేపించుచుఁ జర్చలక్రిందఁ బరిణమించి తుదకుఁ గావ్యగతవైచిత్ర్యములను బ్రతిపాదించుట మానినవి. దండ్యాదికృతప్రాచీనాలంకారగ్రంథములు వివిధకావ్యచమత్కారప్రదర్శనమునందే దీక్షవహించియున్నవి. కావ్యప్రకాశ ప్రతాపరుద్రీయ దర్పణాద్యనంతరాలంకారగ్రంథములు దండ్యాదిగ్రంథములవలె నావశ్యక కావ్యవైచిత్ర్యముల నగపఱచుటమాని పూర్వపూర్వలక్షణముల ఖండింప మొదలిడి యొక్కొకవిషయమునఁ బ్రాచీనగ్రంథములకంటె విలక్షణముగా నుపన్యసింప నారంభించినవి. ఇందు కొక యుదాహరణమును మాత్రమే చూపుచున్నాఁడను. గుణాలంకారయుతపదరచనయే రీతియనియు, నట్టి రీతియే కావ్యమునకు జీవమనియు, నట్టిరీతి ప్రతికవిభిన్నమనియు సరసముగా వామనదండ్యాదులు యథార్థమును వక్కాణించియుండగాఁ దరువాతి యాలంకారికు లావిషయమును ఖండించుటకై గుణాలంకారరీతులకుఁ బరస్పరభేదమును గల్పించి ప్రవృత్తినివృత్తివిషయరూపమగు రసములో వీనికి సంబంధమును నిర్మూలముసేసి కావ్యమునకు ముఖ్యప్రయోజనమగు ప్రవృత్తి నివృత్తి విషయ

కోపదేశము కావ్యజీవితభూతమగు రసమువలననే కాని రచనవలన సిద్ధింపనేరదు గాన రసమే జీవమని కొందఱును, ధ్వనియే జీవమని కొందఱును, నిట్లు పెక్కువిధములఁ జర్చించి తమతమమతముల స్థిరపరచుకొన యత్నించిరి.

శ్లో. "మధురం రసవద్వాచి
వస్తున్యపి రసస్థితిః,
యేన మాద్యంతి ధీమంతో
మధునేవ మధువ్రతాః;
కామం సర్వోఽప్యలంకారః
రస మర్థే నిషించతి,
యయా కయాచిత్ శ్రుత్యా య
త్సమాన మనుభూయతే;
తద్రూపావాపదాసత్తి
స్సానుప్రాసా రసావహా."

అను మాధుర్యగుణస్వరూప వివరణసందర్భమున నుదాహరింపఁబడిన శ్లోకములనుబట్టి రసావహ శబ్దాలంకారరచనయు, సహృదయోన్మాదక రసావహార్థాలంకారరచనయు, మాధుర్యగుణస్వరూపములే యని దండి యభిప్రాయపడినట్లు స్పష్టమగుచున్నది. మఱియు నీమాధుర్యగుణస్వరూపవివరణశ్లోకములమూలమున గుణాలంకారములయందు రసస్థితియు, గుణాలంకారములవలన రసప్రతీతియు దండి సూచించియున్నాఁడు. కావుననే దండి రసములనుసైత మలంకారములుగా నిరూపించియున్నాఁడు. ఇట్లే యనేకములగు ప్రాచీనాలంకారికోక్త విషయములు నవీనాలంకార గ్రంథములలో ఖండింపఁబడియున్నవి కావ్యమునకు రసముగాని, ధ్వనిగాని, వ్యంగముగాని, తాత్పర్యముగాని యాత్మయనుటకంటె దండ్యాదులవలె రసావహగుణాలంకారయుతరీతియే కావ్యాత్మయనుట యుచితమని తోఁచుచున్నది. రసముగాని, ధ్వనిగాని, వ్యంగ్యముగాని, తాత్పర్యముగాని, యలంకారగుణాదులుగాని కావ్యప్రయుక్తార్థవచ్ఛబ్దరచనామహిమవలననేకదా యుద్భృతము లగుచున్నవి.

కావ్యమునకు రస మాత్మయనిన నేమి? ధ్వని యాత్మయనిన నేమి? రీతి యాత్మయనిన నేమి? అట్టి కావ్యజీవితమగు రసముగాని, ధ్వనిగాని, రీతిగాని, కావ్యముల నెట్లెన్నివిధములవిరాజిల్లుచుండునో యనునంశమునుమాత్రమే యలంకార గ్రంథములు ముఖ్యముగా స్పష్టపఱుపవలసియుండును ప్రాచీనాలంకారికులు కావ్యవైచిత్రీ సమూహములనుమాత్రమే ప్రతిపాదించి యంతతో సంతుష్టిని జెందియుండ నానంతరాలంకారికులు తమకాలములోనుండు కావ్యరచనామార్గము లగపఱచుట మాని స్వవిధిని మఱచి విషయచర్చలతోఁ దమగ్రంథముల నింపియున్నారు. ఇట్టిచర్చలచేఁ బ్రాచీనాలంకారికోక్తరీతి రసాలంకారాది పదార్థములు నవీనాలంకారికహస్తగతములై రూపుమాసి మాఱువేషమును ధరించియున్నవి. ఈ యంశమును విస్తరభీతిచే నిట నుదాహరించనైతిని. ఆయా యీకాలములలోనుండు కావ్యములస్వరూపమును రచనాస్వరూపములను, స్పష్టముగా నుదాహరణపూర్వకముగాఁ బ్రతిపాదించుటయే యాలంకారికుల విధియై యున్నది.

అలంకారగ్రంథ ముఖ్యప్రయోజనములగు పైని నిరూపించినయంశములను బాటింపక నిష్ప్రయోజనములగుచర్చలతోఁ దమగ్రంథములను నింపిన నవీనాలంకారికుల యాశయము సరిగా లేదనిఁ దోఁచుచున్నది.

కాని యట్టిచర్చలు పాఠకులకు బుద్ధికౌశలమును మాత్రమే సమకూర్పఁజాలియున్నవి. మఱియు స్వపాండిత్యప్రకర్షను, స్వోక్తికౌశలమును, స్వనిరర్గళవాగ్ధోరణిని, స్వవివిధశాస్త్రగ్రంథపరిచయమును, వెల్లడించుకొనుటకును సంస్కృతాలంకారికు లిట్లు తమగ్రంథములను జర్చలతో నింపియుందురని తోఁచుచున్నది.

మఱియుఁ దార్కికమీమాంసకాది పదార్థములకును నాలంకారికోక్త పదార్థములకును, గలభేదమును బాఠకులకు వ్యక్తపఱుచుటకే సంస్కృతాలంకారికులు తత్తత్పదార్థ వివరణావసరముఁ జర్చించి రనుకొందము.

కాని తత్తత్పదార్థముల నిరూపించుచోటుల నట్టి మతభేదములనుమాత్రమే నిరూపించుట యావశ్యకముగాని తత్తన్మతఖండనా ప్రస్తావన మనావశ్యక మని

నిష్పక్షపాతబుద్ధితో విరిమ్మించుసహృదయులకుఁ దోఁప కపోదు.

భరతఖండమునందు జనులు వివిధవర్ణములుగా విభాగింపఁబడి వివిధాచారముల నవలంబించినట్లు తార్కికమీమాంసక వైయాకరణికాదులు తత్తత్పదార్థస్వరూపవివరణ విషయమున స్వోపయుక్త విభిన్నమతానుసారులై యుండవచ్చును. వివిధాచారపరాయణులైన వివిధవర్ణములవారిని బ్రోగుచేసి యొక్కయాచారము నవలంబింపఁజేయ బ్రయత్నించుట యెట్టి సాహసమో తత్తత్పదార్థస్వరూప వివరణవిషయమున విభిన్నాభిప్రాయులగు తార్కికమీమాంసక వైయాకరణికుల యాశయమును ఖండింపఁబూనుటయు నట్టిసాహసమే- కావునఁ దార్కికవాదమును ఖండింపఁబూని విశ్వనాథకవిరుఁడు వ్యంజనాస్థాపనవను నొకపరిచ్ఛేదమును సాహిత్యదర్పణమునఁ గల్పించుటయు గౌణలక్షణలు విలక్షణలని నిరూపించుటయుఁ గావ్యప్రకాశకారాద్యనేకాలంకారికాభినందితమగు "తదదోషౌ శబ్దార్థౌ సగుణౌ వనలంకృతీ పునః క్వాపి" అను కావ్యలక్షణమును ఖండించి 'వాక్యం రసాత్మకం కావ్యం' అని కావ్యలక్షణమును నిర్మించుటయు మున్నగు చర్చావిషయములు నిరర్థకములని చెప్పవచ్చును.

ఇట్లే విద్యానాథాదులును ననుమానవ్యంజనలకును నభిధావ్యంజనలకును దాత్పర్యార్థ వ్యంగార్థములకును గౌళలక్షణలకును గుణాలంకారములకును భేదాభేదములను జూపఁ జాలశ్రమపడి చర్చించియుండిరి.

ఇట్లే ప్రాచీనాలంకారగ్రంథములు రెండుమూఁడు దప్పఁ దక్కినవన్నియుఁ జర్చలతోడనే నింపఁబడి యున్నవి.

సంస్కృతకవులు సామాన్యముగాఁ దాము వ్రాసిన గ్రంథములకుఁ దామే తమయభిప్రాయమును స్పష్టపఱచు వ్యాఖ్యలను వ్రాసియుండకుండుటచేతను, గాలక్రమమున సంస్కృతభాష వ్యవహారమునుండి తొలఁగుటంబట్టి యొక్కొకపద మనేకార్థములనొసంగసమర్థమై యుండుటచేతను, వ్యాఖ్యాతలు తమయిచ్చవచ్చినట్లు పదములను విఱిచి సరియగు కవ్యభిప్రాయమును గనిపెట్టక తత్తత్పదార్థ స్వరూపవివరణవిషయమున విభిన్నాభిప్రాయులగుటయు సంభవించినది. దానఁ బాఠకులును భిన్నాభిప్రాయులైరి.

అట్లనేకవిధభేదములతోఁ గూడియున్న యలంకారశాస్త్రమందలి ప్రాచీనమత మత్యంతసంక్షేపముగా నుండుటచేతను, నవీనమతము లతివిపులములై బాలురకు దుర్గ్రాహ్యములై యుండుటచేతను, నేగ్రంథకర్తమతము ననుసరించినను సంపూర్ణముగా నలంకారశాస్త్రజ్ఞానము సంభవింపకుండుటచేతను, బ్రాచీనతమాలంకారగ్రంథములం దలంకారవిషయము లత్యంతసంక్షేపముగ నిరూపింపఁబడినను బాలబుద్ధికి సుబోధములగుటంజేసియు, శిక్షితబుద్ధులకు మాత్రమే నవీనాలంకారికసరణి హృదయంగమ మగుటంజేసియు, బ్రాచీనాలంకారగ్రంథములే శిష్యులకుఁ బ్రథమోపదేశమున కర్హములని నిస్సందేహముగ నుడువవచ్చును.

వాటియు నిట్టి చర్చలతోఁ దమ గ్రంథములను నింపుటకన్న నితరభాషాకావ్య చమత్కారములను, తద్రచనామార్గములను, మున్నగువానిని విచారించి వానికిని సంస్కృతకావ్యములకును గలభేదాభేదములను జూపి యట్టిచర్చలతోఁ దమగ్రంథములను నింపిన బాగుండును. కాని యితరభాషాకోవిదులకు మాత్రమే తాదృశగ్రంథరచన సాధ్యముకానోపును. సామాన్యముగా సంస్కృతాంధ్రకవుల కితరభాషాపాండిత్యము లేకుండుటంజేసి యట్టిగ్రంథములు సంస్కృతాంధ్రభాషల నుదయింపవయ్యెను.

ఇఁక నాంధ్రాలంకారగ్రంథస్థితిని విచారింతును. ఆంధ్రవాఙ్మయమున నలంకారగ్రంథములు మిగులస్వల్పముగాఁ గానవచ్చుచున్నవి. అందుఁ గావ్యాలంకారచూడామణి, నరసభూపాలీయాంధ్ర చంద్రాలోకము లే సుప్రసిద్ధములును బ్రాచీనములును నైయున్నవి. అందును గావ్యాలంకారచూడామణి నరసభూపాలీయము లే సంపూర్ణములు. తక్కినవి యలంకారశాస్త్ర విషయైకదేశనిరూపకములు

"విద్వత్సు దారిద్ర్యతా" అనునట్లు విద్వాంసులగుకవులు సామాన్యముగాదరిద్రులు. కావుననే కవులు

సామాన్యముగా రాజుల నాశ్రయించి జీవించుచుండెడి వారు. అట్లే యాంధ్రకవులును సామాన్యముగా రాజుల నాశ్రయించి జీవించుచుండుటంజేసియు, శాస్త్రగ్రంథ విషయములు రాజమనోరంజకములు, గామింజేసియు, రాజమనోరంజకములుగాని శాస్త్రగ్రంథముల నాంధ్రీకరించుటవలనఁ గుటుంబపోషణమునకు వలయు ధనము లభింపకుండుటంజేసియుఁ, జమత్కార కథాయుతములగు పురాణములే రాజమనోరంజకము లగుటంజేసియుఁ బ్రాచీనాంధ్రకవులు సామాన్యముగా సంస్కృతవాఙ్మయమునందలి శాస్త్రగ్రంథముల నాంధ్రీకరింపక సరస కథా గుంభితములగు పురాణాదులనే యాంధ్రీకరించిరి, అట్టి ప్రబంధములనే రచించిరి. కావుననే యయ్యుగమున నలంకార గ్రంథము లాంధ్రమున నుదయింప వయ్యెను.

మఱియు నాంధ్రకవులందఱును సంస్కృతమున మంచిజ్ఞానముగలవారగుటచే 'తల్లిపోలిక పిల్లకు వచ్చును. తల్లియలంకారములు పిల్లకువచ్చును' అను నార్యోక్తిని బాటించి సంస్కృతాలంకారగ్రంథములే యాంధ్రమునకును నుపయోగింప నర్హములని భావించి కావలయుఁ బ్రాచీనాంధ్రకవు లలంకారగ్రంథముల నాంధ్రమున స్వతంత్రముగా రచింపరైరి.

ప్రాచీనాంధ్రకవులు సంస్కృత లక్షణములనే సామాన్యముగా ననుసరించి కావ్యములను రచించుట చేతను బ్రకృతిమున నాంధ్రవాఙ్మయమున నగపడు నలంకారగ్రంథములు సంస్కృతాలంకారగ్రంథప్రతిబింబములే యగుటచేతను నాఁటినుండి నేఁటివరకు రచింపబడిన యాంధ్రకావ్యము లన్నియు నొకేయాకృతితో నలరారుచున్నవి. ప్రసక్తియున్నను లేకున్నను మహాప్రబంధనాటకాద్యాలంకారిక లక్షణలక్షితము లగుటకుఁ దమపూర్వుల నాలంకారికనియమము ననుసరించి యాయావర్ణనములంజేసి తీరవలసినదే. మహాకావ్యనాటకాది లక్షణవిరుద్ధమైన కావ్యమునుగాని, నాటకమునుగాని, శాస్త్రవేత్తలగు సహృదయులు దోషదూషితముగా నెంచి యసత్కావ్యము క్రిందఁ బరిగణింతురు. సహృదయ సన్మానపాత్రము గానికావ్య మెన్నఁడను బ్రచారము లోనికి రాఁజాలదు. దాన నక్కవికిఁగాని యక్కావ్యమునకుఁగాని యభివృద్ధి యెన్నటికిని సంభవింపదు. ఇట్టి యిక్కట్టులనుబట్టియే కవులందఱును నాలంకారికుల కట్టుబాటులకు లోనై కావ్యములను రచించుట సంప్రదాయమైనది. ఆంధ్రకవులే యననేల? సంస్కృతకవులు సైత మిట్టి యిక్కట్టులకు లోనైరని స్పష్టముగాఁ జెప్పనచ్చును గాని గ్రంథవిస్తరభీతిచే నుదాహరింపనైతిని. కావుననే యాంధ్రకావ్యములొకదాని ప్రతిబింబ మొకటి యనఁదగుననువిమర్శక ప్రవాదమునకు లక్ష్యము లోటు తటస్థించినది.

కాని రసమునకుఁగాని, యితివృత్తమునకుఁగాని, యౌచిత్యమునకుగాని భంగము వాటిల్లునపుడు యథోచితముగఁ దత్తద్వర్ణనముల విడువవచ్చుననుటకుఁ బ్రమాణము లనేకములు కన్పట్టుచున్నందునఁ గవులే యట్టి యిక్కట్టులను దెచ్చిపెట్టుకొనిరని చెప్పవచ్చును. కాన నాలంకారికులు దేశికునివలె మార్గోపదేష్టలు గాని నియామకులుగారని గ్రహించి కావ్యములను రచింపవలసియుండును. లక్షణకర్తలు బహులక్ష్యములఁ బరిశీలించి లక్షణములను రచించి కవులకు మార్గమును జూపుదురుకాని తూచాతప్పకుండ వాని ననుసరింపవలెననివారి యుద్దేశముగాదు. యథోచితముగ ననుసరింపవలెననియే వారియుద్దేశము. కావున లక్షణకర్తల లక్షణములు మార్గమునుజూపునవిగాని వేదవాక్యములుగావని తలంచుచు యథోచితముగ వారుచూపినదారిఁ బోయిన రాజబాటనంటిపోవునపుడు గల్గుసుఖము వంటిసుఖము గవికి సామాన్యముగాఁ గల్గకతీరదు.

ప్రకృత మనుసరింతము. ఇట్లు పదునాల్గవశతాబ్దమువఱకు సంస్కృతాలంకారగ్రంథములే యాంధ్రమునకును నలంకారగ్రంథములై యుండెను. సంస్కృతకన్యకత్తవారు పెట్టిన క్రొత్తయలంకారములను, దల్లినగలను గాలవ్యత్యాసవశమున నభిరుచి ననుసరించి క్రొత్తరీతిగా మార్చికొని తత్తత్స్థానముల నలంకరించికొనిన యాంధ్ర కొంత యుక్తయలంకారములను, సంస్కృతాలంకారగ్రంథములు నిరూపింపవనితలంచియో యాంధ్రమున నలంకారగ్రంథము లేదనుకొనుటచేతను దీర్ఘముగఁదలంచి యో స్వాశ్రయుల యభిరుచిమూలముననో విన్నకోట

పెద్దనాదికవు లాంధ్రమునఁగూడ నలంకారగ్రంథముల రచించుటకు సాహసించిరి.

వివిధకావ్యములందలి వివిధ చమత్కారములను, వివిధకావ్య రచనామార్గములను, తత్తత్కాలములందుఁ దత్తద్విషయములందుఁ గవులకుఁగల యభిరుచిని దత్తద్గ్రంథములఁ బరిశీలింప నక్కఱలేకుండ సులభమార్గమున విశదీకరించుటయే యలంకారగ్రంథముల పనియైయున్నది. కాని పెద్దనాదులుగూడ సంస్కృతాలంకారగ్రంథాంధ్రీకరణమందే యాసక్తులగుటంజేసి యయ్యది దూరీకృతమయ్యెను. ఇందులకు మచ్చునకై యొకయుదాహరణమునుమాత్రమే చూపెదను.

సంస్కృతలాక్షణికు లేకముఖముగా శార్దూలాదులను జదువుట కష్టమనియు నట్లైనవాని శ్రావ్యత చెడుననియుఁ దలంచి యచ్చటచట నూపిరివిడిచి చదువుటకై పదచ్ఛేదరూపయతి నంగీకరించిరి. ఆంధ్రలాక్షణికు లన్ననో వాని నంతకంటె శ్రావ్యములుగాఁ జేయనెంచి సంస్కృతపదచ్ఛేదరూపయతిని దమయిచ్చవచ్చిన స్థలముల సజాతీయవర్ణావృత్తిరూపయతిగా మార్చి కర్ణాటకమునుండి కాఁబోలు హల్తౌల్యరూపప్రాసమునుగూడ క్రొత్తగా సంగ్రహించి నిప్పిమెఱుఁగువెట్టిరి. సంస్కృతలాక్షణికులు పదచ్ఛేదరూపయతినంగీకరించి ప్రాసమనుప్రాసాదిరూపమాటలనిశ్యముగానెంచుటచే ఛందోవిషయమున 'యతిభంగ' ఛందోభంగము లను దోషములను మాత్రమే పేర్కొని పరిమించిరి.

అట్టిసంస్కృతలక్షణముల ననుసరించిన విన్నకోట పెద్దనాదులును ఛందోభంగయతిభంగములను మాత్రమే పేర్కొని యాంధ్రభాషా జీవితమనఁదగు ప్రాసమును మదిలోనికిఁ దెచ్చికొనక (ప్రాసభంగ దోషమును వక్కాణింపక,) యున్నమున్నటుల నావశ్యకానావశ్యకముల విచారింపక సంస్కృతలక్షణముల నాంధ్రీకరించిరి. కావుననే ప్రకృతమున నాంధ్రవాఙ్మయమున నగపడు పురాణేతిహాస ప్రబంధము లాంధ్రాలంకారగ్రంథనిరూపిత తల్లక్షణములకు లక్ష్యములుగా కున్నవి. ఇంతియకాక నవలాదినూతనాంధ్రకావ్యరచనామార్గములను విశదీకరించులక్షణమే యాంధ్రమునఁ గానరాదు.

మఱియుఁ బెద్దనాదులు రాజుల నాశ్రయించి జీవించుచుండుటంజేసి తమ యలంకారగ్రంథము నందలి ప్రతిలక్షణమునకును స్వాశ్రయభూతుఁడైన రాజునే లక్ష్యముగాఁ జూప యత్నించి యెట్లో గిట్టించిరి. దాన లక్షణము లక్ష్యమున సరిగా సమన్వితమైనట్లు శిష్యబుద్ధులకు సుబోధముగాకున్నది. కావున విశ్వనాథపంచాననాదిసంస్కృతకవులవలె వాఙ్మయమునుండి లక్ష్యమునుజూపుట యావశ్యకమైయున్నది. అట్లయిన శిష్యసుబోధమగుటయేకాక వివిధకావ్య చమత్కారప్రకటనరూపాలంకార గ్రంథప్రయోజనముగూడ ప్రకటీకృతమగును.

మఱియు నాంధ్రాలంకారికులు సంస్కృతాలంకారగ్రంథములందుఁగల నాటకప్రకరణము నాంధ్రీకరింపలేదు. దీనిం బట్టిచూడఁ బెద్దనాదులకాలమున నాంధ్రవాఙ్మయమున నాటకరచన లేదేమో యని సందియము పొడముచున్నది. లేనిచో సంస్కృతాలంకారగ్రంథస్థవిషయముల నన్నింటిని సంగ్రహించినవారు నాటకప్రకరణమును మాత్ర మాంధ్రీకరింప కుందురా? ఇంతయేల? ఇప్పటికిని నాంధ్రవాఙ్మయమున సంస్కృత దశరూపకములలోని గొన్ని రూపభేదములు రచింపబడవయ్యెను, మూలభూత సంస్కృతగ్రంథములందలి 'గుణ- లక్షణ- రసము- అనుమానము-వ్యంజన-' మున్నగుపట్టులంగల చర్చావిషయములను విడిచి తత్ఫలితార్థములనుమాత్రమే నిరూపించుటచేఁ బెద్దనాదులు శిష్యబుద్ధులకు సుబోధములగు నావశ్యకాలంకారవిషయములనుమాత్రమే మూలగ్రంథములనుండి సంగ్రహించి సంక్షేపముగా విశదీకరింప నిశ్చయించికొనిరని చెప్పవలసియున్నది.

నవీనాలంకారగ్రంథములలోఁ బ్రతాపరుద్రీయమే బాలురకు సుబోధమగుటంజేసియు నాతఁడును రాజునకే కృతియిచ్చి యుండుటంజేసియుఁ గావ్యాలంకారచూడామణి నరసభూపాలీయములు ప్రతాపరుద్రీయమునే యనుసరించినవి. కాని కావ్యాలంకారచూడామణిలోని చతుర్థపంచమోల్లాసములలోఁ బేర్కొనఁబడిన గుణరీత్యలంకార సందర్భములుమాత్రము దండికావ్యా

దర్శముల ననుసరించి రచింపఁబడినవి. మున్ముందు వేఱొక వ్యాసమున నీ విషయమును స్పష్టపఱచెదను

పైని వ్రాసినవిషయములనుబట్టి యాలోచింప వాఙ్మయమునుండి లక్ష్యములనుజూపుచు వివిధాంధ్ర కావ్యరచనామార్గములను, రసాలంకారగుణరీత్యాదుల స్వరూపమును, దత్తద్విషయములఁ గవు లవలంబింపఁదగిన స్వాతంత్ర్యములను (లక్షణములఁ గవు లెంతవఱకు స్వతంత్రింపవచ్చునో యను విషయమును) నితర భాషాకావ్య రచనాస్వరూపములను, సవిమర్శముగ నిరూపించు నలంకారగ్రంథమొకటి యాంధ్రమున రచింపఁబడుట యావశ్యకమని చెప్పుటకు సందియము లేదు. సమర్థులగు సహృదయు లట్టి గ్రంథమును రచించి యాంధ్రమాత నలంకరింతురుగాక!




# సాత్త్వికసేవ

వారణాశి సూర్యనారాయణ శాస్త్రి గారు (సారస్వత సమాజము)

సత్యవేదరహస్యార్థ సారమైన
తత్త్వమస్యాదివాక్యపద్ధతిఁ దలంచి
భూరివిజ్ఞానపథముఁ బోవవలయు
మోక్షమున! కొక్కటే! మాఱుపుంత లేదు!

మహితభోగానుభవరూపమాత్ర మగుటఁ,
బతనహేతుదురంతజంబాలపటల
గర్భితమె యగుట, స్వర్గసౌఖ్యంబుకూడఁ
దుచ్ఛమును దుచ్ఛతరమునై తోఁచుమదికి;
హేయము, సదాప్రమాదభూయిష్ఠ, మధిక
కష్టసాధ్యము నగు నైహికంబుమాట
తలఁప నేటికిఁ? గావునఁ దథ్య మెఱుఁగు
జనున కభిగమ్య మొక్క మోక్షంబుకాదె?

ఎఱుఁగు; దిదియంతయును జాల నెఱుకగలుగు
పెద్దలెఱిఁగింప నాసక్తి విందు; నైన—
ఏమిమాయయొ? చెప్పలే; నెన్నిసార్లు
మది మహావాక్యరసములు మననపుటము.
దీర్చినరసాయనంబు సిద్ధింప; దౌర!
కాని విశ్వంభరంబయి క్రాలు నీదు
విశ్వరూపంబులోపల వెలిని నిండి
నాకుఁ బొడకట్టుచున్న దనేక జన్మ
కర్మసంస్కారఫలమొ? శుష్కప్రయాస
మేల? యెందుకుఁగొఱగాని యీవిహీన
పరికరంబుల నమ్మియే పనికిఁ బూన
నేమిమాటదక్కును? మఱి యేమి లేదు!

చెడి నిరాశోపహతుఁడు భజింపరాదు
నిన్ననుచు శాస్త్రమా? మన సెన్నివిధులఁ
బట్టి బంధించినను నీదు పాదపద్మ
సన్నిధిని వ్రాలుచున్నది; స్వామి! కానఁ
జేయఁబూనితి సాత్త్వికసేవ నీకు
నవధరింపుము! గురుకణార్ద్రమతిని.

మ. ధనముల్ రాజ్యము భోగముల్ వలదు; కాం
తా పుత్త్రమిత్త్రాను జా
ద్యనుబంధంబులు గోర; మోక్షమును నే
నాసింప; నాసించెదన్
నినుఁ జింతించుచు నీకథల్ వినుచు నీ
నిక్కంపు భక్తాళి భ
క్తిని సేవించుచుఁ గాలముల్ గడుపఁగా;
దీనిన్ బ్రసాదింపుమా!



# కళాస్వప్నములోఁ గలవరింతలు

జయరావ్ గారు

ఱెఱుపి వెన్నెలలోని ధావళ్య మొకకొంత
నవసుధాకర్దమద్రవము గాఁగఁ
జిన్నారిపొన్నారి చిఱుతచీఁకటి చాయ
యసలుకొల్పిన మషీరసముగాఁగ
నిద్రమేల్కాంచిన నెత్తమ్మి మొగడల
పరువంపుఁ బుప్పొళ్లు హరిదళముగఁ
దొగలు వన్నియ లేతఁ దొలుసంజ కెంజాయ
కమనీయధాతురాగంబు గాఁగ
వర్ణములుగూడి యామినీవ్యాసగమున
జగము చిత్రింపఁ దూలిక చందమైన
కొమరుఁబ్రాయంపు నూనూఁగు కొదమ
ప్రాచి కభినవమాణిక్యపదకమాయె యెండ
—శ్రీనాథుఁడు

ముద్దు ముచ్చటలు గొలుపుట కేమి, మనోరంజనము జరుపుట కేమి, పారవశ్యమును బఱపుట కేమి, కొమరుఁబ్రాయమునకు జోడు లేదు. అగ్నికీలల తాపమునకు జంకక, దహః పర్యాకులితుఁడైన త్రినేత్రుఁడు,

'చులకన మేలుకొన్నతొలి
చూపునఁ జూచెఁ బినాకపాణి దా
పలిదెస, షోడశాబ్దముల
ప్రాయము మత్తచకోరనేత్రి'—

చూచి, నూతనరుచులు తోఁచి, 'కించిత్పరిలుప్తధైర్యుఁ' డయ్యెనఁట!

మనసులో నీశ్వరధ్యానము; శరీరముపై వెలిబూడిద; కృష్ణాజినము; వారిరువురు ఋషులఁట! ద్వారకకుఁ గృష్ణునిఁ గాంచుటకుఁ బోవుచున్నారు. దారిలోఁ గన్నులతృష్ణ తీర్చుకొనుచున్నారు. హాయిఁ యిమిఱఁ దూఁగుటుయ్యెలలపైఁ గూర్చుండి పంతాలాడుచున్న పడుచుఁ బ్రాయపుఁబడఁతి మిన్నలను జూచిరి.

'ఏమిఁ బూఁదీఁగెలఁ దూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుఁ దూగునా, కొమరుంబ్రాయపు గబ్బిగుబ్బెతలయంఘ్రుల్ చక్కఁగాఁ జాగి, మింటి మొగంబుపై చనుఁదెంచు నీవిఁ గనుఁగొంటే? దివ్యమునీంద్ర!'

నీవిఁ గన్నంతటితో సరిపోయినదా? మోవి కెంపుతో సరసములాడుపలుకుఁ గప్పురపుఁ దావియో? మెల్లమెల్లగ నాకన్నియలదాఁపునకుఁ జేరిరి. కలభాషిణితో నెయ్యము కలిపిన జాలునని మణికంధరుఁడు ఆమెకుఁ గయ్యము; గరపినఁ జాలునని నారదుఁడు.

కవులందఱు నిట్లు కామినుల కొమరుఁ బ్రాయపు సోయగములపైఁ దవిలినతమిచేత

నువ్విళ్లూరుచుండిరి. ప్రవరునివంటి సాహస వ్రతునిసృజించిన కవితాపితామహుఁడు కూడ

"రాత్రియుం బవల్ మఱపు
　రాని హాయల్ చెలియార జంపు ని
ద్దాతరి తీపులంబలెను
　దారసిలన్ వలె లోఁదలంచినన్."

"డాతొడనున్న మిన్నుల మి
　టారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండువలె
　వాచవిగావలెఁ బంట నూదినన్."

"చేతికొలంది కౌఁగిటను
　జేర్చిన కన్నియచిన్నిపొన్నిమే
ల్మూఁతల చన్నుదోయివలె
　ముచ్చటగావలెఁ బట్టిచూచినన్"

ఈపోకలే పోయినాఁడు. కాని కొమరుఁ బ్రాయపుఁ జక్కఁదనము, మెత్తఁదనము, హాయలు, మెఱుఁగులు, మరెచ్చటనుగాంచఁడాయెను.

కవిరాజు త్రొక్కినదారి వేఱు; విటాగ్రేసరుఁడన్న కల్పితబిరుద మీయఁబడినను, "గంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ గంధసారఘుసృణద్వైరాజ్యభారంబు" నధ్యక్షించిన ప్రౌఢసాహిత్యముల ధరించినందులకు ద్రాక్షారామములోని బానిసతొత్తులతోఁ బొత్తుకలిగెనను నెత్తిపొడుపులకు గుఱియయ్యు, నీతఁడు "స్వైరవిహారధీర" యైన స్వచ్ఛందకవితా కాంతతో దైవీప్రేమ నెఱపిన మహానుభావుఁ డనుట సహృదయులకు విదితమే.

శా. "బ్రాహ్మీదత్తవర ప్రసాదుఁడ వురు
　ప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చన కళా
　శీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయసం
　ప్రాప్తార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళా ధురీణుఁడవు నీ
　భాగ్యంబు సామాన్యమే!"

అంబికావరప్రసాదుఁడైన శ్రీనాథుఁడు, దిగ్విజయశ్రీలతోఁ దూఁగిన శ్రీనాథుఁడు, డిండిమభట్టువంటి పండితాఖండలుని కంచుఢక్క బ్రద్దలుగొట్టిన శ్రీనాథుఁడు—"తములపాకుల బేరములాడఁబోయి" కాపుటిల్లాలితోను, నీలాటిరేవుకడఁబోయి "కాసలనాటివారికనకాంగి"తోను "అంగజాస్త్రపాతమ్ములఁ బ్రోవుఁదీసి విటతండము గుండియ లారవిచ్చు" కుమ్మరివారి బాలికతోను, బిందెజాఱి పైఁట తడిసిన పూజారివారి కోడలితోను, ఇంకను నవాచ్యులైన నైచ్యవ్యక్తులతోను సరసములకు దొరకొనెననుటకన్న పాతకము కలదా? ఆకాలపు రాజకీయపరిస్థితులచేతను, ఆకాలపు సాంఘికావస్థలచేతను, ఆకాలపు విద్యాదశలచేతను, తనమహిమ మిాకేదారులకును జోరనీయఁడాయెనేకాని, శ్రీనాథుని ప్రతిభాభాస్వరతకుఁ బ్రతిబంధము కలదా? ఏవిశ్వశక్తిప్రదర్శనముచేత చాణక్యుఁడు-ప్రచండచాణక్యుఁడు-సకల రాజులగుండెలలో దడదడలు పుట్టించెనో, ఏవిశ్వశక్తి గరిమముచేత శివాజీ-ఛత్రపతిశివాజీ- సామ్రాజ్యవైభవము గాంచెనో, ఏవిశ్వశక్తిచేత శార్మన్యుఁడైన గైటే సకలకార్యదక్షత వహించెనో, ఏవిశ్వశక్తి యూవేశించినందున షేక్స్పియర్

నిస్తుల నాటకరచనాబంధురుఁ డయ్యెనో, ఏ విశ్వశక్తి యావహించుటచేత నేటికి ఇటలీలో ముసోలినీ యను నద్భుతమంత్రి జగత్కంపన శాలి యగుచున్నాఁడో, యట్టి విశ్వశక్తి శ్రీనాథుని రక్తనాళములలో ననర్గళ ప్రవాహ ధోరణిఁగాంచియుండెను. కార్లైలునిరూపించి నట్లు వీరవ్యక్తికి నవస్థా ప్రతిబంధకములు లేవు. చక్రవర్తిగనో, మత ప్రస్థాపకుఁడుగనో, కావ్యనిర్మాతగనో, ఏవిధముననైనను వీరుఁడు తనశక్తిని వ్యక్తీకరింపకమానఁడు. శ్రీనాథుని యుత్సాహగుణము, ఉద్ధతభావనాశక్తి, యుత్కలికాసందోహము——ఇవన్నియు ననమాననములు.

క. ఉప్పర మెగసి యజాండము
చిప్పలు రాలంగ, మేరుశిఖరంబులపైఁ
గుప్పించి యెగసికొందునో ?
తప్పక నామనసులోని తహతహ తీఱన్.

మనసులోఁ దహతహపుట్టుటకుఁ జాలిన యుత్సాహధర్మము కలవాఁడు; ఉప్పరమెగసి యెగిరిపోయెద ననుచున్నాఁడు; యజాండము చిప్పలురాలఁ దన్నెద ననుచున్నాఁడు; మేరు శిఖరములపైఁగుప్పించి యెగిరెద ననుచున్నాఁడు. ఆహా! కవిసార్వభౌమా! నీవు నేఁడు బ్రదికియుండినచో నాంధ్రయువజన హృదయ మండలములయందు నుద్వేగోత్సాహ సాహస శక్తి నిండికొనియుండునుగదా! స్వాతంత్ర్య ప్రసూతికై బహువేదనలఁ బొల్పడిన భారత భామినికిఁ గష్టములను తగ్గించియుందువుగదా! అలసతావివశులై యుద్ధురకార్య వివేచనకు దూరులై సొలసియున్న యాంధ్రయువకులకు ధర్మప్రవర్తనాధౌరంధర్యముఁ జూపి యడ్డు వచ్చిన వేయి కంచుఢక్కలనైనఁ బగులఁ గొట్టించియుందువు గదా!

కవితలో నీకవి రాజుత్రొక్కనదారి లేదు. కొమరుఁబ్రాయపుటూయము లీతనికిఁ గూడ సోఁకినవి. కాని మదోన్మత్తులైన ప్రబంధకవులకు సోఁకినసోఁకుడుబూతము సోకలేదు; 'చలితలతాంతకాంతి యనుచందిర కావి చెఱంగు మీటి సమ్మిళితవయోవిలాసముల మీటిన విచ్చు ఘలస్తనాగ్రముల్, వెలువడఁ' జేసినగాలిబూతము సోఁకలేదు. 'కొన్ని నిశలంగను మూసినయంత మాత్రఁబైపై విలసిల్లుకుట్టమితభావ విశేష విజృంభణంబులు' సోఁకలేదు. నిర్మలమై, యనావిలమై, బ్రహ్మానందానుభవ ప్రదాయినియై, స్వచ్ఛందమైన ప్రకృతికామినీ నిర్వ్యక్తమూర్తి యొక్క మోహనగానస్వన సాంప్రదాయము సోఁకినది. అద్భుతమై, యఖండమై, యనంతమై యవ్యాజమైన ప్రకృతిప్రేమాజ్యోత్స్నలచల్లఁదనము సోఁకినది. బాలభాను మరీచుల కొమరుఁబ్రాయపు 'సోకు' సోఁకినది.

ప్రకృతియుఁ గామినియే; మోహినియే; యానందసాహిణియే; భావనావాహినియే. కాని వరూథినివంటి యలివేణి యొసగు నానందబ్రహ్మను పేరిటి యింద్రియ సౌఖ్యములనిచ్చు బిబ్బోకవతి కాదు. హృదయాంతర్లీనమై శాశ్వతమైన యానందము నిచ్చు దేవి! వీర్యవత్తరశక్తిప్రధానయై కొమరుఁబ్రాయంపు నూనూఁగుకొదమయెండలో నటన లీలావిలాసినియైన దేవి! 'నలినీ బాంధవభాను

తత్తరవికాంత స్యందినీహారకందళచూత్కార పరంపరలలో' నాలాపములుదీయు వీణావిలాసిని యైన దేవి! సాయంసమయసూర్యరంజిత మైయరుణాంబరములను ధరియించి వాసకసజ్జిక యైన దేవి!

కౌమరుఁబ్రాయపు నూనూఁగు కౌదమ యెండను జూచి హర్షోత్కర్షుఁ డైన శ్రీనాథ మహర్షి పలురంగులతో హారంగుచూపు తూర్పుదెస నాలోకించినాఁడు. చిత్రలేఖనము చేయవలెనను కోరిక ప్రకృతికన్యకకుఁ బుట్టించి, చేతిలోఁ గౌదమయెండ యను తూలిక నిచ్చినాడు. ఏమిచిత్రించునో? ఓంకారమహిమము చిత్రించునో? తనయందు లీనమైన విశ్వశక్తిని జిత్రించునో!— చిత్రించినది— కట్టకడ కేమిటో చిత్రించినది; మనకన్నులకుఁ గానరాదు. శ్రీనాథకవివరేణ్యుని యక్షులకు గోచరించినది.

రంగులమహిమఁ గాంచి సంభ్రమించు నొక మహనీయుఁడు; గానమహిమఁ గాంచి సంభ్రమించు నింకొకఁడు. హేలావిలాసవిజృంభితకామినీప్రౌఢతరతీవ్రకటాక్షవీక్షణంబులకు గుఱియై సంభ్రమించుమఱియొకఁడు. ఈమువ్వురింటికిని గల సామ్యమేమి? విమర్శింతము:

ప్రకృతిమోహనగుణముచేత నవలీలగఁ గట్టువడు కవివరేణ్యులకు భావనోద్దీపకములైనవి నవనవరచనాచమత్కృతిచేతఁ దళుకులు వహించిన రంగులును, 'నవ్యామృతావ్యాహతాస్వాదంబై వినవయ్యెడి' రవముల పొందికలును,'పయిగాలిసోఁకిన, వెన్నవలెం గరంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చు భాగ్యములకు' నిశ్శ్వస్తిప్రవచన మైన ప్రణయ గరిమమును ముఖ్యాసులు. ఆనందహాస మైన బ్రహ్మయొక్క యాథార్థ్యము ననుకరించు నింద్రియగ్రాహ్యసౌఖ్యములకు మైకముచెందని మనస్సు, అనంతసౌఖ్యనిలయమైన 'దాని' పొందఁగలుగుట యసంభవము. ఇందుచేతనే మనోబలనిరూఢిఁ గాంచిన మనఋషులు సర్వమునందు నాహ్లాద మపేక్షించి, 'భద్రత' నాకాంక్షించి, యానందము నుపాసించిరి.

“ఓం భద్రంకర్ణేభిః శృణుయామ దేవా
భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః.”

ఈ యానందస్వరూపమును వెదకి వెదకిఁ ప్రకృతిలో నంతర్లీనమైనదని గ్రహించి, ప్రకృతిమహిమల నుగ్గడించి, తన్మూలముగ నానందము ననుభవించి ధన్యులైరి. ఇందుఁ గలఁడో, యందుఁ గలఁడో యని వెదకి వేసారి కడకుఁ గళాస్వప్నములో నకస్మాత్తుగాఁ గలవరించిన పలుకు లివి.—

“యో దేవో౽గ్నౌ, యో౽ప్సు,
యో విశ్వం భువన మావివేశ,
య ఓషధీషు, యో వనస్పతిషు,
తస్మై దేవాయ నమోనమః.”

ఆహా! తృణములోఁ గలఁడు, మహావనములోఁ గలఁడు! సర్వప్రకృతిలోఁ గలఁడు!

ప్రకృతిసౌందర్యమును నేత్రముల మూలమున ననుభవించునపుడు కంటి నాకర్షించునవి స్వరూపము, ఛాయ, వర్ణము. మాలతీలత యల్లిబిల్లిగ నల్లుకొనుటఁ జూచినచోఁ గలుగు

నుత్సాహము గుబురు గుబురుగఁ బెరిగిన బ్రహ్మజెముడుడొంకలను గాంచినచోఁ గలుగ నేరదు. స్త్రీ పురుషుల యందమునకు ముఖ్యమంగములతీరు. అజంతాచిత్రములయుత్కృష్ట సౌందర్యమునకుఁ గారణ మీయవయవ వైఖరియే. ముఖారవిందముయొక్క యనూనవైఖరియు, వక్షోజముల సౌష్ఠవవక్రతా పరిణతియుఁ, గన్నులతీరును, 'సింగపుఁ జిన్ని లేనడుము' చెన్నును ముఖ్యముగ నీచిత్రములకు వికాసముఁ గలిగించి, 'కళ యుట్టిపడఁజేసి,' ప్రస్తుతమున బ్రపంచమునంతయు నాకర్షించి, కళానుభవితల యుల్లముల కుల్లాసముఁ గలిగించుచున్నవి. ఈయంగసౌష్ఠవమే, యీశారీర వైఖరియే, గ్రీకుదేశములోని యద్భుతశిలా విగ్రహముల యఖండసౌందర్యసంపదకుఁ గారణములు. 'స్థిరైరంగైస్తుష్టువాంసస్తనూభిః' యని పాడిన మనఋషుల యాశయమున కనుకరణముగాఁ గళారూపమునఁ బ్రకటించి, స్థిరములును, సుష్ఠువులును, ఋజువులు నైన యవయవరీతులను సంఘటించి, ప్రతిమారూపమున గ్రీకులును, చిత్రరూపమున నజంతా కళాకర్త లగు ప్రాక్తనాంధ్రులును వెల్లడించి లోకమునకుఁ జేసిన యుపకారము పొగడ్త కెక్కినది.

స్వరూపముయొక్క యాకర్షణమహిమ దానివైఖరిని (contour)బట్టి యందము నందుచున్నది. కాని వస్తువుయొక్క సౌష్ఠవము తెలియుటకై చాయ (Half-tones) ముఖ్యాంశముగ నున్నది. ఫోటోగ్రాఫీలో ఛాయాసమవాప్తిచేతనే ప్రకృతియాథార్థ్యము స్ఫురింపఁ జేయఁబడుచున్నది. ప్రాకృతవస్తువు లన్నియుఁ ద్రిపరిమాణయుతములై (Three-dimensional) యుండ, ఫోటోకాకితముపై వస్తువు లన్నియు ద్విపరిమాణయుతములై (Two-dimensional) యున్నవి; కనుక, వానికి యథార్థసౌష్ఠవస్ఫూర్తి (Stereoscopic effect) గలిగించుటకై ఛాయాసమాకలనము మిక్కిలియవసరమైనది.

వస్తువుయొక్క యందమునకుఁ దీరును, సౌష్ఠవమునకుఁ జాయయు ముఖ్యములైనట్లే దాని రామణీయతకు వర్ణము ముఖ్యము. ప్రకృతిలక్ష్మి సింగారించుకొని, 'నీటిగాలికి నెగరిన పైఁట' వలె ప్రాగంభోనిధిపైన నుషఃకాలారుణిమము సొగసు చూపించుచుండఁ దనివితీఱఁ జూచి, తైతై యని పారవశ్యమున గంతులు మొదలిడని కళానుభవితకలరా? 'వనజాలయము మూసి యినుజాడఁ దిలకించు లలితాబ్జినీ రాగలక్ష్మి' యంట! సంధ్యారామణీయకమునకు మైకము కలుగదా?

తీర్చినది కాశ్మీరతిలకము; మోవిమూంగట దురంగలించుచున్నది తొగరువన్నె; చూపులబందాలఁ జేయునది 'యిటునటు మిట్టిమిట్టిపడుచు', 'విలోలగతిఁ దొంగలిఱెప్పల నానుచు' 'గర్ణకుండలరుచి ధాళధళ్యములు'దాపున నల్లనల్లాంచుచు నేత్రాంచలముల నుండి మిటారించు తళుకుమెఱుంగు చూపుల ప్రోవులు. లోచనకోణములనుండి ధాటిమీఱఁ బ్రసారించు మదతీవ్రములైన యరుణ కాంతులకుఁ జెలియలై 'యబ్బురపాటుతోడ నయనాంబుజము ల్వికసిల్లఁ గాంతి పెల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరించుచున్నవి.' ఇంక

మనోజసామ్రాజ్యమునకు సింహాసనమైన యురస్స్థలి చక్కఁదనమూ, 'యెత్తుకొనివచ్చు నుద్వృత్తియే' తెలుపుచున్నది. ఇంకనాపై 'జీబుగవైచిన జిలుగుపయ్యెద' మనసులోనిరా గమును బీల్చివైచినది. కట్టెదుట నిలిచినది. ఘుమ ఘుమ పరిమళములలోఁగూడ గాఢ రాగమే!

'జగమెఱుంగు దాని జగమెఱుంగు!'

ఇంత రమ్యతతో, ఇంత మాధురితో, ఇంత సమున్మేషముతోఁ గన్నులకుఁ బండువై నాట్యమాడుచున్న సంధ్యారుణ మహిమను గాంచి, యానంద రసాస్వాదన మొనరించిన మనఋషులు 'భద్రత'నాకాంక్షించి యయ్యాది ప్రకృతిమోహన విలసనములలో నాలోకించి యిట్లు పాడిరి:

'ఉద్యంత మస్తంయంత
మాదిత్య మభిధ్యాయన్
కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్
సకలం భద్రమశ్నుతే.'

పరమానందమునకు జోడైన యీ భద్రత సంధ్యారుణదీప్తులతో నలరారు భాస్కరుని ధ్యానించుటచేఁ గలుగు ననుటలోని యర్థ మేమి? ధ్వనియేమి?

ఎప్పుడైనను రమ్యవస్తువును దిలకించి నచో నారమ్యతకుఁ బ్రతిధ్వనిగ మనస్సురంజి ల్లుట సహజము. "పాలబుగ్గలలేఁతపల్లవంబుల తోడఁజిన్నిలేనగవులుచెలిమిసేయఁగా" నాడు కొను బాలకునిఁ జూచి కందళితహృదయార విందుల మగుట యనుభవవేద్యము; కాని 'వెక్కి వెక్కి వెక్కసమగు మన్యువేగమున' నేడ్చువానిని గాంచినచో నానందము జనింప దు. మనస్సున కానందము కల్గినచో శరీర మునకుఁ బుష్టియు, వికాసమును, వర్చస్సును గలిగి, జీవోన్మేషముతో మనుష్యుఁడు 'భద్ర తను' గాంచఁగలఁడు. కనుకఁ బ్రకృతిసంపద లలో నంతర్యామియగు నా నం ద రూపుని యనుభవించుటయే 'భద్రతావాప్తికిఁ' గారణ మని మహర్షులు 'ఉదయాస్తమయ భానుధ్యా నమే' నిర్ణయించుకొనిరి. మధురకలకంఠ నిస్వ నముతో వీణియమీటిమీటి, 'ఆలాపగతి వేళ నరమోడ్పు గనుదోయి రతిపారవశ్య విభ్రమముఁ దెలుప, తూల్గఱగించి, రహివుట్ట, విమలగాంధర్వవిద్య' వెల్లడించు తరుణీమణి గానమునకు బులకరించినమేను మింటికెగయు చున్నట్లు తోఁచుట, యవ్యక్త మహిమను సంభావించుటచేత వ్యక్తియు నందు సాయుజ్య మును బొందుననుటకు నిదర్శనమై యున్నది.

కవితాశక్తి జీవోన్మేషమును గలిగించు నట్లును, గానమహిమ సర్వావయవములకుఁ బారవశ్యముఁ బుట్టించునట్లును, వర్ణముల సమంజససమాకలనము దృష్టి నట్టె యాకర్షిం చి, గాత్రమునకు నిశ్చేష్టతఁ బొడమఁజేసి, మనస్సునకు నానందరసపోషణముఁ గావించు ను. అనాదినుండియుఁ గవుల నాకర్షించిన ప్రకృతిలోని వర్ణసమాకలనమునకుఁ బ్రతి సృష్టిఁ గావించి పల్వురు చిత్రకారులు పే రెన్నిక కెక్కినారు. కవీశ్వరుఁడు వనసౌకు మార్యమును మంజులస్వనగుంభితపద రచన తో 'నవనానుగుణమంద పవనానుగతనంద

నవనాధికానంద వివలనంబు'న కెక్కించినట్లుఁ జిత్రకారుఁడు సొంపైనరంగులతో నాసాకు మార్యమునే వెల్లడించుచున్నాఁడు. పురాణ ములలోను గావ్యములలోను గల వర్ణనల వలన మునుపు ఘనులైన చిత్రకారు లుండి రని తెలియుచున్నది. ప్రస్తుతమున హిందూ దేశము నలంకరించు చిత్రశాల యజంతా గుహాలలో నున్నది. ఇచ్చట మనోహరచిత్ర ములను లిఖించి, శాశ్వతముగ నెలకొల్పి, కీర్తిసంపద నార్జించి, మనప్రాక్తనాంధ్రమహా శయులు లోకమున కభినవాలోకముఁ గల్పించినారు.

ఇటీవల భౌతికశాస్త్రము మేఘాలపైఁ బరుగులెత్తుచున్నది; క్రొత్తక్రొత్త వింతలను బుట్టించుచున్నది. శాస్త్రముయొక్క యుద్దేశ మెన్నటికిని కేవలవిషయసుఖైక కాంక్ష కాదు; సృష్టివైచిత్ర్యముల కాదికారణ మేదియైనఁ గలదా, లోకపద్ధతుల నన్నింటెని గేంద్రీకరించి వానికి నేకహేతువును గనుగొనఁ గలమా యనునదియ సచ్ఛాస్త్రజ్ఞుల యాశయము. ఈ సత్యాన్వేషకుల కార్యక్రమములోఁ దేలు చుండు ఫలితములను విషయ సుఖానుభవము నకుఁగూడ నుపయోగించి కేవల పశుకామ మును బోఁద్రోసి, రసాస్వాదనమే యనుభ వింపఁదలంచుట కళాకోవిదుల కర్తవ్యము.

ఛాయాగ్రాహితో (Camera) బొమ్మలను జిత్రించుట యందఱకుఁ దెలిసినదే. కాని కాలవ్యయమునకోర్వక, ఫోటోగ్రాఫరులును, కళాశూన్యతచేత సామాన్యజనులును, దిమ్మల వలెఁ దీయించుకొను బొమ్మ లానందదాయక ములు కావు.

కవితలోను, గానములోను, జిత్రముల లోను, యాథార్థ్యము స్ఫురించి 'జీవకళయుట్టి పడిననేకాని' యవి రసికుల కుల్లాసముఁ గలి గింపనేఱవు.

"వరుచూడ్కి ముద్దియ వదనంబుపై వ్రాలి
తివుటమై నునుఁగాంతి తీపుఁ గ్రోలు."

ఇట్టివిచిత్రసృష్టిగావించిన యాతఁ డాహా, కవిబ్రహ్మ!

ఇది యకృత్రిమమైన చిత్రము. ఈ వర్ణన విన్నతోడనే కన్నులకుఁ గట్టినట్లు వివాహవేదికయుఁ, బెండ్లికొడుకును, నును సిగ్గుతేటలు నూల్కొను నిగనిగలాడుమోము తో వధూమణియు, ఆతఁ డామె మైసోయ గంబున వ్రాల్చిన చూపు లామె వదనంబుపై వ్రాలి, తివిరి, తివిరి, నునుగాంతి తీపు గ్రోలి మైకముఁ జెందుటయుఁ గనుపింపక మానవు; మనస్సు రంజిల్లక మానదు. ఇఁక నాపైఁ గలుగు మహానందము వధూవరులదో, క వినులదో బ్రహ్మదేవుఁడే యెఱుఁగును.

"అక్కజమైన రూపమున
నాత్మకు ప్రేఁగయి పొల్చుపొల్తిపై
నెక్కొనుచూపు క్రమ్మఱుప
నేరక!"——

ఆహా! కవిబ్రహ్మసృష్టి కింక విమర్శన లేల?

ఇట్లే నిర్మలమానసముతో నాలాపములు దీయుచున్న గొపుపిల్ల పాడిన వృత్తమే మనసు

నావరించుకొనఁగా నామె దాటిపోయినను వృత్తి మింకను జిత్తమున డోలిక లూఁగుచు నే యుండెనని నిసర్గమాధుర్యముతో వర్డ్సువర్త్ కవి వ్రాసినాడు.

"The Music in my heart I bore,
Long after it was heard no more."

ఈ నైజప్రతిమయే గానములో నుండవలెను గాని, పదిగాసులైట్లు మండుచుండగా, పీడించుకొనుచు మద్దెళ్లు మ్రోయుచుండగా, బంయ్యిమని హార్మోనియ మొక్కటి ప్రాణాలు తీయుచుండగా నినుము సాగదీసినట్లు ఒకేపాదము వందమాఱ్లు పలవరించుగాయకునిపాట రోఁతఁ బుట్టించును.

ఇట్లే చిత్రములలోఁగూడ సత్యప్రకటన యవసరము. చేతితోవ్రాసిన చిత్రములవలె కెమెరాతో యథార్థస్ఫురణముఁ గల్గించుట కష్టము. కాని సాధ్యమైనంతవఱకు సత్యమును బ్రకటించుటయే ఫోటోగ్రాఫరు యొక్క యుద్దేశముగ నుండవలెను.

దిమ్మలవలెఁ గూర్చుండఁబెట్టి, స్కూలు కుఱ్ఱవాళ్లకు డ్రిల్లు చెప్పునట్లు 'స్టాండ్', 'సిట్' అని నిలుపుటకన్న హేలావిలాసముగఁ గూర్చుండఁబెట్టి ఫోటో తీసినచో మనోజ్ఞముగ నుండును.

యాథార్థ్యము స్ఫురింపఁజేయవలె నని పైనఁ జెప్పుటలో నున్న దున్నట్లు చూపుట యని కాదు. చింపిరితల చేతితో నవరించుకొనివచ్చి, చీపురుకట్ట చేతిలోఁ బట్టుకొని, గుమ్మములికి ముగ్గుపెట్టు యిల్లాలి నున్న దున్నట్లు వర్ణించినచో జుగుప్సాకారణ మగును. కాని యామెకు గృహనాటకనటీపదవి నొసగి, యామె పనులకు నభిప్రాయములను బొసగించి వర్ణించినచో నానందము కలిగించుచున్నది. ఇంతేకాక, యొక మెట్టు పైకెక్కి మనము విచారించినచో నసత్యప్రకటనలోఁ గూడఁ గళావిలసన మున్నదని గ్రహింపఁగలము. ప్రకృతిలోఁ బ్రసిద్ధమైనది 'సమ్మేళనగుణము' (Harmony). ప్రకృతిలో నుండి పరికరములనుగొని వానిని సమంజసముగా మేళవించినచోఁ గృతికర్త యాథార్థ్యము నతిక్రమించినను సత్యమునే స్ఫురింపఁ జేయుచున్నాఁడు.

"తోలుకాఱు మెఱుఁగుల తోఁటలో నాడెడు
రాయంచకొదమతో రాయఁజాలి."

తోలుకాఱు మెఱుఁగులతోఁ దోఁట కల్పించినాడు; అందులో రాయంచకొదమలు; అవి యాడుచున్నవి! కృత్రిమచిత్రమే; కాని సమంజససమ్మేళనము కలదగుటచే నాహ్లాదదాయకము.

'On the Sea shore of endless seas
Children meet'——

అంతములేని మహాసముద్రము లంట! వానికిఁ దీరము కల్పించుటయే హేళనముగ నున్నది; అక్కడ శిశువులకు సమావేశముఁ బొసగించినాఁడు!

'I will be bounded in a nut shell
And count myself the king of infinite space.'

హేంలెట్టునకుఁ గవితాలక్షణములు కలవు; అందులోఁ గామినీ మోహనరుచుల

తొలి తళుక్కులను జుఱ్ఱుచున్నాఁడు మీఁదు మిక్కిలి యవస్థావిధానముచేత భావోద్రేక మతిశయించి యున్మత్తదశలోనికి దిగుచున్నాఁడు

The poet, lover and lunatic, all in one combined

అటువంటికాలమున నాతఁడు దురూహ్యాభావములకు వ్యక్తిత్వ మీయఁబూనుట సమంజసముగా నున్నది. 'గుల్లపోకలోఁ గూర్చొని, యనంతావకాశమునకు నేనే యధినాథుఁడ నని తలంచెద' ననుచున్నాడు. నాచనసోమనాథుఁడేమి, రవీంద్ర నాథుఁడేమి, షేక్స్పియర్ కవినాథుఁడేమి; తమ విశదకీర్తికి కారణము తమ భావనౌద్ధత్యమే. 'సత్యలోకము దాఁక సకలలోకంబులు' దాటిపోయినను 'ఊహను' మించఁజాలు భావములకుఁ జోటిచ్చువాఁడే మహాకవి:—

'Thoughts such as dodge conception
To the very bourn of heaven'—Keats.

యాథార్థ్యమును వ్యక్తీకరించుట యసంభవమైన నోఁగాక! మనసులో 'నేర్పఱచుటకు నశక్యమైన నోఁగాక! సమంజసమ్మేళన మున్న నంతేచాలు. శకుంతలను జూచిన, చూపించిన కాళిదాసున కేమితోచినది?—పగడములా, యిగురాకులా, కరికుంభములా, నెలకూనలా, నీలవిషధరంబా.—కాదుకాదు.

'అఖండం పుణ్యానాం
ఫలమివచ తద్రూప మనఘమ్'!

పొచ్చెము లేనియామె యాకృతి పున్నెముల ప్రోవువలెఁ గాన్పించినదఁట!

ఈదురూహ్యాభావనా ప్రకటనము చిత్రకారులకుఁగూడఁ జేతకావలెను; అభిప్రాయ విలసితము కానిచోఁ జిత్రము కేవల పాశవతృప్తి కలిగించునే కాని యాంతరంగికవికాసమును గలుగఁజేయదు. ఈ కిటుకుఁ దెలిసియే 'లియనార్డోడావిన్సీ' యను ప్రసిద్ధచిత్రకారుఁ 'డిటలీ'లోఁ దనచిత్రములకు స్మేసము జనింపఁజేసెను. హైందవకళావిమర్శకుఁ డగు 'హేవెల్' వ్రాసినట్లు హిందూచిత్రములలోఁ గల భావనావిలసనము, ఆధునికపాశ్చాత్యుల విషయేచ్ఛావివర్ధకచిత్రములలో లేదు.

ఒకవంక యాథార్థ్యమును బ్రకటింపవలెను; ఇంకొకవంక భావౌన్నత్యమును జూపవలెను. వేఱొకవంక నింద్రియసౌఖ్యములకుఁ దోడుకావలయును. మఱియొకవంక దైవీద్యుతులను వెలిగింపవలెను. కళాప్రకటన సామాన్యమైనది కాదు. కళాకోవిదుని తాత్కాలిక భావనాగతులనుబట్టి రూపుమార్చుచుండును.

సహృదయులారా! కలవరింతలు తుది ముట్టుచున్నవి. తెల్లవాఱుచున్నది. మంజుల నిస్వనములతోఁ గోకిలలు పాడుచున్నవి. తళుకు బంగరుజిగి మెఱుంగులతో గులాబి పువ్వులు వికసించుచున్నవి. 'కొమరుఁబ్రాయపు నూనూగుఁ కొదమయెండ ప్రాచి కభినవ మాణిక్యపదక'మౌచున్నది.

సీ. కలువపూవలపు, వెన్నెల వెన్నలో వన్నె
సవరించి యిచ్చెనో చందమామ
మెఱుగుఁదీవెలతీవి మిసమిసల్ ప్రసరించి
పెనఁచి యర్పించెనో వేగుఁజుక్క

మిన్నేటిచంచలోర్మల కాంతితోఁ బల్కు-
కపురమ్ము లొసగెనో యపరవాణి
ప్రణయినీమోహనస్వనముతోఁ బుల్కరిం
పులనల్లి యొసఁగెనో పూలదండ

గీ. కవికిశోరంబు తానిన్ని చవులమఱగి,
నిదురపోవుచు నున్నను నృత్యమాడెఁ
గలవరింతలు చెలియలై కలసియాడ
వినుతలీలఁ గళాసౌధవీథులందు.

సీ. చలితకల్లోల మాలల డోల కట్టించి
జోలపాడించెనో పాలకడలి
యవదాత కౌముదీహాస లీలలచేత
నవ్వించి పెంచెనో నలినవైరి
కోయిలపాటలో హాయి చేఁగొని వచ్చి
పాలుత్రావించెనో గాలిరాజు
యుదయరాగములోనియూటపేరిచియుగ్గు
పట్టి పోయించెనో ప్రకృతి మాత

గీ. భువనమోహనకారణాద్భుతము గాఁగ,
సహృదయాత్మానుకూల నైసర్గసృష్టి
అల్ల గరగించు కవికిశోరమ్ము పాట
కేల జనియించు లేకున్న నిట్టి రుచులు?

సంపూర్ణము

# మృతి—రాత్రి *

సెట్టి లక్ష్మీనరసింహము గారు

వాయురే! లోకమున నాదిమానవుండు
రాత్రిని గుఱించి విన్నమాత్రమున
మూత్రముం బొందెనో? వినీలమైప్రభాస[ నెంత
మేతమైనట్టి గగనంపు మేలుకట్టు
కలిగి, కన్నోయికిఁ వింతగొలుపు నీప్ర
పంచ మేహానోయని యెంత భయముపడెనో?
అంతలో వేవెలుఁగుమంట యస్తమింప
అప్పటి యురుప్రభాప్రవాహంబునందుఁ
దడియు నునుమంచుతెరనుండి వెడలి వచ్చి
నింగి నక్షత్రసమితి వెలుంగఁ దొడఁగె
ఇట్లు వెనుకటికంటె మఱింత హెచ్చు
గాఁగ సృష్టి దృష్టులకును గానవచ్చె.
ఔర! సూర్యుని కిరణచయంబునందు
నిట్టిచీఁకటి కలదని యెవ్వఁ డెఱుఁగు?
మఱి కాద్యల్పవస్తువు లఘులకుఁ గ
నంబఱచి కోట్లకొలఁది పెన్మండలములఁ
గానఁబడకుండఁ జేయు భాస్కరుని రశ్మి.
భానుకిరణంబులవిధాన బ్రదుకుగూడ
మోస మొనరించుచున్నదేమో మనలను!
మృతియనఁగ భయపడి జంకనేల యింక?

* Blanco White's famous Sonnet, Night & Death.",





# ప్రచండభార్గవము

* ఏకాంకనాటకము

శ్రీ శేషాద్రిరమణ కవులు

[జనకుని రాజమందిరము, మిధిలా నగరము]

పరశురాముఁడు

(కోపముతోఁ బ్రవేశించి) ఓ యంతిపురంపుఁ బనికత్తెలారా! శివధనువు విఱిచిన రాముఁ డెందున్నాఁడు? ఎందున్నాఁడు? మాఱుపలుకరేమి ?

చ. ఇరువదియొక్కమాఱు ధర
ణీశులఁ జెండి, కుమారు గెల్చి శం
కరునుతిఁ గాంచి, సంగరము
ఖంబున దుస్తరు గార్తవీర్యుసక్
బొరిగొనినట్టి విక్రమవి
భూషణుడై తగుభార్గవుండు తాఁ
బరశువుతోడ వచ్చెఁ గను
పట్టఁడు రాముఁ డిదేమిచిత్రమో.

అంతఃపురపరిచారికలారా! రాముఁ డెచట నున్నాఁడు? గురుధనుర్భంగము గావించిన రాముఁ డేఁడి ?

[అంతఃపురములోనికిఁ బోఁ బోవును]

రాముఁడు

(ప్రవేశించి) తేజస్వీ? నేనే రాముఁడను. ఇటురండు.

పరశురాముఁడు

(రాముని జూచి) అయ్యయ్యో! పాలుగారు చెక్కులు, కనువిందుగూర్చు రూపు, నల్లమబ్బుఁబోలు మేనిచాయగల యీ పెండ్లికుమారుఁడు గతింపవలసిన కాలము చేరువలో నున్నది. (ప్రకా.) దాశరథీ! గురుధనుర్భంగామర్షంబునఁ గ్రోధాతిరేకుఁడైన పరశురాము గండ్రగొడ్డలి నీకంఠము నలంకరింప నున్నది.

రాముఁడు

(చిఱునగవుతో) పదివందల సంవత్సరములు శివునొద్ద సేవగావించి కుమారస్వామిని గెలిచి శివుని యనుగ్రహావశమున నొందినది యీ గండ్రగొడ్డలియేనా?

పరశురాముఁడు

(తనలో) అదిరా? ఈతని మాటల పొందిక బింకమును, బీరమును, మగఁటిమిని వెల్లడించుచున్నది. (ప్రకాశముగా) రామా? ఇది గురుఁడగు శంకరుఁడు ప్రసాదించిన పరశువే?

రాముఁడు

(వినయముతో నమస్కరించి) తపోధనా? ఈ గండ్రగొడ్డలివలననేకదా శంకరుఁడు ఖండ

* భవభూతికృత మహావీరచరిత్రములోని యొకయంకమునకు ఛాయ.

పరశువనియు, నీవు పరశురాముఁడనియుఁ బే రొందినది. మహర్షీ! నీవు ధన్యుఁడవు. నీ కీర్తి లోకాలోకపర్యంతము నిండియున్నది. నీపరాక్రమము లోకవిదితము. నీత్యాగము చతురర్ణవవేష్టిత సర్వసర్వం సహావలయము. నీ తపస్సు అనన్య సామాన్యము. నిన్నుఁ గొనియాడఁ దరమా?

పరశురాముఁడు

(శాంతముగ)వత్సా!రామా! నీమంచితనముఁ గాంచినదాది నిన్ను బిగియారఁ గౌఁగిలింప నా వక్షస్స్థల మాసపడుచున్నది.

రాముఁడు

(సగర్వముగ)మునీంద్రా! కౌఁగిలింతల కిది తగిన వేళగాదు.

పరశురాముఁడు

(స్వగతము) ఈ బాలుఁడు నన్ను పలుతెఱంగుల గారవించుచున్నాఁడు. నాకుంజూడ నీ బాలుఁడు పురుషాకారము ధరించిన ధనుర్విద్యవలె, భువనసారమువలె, సుకృత సముదయమువలెఁ దోఁచుచున్నాఁడు. (ప్రకాశముగా) మంచిది, దాశరథీ! సంగరమున కాయితము కమ్ము.

రాముఁడు

(సగర్వముగ)ఇదిగో సర్వసిద్ధముగా నున్నాఁడ.

పరశురాముఁడు

[విల్లెక్కుఁబెట్టఁబోయి విచారమునభినయించి కనుల నీరువిడచును.]

రాముఁడు

మునీంద్రా! అదేమి? కనులనీరువిడచుచున్నారు.

పరశురాముఁడు

(నిబ్బరించి) కుమారా! ఏమియును లేదు. నీవా? నిన్న మొన్నఁ బెండ్లియైన పసపుఁబట్టల క్రొత్త పెండ్లికొడుకవు. ముద్దులకూనవు; గురునివిల్లు విఱచి నన్నుఁ బరాభవించి ఘోరమృత్యువు వాతఁ బడనుంటివని సంతాపించుచున్నాఁడను.

రాముఁడు

(స్వగతము) మొసలి యితరజంతువుల వాతఁ గొను ముం దిటులే కనుల నీరుగార్చుచుండు నట! (ప్రకాశముగా) జనకాజ్ఞా నిర్వహణ ప్రవీణా! భార్గవా! నిజముగా నీవు దయాశాలివే! నీ దయాభావము నెఱుంగనివారిం దెవరును లేరు.

పరశురాముఁడు

(కోపముతో) ఓరిమూర్ఖా! బాలుఁడ వని జాలిఁ దలంచినకొలఁది వాఁడినారాచముల వలె నీమాట లెదనాటుచున్నవే! కడుపాఱ గన్న తల్లినే తండ్రియానఁగొని పిలుకుమార్చిన నాకు నీవు ఎంతలో నెంత! ఇరువదియొక్కమాఱు రాజవంశము తెగటార్చి నిండుచూలాండ్రగు రాజకాంతలను కడుపులోని కనులు గానని కందువులతోఁగూడఁ జెండి రాజరక్తముచే దర్పణాదు లొసంగి పితృభక్తి ప్రకటించిన నాకు దయ లేదు. ముందు ధనువు సజ్యము గావించి నాపై బాణము విడువుము.

[జనకుఁడు, శతానందుఁడు, ప్రవేశింతురు]

పరశురాముఁడు

శతానందా! మీకందఱకుఁ గుశలమేనా?

శతానందుఁడు

మీ యనుగ్రహామువలనఁ గుశలమున కేమి కొఱఁత. అతిథిపూజార్హవగుదువేని యివి గో పూజా ద్రవ్యములు; గైకొమ్ము.

పరశురాముఁడు

(గర్వముతో) బ్రహ్మజ్ఞుఁడు, మహాత్ముఁడు నగు జనకచక్రవర్తి బ్రాహ్మణప్రియుఁ డని నే నెఱుఁగనివాఁడఁగాను. నే నతిథిపూజలఁ బడ యుటకు రాలేదు.

శతానందుఁడు

రాజనియమములను పాటింపక నీ వంతిపురికి రానెంచుట మంచిపని కాదుగదా!

పరశురాముఁడు

తపఃప్రియుఁడనై కానలలోనుండు నాకు రాజ గృహముల నియమములు తెలియవు.

పరిచారకుఁడు

(ప్రవేశించి శతానందునితో) దేవా! కంకణము లు విప్పుటకు శ్రీరాముని నవరోధాంగనలు గొనిరమ్మని యాజ్ఞాపించినారు.

జనకుఁడు, శతానందుఁడు

రామభద్రా! పోయిరమ్ము.

రాముఁడు

భార్గవా! గురువులయాజ్ఞ చిత్తగించు చున్నా రుగదా, పోయివత్తునా?

పరశురాముఁడు

వత్సా, రాఘవా! పూర్వాచార ముజ్జగింపఁ జనదు. పోయిరమ్ము; కాలవిలంబము గావింపక వైళమ రమ్ము. కాననవాసులమగు మేము నగ రములలోఁ జిరకాల ముండ నేరము.

[సుమంత్రుఁడు ప్రవేశించును]

సుమంత్రుఁడు

ఆర్యులారా! వసిష్ఠ విశ్వామిత్రులు కొలువు సావడిలో నున్నారు. మిమ్ముఁ బిలిచికొని రమ్మని సెలవిచ్చిరి.

అందఱు

మంచిది; యటులనే చేయుదము.

[నిష్క్రమింతురు]

రంగము

[జనకుని కొలువుసావడి; జనక, విశ్వామిత్ర, శతానంద, వసిష్ఠ, పరశురాములు, దశరథుఁడు ప్రవేశింతురు.]

వసిష్ఠుఁడు

భార్గవా ! నీ కీవ్యర్థవివాద మెందులకయ్యా! వృద్ధుఁడు, సూర్యకులుఁడు నగు దశరథమహా రాజు నిన్ను అభయము ప్రసాదింప నర్థించు చున్నాఁడు. మామాట లాలించి సంగర ప్రసంగము మాని జనకుని యతిథిపూజలఁ బరిగ్రహించి దయాళుఁడవు కమ్ము. బ్రతికి యున్నంతవఱకు కీగండ్రగొడ్డలితోనేనా కార్య ములను సాధింపవలసినది?

చ. చదివితి వెల్ల శాస్త్రములు
క్షత్త్రియకంఠవిలుంఠనక్రియా
స్పదమగు గండ్రగొడ్డలిని
బట్టఁగ నేటికి వీడుమింక, మో
క్షదమగు నాత్మతత్త్వము వి
చారణసేయక రాచపాడితో
బ్రదుకఁదలంతురే మునులు
బ్రాహ్మణధర్మమె యిద్ది భార్గవా!

బ్రహ్మజ్ఞా! యిది మునులు రాజులు నిండిన సభ. ఈ కానఁబడువా రందఱు నిన్ను యాచించుచున్నారు. గండ్రగొడ్డలి పాఱవైచి చిత్తశాంతి నొందుము. మా ప్రార్థన మాలింపుము.

పరశురాముఁడు

మునీంద్రా! మీ యాజ్ఞ పాలింపఁ దగును. (శ్రీ)రాముఁడు శూరవర్యుఁడుగాఁడేని యెన్నఁడో శాంతించి యుండును. కాని యాతఁడు లోకోత్తరుఁడు. వానిని క్షమింతునేని పరశురాముఁడు పరాభవమును సహించెనన్న నింద నాతలపైఁ బడును. విరోధినిఁ దెగటార్పక నా గురుఁడగు శంకరుని సందర్శింపఁ గలనా?

విశ్వామిత్రుఁడు

పరశురామా! నీకు గురునిపై నాదరభావము గలదేని నన్నుఁగూడ గురుభావముతోఁజూచి నామాట నాలకింపుము. ఇట నున్నవారిలో నందఱును నీకుఁ గావలసినవారే. నీ తండ్రి యగు భృగుమహర్షియు, వసిష్ఠుఁడును అంగిరసుఁడును సహోదరులు. శతానందుఁ డా యంగిరసుని మనుమఁడు.

క. అనితరమగు బాంధవ్యము
చనువును సాహసము రక్తసంబంధంబుఁ
బెనఁగొనిన యీ మహాత్ములు
వినఁబలికెడిహితముచెవినిబెట్టుమికూర్మిన్.

పరశురాముఁడు

పెద్దలమాట వినమి మిగులపాపమని నేనెఱుంగనివాఁడఁగాను. ఆపాపముఁ బోవ నెన్నేని ప్రతిక్రియలఁ గావింతును గాని చేతనున్న గండ్రగొడ్డలినిమాత్రము విడువను. నాకు మోక్షముకంటె నాయుధధారణమే యిష్టమైనది. మీరు నాకు దాయాదులే; నా మేలు కోరువారె; కాని చేయవలసినది లేదు.

గీ. నారితాఁకిడిచే నొచ్చి నాభుజములు
కంది నేఁటికిఁ గాయలు కాసిపోయె
ఇవియె నామోక్షవిముఖత హెచ్చరించె
శస్త్ర మిఁక నేమొగంబున జారవిడుతు.

విశ్వామిత్రుఁడు

కుమారా! నేను చెప్పునది యొక్కమాట; వినఁదగెనేని వినుము. ఎవఁడో యొకరాజు నీ కహితము గావించెనని రాజవంశము నంతయు నిర్మూలము గావించితివి. మరల బ్రాహ్మణ మూలమున నంకురించు రాజకులమును దెగటార్పఁ బూనిన నన్ను పెద్దలువారింప శాంతించితివిగదా? ఇపుడుగూడ నటులె పెద్దల మాట పాటిసేయుటయె కర్జము.

పరశురాముఁడు

గాధేయా! నిజముచెప్పితివి. చ్యవనాదుల యాజ్ఞ శిరసావహించినాఁడు మొదలు రాజరక్తధారాపూతమగు నీపరశువును గట్టెలు నఱకుట కుపయోగించితిని. మరల రాజవంశ మంకురించుటచే రాముఁడు నా కహితము గావించెను. వానిని జెండాడి నే నీ యాయుధమును బాఱవైచి తపము గావించెద.

శతానందుఁడు

(ఆగ్రహముతో) పరశురామా! శాంతమూర్తియుఁ దపస్వియు నగు జనకుని గృహము నందే యిట్టియవమానము రాజవంశమునకుఁ

గలిగెనేని ఇఁక మాజీవితములు, తపస్సులు తగులఁబెట్టనా? మమ్ము కాదని రాముని నీడనైన త్రొక్కఁగలవా?

విశ్వామిత్రుఁడు

శతానందా! మంచిమాటాడితివి.

పరశురాముఁడు

జనకపురోహితా! నీవంటి మునివేషధారుల నెందఱనో కాంచితిని. నీ తపశ్శక్తి నా బ్రహ్మతేజము నిం చు కే ని యెదిరింపఁజాలదని యెఱుంగుము.

శతానందుఁడు

బ్రాహ్మణబ్రువా, కులాచారదూరా! నీవు మాతృహంతకుడవు; శిశు హంతకుఁడవు. నీమొగముఁజూచినఁ దీఱనిపాపము వచ్చును.

పరశురాముఁడు

ఓరి అహల్యాపుత్రా! నీవు నన్నుఁ గులాచార దూరుఁడని యనఁదగినవాఁడవని నేనెఱుంగక పోలేదు.

శతానందుఁడు

(ఆగ్రహాతిశయమున) ఓమునులారా! ఓరాజులారా! మీరంద ఱీభార్గవుని క్షమింతురుగాక! నే నిఁక నుపేక్షింపను. (కమండలుజలముగొని) సదస్యులారా! ఆలకింపుఁడు. రాజకులద్వేషి యగు నీనీచుని భస్మముచేయుచున్నాను.

వసిష్ఠుఁడు

(అడ్డమువచ్చి) శతానందా! శాంతింపుము. శాంతింపుము. పరశురాముఁడు మన కతిథిగా వచ్చినాఁడు. అతిథిని గోపింపరాదని యెఱుంగవా! (జలము పాఱఁబోయును).

పరశురాముఁడు

(కోపముతో) ఓ రాజన్యులారా, తపస్వులారా! వింటిరా శతానందుని ప్రలాపములు. దాని కేమి? నేనిపుడు విదేహరాఘవ వంశములను దెగటార్చెదనని ప్రతిజ్ఞా పూర్వకముగాఁ జెప్పుచున్నాఁడను. మగఁటిమిగలవిలుకాఁడైన మహాత్త్వముగల తపస్వియైన నున్న నడ్డుపడ వచ్చును.

జనకుఁడు

భార్గవా! గర్వముచే నోడలెఱుఁగక మాటలాడుచున్నాఁడవు వైరి లేఁడని పరమాత్మను సందర్శింపఁ దత్త్వోచితముగ వర్తించుచు నాత్మానందమునగనున్న మా క్షాత్ర తేజము నీ మాటలచేఁ జెలరేగి ధనుర్బాణధారణము నకుఁ బ్రేరేపుచున్నది. ఇఁకఁ జూడుము:

ఉ. ఆరియు నారనట్లు హృద
యంబున రాజెడి క్షాత్రవహ్ని నీ
వీరవచస్సమీరగత
వీచికలన్ దళుకెత్తి యాత్మర
క్షారతి కుత్సుకత్వమును
సంధిలఁ జేయుచునుండె నడ్డుకో
రా! రణమందు నీదుతల
రాల్చెదఁ దాళఫలంబు కైవడిన్.

పరశురాముఁడు

జనకరాజా! నీవు వృద్ధుఁడవు; ఆత్మవిదుఁడగు యాజ్ఞవల్క్యుని శిష్యుఁడవు, నిగమరహస్యవేదివి, శాంతమూర్తివి, అని గౌరవభావముతోఁ దిలకించుచుండఁ బైకొనుచుంటివా?

తే. క్రూరరాజన్య ఘోరకాంతారవార
మోరిమి వహించి యస్మత్కుఠారధార
బారిఁబడనీక నిల్పినపాపమిట్లు
పరిణమించెను విషవృక్షభావమునను.

జనకుఁడు

భార్గవా! ఏమో బ్రాహ్మణుఁడవు. దురహంకారివి. పోనిమ్మని సహించినకొలఁది రాజుల నీ వగౌరవించుచున్నాఁడవు. కాఁగలది కానిమ్ము. ఇఁక ధనువు పట్టుకొనక మానను.

పరశురాముఁడు

జనకా! నా గండ్రగొడ్డలిని జూచుచునే వ్రేలుచుంటివా?

జనకుఁడు

భార్గవా! ఇది మాటలకుఁ దగినవేళ గాదు. కాచుకొమ్ము.

[విల్లెక్కుపెట్టి గురిచూచును.]

దశరథుఁడు

(అడ్డమువచ్చిజనకునితో)రాజేంద్రా! దోషియే కానిండు బ్రాహ్మణునిపై బాణము విడచుట తగునా?

క. కోపంబు మాని బ్రాహ్మణ
తాపసుఁ గరుణింపుమయ్య, దాక్షిణ్యనిధీ!
వ్యాపాదము విప్రునియెడఁ　　[ముల్.
జూపఁగరా దనవె తొల్లి శ్రుతిసముదయ

జనకుఁడు

రాజన్యా! నా కడ్డురాకుము. ఈ కలుషాత్ముని పట్ల దయఁదలంచినఁ బాపము వచ్చును.

పరశురాముఁడు

ఓరిదుష్టా! నేనా కలుషాత్ముఁడను. నీకుక్షి బగులఁజీల్చి ప్రేవులఁదీసి కలుషాత్ముఁ డెవఁడో, యెటులుండునో తెలిపెద.

[గండ్రగొడ్డలి యెత్తఁబోవును]

దశరథుఁడు

ఓరిబ్రాహ్మణా! మేము ప్రాణములకంటె మిగుల గౌరవముగాఁ దిలకించు నీరాజర్షిని వృథాగా దూషించుచున్నాఁడవు; ఇది కూడనిపని. ఇఁక నేని శాంతివహింపుము.

పరశురాముఁడు

(నవ్వి) నీవుగూడ నొకరాజువలె నాజ్ఞాపించ వచ్చితివా?

దశరథుఁడు

(కోపముతో) నీవిపుడు శిక్షార్హుఁడవు. రాజులకు దుష్టుల శిక్షించు నధికారము గలదు. ఉపేక్షింతువా, బ్రతికిపోవుదువు. లేకున్న మేమే నిన్ను ఉపేక్షింపఁజేయుదుము. బ్రాహ్మణులా, క్షాత్రధర్మ మవలంబింపవలసినది? చాలులెమ్ము.

పరశురాముఁడు

మీరు రాజులగుటచేతనే కాఁబోలు పరశురాముఁడు సనాథుఁ డైనది! మీ కొలువున మీ రెటులేని భాషింపవచ్చును.

దశరథుఁడు

జ్ఞానశూన్యులై రెంటికిఁ జెడినవారిని శైశవమున దేశికుఁడు,ప్రాయమున రాజును శిక్షింపఁ దగినవారు.

విశ్వామిత్రుఁడు

దశరథరాజన్యా! నీవు చెప్పునది యుక్తియుక్తముగా నున్నది. పరశురామా! ఇకనైన జ్ఞానమును సంపాదించుకొని వసిష్ఠ మహామునిని సేవించి హితోపదేశమును బడసి సుఖముగా బ్రదుకుము. దాన నీయహంకార మంతరించునేమో!

పరశురాముఁడు

ఖండపరశుని ప్రియశిష్యుఁడ నగునాకా, ఈ ముదుసలి తాపసిహితోపదేశము చేయవలసినది?ఏదో పెద్దవాఁడు, కాలము దీఱినవాఁడని నేను గౌరవించినంతమాత్రనె వసిష్ఠుఁడు నాకంటె నుత్తముఁడా? ఈవృద్ధుఁడు నాకుఁ జెప్పవలసిన దేమున్నది?

వసిష్ఠుఁడు

పరశురామా! నీవు వృథా వాచాటుఁడవు. దేహాభిమానము లుజ్జగించిన నాకు నీవెంత నిందించినను రోషములేదు. కాని నీమూలమునఁబవిత్రమగు నావంశము కళంకిత మయ్యెనని మిగుల వగపుకలుగుచున్నయది.

దశరథుఁడు

మహానుభావుఁడగు వసిష్ఠునిగూడ దూషించుచున్నాఁడే?

జనకుఁడు

రాజన్యా! నీవడ్డుపడి బ్రతికించినందులకుఁగృతజ్ఞతారూపమున నీ పురోహితుని గౌరవించుచున్నాఁడు.

విశ్వామిత్రుఁడు

గురునింద, కులవృద్ధనింద గూడఁ జేయ పరశురాముఁడు వెనుదీయుటలేదు. ఇతని నిటుల విడువవలసిన దేనా?

పరశురాముఁడు

(కోపాతిశయముతో) కారణాంతరములచే నారక్తనాళములలో మరుగుపడిన విక్రమవహ్ని సర్వతోముఖముగ వెలికురుకవలసిన యవకాశ మిప్పటికిఁ దటస్థించినది. దీనితో నిరువదిరెండుమారులు క్షత్రియకుటుంబములు తెగటార్చినటు లగును.

[జనకునిపైకిఁ బోఁబోవును.]

వసిష్ఠుఁడు

ఈదుష్టుని బ్రాహ్మణుఁడని యెంచి క్షమింపఁ దగదు.

విశ్వామిత్రుఁడు

భార్గవా! నిన్నుఁ గరుణించుటయే యింతటి దుండగమునకుఁ బ్రేరేపినది. ఇఁక నీపొగరు నేనొకడ నడఁచెద చూడు.

పరశురాముఁడు

ఓరికౌశికా! బ్రాహ్మణబ్రువా! క్షత్రియకళంకా! నీవు నిజముగ బ్రాహ్మణుఁడవయేని నా శాపజలముచే నిన్ను రూపుమాపెద. కాదు, రాజునందువా! నా గండ్రగొడ్డలితో జరుపఁబోవు నిరువదిరెండవ సంహారకార్యమునకుఁ దొలుత నిన్నె ఆఁగావించి కార్యారంభమున కుపక్రమించెద.

[శ్రీరాముఁడు ప్రవేశించును]

శ్రీరాముఁడు

మహాత్ములారా! వందనములు. అంతఃపురమునఁ బని పూర్తిచేసికొని వచ్చితిని. భార్గవుని

నే నెదిరించెద. నన్నుఁబంప నంగీకరింపఁ బ్రార్థించెదను.

జనకుఁడు

అది పరశురాముఁడుగూడఁగోరుచున్నదియే.

దశరథుఁడు

తనయా! తప్పని సరి వచ్చినది; కానిమ్ము.

పరశురాముఁడు

రాజడింభకా! పాపము పరశురాముని గెలువఁ గలనని మురియుచున్నాఁడవు కాఁబోలు! నీ మారణకర్మము నాచేత నిమిడియున్న దని గట్టిగాఁ దెలిసికొమ్ము.

శ్రీరాముఁడు

అంతయు రణరంగమునఁ దేటపడఁగలదు; రండు.

[నిష్క్రమింతురు.]

విశ్వామిత్రుఁడు

(చూచి) రాముఁడు పరశురాముని నెదిరింపఁ బోవుచున్నాఁడు. పరశురాముఁడు విష్ణుధనువు, గండ్రగొడ్డలి గొని పైకిఁ బోవుచున్నాఁడు.

వసిష్ఠుఁడు

శ్రీరాముని బాణశక్తియే పరశురామునకు హితోపదేశము గావింపఁగలదు.

జనకుఁడు

రాజన్యా! పరశురాముని చేతినుండి రాముఁడు ధనువును గైకొనుచుండ నొక మహాతేజము పరశురామునుండి శ్రీరాముని జేరినటు లగుపడినది. అదిగో శ్రీరాముఁడు నూత్న వికాసముతో, విజయోత్సాహముతోఁ గనుపడుచున్నాఁడు. రాజేంద్రా! రాముఁడు నీకుఁ దనయుఁడై జనియించుట నీ సుకృతము సుమా!

విశ్వామిత్రుఁడు

అదిగో! తేజోహీనుఁడై పరశురాముఁడు రామసహితముగాఁ బ్రవేశించుచున్నాఁడు.

[పరశురాముఁడు రాముఁడు ప్రవేశింతురు]

జనకుఁడు

దశరథా! లోకాభిరాముఁ డగు రాముఁడు నీకుఁ దనయుఁడగుట కేమిసుకృతము గావించితివో!

రాముఁడు

బ్రాహ్మణశిరోమణీ! నా యపరాధమునకు మన్నింపుము.

[సమస్కరించును.]

పరశురాముఁడు

రామచంద్రా! నీవు నా కుపకారము గావించితివి. క్రోధాతిరేకమున తపస్సత్త్వము, బ్రాహ్మణధర్మము, మఱచిన నాకు హిత ముపదేశించి కడతేర్చితివి. గర్వ మడఁచి శాంతి గూర్చిన మిత్రుఁడవు. ప్రజల సన్మార్గమునఁ ద్రిప్పుట రాజధర్మమే కదా! (ప్రకాశముగా) తపస్వులారా! భూపాలురారా! శ్రీరామానుగ్రహమున నా యహంకార మడఁగినది. పెద్దలగు మీమాట నిరాకరించినపాప మడఁగు నుపాయము నెఱింగించి నన్నుఁ గృతార్థుఁ జేయుఁడు. మహర్షీ, వసిష్ఠా! నా దోషమునకుఁ బరిహారముఁ జెప్పి యెటులో యుద్ధరింపుము.

[కేలుమోడ్చును.]

వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు

భార్గవా! నీవు పశ్చాత్తాపమాత్రమునఁ బునీతుఁడ వైతివి. నిన్నెవరు పునీతులఁ గావింపఁ గలరు?

పరశురాముఁడు

(పశ్చాత్తాపముతో) పాపాత్ముఁడను హింసారతుఁడను, దయాశూన్యుఁడను. అమ్మా, భూదేవీ! కళంకితురాలవగుదువని జంకవేని నన్ను నీగర్భమున నిముడ్చుకొనుమా!

వసిష్ఠుఁడు

పరశురామా! శాంతింపుము. నీ లోపము లన్నియుఁ బశ్చాత్తాపముచే శమించినవి; కూర్చుండుము.

పరశురాముఁడు

[కూర్చుండును.]

దశరథుఁడు

బ్రహ్మర్షిశిరోమణీ, భార్గవా! మహానుభావులగు మిమ్ము దర్శించుకతన మాజీవితములు పునీతమైనవి. స్తోత్రిప రాజ్యముఖుఁడవగుని స్నేమని కొనిచూడఁగలను? కశ్యపునకు సర్వ వసుంధరామండలము ధారవోసిన మహాత్యాగి వగు నీ కేమొసంగఁగలను?

పరశురాముఁడు

నృపాలా! బ్రహ్మవిదుండగు వసిష్ఠ భగవానుఁడు నీకు దేశికుఁడు. దేవేంద్రునంతవానికి రాక్షసయుద్ధమునఁ దోడుసూపిన జగజెట్టివి నీవు; మహైశ్వర్యశాలివి; ధన్యుఁడవు. నాకనుజ్ఞ యొసంగిన నడవులకుఁ బోయెద! సెలవా?

విశ్వామిత్రుఁడు

(వసిష్ఠునితో) మహాత్మా! మనముగూడ నాజ్ఞగొని సిద్ధాశ్రమమునకుఁ బోవుదమా!

[అందఱును నిలిచి యుందురు]

విశ్వామిత్రుఁడు

రామచంద్రా! మా కగ్నిహోత్రనిర్బంధములు గలవు. నిన్ను వదలిపోవఁ జాలకున్నారము. సమస్తైశ్వర్యపరిపూర్ణుఁడవు కమ్ము. మేము పోయివచ్చెదము.

వసిష్ఠుఁడు

జనకచక్రవర్తీ! దశరథేశ్వరా! రామచంద్రా! నేనును బోయివచ్చెదను. సర్వవేత్త లగు కుఁ జెప్పవలసిన దేమున్నది?

[అందఱును నమస్కరింతురు; వసిష్ఠాదులు నిష్క్రమింతురు.]






కొత్త జగ్గయ్యచౌదరి గారు

చాలుంజాలును గట్టిపెట్టుమిఁక, నీసంభాషణీయాంశ ము
ద్వేలంబయ్యెఁ, గఠోరపద్ధతుల నన్వేధింప నీతంత్ర మీ
వాలోచించినభంగిఁ దోఁచునకటా! యారీతిఁగాకున్న ని
క్కేలా మూతిబిగింపు పర్వములు? నీకెల్లప్పు డో మంథరా!

చెప్పకు మింక నాకు విని చేయఁగఁజాలను దుష్కృతంబు, నీ
కొప్పదు చేయకుంట మఱికొప్పదు చేయుట కీవు రాము చి
న్నప్పటినుండి సాఁకితి వయూచితప్రేమరసానుభూతి నీ
చొప్పన నేఁడుఁ బల్కెదవు చోద్యము నీచరితంబు మంథరా !!

నిరతిశయానురాగ మది నెక్కొనియుండుటఁ జేసి శ్యామసుం
దరునిపయిన్ వసిష్ఠుఁడును దండ్రియు నమ్మలు దమ్ములున్ గుణా
కరులగు నార్యులున్ జననికాయము పాయనివేడ్కతో వసుం
ధర కధినాథుసేయ మదిఁదల్పఁగ బీఁటలమీఁదఁ బెండ్లి నేఁ
జెఱపి తిరంబు తిట్లుదిని చీకఁగ నేమిఫలంబు? మంథరా !!

భరతుని క్షేమ మారసి కృపామతితోడ వచింపుచుంటి వే
నెఱుఁగుదు నీమనంబు జలజేక్షణ! నాసుతు సౌఖ్యపెట్టనై
పరులకుమారుఁ గానలకుఁ బంపఁదలంచుట న్యాయ్యమొక్కొ? యీ
తెఱ వెప్పుడైన వింటిమె? సుధీజనదూష్యము గాదె? మంథరా !!

నాకొమరున్ దయామతిఁ గనన్వలెనంచును, భూరిసంపదా
నీకముఁ గూర్పుమంచును, మణీగణ భాసురసింహపీఠి న
స్తోకవిభాతిరేకమున సొంపుగనిల్పుమటంచు, గోరనోఁ
గాక రఘూత్తమోత్తముని గానసీమకుఁ బారఁద్రోలుమం
చేకరణిన్ వచింతు హృదయేశ్వరుతోఁ బనిబూని మంథరా !!

భరతుం డొక్కఁడు రాముఁ డొక్కఁడను దుర్భావంబు నాయాత్మ కీ
వఱకున్ గల్గదు; లేనిపోనిబెడఁదల్ వర్ధిల్లఁగాఁ బాపసం

భరితాలోచన లేల సల్పె దిటు లీవార్తల్ విన న్గాథ దు
ర్భర సంతాప ముచేతఁ దల్లడిలు నాప్రాణేశుఁ డో మంథరా!!

జననాథుల్ వరమెట్లు కోరుదును గౌసల్యాత్మజు న్గానకున్
బనుపన్ నాసుతుఁ బట్టభద్రుఁగ నొనర్పన్; లోకు లేమందు రీ
పనికిన్ మాభరతుండుమాత్ర మసలొప్పన్ జూచునే? నన్ను దూ
రునుగా కింత యెఱుంగనేరవొకొ? చాలున్ జాలు నో మంథరా!!

చిరసౌహార్ద భరంబుచే భరతుఁడా శ్రీరామచంద్రున్ మహా
దరభావంబునఁ బూజసేయు మన చేతల్ విన్నచో వాఁడు దు
ర్భరసంతాపము నొందు సౌఖ్యమని సంభావింపఁగాఁబోవఁ డ
క్కఱకున్ మాలినకార్య మేల సలుపంగా! నిప్పు డో మంథరా!!

అనఘుని రామభద్రు గహనాంతరసీమలఁ గాఁపురంబు సే
యను బనుపంగదే యని ధరాధిపుతో మొగమోట ముంచ కే
ననఁగలనొక్కొ? నిక్కముగ నయ్యయొ!! బిడ్డలఁ గన్నదాన నిం
దున సుఖమన్నదున్నె? కడు దుఃఖము లున్నవి గాక మంథరా!!

ఎడ్డెమటన్నఁ దెడ్డెమనుటే తగవా? రఘురాముఁడన్న నా
బిడ్డనికంటె నెక్కుడగు ప్రేముడిఁ గాంతును నేఁడు వాని కీ
చెడ్డను గూర్ప నేను గృషిసేతునె? నల్వుర నోళ్లలోపలన్
బడ్డఁ బ్రయోజనం బణువుమాత్రముఁ గల్గునె చెప్పు? మంథరా!!

నిక్కముఁ జెప్పుచుంటి విను నీకు, సురూపుల వెక్కిరింపనే
కొక్కెరఁ బుట్టె నన్నటులు కొంకక రాముని కానకంప నీ
రక్కసముండ మంథర ధరాతలమందు జనించెనంచు న
మ్మక్కలు నాడుకొందు రటు లారడిపా లగుటేల? మంథరా!!

మంచియుఁ జెడ్డయున్ గనక మంథరపల్కును వేదవాక్కుగా
నెంచి వివేకహీనత నహీనశుభప్రతిభావిశేషతా
భ్యంచితసారసద్గుణ విభాకరవంశపయోధిచంద్రు మే
లెంచఁగలేక కైక యిటులింతలు చేసె నటండ్రు మంథరా !!

పుట్టదు బుద్ధి నాకు రఘుపుంగవు క్రూరమృగాకులోగ్రసం
ఘట్టనజాయమాన భయకంపిత కాననభూమికంపి నా
పట్టికి రాచసౌఖ్యము లపారము గూర్పగ రామభద్రునే
పట్టము నేలనిమ్ము తగువాఁ డతఁడే నిజమెన్న మంథరా !!

కడుపునఁగన్న పుత్త్రకుఁడు గాఁడనుకారణ మొండెకాని, నే
నడలనిప్రేమతోడ ననిశం బతనిన్ గనుగొంచునుందు, నా
తఁడు సయితంబు పాపము యథార్థముగాఁ దనతల్లికంటెఁ బ్రే
ముడిఁగను నన్ను కాన కెటుపొమ్మని పల్కుదువాని మంథరా !!

తగ్గనిప్రేమ రామునకుఁ దమ్ములపైఁ గల దెంతొ వారికిన్
లగ్గులఁగూర్ప నాతఁడు నిరంతరమున్ దలపోయు నన్నిటన్
బగ్గగలాడు నన్నుఁగడు బత్తిమెయిన్ గనుచుండు వాని కే
నెగ్గుఁదలంప లోకులు పయింబడి తిట్టరె నన్ను, మంథరా !!

(శ్రీ)రామా ! రఘురామ ! దాశరథి ! రాజీవాక్ష ! (శ్రీ)రాఘవా !
రారా ! నాయన ! బాబు ! తండ్రి ! యని చేరన్ జీరి ముద్దాడి నేఁ
డేరీతిన్ వచియింపఁ జాలుదునొకో ! యీ నోటితోఁ గానకున్
బోరా ! కాఁపురముండఁగా నని దయన్ బోనాడి నే మంథరా !!

అలయిక కోర్కెఁజాల దినుమంతయు నన్ను్ల నొవ్వనాడఁగాఁ
దలఁపద యత్తమామల కుదాత్తమతిన్ బరిచర్యసల్పుఁ బె
ద్దల వచనంబు తాఁదలను దాలుచుఁ జీమకునైనఁ గష్టముల్
గలిగినఁ జూడఁజాలద యకల్మషవర్తనమందు నావెనేఁ
బలికిఁ మఱొక్కరిన్ బిదపఁ బల్కవలెన్ మముబోంట్లకెల్ల నీ
తులుఁ గఱపంగఁజాలు బరదోషములెన్న స్వభావమావెకున్
గలుగదు స్వప్నమందయినఁగాని వివేకమునందుఁ బెద్ద పె
ద్దలు సయితంబుఁ జాలర యధర్మముపే ర్వినఁ భీతిఁ జెందు ని
చ్చలు రఘురామపాద పరిచర్యలొనర్పఁ దురంగలించు కో
మలి, సుగుణాంబురాశి యసమాన పవిత్రచరిత్ర గణ్య మా
కొలమునకెల్ల వన్నెనిడు కోడలు సీత మొగంబుఁ గాంచఁగాఁ
గలనొకొ? నీ వచించినటుగా నొనరించిన నేను మంథరా!

జనవిభు కాళ్లవ్రేళ్లఁబడి నల్పఁగ జాలుదు నింతమాత్రపుం
బని యొకలెక్కగాదు ననువంటిసుధీమణి కైనఁగాని యిం
దున లవమాత్రమైనఁ బరితోషము సౌఖ్యములేమిఁ జేసి నా
మనమున నిచ్చగింప; పలుమారు వచింపగనేల? మంథరా!!!




## ౪

### పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

ఏలాపాథుఁడు—మిత్రమా! శంసా! ఇంక వీరు చూచినది గాని, విన్నది గాని, అనుభవించినది గాని యేమయినను ఘటన ఉన్నపక్షమున వినిపింపవలసినది.

శంసుఁడు—అటులేని వినుఁడు. నేను చూచినదియు, విన్నదియును గాదు. ప్రత్యక్షముగా అనుభవించినదే ఒకానొకఘటన చెప్పుచున్నాను. ఒకానొక గ్రామమునకు సమీపముగా ఒకపర్వత మున్నది. ఆ కొండదిగువను పల్లపుభూమిలో పొల మున్నది. నే నొకమాఱు శరదృతువులో ఆపొలములోని వ్యవసాయము చూచుటకు వెళ్లియుంటిని. నే నకస్మాత్తుగా పైకి చూచునప్పటికి మదోన్మత్తమయినయేనుఁ గొకటి కొండనుండి దిగి నావైపు పరుగెత్తుకొని వచ్చుచు నగపడినది. దానిని చూడఁగానే నామీఁదప్రాణాలు మీఁదనే పోయినవి. 'దానిబారినుండి తప్పించి యీశరీరమును కాపాడుకొనుట యెట్లు దైవమా!' అన్నచింత పుట్టినది. ఏమియు తోఁచక పరుగెత్తి యేనుఁగున కందనిస్థాన మేమయినను ఉన్న దేమో అని వెదక నారంభించినాను. వెదకఁగా వెదకఁగా, ఆపొలములోనే మిగుల గొప్పది యగు తిలవృక్షము (నువుచెట్టు) ఒకటి కంటఁబడినది. బ్రదుకు జీవుఁడా! అని చట్టున నే నాచెట్టెక్కి కూర్చుండి యేనుఁ గింకనేమి చేయునో అని చూచుచున్నాను. అంతలోనే యేనుఁగుకూడ ఆచెట్టు దగ్గఱకు వచ్చినది. "నేను పరుగెత్తుకొని వచ్చుచుండుట చూచి వీఁడు నాకు దొరకకుండ నుండుటకై యీ చెట్టెక్కి యున్నాఁడా?" అన్నరోషముచేతను మిగుల కోపించి తొండముతో నాచెట్టును చుట్టి తనయూపశక్తిని వినియోగించి దాని నూఁపుట కారంభించినది. అది అట్లు గట్టిగా ఊఁపినప్పటికిని నే నాచెట్టుకొమ్మను గట్టిగా పట్టుకొనియే ఉన్నాను గనుకను నేనేమో క్రిందను పడిపోలేదు గాని, ఆచెట్టున పండియున్న నువుగింజ లన్నియు జల్లున క్రిందను రాలినవి. అప్పటికిని అది నేను క్రిందను పడవలె నని పట్టినపట్టు వదలక చెట్టూఁపుచునే యున్నది. ఆక్రిందను రాలినగింజలు దానికాళ్లత్రొక్కుడువలన మిగుల మెత్తగా నలిగిపోయినవి. క్రమముగా అందుండి నూనె స్రవింప మొదలిడినది. ఆనూనె యింతయు, అంతయుఁ గాదు. పెద్దప్రవాహ మయినది. ఆప్రదేశ మంతయు బురదమయమయిపోయినది. ఆబురద యెంతనుకొన్నారు? ఆయేనుఁ గందుండి బయటికి రాఁజాలనంతగా అయిపోయినది. తుదకది యాబురదలో కూరుకొనిపోయి పైకి రాఁజాలక, ఆఁకలి-దప్పులచేతను ఘీంకరించి ఘీంకరించి తుట్టతుదకట్టులయిన నేమి, అది ఆ చెట్టుక్రిందనే చచ్చి పడిపోయినది. అది అంతయు మీఁదినుండి చూచి యింక భయము లే దని నమ్మిక కలిగినతరువాతను చెట్టు దిగినాను. అట్లు చచ్చి పడియున్న—ఆయేనుఁగుతోలు చక్కఁగా ఒలిచి దానితో ఒకపెద్దకుప్పె తయారుచేసినాను. అటుతరువాతనే నానూనె వృథాగా పోవనేల యని, అంతయు ఒకచోటునఁ జేర్చి యందుండి పదికుండలనూనె కడుపునిండ త్రాగి, ఒక్కమణుఁగు తెలికపిండి తృప్తిదీర తిని యెట్లో నాక్షుత్పిపాసలు శాంతపఱచుకొన్నాను. అటుపయిని ఉన్ననూనె యంతయు—ఆకుప్పెలో నింపించి అది బుజముపైని వ్రేలవేసికొని యింటికి చేరుకొంద మని యక్కడినుండి బయలుదేఱినాను. ఊరిదగ్గఱకు చేరి చూచునప్పటి కక్కడ నొకపెద్దమఱ్ఱిచెట్టగపడినది. ఆ చెట్టుకొమ్మకు నూనెకుప్పె వ్రేలఁదీసి నేను నాయింటికి చేరుకొంటిని. ఇంటిదగ్గఱ పిల్లకాయ లాడుకొనుచున్నారు. వారిని దగ్గఱకు పిలిచి "నాయనలారా! ఊరిబయటనున్న పెద్దమఱ్ఱిచెట్టు పడ

మరకొమ్మకు నూనెకుప్పియ వ్రేలఁగట్టి వచ్చినాను. మీరు వెళ్లి దానిని మోసికొని రండు" అని చెప్పినాను, నేను చెప్పుటయే తడవుగా పిల్లలు పరుగెత్తినారు కాని, వారి కానూనెకుప్పె కానరాలేదు. అప్పుడు వారందఱును కలిసి, ఆపెద్దమఱ్ఱిచెట్టే కూఁకటివేళ్లలోని కూడఁబీకి యింటికి మోసికొని వచ్చియున్నారు.

తరువాతను నేనే ఆనూనెపోసినపాత్రము విప్పి యింటిలోనికి పట్టుకొనిపోయి మిద్దెదూలమునకు వ్రేలఁగట్టినాను. ఇదంతయు నేను ప్రత్యక్షముగా అనుభవించినసంగతియే. ఇది జరిగి యెంతో కాలముకూడఁగడచి యుండలేదు. అది జరిగినతరువాతనే యింట నేమియు పని లేక తోచనందున ఇల్లు బయలుదేఱి యిటువైపు వచ్చి మీ—అందఱితోను కలిసికొన్నాను.

ఖండవణ—అయ్యా! ఇప్పుడు నీవు చెప్పినయావత్తుసంగతులును నిజమే కాని యిందులో సందేహపడవలసినది నామట్టున కెంతమాత్రము లేదు. ఏమో ఇప్పుడు నీవు చెప్పినసంగతులవంటి వనేకములు భారతాదిగ్రంథములలో కావలసినన్ని ఉన్నవి.

శంసుఁడు—శ్రీమతీ! ఇప్పుడు నేను చెప్పినఘటన నిజమే అని మీ రొప్పుకొన్నపక్షమున నువుచెట్టంతపెద్దది యెట్లు సంభవించును? దానినుండి రాలిన నూవు లేనుఁగు మట్టినందున నూనె ప్రవాహముగా ప్రవహింపఁదగి యెట్లుండును? నా కీసంగతి ఉదాహరణము చూపి బోధపఱుపఁగోరుచున్నాను. అదికాక నేను పదికుండలనూనె యెట్లు త్రాగఁగలిగినానో, మణుఁగెడు తెలికపిండియెట్లు తినఁగలిగినానో అదియును సదృష్టాంతముగాఁ జెప్పఁగోరుచున్నాను.

ఖండ—వ్యాసభట్టారకుఁడు వ్రాసినగ్రంథములలో పెద్దదియు, లోకులచేతను పంచమవేద మని పరిగణింపఁబడుచున్నదియును అగు మహాభారతములో "ఏనుఁగులగండస్థలములనుండి మదము స్రవించి నదులుగా ప్రవహింపఁగా, అందులో ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు, పదాతులును మునిఁగిపోయినారు." అనియున్నది. కాఁబట్టి, యేనుఁగులమదజలమునుండి నదులు ప్రవహించుట సంభవించినప్పుడు తిలతైలమువలన నదులు ప్రవహించుట అసంభవ మెట్లగును? ఇదిగాక, భీముఁడు బకాసురుని చంపుటకు బయలుదేఱినప్పుడు వానితిండికొఱకు బండికి కట్టినరెండుదున్నపోతులు, పిండివంటకములు మొదలగువానితో బండెఁడన్నము, త్రాగుటకు వేయికుండలకల్లు తోడనే తీసికొనిపోయినట్లు, ఆదిపర్వములో ఉన్నది. అది నిజ మయినప్పుడు నీవు పదియేకుండలనూనె త్రాగఁగలుగుటయు, ఒక్కటే మణుఁగు తెలికపిండి తినుటయును మాత్ర మెట్లు నిజము కాకుండును? ఇదికాక, కుంభకర్ణుఁడు నిద్రనుండి లేచినతోడనే వేయికుండలకల్లు త్రాగు ననియు, ఎందఱో మనుష్యులను, ఎన్నియో పశువులను తిను ననియు రామాయణములో ఉన్నప్పుడు నీవు పదికుండలనూనె త్రాగుటయు మణుఁగు తెలికపిండి తినుటయు సామాన్యముగా భోజనానంతరమునఁ గాని, ప్రాతఃకాలమునఁ గాని చేయు లఘుభోజనమువంటిదే కాని యిం దాశ్చర్య మేమున్నదయ్యా! మఱియు నొక్కటి చెప్పెదను వినుము. అగస్త్యమహాముని ఒకసారిగా ఆఱుసముద్రములజలమును త్రాగినాఁ డని పలుపురాణగ్రంథములలో ఉండనే ఉన్నది. కనుకనే "ఆఱుసముద్రములను అగస్త్యుఁ డాచమనము చేయుచుండఁగా, కల్లుసముద్రము గంతులు వైచినదఁట!" అని సామెత పుట్టినది. ఇంకొకటి. గంగ స్వర్గలోకమునుండి దిగి మహాదేవునిజటాజూటములో ప్రవేశించి యందుండి క్రమముగా ప్రవహించుచు జహ్నుముని—ఆశ్రమములో ప్రవేశించునప్పటి కాయన దానిని త్రాగివైచి వేయిసంవత్సరములవఱకును, తనకడుపులోనే యిముడ్చుకొనియుంచి తర్వాతను భగీరథుఁడు బ్రతిమాలఁగా చెవిలోనుండి చిన్నధారయొకటివదలినాఁడనియు, అందుచేతనే గంగకు జాహ్నవి అని పేరువచ్చినదనియు, రామాయణములోను, మఱికొన్ని గ్రంథములలోను ఉన్నది. అటువంటిపురాణకథలవల్లని నీపదికుండలనూనె త్రాగుట అనునది అంతగా లెక్కింపవలసిన సంగతియే కాదు.

శంసుఁడు—సరి గాని, దేవిగారూ! నే నంతపెద్దయేనుఁగుతోలుతో చేసిన, నూనెతో నిండినకుప్పియ యెట్లు బుజముపైని వేసికొని మోయగలిగినానో, దానినింటివఱకును ఎట్లు తేఁగలిగినానో దీనికికూడ సమాధానము చెప్పఁగలరా? అటులేని మీప్రజ్ఞ కెంతయేని మే

మందఱమును సంతోషించెదము. దయచేసి సెలవీయవలయును.

ఖండ—అయ్యా! శంసయ్యగారూ! మీ రిది వఱ కెప్పుడును గరుడపురాణము చదివినట్టు గాని, యెవరయినను చదువుచుండఁగా విన్నట్టుగాని నాకు తోఁచకుండ నున్నది. కనుక నే మీ రిటువంటి చిన్నచిన్న విషయములకుసయితము శంకించుచున్నారు. అటులయినపక్షమున నే నిప్పుడు చెప్పుచున్నాను వినుఁడు. అం దిటులున్నది. కశ్యపమునికి కద్రువ అని, వినత అని యిద్దఱు భార్యలున్నారు. ఆయిద్దఱుసుద్దియలును ఒకసారిఆటలాడుచు "మనలో ఎవ రోడిపోవుదురో వారు గెల్చినవారికి దాసిగా ఉండవలెను" అని పందెము వేసికొన్నారు. తుదకు వినత ఓడిపోయినది. కద్రువ గెలిచినట్టు చెప్పవలెనా? కాఁబట్టి వారు మొదటను నిర్ణయించుకొన్న పందెము ననుసరించి పాపము! వినత రెండవదానికి దాసి అయియుండవలసివచ్చినది. కద్రూదేవికి మంచిసమయము దొరకినది. సవతి యగుటచే వినతను సాధింప మొదలు పెట్టి పలుకష్టములకు పాలు చేసినది. ఇట్లు కొన్నాళ్లు జరుగునప్పటికి వినత గర్భవతి యైనది. దినములు నిండినతరువాత నది మూఁడు గ్రుడ్లు పెట్టినది. తనదాసీత్వ కష్టమునుండి తప్పించుకొనుటకు దానికి కడు తొందర కలిగినది. అప్పు డది తనమూఁడుగ్రుడ్లలోను ఒకదానిని వెంటనే పగులఁగొట్టినది. "ఇందుండి నాదుఃఖమును తొలఁగింపఁజాలిన పుత్త్రుఁడు బయలుదేఱును" అని పాపము.! వినత పుట్టెఁడాస పెట్టుకొని యున్నది. కాని చూచునప్పటి కందుండి తేలొకటి బయలుదేఱినది. మఱికొన్నాళ్లయిన తరువాతను రెండవగ్రుడ్డును పగులఁగొట్టునప్పటి కందుండి తొడలుమొదలు క్రిందుభాగము లేనిబిడ్డఁడు బయలుదేఱినాఁడు. వాఁడు తల్లిని పిలిచి "అమ్మా! నీవు తొందరపడి మొదటగ్రుడ్డు నుదురకమునుపే పగులఁగొట్టినావు. ఈరెండవగ్రుడ్డుకూడ సగముముదిరినది గాని పూర్తిగా పక్వమునకు రాలేదు. అందుచేతనే నేనును సగముశరీరము గలవాఁడ నయిపోయినాను. కనుక నీదాస్యమును తొలఁగించుపాటిశక్తి నాకు లేదు. ఇటుపయిని, మూఁడవగ్రుడ్డును బాగుగా పక్వమగువఱకును కాపాడుము. అందువలన నీకోరిక పూర్తి యగును." అనిచెప్పి పోయినాఁడు. అటుపైనా- ఉన్నమూఁడవగ్రుడ్డు లెస్సగా పక్వమునకువచ్చి తనంతనే పగులఁగా, అందుండి సర్పకులకాలుఁడు, మహాబలశాలి, గరుత్మంతుఁడు పుట్టినాఁడు. ప్రబలమయిన-ఆ పక్షిరాజు కద్రూసంతతి యగుపాములను పలుబాములకు లోనుచేయుట కారంభించినాఁడు. అతఁడు పెట్టుబాధలు సహింపఁజాలక పాములన్నియు నొకచోటున చేరి యాలోచించుకొని తమతల్లితో ఏడ్చుచు గరుడుని పైని నేరములు చెప్పినవి. బిడ్డలుపడ్డ- పడుచున్నప్రాణగొడ్డములు వినఁగానే తల్లికి ఎక్కడలేనికోపము వచ్చినది. అది సవతియు, దాసియు నగువినతను పిలిచి నోరికివచ్చినచ్చున నేమేమోతిట్టి "ఓసీ దాసీ! నీవు నా బిడ్డలను పలుకష్టములకు పాలుచేయుచున్న నీబిడ్డని ఏల వారింపకున్నావు? మించిన దేమో మించనేమించినది. ఇటుపయినయినను నీవు నీగడ్డుబిడ్డని వారింపకుంటివేని జ్ఞప్తియం దుంచుకొనుము. నీకు మఱింత కష్టము కలుగఁజేయకమానను. జాగ్రత్త" అని హెచ్చరించినది. సవతి తన్నిట్లన్నందుల కది యేడువ మొదలిడినది. ఎక్కడినుండియో గరుఁడు డింటికివచ్చునప్పటికి వినత యేడ్చుచునే యున్నది. "అమ్మా! ఎందులకే నీ విట్లు వెక్కి-వెక్కి యేడ్చుచున్నావు?" అని అడిగినాఁడు. తల్లి తనదాస్యవృత్తాంత మంతయు వినిపించి "నాయనా! నీగ్రుడ్డితండ్రి బదరికాశ్రమములో ఉన్నాఁడు. ఆయన కమృతము నిలువచేసియుంచినచోటు తెలియును. నీవుపోయి నీతండ్రి నమృత ముండుచోటడిగి తెలిసికొని, అది యెట్లయినను తెచ్చితివేని నా కీదాస్యము తొలఁగును" అని చెప్పినది. తల్లిచెప్పినమాటలు విని గరుడుఁడు తన తండ్రి ఉన్నచోటికి వెళ్లి ఆయనపాదములపైని పడినాఁడు. అతఁడు గ్రుడ్డివాఁ డగుటచేతను శరీరమును తడివి కొడుకును పోల్చుకొన్నాఁడు. కొంచెము సేపయిన తర్వాతను గరుత్మంతుఁడు "తండ్రీ! నా కాకలివేయుచున్నది. ఏమి తిను మనియెదవో చెప్పుము" అని అడిగినాఁడు. అప్పుడు కశ్యపుఁడు "నాయనా గరుడా! ఇక్కడికి కొంచెముదూరములోనే పద్మసద్మ మనుసరోవర మొకటి ఉన్నది. అక్కడ పండ్రెండుయోజనముల శరీరప్రమాణముగల యేనుఁగొకటియు, ఇంచుమించు

చుగా అంతే ప్రమాణముగల తాఁబేలొకటియు ఉన్నవి. ఆరెండును ప్రస్తుతము తమలో తాము జగడ మాడుచున్నవి. కాఁబట్టి నీవిపు డక్కటికి పోయి అవి వచ్చిన తోడనే వానిని తినుము. ఈలాగున ఆఁకలితో ఉండఁగూడదు." అని బదులుచెప్పినాఁడు. గరుడుఁడు తండ్రి చెప్పినచొప్పున బయలుదేఱి పోయి, ఆరెంటిని తిని మరలి వచ్చుచుండఁగా, దారిలో పెద్ద మఱ్ఱిచెట్టొకటి కనుపట్టినది. దానిపై ననేకపక్షులు నివసించుచుండెను. దానికొమ్మలను వ్రేలాడుచు బ్రహ్మ...మువలనఁ బుట్టినవాలఖిల్యాదులు మూఁడుకోట్లయేఁబదిలక్షలమంది తపస్సు చేసికొనుచున్నారు. గరుడమూర్తి విశ్రాంతిని మిత్త మాచెట్టుకొమ్మపైని వాలినాఁడు. వెంటనే ఆ చెట్టు బరువుచేతను చరచరలాడుచుఁ విరుగఁబడిపోవుటకు సిద్ధమయినది. అట్టు లాచెట్టొరిగిపోవుచుండుట చూచి "పాప మీఋషు లందఱును దీనిక్రిందనుపడి మృతి నొందెదరేమో"అని గరుడుఁడు చింతాగ్రస్తుఁడయిపోయినాఁడు. అవు డేమియు నుపాయముతోఁచక ఆచెట్టును చంచూపుటములతో నొక్కిపట్టుకొని కూఁకటివేళ్లలోని కూడఁబీకి దేవతలు మొదలయినవా రందఱును ఆశ్చర్యపడుచు చూచుచుండ దానితోనే మీఁది కెగిరి పోయినాఁడు. అట్లు పోయిపోయి యతఁ డొకానొక సముద్రద్వీపమునఁ జేరుకొని యందా మఱ్ఱిచెట్టును వదలిపెట్టినాఁడు. ఆమఱ్ఱిచెట్టుచేత నలంకరింపఁబడినభూమినే అదిమొదలుకొని లోకులు లంక యని చెప్పమొదలిడినారు. తరువాత నాలంకయే క్రమముగా రావణాసురునకు రాజధాని యైనది. అట్లాచెట్టు నక్కడ పడవైచి, తిన్నగా ఆకాశమార్గమున నెగిరి మరల తండ్రిని సమీపించి "తండ్రీ! నా కింకను ఆఁకలిగా ఉన్నది. ఏమి తిను మనియెదవో చెప్పుము" అని యడిగినాఁడు. కశ్యపుఁ డతనిమాటలు విని "నాయనా! సముద్రములో ఫలానాస్థలములో రాక్షసు లున్నారు. వారు జగత్కంటకులు. వారిని భక్షించితివేని నీ-ఆఁకలియుఁ దీఱును. లోకమునకు ఉపకారమును అగును అని చెప్పినాఁడు. గరుత్మంతుఁ డతివేగముగా తండ్రి-ఆజ్ఞ ననుసరించి యాస్థలమునకుఁ బోయి యందున్నరాక్షసుల నందఱను భక్షించి మరల తండ్రియొద్దకు వచ్చి "తండ్రీ! అమృతము నిలువచేసి యుంచినస్థల మెక్కడనో చెప్పుము" అని అడుగఁగా, కశ్యపుఁడు "నాయనా! గరుడా! అమృతఘటము పాతాళముక్రిందను దుర్గమమయిన స్థానములో ఉన్నది. ఎందులకు దుర్గమ మంటివా; దానినాలుగు వయిపులను ఆకాశము నంటుజ్వాలలతో అగ్ని ప్రజ్వరిల్లుచుండును. బలవంతులయిన దేవదానవులు దానిని కాపాడుచున్నారు. నీ వూరక శ్రమపడుటయే కాని, అచ్చటినుండి అమృతము తేఁజాలవు. అది అసాధ్యమయినపని. కాని, ఒక్క-ఉపాయముమాత్ర మున్నది. ఎవరయినను అగ్నిభగవానుని యథేష్టముగా తేనియ, నేయి, జలము పోసి సంతుష్టి పొందించిరేని యాకుండ సమీపమునకుఁ బోనుగలుగుదురు, అందుండి అమృతమును తేనుగలుగుదురు. కాని అమృతమును సంపాదించినంతమాత్రమున లాభము లేదు. అది తెచ్చునపుడు విఘ్నము లెన్నియో తటస్థింపకమానవు. అయినను ధైర్యసాహసము లూఁతగా బ్రయత్నింపుము నీమనోరథము ఫలించును. నీమార్గము మంగళప్రద మగుఁగాత" మని చెప్పవలసినసంగతు లన్నియు చెప్పి దీవించి పంపఁగా గరుఁడుఁడు తండ్రి చెప్పినచొప్పున నెక్కడనో సంపాదించి తేనె, నేయి రెండుకొక్కలతోను, ముక్కుతో జలమును పట్టుకొని తిన్నగా పాతాళలోకమునకు వెళ్లి, అగ్నిదేవుని సంతోషపఱిచి అతఁడు చూపించిన-అమృతకుండమునుండి తనకు కావలసినంత-అమృతము పట్టుకొని తిరుగుమొగ మయినాఁడు. ఇంతలో కుండ రక్షకులయిన దేవదానవులు-"ఏదో పక్షి వచ్చి అమృత మెత్తుకొని పోవుచున్నది. పోనీయక పట్టుకొనుఁడు"అని నలువైపులనుండియు అల్లరి చేయునప్పటి కక్కడ నున్నవా రందఱును కోపించి ముద్గరములు, ముసలములు, శక్తులు, హలములు, కత్తులు, దండములు మొదలయిన-ఆయుధములు పట్టుకొని యతనివెంటను "కొట్టండి, చంపండి, పోనియ్యకండి, పట్టుకొండి" అని కేకలు పెట్టుచు పరుగెత్తి గరుడుని ఉద్దేశించి "ఓరీ! పాపాత్ముఁడా! దొంగా! నీ వమృతమును దొంగిలించుకొని యెక్కడికిరా పోవుచున్నావు? నీవు చేసినపాపమునకు తగినఫలమిపుడే పొందుదువురా! ఎక్కడికి పోయినను నిన్ను మేము విడుచువారము కాముర! మా-అమృతమును మా కిచ్చి వచ్చినదారినే పోయినచో క్షేమపడియెదవు. లేనిపక్షమున నేఁడు నీచావు మాచేత నున్న దనుకొనుము" అని

యేమేమో అన్నారు. ఆమాటలు విని చిన్నకోపము తెచ్చుకొని గరుడుఁడా దేవదానవుల పయిని తిరుగఁబడి కొందఱను ముక్కుతో పొడిచియు, కొందఱను కాళ్ళతో అడిచియు యమునియింటికి పంపించుట కారంభించినాఁడు. చావఁగా మిగిలినవారు ప్రాణములు పిడికిటఁ బట్టుకొని పాఱిపోయినారు. ఈసంగతి వెంటనే దేవరాజునకు తెలియవచ్చినది. ఇంద్రుఁడు కోపించి జాజ్వల్యమానమయిన తనవజ్రాయుధమును గరుడునిపైని ప్రయోగించినాఁడు. కాని, అదియు నిష్ఫలమే అయినది. "దీనిదెబ్బ నా కెంతమాత్రమును తగులనే లేదు" అని తెలియఁజేయుటకై దానిని తనముక్కుతో పట్టుకొన్నాఁడు. అతనిసాహసకృత్యము చూచి దేవేంద్రుఁడు భయంపడినాఁడు. "అమృతమే కాకుండ చేతివజ్రము కూడ పోవుచున్నదే! ఇంకేమి దారి?" అని వెంటనే యింద్రుఁడు వైకుంఠమునకు పరుగెత్తి జరిగినయావత్తు సంగతులును శ్రీమహావిష్ణువుతో విన్నవించినాఁడు. ఇంద్రునిమాటలు వినఁగానే ఉపేంద్రునకుకూడ పట్టరానికోపము వచ్చినది. అప్పు డాయన ద్వాదశాదిత్యులతో సమముగా ధగధగలాడుచుండెడి తనసుదర్శనచక్రమును చేతఁబట్టుకొని గరుడునివెంటఁబడినాఁడు. ఆ యాసంగతులన్నియు చూచుచున్న శనైశ్చరాదిగ్రహములును, ఋషులును "స్వామీ! నీవు సర్వవ్యాపకుఁడవు. పదునాలుగులోకములకును ప్రభుడవు. ఇట్టినీ వాలోచింపకుండనే యెవ్వరిపయినను కోపింపరాదు. ఈగరుడుఁడు నీకు బంధువు. కనుక నితనిపైని వచ్చినకోపమును విడిచిపెట్టుము. మ్లేచ్ఛులవలెఁ గనుగోత్రమునకు క్షయము కలిగించుకోరాదుగదా!" అని పలురకములుగా వైకుంఠభగవానుని ప్రార్థించినారు. వారిమాట లన్నియు విన్నపై నాయన శాంతుఁడయి గరుడునితో నేస్తము కట్టుకొని అదిమొద లతనిని పక్షిరాజుగా నుండుమని వరమిచ్చి తనకు వాహనముగా చేసికొన్నాఁడు. క్రమముగా గరుడుఁ డమృతము పట్టుకొని తల్లియొద్దకు వచ్చి యామె కద్దాని నప్పగించినాఁడు. అది సవతి కిచ్చి వినత తనదాస్యమును వదలించుకొన్నది. తరువాతిసంగతితో మన కవసరము లేదు. ఒకగరుడపక్షి ఒకచోటినుండి పెద్దమఱ్ఱిచెట్టొకటి ఊడఁబెఱికికొని పోయి దాని నతిదూరములో ఉన్నద్వీపములో పడవైచినదికదా! దీనినిబట్టి యాలోచింపఁగా, అయ్యా! నీ వొకనూనెకుప్పను బుజముపైని వేసికొని గ్రామముదాఁక మోసికొని వచ్చుటలో ఏమాశ్చర్య మున్నది? అది సంభవమయినప్పు డిదియును సంభవించును. ఇందులో సందేహింపవలసినది లేదు. ఇదిగాక జగద్విఖ్యాతమయిన సంగతి యింకొకటి ఉన్నది, వినుము. ఇంద్రయాగము మానినందుల కింద్రుఁడు కోపించి మందపైకి పుష్కలావర్తకమేఘములను పంపి యేడహోరాత్రములు జాలవాన గురియింపఁగా శ్రీకృష్ణమూర్తి గోవర్ధనపర్వతము నెత్తి యేడుదినములవఱకును తనయెడమచేతి చిటికెనవ్రేలిపయిని ఉంచియున్నాఁడు. బాలుఁ డయిన-అతఁడంత పెద్దకొండ నెత్తి పట్టుకొనఁగా వయసువాఁడవయిననీవు నూనియతో నిండినతోలుకుప్పె యెత్తి పట్టుకొన్నా వనఁగా నెవ రాశ్చర్యపడుదురయ్యా! ఇది సాధారణమయినసంగతియే అనుకొందురు. ఇంకొకసంగతి జ్ఞప్తికి వచ్చినది. సముద్రములో సేతువుకట్టుసందర్భమున కోఁతులుసైతము దూరి దూరమునుండి చెట్లు కొండలు పెఱికి మోసికొని తెచ్చినప్పుడు మీబిడ్డలొక్కచెట్టును పెల్లగించిమోసికొని వచ్చుటలో నాశ్చర్యమేమున్నదో నాకు చెప్పవయ్యా! పైసంగతులు నేను కల్పించినవి కావు. రామాయణములోనే ఉన్నది. అందులో ఇంకొకసంగతికూడ నున్నది. హనుమంతుఁడను పేరికోఁతి యెన్నో అశోకవృక్షములు పెల్లగించి బయటను పాఱవైచినది. ఆమాటలు సత్యమయినప్పుడు నీమాట లవేల సత్యము కాకుండును? కావున నీ కనుభవమయినఘటనలో ఒక్కటియైనను సందేహింపవలసిన-అంశము లేదు. నాకే కాదు హైందవపురాణములు చదివినవారి కెవ్వరికిని నీ విపుడు చెప్పినవృత్తాంతమును గుఱించి సందేహము కలుగ దని నిశ్చయముగా చెప్పఁగలను. ఏమి ఒప్పుకొనియెదవా లేదా చెప్పవయ్యా! అవును నిజమేఅనుము.






తిరుక్కోవిలూర్ మహాస్వామి శ్రీకుమార ఆదివరాహాచార్యులు గార

భగవదవతారమూర్తివి బ్రాహ్మణుడవు, పశుపతికి శిష్యుడవు భృగువంశమణి
పరమవైదికుఁడవు నినుఁ బ్రస్తుతింప, నఘము లడఁగవె రామ, బ్రహ్మర్షి

ఉ. హావడి సెట్టిత్రోవ నడయాడెడు రాజులఁ బిల్కుమార్చి మేల్
త్రోవ రహింపఁజేయ నిటఁ దోచిన శ్రీహరివంచుఁ జెప్ప సూ
క్త్యావలి యుండుఁగాక భవదద్భుత దివ్యచరిత్రలోని స
ద్భావములం దలంచినను పాపములెల్ల నశించునే కదా!

చ. అడరి కుమారునిం గెలిచినప్డు గురుం డిది యిచ్చె నీకు నీ
వుఁ డిది ధరించి ఖండపరశుండను నాఖ్య వహించి మించెఁ బే
ర్వడసితి వీవునుం బరశురాముఁ డటంచును దీనిఁ దాల్చి య
య్యడిదము జ్ఞానభక్తి విజయాంకమునై రహిఁ గాంచెడిం గదా!

ఉ. తల్లి పవిత్ర విద్యయవతారము, తండ్రి తపస్వి శాంతులం
దెల్లను మేటి యింకఁ గరణీయము మాతృవచంబొ తండ్రి ప
ల్కుల్లిమియో కదా? యిటులనుండగ నీప్రతిభావిశేషమే
పల్లవితంబునై యుభయపక్షములందుఁ గృతార్థతం గనెన్.

ఉ. చెప్పినయంతఁ దల్లితలఁ జెండుట మెచ్చి వరంబు వేఁడుమం
చప్ప వచింప నాయమ దయం బ్రదికించి గ్రహింపుమంచు నీ
చొప్పునఁ దల్లిదండ్రులను సూనునిధర్మము నుద్ధరించు నీ
యొప్పటికంబుఁ దప్పయిన నొక్కటసర్వము ధ్వంసమొందదే!

సీ. విద్యావతారపవిత్రశీలచరిత్ర, దివ్య నీజనని సాధ్వీత్వగరిమ
సర్వజ్ఞుఁ డభియుక్తశాసనుండు ప్రశాంతి,పరుఁడు నీతండ్రి తపంపు మహిమ
ధర్మముచెడకుండు దారిఁ గాలోచిత,ముగ నిర్వహించు నీబుద్ధిబలిమి
తనువు జ్ఞానంబిడు తల్లిదండ్రులయెడఁ, దనయుఁడుండఁ దగిన ధర్మసరణి
నుద్ధరించి ప్రశాంతి నీవొసరిచిన మ,హత్తరంబగు కార్యము నందలి పర
మార్థ దివ్యరహస్యము నల్పమతు లె,ఱుంగఁజాలుదురే భృగుపుంగవమణి

క. నీతల్లి ధర్మగరిమము, నీతండ్రి తపోబలంబు నీగురుని బలం
బో తపసిఱేఁడ! నీయెడఁ, బ్రీతినిరవుకొనియెఁ జిత్రవిధి రహిమీఱన్.

శా. ఈతం డెవ్వఁడు నేని తా నతిథియై యేతెంచె నంచుం గరం
బాతిథ్యంబు నొసంగ మెక్కి విషమాహంకారియై బ్రాహ్మణుం
డీతం డెంతని యావుఁబట్టిన మహోదృప్తాత్ము శాసించి లో
కాతీతంబగు బ్రాహ్మ్యతేజమును సువ్యక్తంబు గావించితే.

ఉ. ఱేఁడగుఁగాక వేలుపుల ఱేఁడగుఁగాక నెవండునేని తాఁ
బాడిఁ దొఱంగి పారుఁడుఁ దపస్వి యుదారుఁడు నంచునేని మో
మోడక వానియావుఁ బరమోత్తమ జీవధనంబుఁ దాన చే
వాడి హరింపఁ జేయఁగలవాఁడవు నీవట మిన్నకుందువే.

చ. రణమున వేయిచేతుల నరాతులఁ బాతుఁగదల్చువాని రా
వణునకు బందికానరుచిఁ బాగుగఁ జూపినవానిఁ గార్త వీ
ర్యుని నని నేకవీరుఁడయి యొడ్డి ముఖాముఖిఁబోరి వీఁక బ్రా
హ్మణు మొదవుం గ్రహించిన తమందముఁ బాపుట యొప్పు మీఱదే.

మ. చెడుగుం గుంపులశాస్తిసేయఁదగు సుశ్రీసార్వభౌముండె తాఁ
జెడి సద్బ్రాహ్మణు గోధనంబు హరియించెన్ స్వల్పులింకెంత కే
సడలం బోదురె యట్టిబెట్టిదము నోశాపాయుధా! నీవ య
య్యెడఁ జాపాయుధమూని తీర్చితివయా రే సెట్టరాకుండఁగన్.

ఉ. రావణుప్రాపుకల్మిఁ బలురక్కసు లొక్కెడ నుక్కుమీఱి దు
ర్భావత వేదవైదికుల రాయిడివెట్టుచునుండ ధర్మముం
బ్రోవగఁజాలుఁ దా నిటులఁ బూని యధర్మము సేసినప్డు నీ
వే విలుఁదాల్పకున్న గతియేమి? నశింపదె బ్రహ్మకోశముల్.

చ. బెడిదులు క్రమ్మినప్పుడు శపించిన సైచిన నెట్టులేఁ దప
స్నడఁగును గాదె యప్డు పరమార్థ తపోబల శౌర్యశాలి వీ
వడిదముఁ బూని శిక్షయొలయం గుణపాఠము వల్లె వెట్టి యొ
క్కఁడవె జగద్గురుత్వమును గంటివి చాపమునం దపంబునన్.

చ. కరమునఁ గుష్ఠుపుట్టిన రకంబున నుత్తమసార్వభౌముఁడే
యర్థసియుఁ సెట్టఁడయ్యెను దదన్యులు మిన్నకయుండి రాతఁ డా

పరుసము పీడఁడయ్యె నిఁక వానిఁద్యజించి కులంబునెల్ల మేల్
తెఱవున నుద్ధరించుట సుధీవర! ధర్మముఁ బ్రోచుటే కదా?

శా. ఆసంజిక్కి నరేంద్రు లెందుకయి యన్యోన్యంబుఁ బోరాడిరో
యాసర్వంసహ నీపరాక్రమముచే స్వాధీయమైయుండ నా
శాసన్న్యాసముచేఁ ద్యజించియు దపశ్చర్యారతి న్నిల్చితే
రోసం బాన భవత్స్వభావమున మార్పుం గూర్పగాఁ జాలెనే.

చ. నలువ వధూజనంబున ధనంబున వింతభ్రమంబు గూర్చె నాఁ
బలికెద రార్యు లోమునిదివాకర! నిస్పృహ బ్రహ్మచర్యము
జ్జ్వలతనువుం గ్రహించి తగు సంయమి వీవు సుఖాశ్రయంబు భూ
వలయము వీడి స్త్రీ ధన జవంబు జయించితి వేకవీరతన్.

గీ. వాగ్బలము బ్రాహ్మ్యమునకును బాహుబలము, క్షాత్రమునకును సాజమై క్రాలుచుండ
ననఘ! యభ్యస్తభుజబలమున స్వభావ,బలము క్షాత్రమ్ము నోర్వ నన్యుల తరంబె?

మ. తన గోహర్తవధంబుఁ జెప్ప నకటా ధాత్రీశునిం జంపితే
యని యెంతేని దపించినట్టి ముని నన్యాయ్యంబుగా గొంతుఁగో
సిన దూరాజులఁ దాదృశేతరులనుం జెండాడి క్షాత్రంబు ధ
ర్మనిరూఢం బొనరించి వేదవిధి సంస్థాపించితే ధర్మమున్.

ఉ. రేగినక్రోధవహ్ని విహరించెడు నప్పుడు నేని జ్ఞానినిన్
యాగము సేయువాని శరణాగతుఁ బెండిలియాఁడువానినిన్
డాగినఁవానిఁ జంపకఁ గడంకఁ దలంపదు నుక్కడీంద్ర దు
ర్వేగము మూలముట్టము హరించిన నీరణధర్మ మొప్పదే.

సీ. స్వాధ్యాయయోగజపాదులన్నిటికన్న, ఘనమగు దల్లివాక్యముఁ దలంచి
వర్ణాశ్రమాది నిబంధనంబులకన్న, దీవ్రమునగు దండ్రి తెఱఁగు దలఁచి
స్వీయతపంబు నింకించు శాపముకన్న, భవ్యంబునైన చాపంబుఁ దలఁచి
ఈవె సాధించు తపోవిధికన్న ప్రే,గగునెల్లఱ తపఃక్రియలఁ దలంచి
అంతవఱకక్షమాలకు నజినమునకు, వలయునుపయోగము ఘటించి స్వస్తిచెప్పి
యమలము విశేషధర్మము నాదరించి, ధర్మము సముద్ధరించితె తపసిఱేఁడ!

సీ. అఘమర్షణ స్నానమాడునీరముభాతి, రాజులగాత్రాళి రక్తమెల్లఁ
గట్టుకొనంబడు గావివస్త్రముభాతి, రాజరక్తార్ద్రవస్త్రంబు మిగులఁ

బూజలఁగావించు పుష్పాళిభాతిని, రాజసంఘంపు శిరంబులెల్ల
భక్తితోఁజపియించు వరమంత్రములభాతి, బటుక్రోధమునఁబల్కు పల్కులెల్ల
జేసితివటంచు నీజయశ్రీచరితము, నతిశయోక్తుల వర్ణింపనగును గాని
ప్రతినఁ బితృతర్పణము నిల్పి క్రమ్మ బ్రహ్మచారివగుట నియ్యావి సత్యదూరములగు.

ఉ. ధాత్రిసమస్తముం గెలిచి దాయల సున్నయొనర్చి బ్రహ్మకుం
బుత్త్రుఁడు నీప్రతిగ్రహముఁబూనఁగలాఁడగు గశ్యపర్షికిం
బాత్రమెఱింగి దానమును బ్రహ్మసమర్పితబుద్ధి నిచ్చి సా
ర్వత్రికయోగనిష్ఠ నలరారితి నిశ్చలవార్ధియట్టులున్.

శా. మన్నింపన్గల్లరు నీదుపేర్విని భయోన్మాదంబుచే బారి నీ
సాన్నిధ్యంబు లభింపరై రగుట నిష్కాముండ వీదానమం
చు న్నీభారము దప్పికొంటివి తపశ్శుద్ధుండవౌ నీకు నో
యన్నా! దానము గీనము న్వలయునే యాకోర్కియుం గల్గునే.

సీ. పైనిరానున్న కల్పమునందుఁ గైలాస, పతివిగా నుండుట ఫలముగాదె
తపస్వివై షోడశతరమహారాజుల, గణుతికెక్కుటకీర్తికరముగాదె
కశ్యపుఁ డీనేలఁ గడమరాజులకీయ, మిన్నకుండుట శాంతిమేల్మిగాదె
ద్రోణభీష్మాది సద్యోధులకెల్లను, గురుఁడవౌట గురుత్వగరిమగాదె.
గీ. నీదుకళ్యాణగుణములు నీ యనఘత, నీతపశ్శక్తి నీదుశౌండిర్యతయును
బ్రాహ్మ్యమునకు క్షాత్రమునకుఁ బరమమార్గ, దర్శకములౌచు బాపసంతతి నడఁపవె

గీ. ధర్మపథము సమ్యగ్వృత్తిఁ దనరునట్లు, నెల్లరకు సత్యదృష్టి రహించునట్లు
చెడుగరియసూయ వీఁక నశించునట్లు, దయఁగటాక్షింపుమయ్య, యో తపసిమిన్న!





# జన్మాంతర సంబంధము

శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

లక్ష్మీనారాయణకు ఇద్దఱు కుమారులు. పెద్దవాఁడు సూరన్న; రెండవవాఁడు మంచన్న.

సూరన్న కడు చలాకీవాఁడు; ఊరిలో జట్టునకు ఏకచ్ఛత్రాధిపతి. ఊరంతయు మాటు మణఁగిన తరువాత దొడ్లలో దూఱి దానిమ్మకాయలు పొట్లకాయలు వంకాయలు మొదలగునవి ఎత్తుకొనివచ్చి తమలోతమకు పంచుటలోను, ఇతరులకు విందులు చేయుటలోను అందెవేసిన చెయ్యి. వినాయకచతుర్థినాఁడు ఇండ్లమీఁద రాలురువ్వుట, దీపావళినాఁడు భయపడి పోవువారిమీఁద చిచింద్రీలు పాఱవేయుట ఈమొదలగు పోకిళ్లతో 'వీఁడూ ఒకమనిషి' అని లోకములో జమకట్టఁబడినాఁడు.

మంచన్నకు నాలుగేండ్లకు నాలుగు బడులు నాలుగైదక్షరములు తక్కువగా వచ్చినవి. గుంటఓనమాలు దిద్దుటచే చూపుడువేలిలో ఒకకణుపే మిగిలినది. పిల్లలందఱు మొట్టికాయలు వేయఁగా వారికడనుండి పాఱిపోయి దాఁగికొనును గాని తనతల్లియగు భవానితోకూడ ఆ అవినయమును చెప్పికొనఁడు.

అతఁడు ఇపుడు కట్టుచో పండ్రెండు మూళ్లకు తక్కువబట్ట కట్టఁడు; లేనిచో జేనెఁడుతడి కొల్లాయగుడ్డ. చుట్టుచో ఇరువది మూరల తలపాగ; లేనిచో జందెమే. ఇటులు ఉండుటచే జనాభాలెక్కలలోఁగూడ నతని పేరు ఎక్కలేదు.

మంచన్న యన్నచో తండ్రికి తలపోటు. మంచన తండ్రియెట్టెదుటి కెపుడును పోయి యెఱుఁగఁడు. తండ్రి తనపంక్తిలో వానికి ప్రవేశమును రద్దుపఱచెను. అందఱ భోజనములు అయినపిదప తల్లి అతని నొకమూల కూర్చుండఁబెట్టి అన్నము పెట్టును. విస్తరిముందునుండి లేచుట యననేమో అతఁడెఱుఁగఁడు. 'నాయనా! చాలు!' అని తల్లి అనలేక అనలేక అని మంచనను విస్తరిముందునుండి లేవఁదీయుచుండెడిది.

మంచన శరీరమున కంతటికి కను లలంకారములు. ఒకవిధముగా వికారములుకూడ. ఏలయనిన ఆపొట్టయు,ఆకాళ్లును,ఆచేతులును ఆయొడలును కల ఆమనుజునకు కన్నులుకూడ చింతాకులవలె నుండుచో ఆశిల్పము చతురస్రముగా ఉండెడిది. కావున పద్మములవలె నున్న ఆకన్నులు అతనికి వికారముగా ఉన్న

వన్నను అనవచ్చును. ఎవఁడేని క్రొత్తవాఁడా కన్నులుచూచి 'వీనిలో ఏదియో విశేష మున్న'దని అనుకొనక మానఁడు. ప్రకృతము కానఁబట్టుచున్న విశేష మేమనఁగా తిండిలో అత్యాధిక్యము.

లక్ష్మీనారాయణకు పూర్వార్జితము నాలు గెకరములకంటె ఎక్కువలేదు. ఆ క్షేత్రము మీఁద వచ్చుపంట వారికి బొటాబొటీగా సరిపోవును. సూరన్న చెట్టుక్రింది ప్లీడరుగా ఉండి ఇపుడు కొంచె మార్జకుఁ డైనాఁడు. కాఁబట్టి తండ్రి యధికారము సూరన్నకు సంక్రమించినది. మంచన్నను ఛర్దనము మర్దనము చేయు నధికారము తండ్రి వదలిపెట్టను లేదు. సూరన్నకు సంక్రమింపకపోవను లేదు. తల్లి అడ్డమువెళ్లి మంచన్న దెబ్బలలో కొన్ని పంచుకొనుచుండెడిది. దానిచే 'మీఁఅమ్మకుఁ గూడ దెబ్బలు తెస్తున్నావురా వెధవా' అని తిట్లును, రెట్టిదెబ్బలును మంచన్నకు ముట్టుచుండెడివి. మంచన్న ఈదెబ్బలుకూడ అన్నముతోపాటు జీర్ణము చేసికొనుచుండెడువాఁడే కాని కేవలము తండ్రియే యగుచో ఊరకుండువాఁడే. ఏలనఁగా చిన్ననాఁటనుండి తండ్రిచేతిదెబ్బ, అమ్మ ఆముదము రాయుటతోపాటు అభ్యాస మయిపోయినది. క్రొత్తగా అన్నగారిదెబ్బ లధికమగుటవలన అతనిలో అభిమానదేవత నూతనముగా జాగరిల్లినది. ఈవిశేషమును అతనికనులు సూచించుచో సూచింపవచ్చును.

చిన్ననాఁట అన్నదమ్ములు ప్రేమయుగళము. అన్న తమ్ముని శిక్షించును; తమ్ముఁడు దెబ్బతిన్న పామువలె దానిని సహించి చూచుచుండును. అతని కనుకూలమై యౌవనము ప్రాపింపఁగా వారిరువురు శత్రుయుగళ మయి పోదురు. పాపము! అపుడు అన్న తనప్రేమమును క్రమ్మరించునుగాని తమ్ముఁడు దానిని ఈర్ష్యయని తలఁచునంతపగ పెట్టుకొనును.

అన్నదెబ్బల కావేదన పడలేక ఇంట నెవరికి చెప్పక మంచన్న దూరదేశములో నున్న బంధుజాలము నంతయు తిరుగవేయ మొదలిడెను. అతని కిపుడు స్వర్గమున నున్నటు లుండెను. తనవాలకమును, తిండిని చూచి వరసఅయినవారు అనుమాటలు తానుపడుట, మరల వారికి సమాధానము చెప్పుట అను నదియే ఇపు డతనికి స్వారాజ్యసుఖము. అతఁ డేబంధువులయిండ్లలోను ఉండఁదలఁప లేదు. బంధుగృహము లన్నియు తిరుగవేయుటలో అతని ఉద్దేశ మేమనఁగా మంచన యను పిల్లవాఁ డొకఁడు లోకమున నున్నాఁడనియు, అతని కింకను పెండ్లి కాలేదని వారందఱకు తెలియవలయు ననియు.

అతఁ డటులు తిరిగితిరిగి బంధులోకమునకుఁగూడ తనయందు దయలేదనియు తండ్రికే తనపై నెక్కువ దయ కలదనియు తెలిసికొన్నాఁడు. ఏలనగా బంధువులు 'మీమంచన్న ఇక్కడికి తప్పించుకొని వచ్చినటులు తోఁచుచున్నది. వెంటనే తీసికొనిపొండు!' అని లక్ష్మీనారాయణకు వార్తలు పంపఁగా అతఁడు మంచన్నను రావించుటకు యేమి యేర్పాటును చేయకుండుటయేకాక వారికి ప్రత్యుత్తరమేని పంపలేదు.

తండ్రి కోపపడేని తనపై దయతప్పిపోవునేమో యనియు ఏబందుగేని తనపై ద్వేషముచే తండ్రి కప్పగించి పోవునేమో యనియు మంచన బంధులోకమును విడిచిపెట్టెను. ఏకాంతములో ప్రవేశించిన యోగివలె అతడు లోకములో ప్రవేశించెను. సత్రము అగపడుచో సత్రమున, విందు దొరకుచో విందున, బ్రాహ్మణార్థము కుదురుచో నచట, లేనియెడల ఎవరియింటనో ఒకరియింట భోజనమొనరించుచుండెను. ఎవరిని ఎర్రని ఏగాని అడుగఁడు; కావున లోకుల తిట్టులుకాని దెబ్బలుకాని అతఁడు చవిచూడలేదు.

ఇటులు సమస్తలోకమున ఆదర మనుభవించుచు అభిలషించుచు తిరిగితిరిగి మంచన్న శైలారామ మనుగ్రామము ప్రవేశించెను. ఆసంధ్యాసమయమున వానచినుకులు ఉదాసీనముగా పడుచుండెను. భోజనమునకు లేవవలసినదను భార్యల పిలుపుల నభిలషించుచు కొందఱును, పగట నంతయు సోమరితనము వలనఁ గలిగినబరువును మోయుచు కొందఱును వాకిటి అరుఁగులపై కూర్చున్నారు. నడివయసు, లంబోదరము, గజగమనము, స్మితముఖము, దీర్ఘ నేత్రములు వీని కన్నిటికి కిరీటముగా నున్న తలపాగ, బుజముపైనున్న చిన్న కొల్లాయయు కల ఆమంచన్న ఆకారము వారి నాకర్షింపక మానలేదు. ఏయూరు మీదన్నచో ఎక్కడ ఉండు మనవలసివచ్చునో యని ముందుచూపుగల కొందఱు అతనిని పలుకరింపలేదు; కాని సంసారపుజంజాట మెఱుఁగని బాలురు అతనిని 'మీ దేవ్వూరు? ఏవ్వూరినుంచి రావడం? ఎక్కడికి పోవడం? ఎందుకు వస్తున్నావు?' అను వివిధప్రశ్నలు వేయక మానలేదు. కొందఱుబాలు రతనివెను వెంటనే నడచుచు మీఁది కొల్లాయయు, గోఁచియు తుదకు కిరీటమును తాఁకక విడువలేదు.

మంచన్న కాప్రశ్నలు మహానందముగా ఉన్నవి. 'వీరెవరో బంధువులే; కానియెడల ఇన్నిప్రశ్న లేలవేయుదురు? విశేషించి మీ దేయూరనియు, ఏయూరినుండి రాకయనియు, అడుగుట కేమిపని? ఇంక గుడ్డ గోఁచులు తాఁకుట కేటియక్కఱ?' అని మనస్సులో తనతో వారి కేదో సంబంధ మున్నదని నిర్ధారించుకొన్నాఁడు. అతఁ డెవరికిని ఏమియు సమాధానము చెప్పకుండ బజారువెంట పరిక్రమించుచున్నాఁడు.

అతని యాకారమును వెంటఁబడి బాలురతనితో చేయు పరిహాసమును అరుగుమీఁద అఱమోడ్పుకనులతో పడుకొన్న అనంతుఁడు చూచుచున్నాఁడు. అది యెల్లయు నతనికొక స్వప్నమువలె నున్నది. తనయెదుటనుండి పరిక్రమించుచున్న ఆయాకార మొక మనుష్యుఁడే యనియు అది కలకాదనియు తెలిసికొని అనంతుఁడులేచి 'మాట, మాట; మీ దేయూరు?' అని అడిగెను.

ఇదివఱ కెవరికి సమాధానము చెప్పని మంచన్న 'మాది రామాపుర'మని ప్రత్యుత్తరము చెప్పినాఁడు అనంతుఁడు. 'ఎక్కడికి వెళ్లుచున్నా'వని యడుగఁగా మంచన్న ఇక్కడికే అన్నాఁడు. 'అగుచో రమ్మ'ని అనంతుఁడనఁగా మంచన్న వచ్చిఆవలి యరుఁగుమీఁద కూర్చుం

డెను. అనంతుఁడు 'మా యింట నుండువా' యని యడుగఁగా 'ఆలాగుననే ఉందు' నని మంచన్న అనెను.

'ఇఁక ఈజన్మము నిర్విచారముగాగడఁప వచ్చు'నని మంచన్న అనుకొన్నాఁడు. వెంట వచ్చిన బాలురందఱకు ఆశ్వాసము కలిగినది. అనంతుఁ డతని లోనికిఁ దీసికొనిపోయి 'ఓయీ! అల్లుఁడు వచ్చినాఁడు; కాళ్లుకడుగుకొనుటకు నీరుపట్టుకొని ర'మ్మనియెను. మంచన లోలోపల ముసిముసి నవ్వులు నవ్వుకొనెను. అమల నీరుదెచ్చి పలువురు బాలురచే పరివేష్టితుఁడైయున్న మంచన్ననుచూచి చేయి నోరి కడ్డముపెట్టుకొని నిశ్చేష్టయై నిలువబడిపోయినది. అనంతుని పెద్దకూఁతురు బృంద తలుపు చాటుచేసికొని గదిలోనుండి తొంగి చూచుచు కోపముఖముతో నిర్గమించి నిలువబడినది. బృంద చెల్లెలు కామోద 'బావా బావా' అని కిలకిల నవ్వుకొనుచు దాపునకేఁగి తెల్లబోయినది. బాలు రందఱు పెద్దపెట్టున అరచిరి. మంచన్న కామోదను చూచుచు 'ఈపిల్లనే నాకిత్తురా?' అని అనెను. అందఱు నవ్విరి. ఈరీతిగా మంచన్న కాయింట ప్రథమప్రవేశము కలిగినది.

నిత్యసభలతో ఇటులు పదినాళ్లు కడచినవి. రెండుపూఁటలుతిని కూర్చుండుచున్న మంచన్నకు ఏమియు తోఁచుటలేదు. ప్రతిదినము 'కామోద కేమేమి నగలుపెట్టెద' నని యడిగి 'మంగళసూత్రము పెట్టెద'నని సమాధానము తిరిగిన యాకే తిరిగివచ్చు చక్రమువలె తనకు క్రొత్తవింత కలిగింపమి అనంతునకును ఏమియు తోఁచుటలేదు. పిల్లలకుమాత్ర మిసుమంతయేని తీరిక లేకున్నది.

అనంతుఁ డొకనాఁ డొక కావడిబద్ద, మట్లుతెచ్చి 'మంచన్నా! ప్రతిదినము దీనితో మనయింటికి కావలసిన నీరు తెచ్చుచుండుము! ఇది లెస్సగా మోసినతరువాత సంసారము మోయుదువుగాని' అని అనెను.

మంచన్నకు సరిగా ఆపని నచ్చినటులయినది. అతఁడు బుజాన కావడిపెట్టుకొని నీళ్లుమోయ నారంభించెను. మొట్టమొదట ఊఁపునకు బిందె లటు నిటు ఊఁగి కాళ్లకు కొట్టుకొని క్రిందపడుట,బుజములపై కాయలు కాచి బాధపడుట జరిగినదికాని కొన్నాళ్లలోనే ఆవిద్య అతనికి 'ప్రవేదిరే ప్రాక్తన జన్మవిద్యాః' అన్నటులు సంపూర్ణముగా వచ్చినది పిమ్మట మంచన్న చేతులతో కావడిబద్ద పట్టుకొనకయే నీళ్లుమోయుట కలవాటు పడినాఁడు. పిల్లలందఱ అతనికి'మంచినీళ్ల మంచన్న' అని పేరుపెట్టినారు. కామోద నిచ్చి పెండ్లి చేయుదు మన్నచో నెంతసంతోసమో మంచినీళ్ల మంచన్న అని యన్నను అతని కంతే సంతోసము. కావడి బాగుగా మోసినఁగాని సంసారము మోయుట తెలియదని అతని నమ్మకము.

మంచన్నను ధన మ్మెన్నఁడు ఆకర్షింపలేదు. అతఁ డెన్నఁడు అన్నవస్త్రములు కొనియెఱుఁగఁడు. వానికంటె వేఱేమియు నతని కక్కఱలేదు. లోకు లన్నివిధముల ధనము గూడఁబెట్టి కాపాడుకొందురని అతఁ డెఱుఁగఁడు. నియతప్రకారము మంచినీరు తెచ్చుట,



౬. తంజావూరి రఘునాథరాయల భార్యలు

(కనుమానియున్న ప్రతిమలు)

## రామస్వామి దేవాలయమునందలి శిల్పచిత్రములు-కుంభకోణము



౧౦. సుగ్రీవపట్టాభిషేకము



౯. రామమూర్తి

అనంతునిచేతను అతని జ్ఞాతులచేతను 'అల్లుఁడా' యని యనిపించుకొనుట, బాలికలచేతను బాలురచేతను వినోదింపఁజేయఁబడుట, భోజనము చేయుట, వీనిచే మధ్యాహ్నమును, ఉప్పునీరు చేఁదుట, తనకు తగినవారితో సంభాషించుట, తలపాగ చుట్టుకొని ఊరేఁగుట వీనితో సాయంకాలమును నిర్విచారముగా అతనికిఁ గడఁచుచున్నవి. కాలము మెల్లగా గడఁచుటగాని, త్వరగా పరుగులెత్తుట గాని యీ రెండును అతని కనుభవములో లేవు. అతఁడు రాత్రి ప్రక్క వేయుచో సూర్యోదయమువఱకు కర్రవలె నిద్రించును.

కామోదకు పెండ్లియీడు వచ్చినది. సంబంధము కుదిర్చి లగ్నము నిశ్చయించినారు. మంచన్న ఆనాఁడు కావడిబద్ద బుజానఁ బెట్టలేదు. గదిలో మూలుగుచు కూర్చున్నాఁడు. వంటవేళ అయినది. నీళ్లు లేవు. ఎన్నిమాఱులు పిలిచినను పలుకఁడు. కొంతసేపటికి శ్యామ గదిలోనికి పోవఁగా కనులవెంట నీరు రప్పించుకొని మంచముక్రింద కూర్చున్న మంచన్న కానిపించినాఁడు. శ్యామ 'మంచన్నా! ఏల యేడ్చెద' వని యడుగఁగా 'కామోదను నా కీయరఁట!' అని విలపించినాఁడు. 'అయ్యయ్యో నన్ను చేసికొందువుగాక!' అని శ్యామ అనఁగా 'నిజము? నిజము?' అని మంచన్న అన్నాఁడు. 'నిజంఘా' అన్నది శ్యామ. దానితో ఎక్కడలేని సంతోషము వచ్చినది మంచన్నకు. చాటుగా నుండి వినుచున్న అమల 'మంచన్నా! నీళ్లేవీ?' అని యడుగఁగా శ్యామ 'అమ్మా! కామోదను ఈయ రని మంచన్న ఏడ్చుచున్నాఁడు' అని చెప్పెను. అమల 'అయ్యో, పిచ్చిఅల్లుఁడా! శ్యామను నీ కిచ్చెదము' అనువఱకు మంచన్న అమాంతము లేచి కావడి బుజానఁ బెట్టుకొని చెఱువునకు బయలుదేఱి యెదురైనవా రందఱితో 'నాకు శ్యామ నిస్తారు, నాకు శ్యామ నిస్తారు' అని చెప్పికొనుచు వెళ్లెను. వారు 'శ్యామనూ ఇస్తారు, పద్మనూ ఇస్తారు' అని అతని సంతసము ఇనుమడింపఁజేసిరి.

అతఁ డీసంతోషములో మునిఁగి తేలాడుచుండగాఁ ఇంటివద్దనుండి మఱియొకసంతోషవార్త వచ్చినది. అది తండ్రిమరణవార్త. అతఁ డావినోద మనుభవించుటకు నేఁటికి పదప్రచలనము చేయవలసి వచ్చినది. ఆతఁ డింటికి వెళ్లెను. తాను తద్దినము పెట్టువాని తమ్ముఁడే కాన ఆతనికి క్లేశ మంటలేదు.

భర్త చనిపోవుట, కుమారుఁ డెందులకు కొఱగాక పెండ్లి లేక దేశాలపాలగుట, అన్న తమ్ముని విసర్జించుట భవానిని మిక్కిలి బాధించినవి. ఆమె ఆదుఃఖమున మంచన్నను దగ్గఱ కూర్చుండఁబెట్టుకొని 'నాయనా! ఇఁక నిన్ను అన్న కొట్టఁడు. ఏకొండ్రయో అమ్మి పెండ్లి చేసి చూడవలెనని ఉన్నది.' అని రోదనము చేయఁగా మంచన్న నగుచు 'అమ్మా! నా కచట నొకయిల్లున్నది. పెండ్లికూఁతురుకూడ ఉన్నది. పెండ్లి చేసికొని ఒకసారి నీకు చూపించి తీసికొనివెళ్లెదను చూడు!' అని చెప్పి ఆమె దుఃఖమును ద్విగుణము చేసెను. కర్మయిన పిదప తల్లితో 'మాయింటికి వెళ్లిపోవుదు'

నని చెప్పఁగా ఆమె అతికష్టముమీఁద ఒకరోజు ఆఁపుసరికి దేవతలు దిగి రావలసివచ్చినది.

పశువు కొన్నాళ్లు బందిలిదొడ్డిలోనైనను ఉన్నచో మరల అది అక్కడికి వెళ్లఁగోరును. వింతలతో వినోదములతో బాలికల హాస్యములతో స్వర్గసుఖ మనుభవించుచున్న మంచన్న మరల శైలారామమున అనంతుని యింటికి వెళ్లఁగోరుకొనుటలో ఆశ్చర్యము లేదు. అతనికి తల్లియన్న దో ప్రేమ యున్నది కాని దానికి సూరన్న భయము మాటు. కావున అతని కనంతుఁడే తల్లి.

సూరన్న తనను మాటాడించి ఎక్కడ తన్నిపోవునో యను భయము తొందరపెట్టగా తల్లితోఁగూడఁ జెప్పకయే లేచిపోవలయునని మంచన యూహించుచున్నాఁడు. సూరన్న తమ్మునితోఁఱుకుబెఱుకులన్నియు కనిపట్టి తల్లి కడ పసిపిల్లనివలె నున్న అతని కడకు వెళ్లి 'తమ్ముఁడా! నాయనా పోవనే పోయెను. ఏ కొండ్రయో అమ్మ నీ కొక పిల్లను ముడి పెట్టవలసిన విధి నామీఁద ఉన్నది. కాఁబట్టి నీ వల్లరి చిల్లరగా తిరుగక ఇంటనే పడి ఉండు' అని అనెను.

ఈమాట లకాలజలదోదయము వలె భవాని కాశ్చర్యము కలిగించినవి. ఆమె కనుల నీరొత్తుకొనుచు 'మంచన్నా! అన్నాయికి నీ మీఁద దయకలిగింది. రెణ్ణాళ్లపాటిక్కడ నుండు!' అని బతిమాలుకొన్నది. సూరన్న ఎంత గట్టిగా ఉండుమని కోరునో మంచన్న అంత వడిగా లేచిపోవునని భవాని అనుకొనలేదు.

తెలవారుకడ ఎవరికి తెలియకుండ మంచన్న మాయమయినాఁడు. 'వాఁడు వట్టి వెఱ్ఱివాఁడయి పోయినాఁడు. ఉండమంటే ఉంటాఁడా?' అని సూరన్న తల్లికడ సంభాషింపఁగా భవానిదుఃఖించినది. కాని మంచన్న సూరన్నకు జంకియే వెళ్లియుండు నని ఆమె లోలోపల తలంపకపోలేదు. ఆమె బంధువులలో పిల్లలను గుఱుతుతెచ్చుకొని సూరన్నతో చెప్పుచుండెడిది. సూరన్న వెంటనే వారి వారికి వార్తనంపి వారివారిఅసమ్మతిని ఎప్పటి కప్పుడు తల్లికి నివేదించుచుండువాఁడు. మంచన్న అన్నను మఱచి శైలారామమున సుఖముగా నున్నాఁడు.

అనంతునికుమారుఁ డకులచంద్రుని వివాహము వచ్చినది. ఇల్లంతయు మంచన కప్పగించి అందఱు తఱలి వెళ్లినారు. మంచన్న కది యెంతగౌరవము! పెండ్లివారు తొందరగా వెళ్లుచు పాఱవైచుకొన్న నగలమూట మంచనకు దొరకినది. అతఁడు దానిని భద్రముగా దాఁచెను. చీఁకటిపడఁగనే కఱ్ఱ బుజముమీఁద పెట్టుకొని ప్రహరి తిరుగును. తలుపు లన్నియు తాళములుపెట్టి తడవతడవకు లాఁగి చూచును. చీమ చిటుకుమన్నచో రివ్వునఁ బాఱి సందేహము పోఁగొట్టుకొనును. అతఁడొకదయ్యమై యాయింటి నావహించినటులు ఆయింటి నావహించెను.

నగలమూట యింట జాఱిపోయెననియు, మంచన దాని నపహరించుననియు అమల అనంతునితో పోరుపెట్టెను. ఓసి తెలివి మాలినదానా! నగ లింటనే జాఱిపోయిన

యెడల మంచన మన యినుపపెట్టెయే!" అని యనంతుఁ డనెను. అమల యింటికి మనుష్యుని పంపుమని రాపాడినను అనంతుఁడు చెవి యొగ్గలేదు.

పెండ్లివారు తూర్యధ్వనులతో దిగిరి. అనంతుఁ డింట కాలిడఁగనే మంచన నగల మూట నింటిబరువుతోపా టతనిముం దిడెను. అనంతుఁడు 'మంచనా! నీవు నాకు తీసికొనని అప్పు, తీఱని ఋణము' అనియెను. అమల అతని విశ్వాసమున కాశ్చర్యపడెను.

మంచన్న కొకనాఁడు టపావాఁ డొక యుత్తరమును మనియార్డరును తెచ్చి యిచ్చెను. అది యతని జాతకమున నొకమహాయోగము. ఏమనఁగా గవర్నమెంటు నవుకరు తనకు ఉత్తరము మోసికొని వచ్చినాఁడు. మఱియు నాలుగురూకలు బహుమతి తెచ్చినాఁడు.

తండ్రి తద్దినము పెట్టుకొనుట కింటికి రావలసినదని వ్రాసి ప్రయాణవ్యయమునకై నాలుగురూకలు సూరన్న పంపినాఁడు. ఆపైక ము సూరన్నయే పంపినాఁడని మంచన్నకు గోచరించినపు డతనిమన స్సొక నూతనమగు భ్రాతృప్రేమతో తొణికిపోయినది. మంచన్న వెంటనే రామాపురమునకు పయనమయి పోయెను. భవాని మంచననుచూచి నూతన ముగా కనినటులే యానందించెను. ఆతఁ డొన రించిన కర్మమే భర్తకు ముట్టునని యామె తలఁపు.

మాసికము, ఏఁడుడి, తద్దినము సమాప్త మైనవి. తద్దినమునాఁటి నడికిరేయి సూరన్న మంచన్నను వెదకికొనుచుఁబోయి యతనిని లేపి 'నాయనా! ఇటురా' మ్మని పిలిచెను. మంచన్న కిన్నాళ్లనుండియు లేని భ్రాతృప్రేమ ఒక్క సారి నిండుకొనెను సూరన్న యన్నదో పాటు మంచన్న యిపు డతనిని గొఱియవలె ననుగమించెను. సూరన్నతమ్ము నొకయింటి లోనికిఁ దీసికొనిపోయి 'ఈకాగితము మీఁద వేలిముద్దర వైపు' మనియెను. అదియు కర్మలో నొకభాగమనుకొని మంచన తన బొటనవేలిని మసి కంటించి కాగితముపై దక్షిణమునుండి ఉత్తరమునకుఁ ద్రిప్పెను. అది సూరన్నయప కీర్తి ముద్రవలె నల్లని బహురేఖలతో నంటు కొనెను.

ఔరా! సూరన్న ఎంత తెలివిలేనివాఁడు! తమ్ముని తర్జనభర్జనములచే నెడఁబాపుకొనెను గాని ఒక్క ప్రేమవాక్యము చేతనే అతని యాత్మనే శరీరసమేతముగా స్వాధీనము చేసి కొనవచ్చునే! మంచనా! సహస్రాబ్దములు జీవింపుము! నీకు ధన మక్కఱలేదు భూమి యక్కఱలేదు. ప్రేమకిరణ మొక్కటియే నీ వాసించుచున్నావు. దేనిని నీ వాసించుచున్నావో అది వెలపెట్టినను రానిది. దానిచేతనే యీజగతి జీవించుచున్నది.

తెలవారుకడ భవాని మంచన్నను వెదకి కొని యతఁడు కానరామి పుత్రదుఃఖ మను భవించెను. సూరన్న పుత్రోదయ మయి నటులు సంతోషించెను.

కొల్లాయిగుడ్డ కొకచివర ఒక మిఠాయి పొట్లము మఱొకచివర కజ్జపుపొట్లమును కట్టి దానిని బుజముపై వేసికొనఁగా ఒకటి యెదు

రొమ్ములను మఱియొకటివీఁపును జంగమురొమ్ము వీఁపుల లింగశంఖములవలె కొట్టుకొను చుండఁగా మంచన శైలారామము ప్రవేశించి బాలలోకమున కానందము కల్పించి ఆనంద పురుషుఁడై యుండెను.

కొన్నాళ్ళకు శ్యామావివాహము వచ్చినది. లగ్నము నిశ్చితమయినది. మంచన్న ఆ వార్తవిన్న తత్‌క్షణము శ్యామవద్దకు వెళ్లి 'శ్యామా! నన్ను పెండ్లాడుదు నని నీ నోటి మీఁదుగా నీవే యంటివికదా! ఇపుడు ఇంకొకనిని పెండ్లాడుదువా?' అని యనఁగా శ్యామ 'మంచనా! నీగోత్రము చెప్పు' మని అన్నది. మంచన 'కౌశికగోత్ర'మని యనఁగా శ్యామ 'మాగోత్రము చెప్పు'మనియన్నది. మంచన ఆలోచించుచు 'కౌశికగోత్రమే'అని 'శ్యామా! నీవు నాకుచెల్లెలివి' అని శ్యామనెత్తికొని 'అమలమ్మగారూ! అనంతుఁడుగారూ! మీరు నాకు తలిదండ్రులు; నన్ను నమస్కరింపనిండు' అని వారికి పాదాభివందనములు చేసి బాష్పప్లావిత నేత్రుఁడై కూర్చుండెను. అందఱకు కనుల వెంట ఆనందబాష్పము లుదయించెను. శ్యామ 'జియ్యా! నా కూఁతునిచ్చి నీకు వివాహము చేయుదును లెమ్ము'అనెను. 'మంచన, అంతవఱకే కాదు, ఆమెకు కూఁతురు పుట్టువఱకు పెండ్లికుమారుఁడయియే యుండు'నని మంచన్న అనెను.

కొలఁదినాళ్లలోనే శ్యామకు వివాహమయినది. ఆవివాహమయిన కొలఁదినాళ్లకే అనంతునకు జబ్బుచేసినది. భవానికి ప్రాణము మీఁదికి వచ్చినదనియు వెంటనే రావలసిన దనియు మంచన్నకు వార్త వచ్చినది. ఇంటివా రందఱు వెంటనే వెళ్లుమని చెప్పినను 'అనంతుని యారోగ్యముచూచి మఱివెళ్లుదు' నని మంచన్న కదలలేదు. ఒకనాఁ డనంతుఁడే అతని బిలిచి 'మంచన్నా! వెంటనే నీవింటికి వెళ్లిరమ్ము' అని ఆదేశించెను. అనంతుఁడు చెప్పఁగనే మంచన బయలుదేరి రామాపురము వెళ్లెను.

మంచన్న యింట కాలిడకమున్నే సూరన్న లోనుండి యెదురుగావచ్చి 'దౌర్భాగ్యుఁడా! అమ్మచచ్చి ఆఱురోజులు కాఁగా ఇపుడేల వచ్చితివిరా అపాత్రుఁడా!' యని దవడలపై రెండు తాటించెను. మంచన్న దుఃఖ మంచమున శయనించెను. అతని కారాత్రి అనంతునిపై దుస్స్వప్నములు వచ్చెను. అతఁ డచటికి వెళ్లలేక యిచట నుండలేక ఆసులో కండెవలె అటుఇటు కొట్టుకొనెను.

మంచన రామాపురము విడిచి అనంతునియింట కాలువెట్టువఱకు వైద్యులీ జబ్బుఁక నెమ్మదింపదని చెప్పుచుండిరి. మంచన యొక్క అపాంగప్రసారమే అతని దుఃఖమునకు ధర్మామెటరువలె నుండెను. అనంతుఁ డిటు మోమటు వెట్టెను.

మంచనకు గుండెలలో రాయి పడ్డది. మంచనను చూచినపుడెల్ల అనంతునకు తీవ్రమగువేదన అతిశయించెడిది. వారు పరస్పరముచూచికొని కన్నీరుకార్చుచుండువారు. వారు దీర్ఘమగు చూపులతోడనే మాటలాడుకొనుచుండువారు. కొంతసేపటికి మంచన్న వెలుపటికి తొలఁగిపోవువాఁడు.

అనంతుఁడీలోకులతో మాటలాడుట మాని దేవతలతో మాటలు సాగించినాఁడు. వారితో కొన్నిసైగలుచేయుట ప్రారంభించి నాఁడు. పెద్దపెద్దపేరులుకల దేవతలు వచ్చుచున్నారుకాఁబోలు! లేచికూర్చుండుచున్నాఁడు.

బంధుగు లందఱు చుట్టు మూఁగినారు. భార్య ప్రక్కన నిలువఁబడి దుఃఖించుచున్నది. 'ఏమయిన చెప్పనో' యని అతుల చంద్రుఁ డెదురుగా నిలువఁబడి తండ్రిముఖమును నిరీక్షించుచున్నాఁడు. ఒక్క మంచన్నయే పడునపుడు పట్టుకొనుచు, నోరుతెఱచినపుడు నీరుపోయుచు, తల్లికి పరిచర్య చేసినటులు చేయుచున్నాఁడు.

కొంతసేపటి కనంతుఁడు శాంతముగా పడుకొనెను. పిదప మిగులశ్రమతో లేచి కను లింతంతలుచేసి బాష్పములు స్రవింపఁగా మంచన్నను కౌఁగలించుకొనెను. ఆ కౌఁగటిలోనే అనంతునిప్రేమ, ప్రాణములు రెండును పరసీమ మెట్టెను.

ఎవరియేడుపులలో వా రున్నారు. మఱునాఁటిదాఁక మంచన్నమాట ఎవరికి తోఁపలేదు. వెదుక మనుష్యులఁ బంపిరిగాని అతని యునికి ఇంతవఱకు ఎప్పరికి తెలియలేదు. అనంతునిచే జాగరిల్లిన జన ˘ ˊ సంబంధ మనంతునితో నంత మొందినదా?



# ప్రణయగీతము

నుసర్ల రామమూర్తి గారు

విమల దరహాసచంద్రికా విలసనములఁ
ప్రేమరసపూరి తాపాంగ వీక్షణముల
లలిత సువ్యక్త మధురసల్లాపములను
మెఱపుచందాన క్షణములో వరలఁజేసి
విదితముగ నాదునిర్మల హృదయమెల్లఁ
గలఁచిపోతివి వలపులు మొలకలెత్త
నాఁటిదినమున బృందావనంబునందుఁ
జెలువ మెసలారఁగా శిలాతలముఁజేరి
యరుణసంకీర్ణ పాటలాధరముపైన
మురళి మోపెట్టి పంచమస్వరముతోడ
హాయిగా శ్రోత్రపర్వంబుఁ జేయునట్టి
దివ్యతరగాన మిపుడుఁ బ్రతిధ్వనించు
ఎచటదాగితో? వెదకితి—ఎఱుకపడవు!
కనులపండువుగాగ దర్శనమొసంగి
నిర్భరానందమును మది నెఱపుమయ్య!
వల్లవీలోల, నీలగోపాలబాల!

---



# పిన్ని

ఓరుగంటి వెంకటకృష్ణయ్యా గారు

[రవీంద్రుని కథ కనువాదము]

పిన్నీ!”

“జ్యోతీ! నిద్రపోరా నాయనా, ఎంతరాత్రయింది!”

“కానీ లేస్తూ! యింకెన్ని దినాలు? మరి మణి వాళ్ల నాన్నగారింటి కెళ్లితే మంచిదేమో! ఎక్కడున్నాడో!”

“సీతారామాపురములో!”

“ఆ! సీతారామపురము. అక్కడికి దాన్ని పంపేసెయ్యి పిన్నీ, స్వయంగానే బలహీనపుపిల్ల, రోగిష్టివాడిదగ్గర యింకావుంచడము బాగులేదు.”

“ఏం మాటలురా - ఇలాటిస్థితిలో నిన్నొదిలి ఎలా వెళుతుందిరా?”

“ఏమిటే - డాక్టరు ముక్కలు నాలుగూ దానితో యెవరైనా—”

“ఎవరు చెప్పాలెరా - స్వయంగానే తెలుసుకోలేదూ! మొన్న, ఎవళ్లో యీమాట ఎత్తేసరికి అప్పటి దానిసంగతి నీవు చూడాలసింది.”

అంతా నిజమయితే అరకువ చేస్తుందట కాబట్టే పిన్ని కొంచెము ఎక్కువ తక్కువలుగానే సంగతిచెప్పించి సరిదిద్దచూస్తే నిజమిది: మణికి పిన్నికి క్రిందటిరోజు జరిగిన సంభాషణ:

“ఏమే అమ్మాయి! అనంతు వొచ్చినట్టుంది. మీ వాళ్ల దగ్గరనుంచి సమాచారమేమైనా తెలిసిందా?”

“అవునత్తా! వచ్చే శుక్రవారమునాడు మా చిట్టి అన్నప్రాశనట. నన్ను పిలుచుకోపోవడానికి వచ్చినాడు.”

“ఆహా! ఆహార నుండలేదూ దాన్ని పంపు, మీ అమ్మ సంతోషిస్తుంది.”

“నేనే వెళ్లతానత్తా! పంపడమేమిటి? మా చిట్టిని పుట్టినప్పటినుంచి నేను చూడనేలేదు! ఇప్పుడైనా వెళ్లకుండానా?”

“నీ కేమైనా మతిపోయిందేమిటే, జ్యోతీంద్రుడున్న స్థితియేమిటి! నీవు వస్తా? డాక్టరేవన్నది నీకు తెలుసునా?”

“ఆయనే చెప్తారే యిప్పుడేమి భయములేదని”.

“వాడంతేమాత్రము - నీవు చూడలేవూ?”

“ముగ్గురు మగపిల్లల తర్వాత లేక లేక పుట్టింది. ముద్దూ ముచ్చటా వేడుక వైభవం - నేను వెళ్లకపోతే బాగుంటుందత్తా, మా అమ్మ యేమైనా—”

“మీ యమ్మసంగతి నాకు తెలీదుగానీ; మీ నాయనమాత్రము యిప్పుడు జ్యోతి నొదిలి వెళ్లితే నాలుగూ మంగళహారతులు పెట్టాడు.”

“నీ వో ముక్క రాసీ యత్తా- ‘యిక్కడేమి ఉపద్రవంగా లేదనీ-నేను లేకపోయినా ఏకష్టంలేదనీ.’”

“అదిమాత్రం నిజముపిల్లా - నీవు వెళ్లితే యే యిబ్బందీలేదు. అయితే మీ నాయనకు నేను వ్రాస్తేనా నా మనస్సులో వున్న నాలుగు ముక్కలూ వెడలగక్కతాను.”

“నీవు రాయనక్కరలేదు. ఆయనే రాసిపెట్టారు నేనడిగితే.”

“ఇదిగో, అమ్మాయి, ఏమన్నా చేసేవుగాని యీ పిచ్చిసరాగాలు మానెయ్యి. ఇవన్నీ సాగవుసుమా. నీసంగతి మీ నాయనకు బాగానే తెలుసు; ఆయనకళ్లు గప్పడం నీతరంగాదు.”

పిన్ని వెళ్లినతరువాత మణి చిరాకుతో పరుపు మీద పడుకొని ఆలోచిస్తుంది పొరుగింటి ఆపెవచ్చి "ఏమమ్మ ఔమ్మా యిలావున్నావు?"

"ఆ, అన్యాయం చూడు; ఒదినా! నాకొక్కతే చెల్లెలు. లేక లేక దాని కన్నప్రాశనజరగటం, మా అత్త నన్ను పోనీయక పోవటం"

"నీవు ఎలాపోతానన్నావే, మీ ఆయనకిలావుంటే?"

"ఆ! నేను చాలాచేసి వరిగిస్తుంటేనూ! చేస్తానన్నా నాకు చేతగాదూ."

"అబ్బ! యీకొంప పెద్ద అడివిలాగు సందడి చప్పుడులేకుండా వుంటుంది ఎక్కడకైనా వెళదామన్నా వెళ్లనీయరు."

"ఏదో వింతమనిషివే నువ్వు."

"నావల్ల కాదబ్బా అనుకున్నా ముక్కు బారెడు చేసి, మొగము మూరెడుచేసి అడివిలో ఎలుగుబంటిలాగ నుండటం."

"అయితే ఏంజేస్తావు?"



"నేను లేవదేమో వెళ్లేదే. ఎవ రడ్డంగావస్తారో చూద్దాం."

## ౨

నాన్నగారింటి కెళ్లమనేటప్పటికి మణికి కళ్లనీళ్లపర్యంతం అయింది! జ్యోతీంద్రుడు తటుక్కున పరుపుమీద లేచికూర్చున్నాడు. ఒక్కరనసేపుతాళి దిండు దగ్గరకిలాగుకొని దానిమీద ఒరిగి "పిన్నీ ఆకిటికి తెరు; ఈ దీపము దూరంగా పెట్టు" అన్నాడు.

కిటికీగుండా చూస్తే గభీరమైన తమస్సముద్రము. కాలమహాసముద్రములో అదొకపాయ. ఎన్నిరాత్రులువచ్చినవో! ఎన్ని గడచినవో! నక్షత్రాలు దూరాన మినుకు మినుకు మంటున్నవి. నిశ్శబ్దంగా ఆనక్షత్రాలే! అన్నికోట్లున్నూ ఎన్నికోట్ల చావులో నీరవంగానే చూచినవే.

జ్యోతీంద్రు డిది చూడటంలేదు. అతడు మణి ముద్దుమొగాన్ని ఆ యాకాశపథంలో నిర్మిస్తూ వున్నాడు. రెండు నును సోగకన్నులు—చిన్నినల్లని సగమువాలినకన్నులు—కంటికొనల్లో ముత్యాలవరుసల్లాంటి నీటిచుక్కలు. ఇదేప్రపంచము అతనికి. ఈ మహాప్రపంచములో ఎన్నాళ్లు గడపగలడు, పాపము!

పిన్ని జ్యోతీంద్రు డేమి మాట్లాడకుండుటచూచి నిద్రపోయినాడని మనస్సుకుదుట పెట్టుకుంటూంది. తటాలున జ్యోతి ఆరంభించాడు. "పిన్నీ చూశావా! మీరంతా అది చాల దుడుకుపిల్లనీ, మన యింట్లో కుదురుగా వుండదనీ అంటూరా లేదు? ఇప్పుడు........"

"అవునురా అబ్బాయి, మాకుమాత్ర మప్పుడేంతెలుసును? అనుభవం మీదగదా తెలుసుకోటం."

"పిన్నీ!"

"నాయనా, నిద్రపోరా!"

"పిన్నీ, నీవేనునబోకు. కాస్త మాట్లాడాలనుంది. మేలుకొనే వుంటాను."

"సరే, కానీరా."

"ఒకప్పుడు, మణికి, నామాటే గిట్టుకదా అని అనుకొనేవాణ్ణి. అయినా నేనన్నా ఎలానా ఓర్చుకొనే వాణ్ణిగాని మీరు—"

"అట్లంటావేరా. మేం మాత్రం వూరుకోక ఏం జేశాము."

"అలాకాదు పిన్నీ, యిష్టము వచ్చినట్లు తిప్పడానికి మనమనస్సులుమాత్రం మంటిముద్దలా? కానీ, నాకుమాత్రం మణి, తనమనస్సే తాను దెలుసుకోలేదనీ, తెలుసుకునే ప్రాయమేరాలేదనీ, ఏదోఒకదినము, ఏదో ఒకసందర్భంచేత—"

"అవునురా, నీవుచెప్పేది నిజమే."

"కాబట్టే ఆపిల్లదనము నేనంతగా లెక్కపెట్టానుకాను."

పిన్ని ఊరకవింటూన్నది. వస్తూవున్న నిట్టూర్పును అలానే ఆపివేసి కూర్చున్నది, ఇవన్నీ ఆమెకూ తెలిసినవే! ఎన్నిసారులు జ్యోతీంద్రుడు పడకగదిలోనికి పోవడానికి మనసొప్పక, జల్లుగొట్టూన్నా, రాత్రంతా, వసారాలోనే, యీజీచేరులోబడి దొర్లుతూ, గడపలేదు! ఎన్నిసారులు, గదిలో తలనొప్పితో బాధపడుతూ, మణి ఒకప్పుడన్నావచ్చి, 'ఏలావున్నది' అంటుందా, అని కోరికలమీద కోరికలు కోరుతూ, గడపలేదు! ఇదంతా, మణి ఆవలింటి లలితమ్మ వదినతోనో యీవలింటి కమలక్కతోనో నాటకాలు చూడడానికో, సినిమాకు పోవడానికో—తయారవుతూ వున్నప్పుడే అలాటి సమయాల్లో పిన్ని ఒకవేళ విసరడానికివెళ్లితే పిన్నినిగూడా చీదరించుకొని వెళ్లిపొమ్మనేవాడు. ఈ లోకంలోకంతా ఆమె కొక్కతెకే తెలుసు, ఆబయటబడని హృదయంలో ఎంత మర్మాంతకయాతన దాగివుండేది. ఎన్నోమారు లామె జ్యోతీంద్రునితో, "నీగారాబమే యింతచేసింది. ఇష్టమొచ్చినట్లల్లా దాన్ని పోనిచ్చావు! ఇకమీదనైనా దాని నింతముద్దుచేయక దాన్ని కాస్త ఆటలాడించు. కన్నీళ్లపర్యంతము ఒకసారయిన తర్వాత నీచెప్పుచేతల్లో అది వుండకపోతే ఒట్టు," అనబోయేది. కాని ఎవరయినా యిలాంటిమాటలు బయటికి చెప్పగలరా! చెప్పితే ఆమెకు దెప్పులుతప్ప లాభమేమయినా వుంటుందా? అందులో జ్యోతికి 'స్త్రీ' అనగానే ఒకఅస్పష్ట, అవ్యక్త, మధురప్రపంచము కళ్లఎదుట ఆవిర్భవించేది. అందులో సౌందర్యదేవాలయము, దానిలోపల ప్రేమసింహాసనము, దానిపై మణి ఆసీనురాలై అతని మనోరాజ్యాన్ని ఏలుతుండేది. లోకంలో అందరికి ఆప్రేమ ప్రపంచంలో, ఆ అమృతానుభవంలో పాలుండగా తనకుమాత్రం ఏలలేకపోవలె? ఇట్టికోరికలతో, నమ్మకములతో, ఊహలతో తనప్రియాపాదములలో ప్రణతుడై స్వార్పణము చేసికొన్నాడు జ్యోతి. వరం యేమో కనబడలేదు. పోనీ, యివాళకాకపోతే, రేపు. ఆది అంతములేనిధ్యానము 'రేపు' రేపు' అని. ఆ 'రేపు' ఎప్పటికి వచ్చేదికాదు.

జ్యోతి యింతసేపు నిద్రపోతున్నాడనే పిన్నినమ్మకము. ఒక్కనిమిషములో ఆనమ్మకము కూలింది.

"ఇదివరకు నన్నది సుఖపెట్టలేదు. అందుకోసము మీకంతా దానిమీద కోపము. కాని, పిన్నీ, సుఖమనేదిఅదిగో ఆకనుపడుతూవున్న నక్షత్రాల్లాంటిది సుమా! నక్షత్రాలు అంతా ఉన్నాయా? నడుమ నడుమ నలుపులు లేవూ? అలానే ఎన్నోతప్పులు చేస్తాము. చేశారని అనుకొంటాము. కాని ప్రేమ అనేది, సుఖమనేది ఎప్పటికి మినుకుమినుకుమంటూ వుండనే వుంటుంది. నిజముచెప్తాను. యిన్నాళ్లకు యీ దినాన యెక్కడనుంచో ఆనందము పొంగి వస్తూందిసుమా!"

పిన్నికి పాపము కన్నీళ్లునిండినవి ఆ అమాయకుణ్ణిమాచి. కష్టముమీద వానిని దిగమ్రింగి మాటాడక జ్యోతి తల నిమురుతూ కూర్చున్నది. చీకట్లో జ్యోతి వాటినిచూడలేదు. మరి వాడిధోరణివాడిది.

"అయితే పిన్నీ! ఒకటిమాత్రం చాల కష్టంగా వుంది. అభము శుభము ఎరగని చిన్నపిల్ల, నాతరవాత యేలా బ్రతుకుందబ్బా!"

"ఎదో ఒకవిధాన బ్రతుకకపోతుందా నాయనా! దిరే; మావారు పోయినప్పుడు నే నంతకంటే చిన్నదాన్నే."

"దాని కిప్పుడిప్పుడే నేనెవరో అనేదిపోయి కొంచము కొంచము మనస్సు తిరుగుతూవుంటే నాకిప్పుడే రావాలి."

"నిన్ను ప్రేమిస్తూవుంటే చాలదురా- అయినా యీగోల వుండనేవుంది. ఇంకనైన నిద్రపోరా, నాయనా!"

అప్పుడే దూరానినుంచి వినబడినది గగనమధ్యములో నక్షత్రాల నంటుతూ ఒక యేలపాట.

రా నేరాడూ, రా నేరాడూ—రాక రాక వచ్చాడే వాడూ.
లేనే లేదూ, లేనే లేదూ—లేక లేక వచ్చిందే కోపం.
పోయినాక తెల్సిందే నాకు – పోయినంత వచ్చిందే దుఃఖం
కళ్లనీళ్లకే కాంతుడొచ్చునా—కలికి బాధలాకటిక కెక్కునా
పోయెనే నారాయడూ – పోయెనే నా ప్రాణము.

కడపటి చరణము కన్నీళ్లు తెచ్చింది జ్యోతికి.

"పిన్నీ, గంటెంత?"

"తొమ్మిది."

"ఇంతే! రెండో, మూడో అనుకొన్నా. సూర్యాస్తమయమే నాకర్ధరాత్రంగాబోలు. అయితే ఎందుకివాళ యింతతీపరం నిద్రపోమ్మని."

"నిన్న నిద్రపోకనే పోతివి. బాబూ, యివ్వాళే నా నిద్రక్కరలేదా."

"పిన్నీ– నిద్రపోతుందా మణి."



"హుఁ హూ! నీకు జావ కాస్తుందిరా."

"ఆ! ఏమిటది? మణి జావ—"

"సరే! నీకు పథ్యము చేసి పెట్టడం యిష్టమనుకొన్నావు?"

"దానికి చేతవును పిన్నీ?"

"ఇదేమి బ్రహ్మవిద్యా! అందులో ఆడదానికి. సమయమొస్తే దానంతటదే వస్తుంది."

"నిన్న తాగిన జావ చేసింది?"

"అదే."

"అంత బాగా చేయగలిగింది! నీవు చేశావనుకొన్నాను."

"బాగానే వుంది. నీకోసమివన్నీ కావలసివుంటే నేను చేసిందాక అది వూరకుంటుందిరా. ఇంతెందుకు? నీబట్టలుతకడం, నీగది శుభ్రముగా అలంకరించడం—నీ విషయమేదైనాసరే దానికి ప్రాణమే. దాన్ని యిక్కడికి రానిస్తే నా యింకెప్పుడిక్కడనే వుండి విధి విరామములేకుండా రేయింబవళ్లు నీకుపచారంచేస్తూ చిక్కిపోదూ! అదిప్పుడున్న స్థితిలో అపాయము కలుగుతుందని నేనడ్డు పెట్టానుకాని."

"మణి కేమైనా జబ్బేమిటి పిన్నీ!"

"జబ్బనికాదు. డాక్టరులా బలహీనపిల్లనిక్కడికి రానియ్యడం మంచిది కావన్నారు."

"అయితే పిన్నీ, దానికిలా రావాలనుంటే నీవేలా అడ్డుకోగలిగావు?"

"నామాట జవదాటుతుందిరా అది? పైగా నీసంగతి ఎప్పటికప్పుడే చెప్తుంటాగా."

నక్షత్రాలు కన్నీళ్ళ వలె ఆకాశాన ఆడుతున్నవి. జ్యోతీంద్రు డిహలోకము నుంచి తన్నంత చిన్నతనములో యీడ్చుకుపోతున్న మృత్యుదేవతకు ప్రశాంతముగా స్వాగతమివ్వడానికి, తనకు కలిగిన యిహలోక సుఖాలకి కృతజ్ఞుడుగా నుండడానికి సిద్ధపడ్డాడు.

"ఒక్కమారిలా పిలు పిన్నీ! మేలుకో వుంటే."

"సరే!"

"అయిదు నిమిషాలుమాత్రం. పిన్నీ దానితో ఒక్కవిషయము ముఖ్యంగా చెప్పాలె."

ఎవరికీ వినబడని నిశ్వాసముతో పిన్ని మణిని పిలవడానికి వెళ్లింది.

జ్యోతీంద్రుడి గుండెలు తటతట కొట్టుకోవడం ప్రారంభించినవి. ఇంతవరకూ వారిద్దరొకరొకరితో మనసువిప్పి నోరారా మాటాడుకొన్నారుగారు. ఇద్దరు మేళగింపపడని తీగలు. మణి చెలికత్తెలతో మాట్లాడుతూ కలకల నవ్వుతూవుంటే జ్యోతీంద్రుడి హృదయంలో అగ్నిజ్వాల ప్రజ్వరిల్లుతూవుండేది. కాని తన్నెనిందించుకొనేవాడు. వారివలె పిచ్చపాటిమాటలు మాట్లాడడం తనకు చాతయితేగా. తనస్నేహితులతో లోకాభిరామాయణము మాట్లాడతాడే. బహుశా ఏమాటలు చెలికాండ్రను రంజిస్తాయో వాటికి చెలికత్తెలను రంజించేశక్తి లేదుగాబోలు. మరి పిచ్చపట్టినవేదాంతిలాగ తనకుతానే వుపన్యసించుకోవడం యిష్టములేకపోతే అధమపక్షము యింకొకరైనా వుండాలిగదా! బూరగనే వాయించాలనంటే ఒకబూరగేచాలు. తాళమువేయడానికి జత వుండాలె. స్త్రీలోకములో జ్యోతీంద్రుడిప్రేమసంగీతము వినడానికి ఎవరున్నారు? మణికిష్టము లేకపోయినతర్వాత విషాదసంగీతము వినడానికిమాత్రము పిన్ని సిద్ధంగానే వుంది. విని కాస్తకన్నీళ్లు విడుస్తుంది. కానియెల్లకాలము ఏడుపుతో గడపడానికి సాధ్యమా?

చాలాసాయంత్రాలు జ్యోతీంద్రుడు మణితో మాటాడబోయి రసాభాసము చేసుకొన్నాడు. ఏదో మాటలాడవలెనని మొదలిడితే ఒకమాటపైన సాగేది కాదు. ఇద్దరికి సంకోచము. నోరుతెరవలేరు. ఎవరైనా వచ్చి లేవగొట్టారా అని మొక్కుకుంటూ యిద్దరలాగే కూర్చునేవారు.

ఇప్పుడు మణివస్తుంది. ఏంచెప్పాలె. ఎలాచెప్పాలె. ఈదినంకూడా—మృత్యువుఒకటి రెండుదినములలో సమీపిస్తునపుడు— ఆగుతూ— ఆగుతూ—మాటలా. హృదయంవిప్పి మనసార నోరార—మాటాడాలి. ఎలా అలా మాటాడేది? ఏంమాటలు?

3

"ఏమే అమ్మాయి, ఎక్కడికో ప్రయాణం లాగుందే?"

"అవును. సీతారామపురము వెళ్తాను."

"ఏమిటే!...ఎవరు తీసికెళ్తారు."

"అనంతుడు."

"ఈ దినమొద్దమ్మా! యింకోదినము వెళ్లుదువుగానిలే."

"ఎలానత్తా రైలులో చోటుకూడా రిజర్వుచేసికొన్నాం."

"పోనీలే! ఆనష్టానికంత వగవనక్కరలేదు. రేపు తెల్లవారిబండికి పోదువుగాని; నిన్ను లేపిపంపే భారం నాది."

"ఇదిగో అత్తా నీ మంచిదినములు చెడ్డదినములు నాపంచాంగములో లేవు. ఇప్పుడుపోతే వచ్చే అపదేమిటి?"

"జ్యోతికి నీతో మాట్లాడాలనుంది; పిలవమన్నాడు."

"సరే, యింకొంచెము టైముందిలే. మాట్లాడే వెళ్తాను."

"నీవు వూరికెళ్తున్నానని చెప్పకూడదుసుమా."

"సరే! చెప్పనుగాని చాలాసేపు మాట్లాడడానికి టైంలేదు. రేపు మా చిట్టి అన్నప్రాశన; ఈవాళనే వెళ్లక తప్పదు."

"ఈ ఒక్కసారైనా నామాట విందూ అమ్మా! నీ తొందర అతనికంట కనుపడనీయక కాస్సేపు శాంతంగా వాడిదగ్గర కూర్చోవే."

"ఏంచేయనత్తా! రైలు నీకోసం నాకోసం ఆగుతుందా. పదినిమిషాలలో అనంతుడు తిరిగివస్తాడు. ఆపాటికి సామానులు చేరాలే."

ఈ ఉద్రేకంలో వాడిదగ్గరకెళ్లి సర్వము చెడుపుతాం, పాడుదానా! వాడిని బతికినన్నిదినాలు నిలువు రంపాన కోస్తున్నావు. వాడీ లోకాన్ని విడిచేదినాలు

చాలా దూరం లేవు. నేను చెప్తున్నాను చూడు. ఈదినాన్నితలచుకోని తలచుకోని నీవామరణాంతము ఏడవకపోతే నన్ను నాపేరుతో పిలవబోకు. దేవుడున్నాడు. నీవు చేస్తున్నంత నిన్ను కట్టికుడుపక పోడు."



"ఇదిగో అత్తా! నాకు శాపనార్థ లట్టే రుచించవు సుమా."

"నాతండ్రి! జ్యోతీ! బాబూ! ఎందుకురా నాయనా నీవింకా జీవించడం! నీఘోరాన్ని చూడలేక కళ్లు పోతున్నవి. దీనికంతము కనుబడకుంది."

ఒక్క రవంత బయట నేనిలిచి మనసు కుదురచేసుకొని యిప్పటికైనా జ్యోతి నిద్రపోయి ఉండదా అనుకొంటూ జ్యోతిగదిలోనికి వెళ్లింది. జ్యోతి ప్రక్కమీద దొర్లుతున్నాడు. ఇంకేమిచేయ వలవిగాక "పిన్ని చూశావురా, మణి యేంచేసిందో!" అన్నది.

"మణి యేదిపిన్నీ? ఏంజరిగిందేమి! నీవు వెళ్లి చాలసేపయిందే?"

"జావచేస్తుంటే పాలు అడుగంటిపోయినవిరా. తాను నీవిషయంలో అంత అశ్రద్ధగావున్నందుకు అమిత వ్యసనపడుతూవుంది నేను ఎంత ఓదార్చినా దానికి దుఃఖము ఆగిందికాదు. నీమాట చెప్పేసరికి 'యిలా అన్ని ధ్వంసంచేస్తూ ఆయనమొగము ఎలా చూడ' నని ఏడ్చింది. విశ్వప్రయత్నంమీద దాన్ని ఓదార్చి నిద్ర పొమ్మని చెప్పివచ్చాను. పాపము; ఈదుఃఖము నిద్రలో అణగిపోనీ, లేకపోతే యెలా.

మణిరానందుకు కష్టంగావున్నా ఒక విధంగా జ్యోతికి సుఖంగానేవుంది. మణి వస్తుం దనుకోండి. తాను మనస్సులో కల్పించుకొన్న మూర్తికి ప్రత్యక్షానికి భేదంవుంటే? కాబట్టి ఒకవిధంగా రాకపోవడమే మంచిదనుకున్నాడు. అందులో తనకోసకు శ్రమపడతూవుంటే పాలడుగంటిపోయిన వని మణి దుఃఖిస్తూవుంద అని పిన్ని చెప్పేసరికి అతని హృదయం కరగింది.

"పిన్నీ!"

"ఏం బాబూ."

"నా అంత్యకాలం దగ్గరకు వస్తూందని నాకు తెలుసు. అయినా ఏవిచారంతోను నేను పోవడంలేదు. కనుక నాకోసము నీవు దుఃఖ పడకు."

"దుఃఖపడనురా నాయనా! నాకు తలీదూ ఎన్నోవిధాల బ్రతుకుకన్నా చావే మేలని?"

"అలాకాదు పిన్నీ. నాకిప్పుడు చావంటే కేవల మానందంగానే కనిపిస్తూంది."

జ్యోతి వినీలాకాశమువంక చూస్తూ చావుకూడ తన దగ్గరకు తన హృదయాధిదేవతను నిజమైన మణిని తెస్తూంది అనుకొన్నాడు. మణికి అమృతయావనం— ప్రకృతిమాతే ఆమెను అలంకరించి నక్షత్రాలిచ్చిన పూలతో జడవేస్తూంది. ఇంక ఎన్నో ఇట్టిసంకల్పాలు. శుభదర్శనకాలం మీదికి జ్యోతిమనస్సు పోయింది. ఆ మనస్సులో దాగివున్నప్రతిమ ఇప్పుడు జ్యోతిహృదయాకాశాన్ని నిండి తన్మూలముగాను లోకమంతా జ్యోతికి మణీ; రాత్రంతా మణీ; సర్వం మణిమయము. అత్యుత్సాహముతో అనుకొంటున్నాడు. ఎన్నిమారులో నాకీమణి మర్మాంతిక యాతన కలిగించింది. ఇకమీద ఎంత అమృతమయమైన ఆనందము! ఇంకమీద ఎట్టి యాటంకాలు లేవు. ఒకరిహృదయం ఒకరికిప్రత్యక్షమే. ఈఫలంచే, యీస్మృతియే నాకు మరణానంతరం సుఖా

ధారము. ఇకమీదనైనా నాహృదయంపరిపూర్ణ ప్రేమా నందప్లావితం కాగాక!..........

౮

"చాలా బాధగావుంది పిన్నీ! నీ వనుకోనుగూడ లేవు. ప్రాణం లేచిపోయేటట్టుంది. లంగరు తెగిన పడవ లాగ యీసముద్రములోనికి కొట్టుకొని పోతూన్నాను. .........మణియేది? ఈరెండుదినాలు కనబడలేదు. అబ్బా యీజీవితంతోటి నాబాధలు కూడా పోతవి. పిన్నీ మణియేది? యీరెండుదినాలు కనబడలేదు?"

"జ్యోతీ, యీదిండుప్రక్కన వేసుకో, బాధతగ్గు తుందేమో చూడు."

"పిన్నీ నాకొక్కొక్కసారి వెర్రితలంపులొస్తున్నా యి. తెగిపోయిన గాలిపటములాగ నన్ను బాధలకొది లేసి మణి నన్ను వదలిపెట్టిపోయిందేమో అనుకొంటూ."

"ఎంతసేపటినుంచి మాట్లాడుతున్నావు! దాహం కాలేదా బాబూ! యిందు, యీ దానిమ్మపండ్ల రసం తాగు."

"నిన్న నాఉయిలునామా రాశాను. నీకుచూపా నా? నాకు జ్ఞప్తిలేదు."

"జ్యోతీ, నాకెందుకురా ఉయిలునామా చూప డం."

"అమ్మ పోయినతరువాత నాకేముండింది?అంతా నీవే చేశావు. పెంచావు; పెద్దవాణ్ణిచేశావు. పెండ్లిపేరం టాలన్నీ నీచేతిమీదుగనే జరిగినవి. కనక—"

"ఓరి వెర్రిపిల్లడా! నాకుమాత్ర మేముండింది. ఈకొంప, ఏదోకాస్త భూమి; ఇంతేనా! కొదమంతా నీవు సంపాదించిందేగా."

"ఈయిల్లు చిన్నదా?"

"సగానికిపైగా యిదిమాత్రం నీవు కట్టించే గదట్రా!"

"మణికి నీయెడల చాల భయభక్తులు కలవనేనా నమ్మకం; నిజమేనా?"

"నీ నావ తెలియదట్రా నిద్రపోరా, నాయనా! నాకోసమయినా నిద్రపోదూ."

"నాఆస్తిపేరుకు మణికిరాసిచ్చినా అంతా నీదే. అది ఎప్పుడు నీచెప్పు చేతల్లోనే వుంటుంది."

"ఎందుకు నీ కీవిషయంలో యింతారాటం"?

"నేబ్రతికింపంతా నీవల్లనే. కనక ఎట్లుచూచిన మాత్రాన—"

"ఏమిటి నీపిచ్చ? వేరువిధంగా ఎందుకుతలుస్తాను?" నీసొత్తు నీ పెళ్లాని కిచ్చుకోక ఎవరి కిస్తావు? అది నా క్కూడట్రా కొండంత నీవే లేనప్పుడు?"

"నీకుకూడా ఒకభాగము."

"నా కింక కోపమువస్తుంది. డబ్బిస్తే దుఃఖము పోతుందా?"

"డబ్బువల్ల నీకు ప్రయోజనం లేదు, పిన్నీ! యిం కేమి ఉత్తమమయినది నీ కియ్యలేకపోయినానే అని ఆలోచిస్తున్నాను."

"ఆబదు లుండనేవుంది. శూన్యమయిన యీకొం పలో వరహాల తండ్రిలాగున నడుగుపెట్టావు. నాదుఃఖా న్ని నాశనంచేసావు. నా కడుపునపుట్టకపోయినా నా స్వంతబిడ్డకన్న ఎక్కువగా ప్రేమించావు ఇంకేమి కావాలె? ఇంతకాలానికి భగవంతుడు యీ సౌఖ్యము కూడా లేకుండాచేయాలనని సంకల్పించాడు. మనుష్యు లేం జేయగలరు? ఏగోవిధంగా కాలం వెళ్లిపోదు. నీ ఆస్తి మణికే యియ్యి నాయనా! నాకూ పెత్తనం వచ్చింది. ఈ బరువులన్నీ మోయడం నాతరంగాదు."

"నీకు ఈ ఐహికాలమీద మనస్సులేదు. పెద్ద దానివి; కృష్ణా రామా అనుకొంటూ కాలక్షేపం చేయ గలవు. కానీ, మణి, యెట్లా? పిన్నీ, పసితనము పాపము ఏమీ తెలియదు. సుఖపడుతుందో లేక కష్టాలపాలే అవు తుందో?"

"సుఖమా? డబ్బుఇస్తే యిచ్చేవుగాని ఇకదానికి సుఖముమాట తలపెట్టబోకు."

"ఏమిపిన్నీ? సుఖపడడానికి వీలులేదేమి పిన్నీ?"

"వెర్రినాయనా అది సాధ్యముగాదోయి. మా, అనుభవించగలనాథుడు లేనప్పుడు ఆడదానికి స్వర్గమే నరకము. సుఖమనబోతే గొంతు కిందుకు బోతుంది. నీ

ద్రవ్యంఅంతా నీవు లేకపోయినతరువాత దానికి మన్ను తోసమానమే."

జ్యోతీంద్రుడు ఊరకుండెను! ఈమాట నిజమేనా? నిజమైతే తానువిచారింపవలసిన విషయం అవునా కాదా. మణి తానులేక సుఖపడడానికి వీలులేదటగా! నక్షత్రాలుకూడా మృదువుగానే చెప్పుచున్నవి. నిజమేను; యుగాంతరాలనుంచి చూస్తున్నాము. ఈ సుఖపడే ప్రయత్నాలంతా వ్యర్థము.

"నిజము వ్యర్థమే." జ్యోతి మాటలాడ ప్రారంభించెను.

"పిన్నీ, నిజముగా యియ్యవలసినది నేనెవ్వరికి యివ్వలేకుండా వున్నాను సుమా!"

"నీప్రేమచాలదటరా. నిజంగా నే నీప్రేమ మూల్యం తెలిసికోగలిగే తెలివివుంటె ఆతెలివివుండాలనని దేవుణ్ణిప్రార్థిస్తూన్నాను"

"దాహంగావుంది పిన్నీ దానిమ్మపండ్లరసము యిలా అందియ్యి......నిన్న మణివచ్చి చూచివెళ్లిందీ? నాకు తెలియకపోయెను!"

"నిజమే నీవు నిద్రబోతున్నావు. పాపము బిక్కమొగముతో తలవేపుకూర్చొని విసరుతూ వుండింది. ఎంతసేపటికి నీవు మేల్కొనలేదు. నీబట్టలుదుకుదామని తర్వాతవెళ్లింది."

"విచిత్రంగావుందిసుమా! ఆ నిమిషమేనేను కలగంటున్నాను. మణి గదిలోనికి రావాలనని ప్రయత్నిస్తూ వున్నదట. గదితలుపు ఓరవేసివుండట. తలుపు తెరవ్వాలని ప్రయత్నిస్తుంది. సాధ్యంగాదు ...... పిన్నీ నేను మరణిస్తూన్నసంగతి దానికితెలియనీయకపోతే యేలాగు ఆదెబ్బకు తట్టుకుంటుందీ?"

"బాబా, యీవున్నిరుమాలు కాళ్లమీదవేసుకో; చలివేగులుతుంది"

"నాకొద్దుపిన్నీ. అటువంటివి నామీదవేసుకోవాలంటే చాలకష్టంగావుంటుంది."

"ఇది నీకోసమే; ఎవరు చేశారో తెలుసునా, తెలిస్తే యీలాగు మాటాడవు. రాత్రులు మేలుకొని నిన్ననే ముగించింది దీన్ని నీకోసము కష్టపడి మణి."

ప్రేమ పొంగుతూవుండగాజ్యోతీంద్రుడుదాన్ని తీసుకొని ఆమార్దవమంతా మణివల్లనే కలిగిందనుకొన్నాడు. ఆమెప్రేమసూచకము—తనకుగా ఓర్పుతో ఆమె తనచేతులతో అల్లినదాన్ని—నిరాకరించడమా? కాళ్ళపై కప్పుకొన్నాడు. మణి వచ్చి పాదసంవాహనము చేసినట్టుంది.

"ఇంతవరకు మణి కిది తెలుసునని నాకు తెలియదు సుమా. ఎప్పుడు నేర్చుకుందో?"

"ఎంతసేపు నేర్చుకోవాలి చూడు ఎన్నితప్పులున్నవో."

"ఓహో! ప్యారిస్ ఎక్జిబిషన్కు పంపుతున్నామా యేమిటి.తప్పులుంటేకాళ్లకువెట్టనుకలుగజేయదూ?"

మణి యేలాకూర్చున్నది, ఎలాఅల్లుతున్నది, ఎలా తనతప్పులు తానే తెలుసుకొంటూశ్రమపడుతూ రాత్రుల్లా మేలుకొని తనకోసం ముగించింది జ్యోతీంద్రుడు మేలుకొనే కలగంటున్నాడు. అతని హృదయం కరగిపోయింది.

"పిన్నీ డాక్టరున్నారా?"

"ఇవాళంతా యిక్కడే వుంటానన్నాడురా!"

"నిద్రపోయే మందక్కరలేదను. ఎందుకు? నిద్ర రానేరాదుగదా యింకా బాధ కలుగుతుంది. హాయిగా మేలుకోవుంటేనే మంచిది. ఈవాళ్ళ వైశాఖశుద్ధ త్రయోదశి. రేపు చతుర్దశి. రేపేగదూ మా పెళ్లి జరిగిన దినం. మణిమరచిపోయిందేమో. ఇలాగా చంద్రుడు, చల్లని వెన్నెలను కురిపిస్తూన్నాడు. ఇలానే నక్షత్రాలు కనుబడీ కనుబడకుండినవి. జ్ఞప్తిచేస్తాను; దానిని కొంచెము యిలా పిలు పిన్నీ!.........ఏంపిన్నీ ఊరకున్నావా? డాక్టరు యీఆరాటానికి, వుద్రేకానికి యేమో అవుతుందన్నాడేమిటి. ఆయన చెపుతూవుంటాడు లేస్తూ. దానితో కాస్సేపుమాట్లాడితే చాలు ఆయన వెయ్యిమందులకంటె గుణమిస్తుంది. ఏడుస్తావేమి పిన్నీ! పిచ్చమాటలు పుట్టినాయనుకొంటున్నావా? లేదు; పిన్నీ! నాహృదయం నిండిపోయిందిగనుక ఒక్కసారి మణిని జూచి యీఆనందమెంతో చెప్పాల ననుకొన్నాను. అదిగో మళ్లీ యేడుస్తావు."

"ఎందుకుపిన్నీ! నాకు చాలాకష్టంగా వుంది. పిన్నీ! నీవేడవబోకు. ఇన్నిదినా లూరకుండి యివాళ యేం యెక్కువజబ్బుగావుందని యింతదుఃఖపడతావు?"

"జ్యోతీ; చిన్నప్పుడు నాఏడ్పులకు కంట్లోవున్న నీళ్లన్నీ అయిపోయినావనుకొన్నాను. ఇంకా కావలసిన న్నన్ని ఉండనేవున్నవోయి! నేనోర్చుకోలేకపోతున్నానోయి!"

"కొంచెము మణిని పిలు పిన్నీ! రేపే మాపెళ్లి జరిగిన దినమని జ్ఞప్తి నిస్తాను. మళ్లి వచ్చేసంవత్సరంలో ఈగనాలని, మాపెనుగడా నిక రేపెదో."

"జ్యోతి! నేనస్తాను. శంభుడున్నాడు ఏమన్నా కావలసుంటే పిలు."

పిన్ని మణికదగ్గరకివెళ్లి కూర్చుండిపోయిన్నది ధారలుధారలుగా కన్నీళ్లు కారుతున్నవి. మణిని మనస్సులోనే శపిస్తున్నది. "ఓపాపాదానా! కటికదానా! ఇంకేనా రాగూడదటే అంతా నీకిచ్చేసినవాణ్ణి యిలా చంపేస్తున్నావు. చచ్చేదాక నీవు వచ్చేటట్టు లేదు!"

మెల్లమీద పడ్డాడుని జ్యోతి లేచి కూర్చొని "ఎవరక్కడ? మణీ!"

"నేను బాబూ, శంభుణ్ణి; పిలస్తారా బాబూ!

"ఇంటావిడ నిలా రమ్మనరా!"

"ఎవరిని బాబూ?"

"మీ యమ్మగారి నిలా రమ్మనరా."

"ఇంకా తిరిగి రాలేదు బాబయ్యా!"

"తిరిగి రాలేదూ! ఎక్కడికి వెళ్లిందిరా"

"సీతారామపురము బాబూ."

........................

"ఎప్పుడురా?"

"మూడుదినాలైంది నేటికి."

రెండు చేతులతో తలని గట్టిగ పట్టుకొన్నాడు జ్యోతీంద్రుడు. తల గిర గిర తిరుగుతున్నది. శరీరము గడగడవణికింది! ఆనుమదిండ్ల నానలతో శేసి పడుకోనియుంటా!



"మూడుదినాలైంది నేటికి."

కళ్లుమూసుకున్నాడు. కాళ్లమీదివున్నరుమాలుని అవతలకితన్నేశాడు. ... ... ...

చాలాసే పయింతర్వాత పిన్ని లోపలికివచ్చింది. జ్యోతీంద్రుడలానేవుండి మణికేరేయత్తకఆమెనుమాపులులేని కళ్లతో చూశాడు. మరచిపోయినాడనుకుంది మణి. తటాలున జ్యోతి 'పిన్నీ కలసంగతి చెప్పానా' అన్నాడు.

"ఏంకలరా"

"మణి ఆవలేపునుంచి తోస్తుంటే యెంతతోస్తున్నా గదితలుపు తెరవలేకపోయిందన్నకల. ఇప్పుడు నిజము తెలిసింది. ఎంతప్రయత్నించినా నాగదికివెలపలనే మణికిస్థానం. విచారించి ఏంలాభం?"

ఇన్నిదినాలూ అబద్ధాలు కల్పించిజ్యోతికోసము ఏ స్వర్గాన్నిపిన్ని నిర్మించిందో ఒక్కసారిగా ఆస్వర్గం మాయమైపోయింది. కష్టము వచ్చినప్పుడు కిక్కురుమనక ఊరుకోటము మంచిది. భగవంతుడే చంపెయ్యాలనుకొంటే తప్పించుకోడానికి ప్రయత్నిస్తే లాభముం

"పిన్నీ, నీ ప్రేమకు మితిలేదు. నా సకలజన్మాలకు నీ ప్రేమజ్ఞప్తియందుండనే వుంటుంది ఈ ప్రేమకు బదులు నిన్నే విధమున సుఖపెట్టలేక పోయినాను. ఈ బదులు వచ్చే జన్మములో, నీవు నాకు కూతురై పుట్టాలి; అప్పుడు తీర్చుకొంటాను.

"జ్యోతీ! కలవరిస్తున్నా, నాయనా—ఇదివరకు ఆడకూతురునై పుట్టి అనుభవించిందిచాలదూ- వచ్చే జన్మంలో కూడా ఆడదాన్నే అయిపుట్టాలి. కొడుకునై పుట్టాలనని ఎందుకనుకోగూడదు?"

"వద్దేవద్దు. నీ చిన్నతనంలో ఎలావుండినావో అలానే నేను నిన్ను చూడాలి. నీకప్పుడెలా శృంగారము చెయ్యాలనని యిప్పటినుంచి ఆలోచిస్తుంటాను"

"ఎంత సేపుమాట్లాడుతావురా! బాబూ! నిద్రపో."

"నీకు లక్ష్మి అనే పేరుపెట్టాను"

"ఎప్పుడూ యిదే పాతకాలపు పేరా?"

"నీవు మా పాతకాలపు పిన్నివేగా. ఆ బంగారు ముద్దు పాతకాలప్పేరులే-వాటితోనే—నీవు నాయింట పుట్టాలి. ఈ కాలం మణులు" రత్నాలు, వరహాలు నాకక్కరలేదు. పూర్వకాలపు పేరులు పూర్వకాలపు మర్యాదలు; నాకు అంతా పూర్వకాలమే కావాలి.

"నీవేమనుకొన్నా నేను నీకు కూతురుగా పుట్టి మళ్లీ ఆ కష్టాలన్నీ నీవనుభవించాలరా జ్యోతీ."

"పిన్నీ! నేను కష్టాలకోర్చుకోలేని సుతిమెత్తనివాడినని అనుకొంటున్నావేమిటి. నీవంటి కూతురు పుట్టే కష్టాలా?

"బాబు, నే నాడదాన్నిరా! ఆ కష్టాలు నాకు తెలుసు. కాబట్టే నా జన్మమంతా నీకు కష్టాలులేకుండా చెయ్యాలని ప్రయత్నించాను. దేవుడనుగ్రహించలేదు."

"పిన్నీ, యీ జన్మలో నే నేర్చుకొన్న గుణపాఠాలాచరణలోనికి తెచ్చుకోవడానికి తావులేక పోయింది. వచ్చే జన్మలో ఆచరించాలసిందేను. అప్పుడు నిజముగా పురుషుడెలానడుచుకోవలసింది లోకానికి చూపుతాను. 'చిన్న నాబొజ్జకు శ్రీరామరక్ష' అనుకోవడం ఎంత వ్యర్థమో కనుక్కొన్నాను."

"అలా నీవనడమే కాని ఏమనుభవించావురా, నీవై కోరి అంతా యితరులకిచ్చావు. వాళ్లు సుఖపడ్డారు."

"పిన్నీ ఒకదానికి నాకు గర్వంసుమా. నా సుఖముకోసము యితరులను కష్టపెట్టలేదు. ఎవరు 'వీడికి చెయ్యకపోతే యేంజేస్తాండోరా' అనుకోలేదు. అబద్ధము మోసము నటన వీటితో కాలంపుచ్చలేకపోబట్టి యెప్పటికన్నా మంచికాలంరాదా అని కాచుకోవుండినాను. మంచికాలంమాట దేవుడెరుగను గాని నిజం తెలిసింది. అదే ఒక సంతోషం. ఎవరక్కడ పిన్నీ, అక్కడెవరు."

"ఎక్కడరా ఎవరు లేరే."

"పక్కగదిలోనికి వెళ్లి చూడు. ఏదో చప్పుడు."

"నాకెవరు కనుబడటంలేదు నాయనా"

"ఆ! నాకు చప్పుడు వినబడితేనే!"

"ఏమిలేదు; జ్యోతి! ఊరుకో డాక్టరుగారొస్తున్నారు."

డాక్టరుగారొచ్చి "అమ్మా! మీరు కొంచెము మీ గదిలోనికి వెళ్లండి మీరిక్కడుంటే అసలే ఆరాటం మనిషి; యింకా ఆరాటం ఎక్కువవుతుంది. మీరు వెళ్లి పడుకోండి. మావాడు దగ్గరుంటాడు లెండి.

"వద్దు వద్దు పిన్నీ, నీవు వెళ్లబోకు."

"సరేరా! మాటాడక యీ మూల కూర్చుంటాను."

"అలా కాదు. యిలారా! యిక్కడ కూర్చో నీ చెయ్యిలా అందీయి. నీ చేతిలోనే నేను పెరిగాను. నీ చేతిలోనుంచే నే వెళ్ళిపోవాలి."



'సరే' అన్నాడు. డాక్టరు బాబు. "అయినా

జ్యోతీంద్రుడు గారూ, మీరిలా మాటాడకూడదు సు మండి. శైమైంది! మందు పుచ్చుకోండి ”

“మందూ! పోనియ్యి, నాకు తెలియదనుకొన్నా వేమిటి? ఆకాలం దాటిపోయింది. ఇంకాయెందుకీనటన? చావంటేభయపడుతాననుకొన్నావా? పిన్నీ!చావే అన్నిటికి దివ్యమైనమందు. ఇంకా యిదంతా యెందుకు? డాక్టరుగారిని వెళ్లమనండి. నీవొక్కతవు యిలాకూర్చుంటే చాలు. ఇంకెవ్వరు ఉండనక్కరలేదు. అందరిని పంపేయి. నాబ్రతుకంతా నటనగానే గడచింది. ఇంకా నానటన బూటకం.”

“ఇదిగో తెలిసినవాడిని చెప్పుతున్నాను. ఈ వుద్రేకం చాల హానిచేస్తుంది.”

“కనుకనే; నన్నుడికింపక డాక్టరుగారూ! మీరు వెళ్లిపొండి. పిన్నీ! వెళ్లాడా ఆయన. బలే! ఇట్రా. నీ వొడిలో నాతల నుంచుకోనియ్యి.

“సరే బాబూ, కొంచెము నిద్రపోవోయి.”

“ఇంకా నిద్రేమిటి పిన్నీ! ఈసారి దీర్ఘనిద్రే. శక్తివున్నంతసేపు మేలుకొనివుంటాను. ఏమిటా చప్పుడు ఎవరో వస్తున్నారు కాబోలు.”

౫

“తండ్రీ, జ్యోతిబాబూ! కొంచెము కళ్లు తెరు నాయనా! అమ్మాయి వచ్చింది. ఒక్కసారి కళ్లు తెరచి చూడు నాయనా!”

“ఎవరువచ్చింది- కలా?”



“కలగాదుబాబూ నిజంగానే మణి వచ్చింది చూడు. ఇదుగో మీ మామగారు.”

౬

“ఎవరునీవు”

“కనబడటంలేదట్రా? మణిగదట్రా!”

“మణీ? పిన్నీ, గదితలుపు తెరచుకొందా?”

“అవును బాబూ, బారుగా తెరచుంది.”

“పిన్నీ, వద్దు; ఆ రుమాలుతీసెయ్యి! ఆ రుమాలు వద్దు. అది నటన, అబద్ధము, మోసము.”

“రుమాలుగాదురా జ్యోతీ! మనమణిరా. నీకాళ్ల మీదబడుతుందిరా. తలమీదచెయ్యిపెట్టి ఆశీర్వదించు. మణీ! అలా పెద్దగా ఏడవబోకు; కావలసినంత విరామముంది తర్వాత. ఇప్పుడుమాత్రము కొంచెము వూరకుండు. వాడిని కల్లోలాలు లేకుండా కడతేరనియ్యి.”





# సనత్సుజాతీయము

[కీ. శే. ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రులుగారు రచించిన
"ఆంధ్ర వ్యాస భారత నవనీతము" నుండి]

విదురా! పల్కెదు వింత యర్థములు; నేనీడన్వినం గోర్కె; యు
న్నదె నీచేత ననుక్త మింతయిన నన్నధ్యాత్మసంచింత న
భ్యుదితుండైన సనత్సుజాతుఁడనె మృత్యుర్నాస్తి యంచు; న్భవ
ద్హృదయస్థమ్ములనెల్ల సంశయములం దీర్చు న్ధరాధీశ్వరా.

గీ. ఆ సనాతనుఁ డెఱిగించు నర్థ మిం పెఱుంగవే చెప్ప మీవ యభంగబుద్ధి,
యున్న శేషము తెలివి; నీకన్న విదురుఁ, డనియెనే శూద్రకులమున నాత్మజన్మ!

తరు. కతమదినేఁ జెప్పఁ గడఁగమికొందు, ఘనుఁడు శాశ్వతబుద్ధి కమలజసూనుఁ
డతిరహస్యమ్ములు నర్థము ల్దెలుపు, నమరులు నిందింప రటులైన నన్ను
క్షితిపతి యనె నేను జెందుదునెట్లు, సిద్ధదర్శనమును జెపుమనఁ దలఁచె
మతిమంతుఁ డాముని మానితవ్రతుని, మహితుచింత యెఱింగి వాని యేతెంచె.

ఉత్సాహ. పూజనొంది కూరుచున్న మునివృషభునిఁబల్కెఁ; నీ
రాజు ప్రశ్నమడుగుఁ; జెప్పరాదు నాకుఁ దెలుపు మే,
యోజనన్ని దుఃఖములఁ గురూద్వహుండు వీఁడు; నా
రాజు విదురునుడుల నాదరమునుజూపి యిట్లనెన్.

తే. శ్రుతుల వినఁబడు నింద్రవిరోచనులు ప్రజాపతిగృహంబున బ్రహ్మచర్యమొనరి
చిరి, యమృత్యభిలాషముచేత; నని, భ, వదుపదిష్టము మృత్యభావమ్ము వింటి.

క. ఈ రెండుపక్షములలో, ధీరా! యెది సత్యమనిన దివ్యుఁడు పలికెన్,
భూరమణ! యంద్రు శ్రోతా, చారమ్మ;బుధు లమృతత్వసాధన మితరుల్.

క. తలపక మోక్షమభోగము, కలుగును జన్మముల దేవకాయ మనిరి; యు
జ్జ్వలమానసు లాత్మాన్యము, వెలయమి లేదనిరి మిత్తి; విను నిశ్చయముల్.

ఆ. మొదటినుండి పక్షములు, రెండు నున్నవి, యంద్రు గొందఱు మెయి నాత్మబుద్ధి
మిత్తి; యాత్మఁ గనమి, మిత్తియమృత్యువు, దలఁతు స్వస్వరూప తత్పరతను.

క. చెందె విరోచనుఁ డభిభవ, మందుటఁ; గాయాత్మబుద్ధి; నమరులు సత్యా,
నందాత్మజ్ఞానంబునఁ, బొందిరి బ్రహ్మతను మిత్తి పులివలెఁ దినుచున్.

తే. దేహధారులనుండిన దృశ్యమవును, రూపుగనఁబడమిన్లేదపాపభయదుఁ,
డాచరిత పుణ్యసుఖదాయి యముఁడు పితృభు,వనము రక్షించునోరుఁ;డవిద్వాంసులంద్రు.

తే. స్వస్వరూపముఁ దెలియమి జన్నిగట్ట, బ్రహ్మచారిని వీరు నాబంధు లరులు,
ప్రోతుఁ గొట్టుదునని పెక్కుబుద్ధు లోదవఁ, దప్పదారులఁ బడు స్వస్థతను గనండు.

మ. అజ్ఞానాంధుఁడు పుణ్యపాపముల కర్హమ్మందుచు న్మేను బ్ర
హ్మజ్ఞానం బుదయించు నంతకును గామాదు ల్గలంప న్వ్యథా,
ప్రజ్ఞుండై పరలోకమందుచుఁ బునఃప్రాప్తోద్భవుం డౌట సా
వజ్ఞం జెందెఁ బ్రమాదసంజ్ఞఁ గ్రతుల న్స్వర్గంబున న్భోగముల్.

మ. కనుచుం దద్రుచిఁ జెంది శేషము నయోగ్యమ్మైన మేనొంది లే
ఖనికాయమ్ముల వెండియుం దనుపు మోక్షంబొందఁ; డాత్మైక్య భా
వనలేమి; న్వనితాధనాదులఁ గనన్ వస్తుత్వబుద్ధిం బ్రవృ
త్తిని జెందు న్సతతంబుఁ; గానఁడు నివృత్తి న్నిత్యముం గానమిన్.

మ. విషయధ్యానము స్వస్వరూప మతి దప్పించు; న్వడి న్లాగు నా
మిషగంధంబు ఝషంబుఁబోలెఁ బురుషు న్మించొంది కామంబు; త
ద్ద్వేషులం దాగ్రహమేచుఁ; బిమ్మట నివందించు, న్విమూఢాత్మపూ
రుషుల న్మృత్యువు, వశ్యచిత్తులగు ధీరుల్దాఁటుద ర్మృత్యువున్.

మ. అపవిత్రంబు విషాదమిశ్రము ననిత్యంబు న్శరీరం బదృ
శ్యపదార్థంబటవజ్ఞ వీడి మఱి తద్ధ్యానంబు గావింపఁడా
సుపవిత్రుండవు మృత్యుమృత్యువు; నశించున్ స్త్రీధనాహారలో
లుపుఁ డంతం బవిసెందినన్ క్షణికము; ల్పొందు న్విరక్తుండు మేల్.

మ. రమణీరత్నము దేహ మియ్య దపవిత్రంబు న్ద్రణాద్యప్రకా
శము కూపంబు జుగుప్సితం బిదన కాశం గూడుచు న్గ్రుడ్డులై
యమతిన్ రౌరవమందుఁ గూలుదురు; బ్రహ్మాత్మైక్యబోధమ్మున
న్శమముం గూర్చెడు వేదమూర్ధములపొంతం బోవరయ్యో జడుల్.

గీ. సాంగవేదవేత్తయైన నతజ్ఞుఁడు, పోలు గడ్డిపులిని; మూఢుఁడు దన
కరి స్వబాంధవుఁడు జితాత్మ; కామాది ప్రమాదమెఱిఁగి మిత్తి, మనుజుఁడు విడి.

చ. ఉపనిషదర్థ బోధముననుండినఁ జిత్సుఖరూపత న్భ్రమా
దపరిపరిగ్రహించు; విహితమ్ములు పుణ్యగతిప్రదమ్ములు
న్నిపుణులు సేయు జన్నములు నేర్తురు జ్ఞానులు మాననెట్లన
న్నృపుఁడనె హాని; దేవ! భువనేచ్ఛ విమూఢుఁ డొనర్చు సత్క్రియల్.

క. కను చస్థిరత్వదోష,మ్మును విబుధుఁడు కర్మజసుఖమున నిస్పృహుఁడై
యొనరింపక నవము లుపా,సనములు నాత్మైకనిష్ఠ సదభిన్నుఁ డగున్.

సీ. ఆ పరమాత్మయె యంబరాదిధరాంత, విశ్వకర్తయనుప్రవిష్టుఁడు తను
జీవాది రూపముఁ జెంది సంసారియౌ, నే నజుఁ జిత్సుఖి వీని నెవఁడు
ప్రేరించు నొరుఁడో; తానేల నానాజాతు, లందుఁ; గలుగు నొక్కొ యసుఖ మఖిల
మెఱిఁగింపు చక్క నా నిట్లనె వైధాత్రుఁ, డాశయ మిది ప్రష్ట; కానతిచ్చు
వా; డొకండు నియోజ్యుఁడు వలయు భేద, మనుచుఁ గూటస్థునకు భేదమన్నృతమాంగ
మానభిప్రేత మవు నవిద్యన్బహుత్వ, మఖిలకర్తృతయును సాక్షికవును మాయ.

ఆ. గీ. అంబికేయుఁడనియె; నాచరింతురు ధర్మ, మిందుఁ గొంద; ఱఘముఁ గొంద; ఱవ్వనొ
యఘువిహతము ధర్మ; మఘము ధర్మ ప్రతి, హతమె యవునొ; తెలుపు మాబ్జగర్భ.

ఆ. గీ. మోక్షదాంత్యవృత్తి పొడమినవానికి, మోఘములవుఁ బుణ్యమును దురితము
నధికబలము ధర్మ మఘము నుత్పాదించు, ననఘ సుకృతఫలము లస్థిరములు.

సీ. యాగాదు లొనరించు నవనీసుపర్వుల, కవుపుణ్యలోకము లభిలషింతు
నాలింప ననిన బ్రహ్మాత్మజుండనె దివి, రంభాది భోగాశఁ గ్రతు విధాయు
లనుభవింతురు సౌఖ్య మధికబలు లైచ్చి, యవనిపులవలె సుఖాశపడక
యీశ్వరుం డలరఁ గృతేజ్యాదులై శుద్ధ,చిత్తులు జ్ఞప్తిసంసిద్ధు లవుదు
గీ. రగపడదు జ్ఞాని పుత్త్రమిత్త్రాదుల; కెది, చోరహింస్రమృగాది పీడారహితము;
నన్నపానాదిభూయిష్ఠ మభ్రసమయ, మునఁ దృణమువలె; నెట్టఁ దాపముక్తి యచట.

ఆ. గీ. ఏదొ కట్టితినుచు నేదొ యెందొ పరుండి, వ్యక్తపఱుపక యనుభావము నిజ
మున్నఁ గాంచి యొరులు తన్నుజడుండని, యెగ్గు లాచరింప నెదఁ దలఁచును.

ఆ. హాని యాత్మనిష్ఠు మానస మెరియింపఁ, డెవఁడు బ్రహ్మవృత్తి వృద్ధికృత్తు,
శాజినాంబరాద్యనపహర్త; వానియ,న్నము భుజింపసమ్మతము మునులకు.

ఆ. పుత్త్రదారభవనముల వేదయజ్ఞయు,జ్ఞోపవీతముఖము నుజ్జగించి,
చక్షురాద్యవిషయ సన్నిష్ఠుఁడును గూఢుఁ,డగుచు దర్శనాది సాక్షిఁదలఁచు.

తే. అక్రియాకార్య నద్వంద్వ నంత రాత్మ, శుద్ధ నక్షుత్తృషుని సాక్షి స్థూలుఁ డసుఖి,
మూకుఁ డనుగంత యంధుఁడు మూర్ఖుఁడనని, తలఁచువానికి బ్రాహ్మణత్వంబు పోవు.

తే. చిత్సదానందు నెవ్వఁడు క్షేత్రిఁదలఁచు, నాయనాత్మజ్ఞుఁ డాత్మాపహారి సేయఁ,
డేమహాపాతకమ్మును; దృశ్య మాత్మ, గాదని త్యజించి ద్రష్ట సాక్షాత్కరింపు.

క. అలయుఁడు; కైకొనఁడు; భయా,దులు లే; వెల్లరకు సమ్మతుఁ; డశిష్టుఁడన
న్వాలయింపఁ డశిష్టత్వము, నిల నిర్జరుఁ డిట్టివాఁడ యెఱుఁగుఁ బరమునిన్.

గీ. దారపుత్త్రధనాద్యనాదరుల బ్రహ్మ,చర్యసత్యానృశంసతా చౌర్యవిరహ,
తత్పరుల ధిక్కరింపఁ గదలుపరాని, మునులఁ దలఁపఁగఁ దగు బ్రహ్మతనువులనుచు.

చ. అసముఁడు బ్రహ్మవేత్త కఖిలామరయాజియు వింతగా దిదిం
డెనఁగ ముదంబు దేవతల కిచ్చును హవ్యము యాగకారి; యా
ద్యసదనులున్ సమానుల నయోగ్యతఁ గానమిఁ బూజఁగాంచి త
జ్జ్ఞసమితిచే ముదంపడక సాధులనిందకుఁ గుంద కింపయేన్.

గీ. తన్ను బుధులాదరించుట దన్నుబుధులు, నిందసేయుట యున్మేషనిమిష రీతిఁ
దత్స్వభావములని జ్ఞాని తలఁపవలయు, నగును మానికి నన్నాంగనాది సుఖము.

క. జ్ఞానికిఁ జిత్సుఖమునకు న, నూనమునకు హానిహేతు వొప్పరికింప,
న్మౌనికిఁదగు ఋతవచనము, ప్రాణిహిత మ్మకుటిలత్వ మనుచితకృతికిన్.

గీ. నాన మదినిగ్రహించుట స్నానము పర,మాత్మబోధమివాఱుమోహం బడంచు,
బ్రహ్మసౌధముఁ జొప్పించుద్వారములనఁ, బార్థివుండనె బ్రహ్మ మభాషణమ్ము.

గీ. మౌనమెవనికిఁ దల్లబ్ధి మౌనిపలికె, నవును బ్రహ్మము వాఙ్మనసా ప్రవేశ్య
మాగమప్రభవము జ్యోతిరాత్మకంబు, విద్వదనుభవగమ్యము విశ్వసింపు.





# కళ్యాణి

రాయసం వెంకట శివుడుగారు, యమ్. ఏ., యల్. టి.

౧

ఏకాదశి నాఁడు ప్రయాణమువలదని మా తల్లి గట్టిగాఁ జెప్పెను. మఱునాఁడు వేకువనే ద్వాదశీపారణ చేసికొనిపోవుట యుక్తమని యామె బోధించెను. ఐన నే నానాఁడే బయలుదేర వలసివచ్చెను. ద్వాదశి పారణ సమయమునకే పట్టణము చేరెదనని నేఁదలంచితిని. కాని, మఱునాఁడు ప్రాతఃకాలమున కింకను ఎంతయోదూరము పోవలసియుండెను. పడవ పెండ్లినడకలు సాగించుచుండెను. వేగముగఁ బోవునని నే నాశించిన కొలఁదిని అది వెనుకంజ వేయుచుండెను! తొందరయంతయు నాకేనా, యింకెవరికిని లేదా యని విచారింపఁగా, ప్రయాణికులందఱును వేగముగ నిలు చేరవలయుననియే యాతురతతో నుండుట గాంచితిని. ఇంతలో సూర్యోదయమయ్యెను. ఆదినము సూర్యుఁ డతివేగముగ నాకసమునఁ బరుగెత్తునట్లు కానఁబడెను. ఇపుడు నాలుగు గడియల ప్రొద్దెక్కినది. ఈ రీతినిఁ బడవ నడచిన యెడల, నేఁడును నా కేకాదశియే కాఁగలదని నే భయపడితిని!

మా మాధ్వుల కేకాదశి యత్యంత పవిత్ర దినము. పెద్దలానాఁడు ఉపవసింతురు. యౌవనము దాఁటుచున్నప్పటికే ఫలాహారములు కట్టిపెట్టుట కలవాటు చేసికొందురు. ఈ కలికాలమందైనను, ఏకాదశినాఁడు అన్నము నోట గట్టుకొనువారు మాలో నంతగ నుండరు. అన్నము తిను పిల్లలును సొజ్జె భుజించితిమని చెప్పుట మరియాద. నిరాహారులుగ నుండలేనివారు సయితము ఉపవాసముంటిమని చెప్పక తప్పదు.

నేను వెనుకటి దినము భోజనము చేసినను — క్షమింపుడు — ఫలాహారము చేసియుండినను, సూర్యోదయముతోనే నాకు జఠరాగ్ని తీవ్రతఁ దాల్చియుండెను. ఏకాదశీ వ్రతనిష్ఠ లేకుండియు, ద్వాదశీపారణకు నేను సంసిద్ధముగ నుంటిని. కాని, ప్రస్తుతావస్థలో నాకు మెతుకులెట్లు లభింపఁగలవు? పదిగంటలగునప్పటికే నాకెక్కువ యాఁకలియయ్యెను. లోపలను బైటను మండిపోవుచుండెను. ఇంట భోజనమున కింత యాలస్యమైనచో, ఆగ్రహావేశమున మా తల్లిని మ్రింగివేసియుందును. ఇచట నెవరిమీఁద నా కోపము చూపించ నగును?

పెందలకడనే పట్టణము చేరుదునని తలంచితిని గాన నా యొద్ద తినుటకు కాయ కసరులేవియు లేవు. చేరువ నేయూరును లేకపోవుటచేత, మిఠాయి మొదలగునవి

దొరకకుండెను. ప్రొద్దుననుండియుఁ గడుపులో నేమియు పడకపోవుటచేత, చెవులు గడియలు పడసాగెను ; కన్నులు మసకలు గ్రమ్ముచుండెను. ఇంక నీయాకలికిఁ దాళఁజాలనని దగ్గఱనుండు వారితోఁ జెప్పివేసితిని. ఎవరేమి చేయఁగలరు ?

పడవ మొదటి గదులలో నొక యుద్యోగస్థుఁడు కుటుంబముతోఁ బయనము చేయుచుండెను. అంతట సరంగు పడవమీఁద నుండి దిగి వచ్చి, తహసీలుదారుగారు నిన్నుఁ బిలుచుచున్నారని చెప్పెను. కడుపుమండి పోవుచుండువానికి గొప్పవారితో గోష్ఠియెట్లు? ఐనను పెద్దలమాట తీసివేయఁజాలక, నేను లేచి, పడు చెక్కమీఁద నడచిపోయి, గది ముందు గుమ్మముఁ జేరితిని. పెద్ద యుద్యోగస్థులకుఁ బేద విద్యార్థితోఁ బనియేమి గలిగెనా యని నే నచ్చెరువొందితిని.

న న్నాహ్వానముఁ జేసినది భానోజీరావు పంతులుగారు. భానోజీరావుగారి పే రెఱుఁగని వారెవరు ? ఆయన ప్రాతఃకాలపు ఉద్యోగస్థుఁడయ్యును, మునద్దియని ఖ్యాతి నంది యుండెను. తాలూకా నంతటిని గజగజ వణఁకింపఁగల సమర్థుఁడు. ఈ ప్రాంతమున మా మాధ్వులలో నుద్దండుఁడు. ఈ కులశేఖరుని యండఁజూచుకొనియే మా వ్యాపారులు తలలెత్తుకొని యుండిరి. అట్టి పంతులుగారి దర్శనము చేయునపుడు, అపరిచితుఁడగు నాఁబోటి పసిబాలుఁడు వణఁకుటయం దేమి యాశ్చర్యము ?

"నీవు బ్రాహ్మణ పిల్లవాఁడవే కదా?" యని పంతులు ప్రశ్నము.

" ఔనండి - మేము వేపారులము"అని నా యుత్తరము.

అంత మా యుభయులకును మా కుటుంబపు పూర్వోత్తరములను గుఱించి సంభాషణము జరిగెను. ఐన ఇట్టి కుశల ప్రశ్నములవలన నాకు గడుపు నిండునా ? పంతులంత తన వెనుకటి గదితలుపు తట్టి, "కల్యాణీ! కల్యాణీ ! " యని పిలిచెను. పదునాఱు వత్సరముల వయసు గల సుందరి యొకతె, చదువుచుండు పుస్తకమును నొకదానిని గ్రింద నుంచి, "అయ్యా!"యని నిండుచందురునిబోలు మోముతో తలుపుసందునుండి చూచెను.

" చూడు, కల్యాణీ! ఈ పిల్లవాఁ డెవరో తెలుసునా ? మా సీనయ్య మామ పెదమామగారి మనుమఁడు. మనకు కావలసిన వాఁడు. ఆకలిగొనియున్నాఁడు. నీవు లేచి, ఫలాహారపు మూట విప్పు. ఈ రోజు పడవ మూఁడు జాములకుఁగాని యూరు చేరునని తోఁచదు. ఫలాహారము చేయండి !" అని పంతులు పలికి, కాలు చేతులు గడుగుకొనుమని చెంబు గట్టినత్రాఁడు నాకందించెను. పాదప్రక్షాళనము చేసికొనుచుండఁగా, లోని సంభాషణ నాకొకింత వినవచ్చెను. "నాకు వద్దండీ ! ఆక లేమీలేదు. ఇదిగాక, ఏకాదశి ఉపవాసమున్న మిమ్మును విడిచి, మీ ద్వాదశి పారణ కానిదే, తగుదునమ్మాయని నేను ఫలాహారమునకుఁ గూర్చుందునా ? నేనింత ప్రొద్దుననే భోజనము చేయుటకు ధనుర్మాస

దివసములు వచ్చినవా యేమి? పిల్లవానికి మాత్రము ఫలాహారము పెట్టెదను!"

"కాదు కల్యాణీ! నీవాళ్లు మంచిది కాదు. నీవు ఉండలేవు. నా మాట విందూ, మంచిదాన..." ఈ కడపటి మాట పూర్తిగాక మున్నే నేను గది గుమ్మము నొద్దకు మరల వచ్చితిని. ఆ ముద్దియ ముంగురుల మీఁద నున్న తన వ్రేలిని పంతులు వేగమెత్తీసుకొని, "మఱి యింకలే! రా అబ్బాయీ! కూర్చో!" అని నన్ను సంబోధించెను

నా ముందొక యరటియాకుముక్క వేసి, యా చేడియ, చేత బంగరు కంకణములును, చిన్న వ్రేలిని పచ్చలుతాపిన యుంగరమును, తళ్కుమనుచుండఁగ, కొంత పులియోర పెట్టెను. పులియోరనిన నాకు జిన్నప్పటినుండియు ననిష్టము. ఐన నేఁడీ భాగ్యశాలిని దయతో నిడిన వస్తువును నేనెట్లు పరిహారింపను? కాలుచుండు కడుపునకు నూడిదలు గావలయునా? నానోటి కాయాహార మమృతమయ్యెను. ఇట్టి రుచ్యమగు పదార్థము నిన్నాళ్లు నేనేల యీసడించితినాయని యాశ్చర్యమందితిని. తమకమున భుజించు నాకంత కారముచే నెక్కిళ్లు రాఁగా, "కారమెక్కువ యైనదేమి? నాకును అదియే బాధ. మఱచిపోతిని. ఈ మీఁగడ కలుపుకో!" అని చిన్నగిన్నెలోని మీఁగడ కొంచె మాపూనిని నాకు వడ్డించెను. అంత పంతులు, "కల్యాణీ! నామాట వినుదూ! చూచినావా, ఇతఁడు మన మాధ్వుల పిల్లవాఁడే. మీబోటి చిన్నవాళ్లు తినుటవల్ల దోషమేమీ లేదు!" అని తిరిగి యామెను బుజ్జగించెను. వెండి గిన్నెలో నపుడు తానును గొంత వడ్డించుకొని, యా కోమలి భుజించుట కారంభించెను. భామినులతోడి భోజనప్రసంగములందు ప్రాంతచుట్టరికములు బయలువడుచుండును. నాతో మాటాడుచు, కొంతవడి కాకోమలి యాశ్చర్యమున, "ఏమండీ! ఇతఁడు మీకే కాదు, మాకును దగ్గఱ చుట్టమే సుమండీ! మాకు వ్రేలువిడిచిన అక్కకుమారుఁడు!" అని పతితోఁ బలికెను. ఉభయులకును జుట్టమునైన నన్నింకను భుజింపుమని వారు బుజ్జగించిరి. ఫలాహారానంతరము, జవానుచే నామూటను దమ గదిలోనికిఁ బంతులు తెప్పించి, "ఎంత పని చేసితివి చిట్టిపంతులూ! ఇంతఆకలి పెట్టుకొని, బంధువులము మేము కూర్చుండు పడవలోనే గతిలేనట్టుగఁ గష్టపడితివిగదా!" అని యాశ్చర్యము నందెను.

౨

పడవ పయనమునాఁట నుండియు భానోజిరావు పంతులు నాకుఁ బరిచితులై యుండిరి. పంతులు బంధుప్రియుఁడు, స్వశాఖాభిమాని, దినము నెపుడో యొకప్పుడు తనకుఁ గనపడునని నాకాయన యానతిచ్చెను. వారింటి కేగినపుడు జవానుల నడుగకయే నేను దిన్నగ లోనికిఁజని వారిని సందర్శింపవచ్చును. వారికి నాయందుఁగల వత్సలత యింతింతని చెప్పఁజాలను. ఆయన నేను గనఁబడఁగానే "నాయనా, మనోహరమూ, రా! కూర్చో!" యని తానెంతపనిలో నున్నను, నా యోగక్షేమము లారయుచుండును. పదునాఱు వత్స

రముల లేఁబ్రాయముననున్న నాతో వయసు మీఱిన ప్రజ్ఞావంతుఁడగు తాను బ్రాణ స్నేహితునివలెఁ బరియాచకము లాడును. పూటకూళ్లమ్మ చేతియన్నము అర్భకుఁడనగు నాకు సరిపడదనియు, తన యింటనే విడిసి, తన సహపంక్తిని భుజింపుమనియుఁ బంతులు బలవంతపెట్టుచుండును. ఇట్టి యాదరమును జూపుచుండుటచేతనే నాయనను మానాయనకు మారుగఁ జూచుకొనుచుండును. ఇంకఁ గళ్యాణమ్మకంటె గుణవతి యగు నిల్లాలు నా కంటి కిలలోఁ గానిపింపలేదు. నా యీడు గలదియె యైనను, నే నామానవతిని బిన తల్లిగ భావింతును. మాయమ్మకుఁ జెల్లెండ్రు లేరు. కక్కీయని పిలిచి, నాకుఁ బినతల్లి లేని కొఱంతను దీర్చిన యాకోమలియందుఁ గూర్మి గలిగియుండును. ఇంతేల? నాయందు పుత్ర వత్సలత గల కల్యాణమ్మనుజూచి నేను దల్లిని విడిచిన విచారమును మఱచిపోతిని. నా నేమ మాసుదతి యెన్నిరీతులనో కనిపెట్టుచుండును. తినుటకు ఫలాదులు, చదువుకొనుటకుఁ బుస్తకములును ఆయమ యనుగ్రహమున నా కెన్నిసారులో సమకూరెను. సతి, నాయెడఁ జూపెడి యాదరమునకుఁ దనివినొందనివాని వలె పంతులింకను నామీఁద దయ గురిపించుచుండును.

ఇట్లెంతకాలము గడచెనో నాకుఁ దెలియదు. సుఖదినములు శుక్లపక్షపు చంద్రికల వలె శీఘ్రమే పరిసమాప్తినొందును. ఒక సాయంకాలము నా కేమియుఁ దోఁచకుండెను. పుస్తకమును విసుగుదలతో మూసివైచి, ఎప్పటికంటె వేగమె పచేరమునకు సాగిపోతిని. నాకుఁ దెలియకయె పాదములు పంతులుగారి యింటిత్రోవఁ దీసెను. మా కక్కి యిపుడేమిచేయుచుండునా యని యూహింపఁదొడఁగితిని. నేను గసపడఁగనే లేచి నమస్కరించు పంతులుగారి జవా సీనాఁడు, నన్నుఁ జూడని వానివలెఁ గాళ్లుచాచి కూర్చుండియుండెను! ఒకటిరెండుపర్యాయములు పలుకరించినఁగాని వాఁడు పలుకకుండెను! ఇల్లుసొచ్చినను, నన్నాదరించువారు లేరైరి! నే నపుడు అమ్మగారి గదిగుమ్మము నొద్దకుఁబోయి నిలుచుంటిని. తా నెంత జబ్బుగనున్నను, ఎదురుగ వచ్చి నన్ను గారవించెడి కల్యాణమ్మ, నన్నిపుడు చూచియు, మఱింత ముసుఁగుఁబెట్టుకొని కదలకుండెను! దీనికిఁ గారణమేమి? "కక్కీ, కక్కీ! నీకు జబ్బుగానున్న దాయేమి?" అని హెచ్చరించితిని. ప్రత్యుత్తరము లేదు. అంత నేమనుకొనినదో కాని, కొంతవడికి మాం పిన్నమ్మ లేచి, మంచముపట్టెమీఁద దాఁ గూర్చుండి, కుర్చీలో నన్నుఁ గూర్చుండు మని సైగచేసెను. వీడిన కురులు ముఖపద్మమును గప్పుచు, ఆ సుందరవదనమున కొక వింత వికాసమును గల్పించెను. ఎన్నిమారులో నాకుఁ బ్రేమాతిరేకమున ఫలాహారములిడిన యా మృదువగు చేతివ్రేళ్లు, మందమారుతమునఁ జలించు లేమావి చిగురుటాకులవలె భావోద్రేకమున నిపుడు కంపింపసాగెను. "కక్కీ! నీ వీలాగున నుంటివేమి? బడలికవలననా, విచారముచేతనా? కుమారుఁడ నగు నాదగ్గఱ నీకు దాపఱిక మెందుకు?" అని

అంగుళీయక ప్రదానము



“ ....................దేవి! చూడు మిదిగో దివ్యరామ
నామముద్రితంబు క్షేమవార్తను దెల్పు, నంగుళీయకము మహార్హ్యతమము. [ఆంధ్రశ్రీమద్రామాయణము–శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు.]

చిత్రకారుడు: శ్రీయుత డబ్ల్యూ. ఏ. ఆర్యదాసుగారు.

యాత్రమునఁ బ్రశ్నించితిని. దుఃఖావేశమున మాటరాక, ఆతరుణి దుర్బలత్వమున నూరక క్రిందికిఁ జూచుచుండెను. శీతకాలపు టుదయమునఁ జెట్లయాకులనుండి రాలు మంచుబిందువులవలెనే యాకాంత కనుదోయినుండి బాష్పజలములు జలజల రాలుచుండెను! మందహాసమునకే యనువగునటులు ధాతచేఁ బరికల్పింపఁబడిన యా కోమలి కపోలతలమిపుడు కన్నీటిధారలచే వివర్ణతనొందుటకు నే నోపక, "కళ్యా! నీ వొకమాటాడి, నా హృదయమును వేధించు బాధను తొలఁగింపవా?" యని దైన్యముతో నే వేడితిని.

కల్యాణమ్మ యంతట, "అబ్బాయీ! నీతో నొకమాటే చెప్పెదను. వెనుకటిసంగతులు కలవంటివని మఱచిపోయి, ఇఁకముందు మాయింటికి రాఁబోకు. ఇదే మా యుభయుల యభిప్రాయము" అని చెప్పివైచెను!

మొదలంటనరికిన కదళికావృక్షమువలె నేనంత నేలఁ గూలఁబడితిని. ఈ లోకమున ప్రియతమమగు చుట్టము నెచ్చెలియగు నీ సుదతీరత్నమునకు నామీఁద నిటు దయతప్పుటకుఁ గారణమేమి? ఇట్టి స్నేహితులను గోలుపోయిన నా జీవిత మిఁక వ్యర్థ మని నే రూఢిచేసికొంటిని. ఐనను, ముఖాముఖి మాటాడుకొనిన నట్టి యపోహములు నొక్కొక్కప్పుడు సమసిపోఁగలవని నమ్మి, "కళ్యా! నా తప్పిదమును నీవు సూచింపనైనలేదు; నిరపరాధినైన నన్నూరకయే దయమాలి యిట్లు శిక్షింప నీకు న్యాయమా?" యని నేనడిగితిని. నాసంగతి సవిస్తరముగ విని మఱి దండన విధింపుఁడని వేడితిని. తా నొకవేళ నాతో మాటాడ నొల్లకున్నను, పంతులుగారైన నాతోఁ బ్రసంగించి, సత్యాసత్యము లరయునటులు చేయుఁడని ప్రార్థించితిని. కాని యా సుదతి స్థైర్యముఁ బూనియుండెను. సంతతధారగఁ బ్రవహించుచుండిన బాష్పజల మిపుడు నిలిచిపోయెను. దుఃఖముతోఁగాక, కోపముతోనే యిపు డాసుందరవదన ముద్దీప్తమగుచుండెను. పదునెనిమిదివత్సరములు నిండకుండెడి యా జవ్వని మోమును, ఆగ్రహపిశాచము ముప్పదియేండ్ల భామిని వదనముగ మార్చివైచెను! నేఁ బలికిన పలుకులును చేసిన ప్రార్థనలును, ఆ కలికి యొకింతయు నాలకింపక, నావైపునకు దృష్టినైన మరలింపక, "పో పొమ్ము" అను నర్థము వచ్చునట్టుగఁ జేయి వీచివైచెను! అకారణవైర మూనిన యంగనతోడి ప్రసంగ మనుచితమని తలంచి, ఉత్తరీయము నెత్తి కట్టెచుట్టి, ఆ గృహము నుండి మరలిపోతిని.

ఎక్కడకుఁ బోవుటకును, ఏమిచేయుటకును, పాలుపోకుండెను. సమీపముననే పౌరుల విశ్రాంతికొఱ కేర్పడిన పూఁదోట గలదు. మెల్లగ నడుగులిడుచు నే నందుఁ జొచ్చి, చెట్ల గుబురునడుమఁ జదికిలఁబడితిని. అప్పటికి సూర్యాస్తమయమైనది. సంజచీకటి రాత్రి యగుటచేత నొక కొన్నినిముసములకే యాస్థల మంధకారబంధుర మయ్యెను. ప్రస్తుత పరిస్థితుల నే నంతఁ దలపోసితిని. నా దుస్థితి నెవరి కారోపించుటకును, దానికై యెవరిని దూఱుటకును, నాకుఁ దోఁపకుండెను. నా

యూహాపోహములు స్తబ్ధములై యుండెను. కొంత సేపటి కిద్దరు మనుష్యులు తోఁటలోఁ బ్రవేశించి, నే నుండు చోటునకుఁ జేరువనె వేదికమీఁదఁ గూర్చుండి, మెల్లగ ముచ్చటింపసాగిరి. ఎవరిక్షోభము వారిది! నా గొడవలోఁబడియున్న నా వీనులకు వారి గొడవ వినవచ్చియు వినరాకుండెను కొంచెము సేపటికి వారిమాటలధోరణి నా చెవులకుసోకెను. లోకాభిరామాయణముతోఁ బ్రసంగ మారంభించి, యా మనుష్యులు, రానురాను మాకు సంబంధించిన విషయములకు దిగిరి. ఆశ్చర్యమందిన నా కంత వారి సంభాషణమందలి తుదిభాగ మిట్లు వినవచ్చెను.

మొదటివాఁడు: "ఐతే, బిందుమాధవా! మూఁడవ పెండ్లి చేసికొన్న ముసలి ముండా వాఁ డీసంగతి మొదటనే యేల కనిపెట్టలేదు? లేక మీ బెండకాయబొట్టంటే పడి చచ్చుచుండుటచేత వాని కన్ను లిట్లు పొరలు గ్రమ్మినవా?"

రెండవ వాఁడు: "నీవు చెప్పినట్లే, బంధుత్వ మమకారముచేతనే కుబ్జవానిని నెత్తెక్కించుకొన్నాఁడు. అంతట వాఁడు బిగిసి గొంతుపట్టుకొన్నాఁడు!"

మొదటి: "కుబ్జవాని కేమెతక గుణమున్నదని నీకేలా స్పష్టమైనది? తల్లీ బిడ్డలను వరుసపెట్టుకొనియేకదా వారుండిరి!"

రెండవ: "ఈ కలికాలపు వరుసల కేమివచ్చె! చెడు వ్యామోహములేకపోతే, దగ్గఱి బంధుత్వములేని ఆ కుబ్జగాడిద, ఏమి పడిపోయినదని వేళాపాళలేక, చదువు సంధ్యలు వదలి, వీళ్ల కొంపపట్టుకొని తిరుగుతాడు? వీనిమీఁది మోహముచేతనే ఆవగలాడిదగ్గఱి బంధువులను సహా తనయింటి కిటీవల చేరనియ్యకున్నది! ఈ మాయ గ్రహింపని ముసలి పక్కనకిపుడు మనోహరమే ముద్దులమూటయైనాఁడు! కాఁబట్టియే మనోహరమిపు డాయింటి తహాసీలుదారు హోదా చలాయిస్తున్నాఁడు! ఒకటేల, మనోహరము దయ సంపాదించినవారే అక్కడ ధన్యులు. అటువంటి మహానీయుని కొమ్ములు మనము కోసివేయుట గొప్ప విశేషము గదా!"

మొదటి: "ఔను గాని, మనము వ్రాసిన యీ ఆకాశరామన్న యుత్తరాల వల్ల వాళ్లకు బుద్ధివచ్చునని యేలా చెప్పఁగలవు?"

రెండవ: "పరాంకుశమూ! తినబోతూ రుచి చూడడ మెందుకు? ఈ యుత్తరాలు వాళ్లకు చేరినప్పటినుండి, సంగతులు మనము పరిశీలిస్తున్నాము గదా. ముసలతఁ డిప్పటికి కండ్లు తెరచినాఁడు. మనసులో అనుమానం అతనికి గాఢముగా నాటినది. అమ్మగారికి కూడా నసాళం అంటినది! ఉన్న సంగతి చెప్పితే ఉలుకెక్కువ! అయి వచ్చినదని యమ్మగారిపుడు మంచమెక్కినారు!

"తగిన ప్రాయశ్చిత్తము జరిగిందిలే! మా వంటి బంధువులంటే అమ్మగారి కిటీవల కళ్లు బొత్తిగా పూడిపోయినవి! మనోహరము నిఁక తమ యింటికి రానీయవద్దని భార్యా

భర్తలు నిశ్చయించుకొన్నారు. మనోవ్యథ చేతనే పంతులు నేటి మధ్యాహ్నము కమాను వెళ్లిపోయినాఁడు!"

ఈ సమాచారము నాకుఁ జాలును! నా కనుల పొరలిపుడు వీడినవి. నల్లనివన్నియు నీళ్లనియు, తెల్లనివి పాలనియు, దలంచి, వర్తనమున మాలిన్యములేదని విఱ్ఱవీగి, లోక్య మెఱుఁగక యున్నాళ్లను వర్తించిన నాకుఁ దగిన శాస్తియైనదని నే గ్రహించి, నేనంత మెలకువతో మెలంగ నుద్దేశించి, యిలు చేరితిని.

3

నిర్హేతుకముగఁ గుత్సితజనులు మోపిన యపనిందలకు వెఱఁగంది నాతోడి సంబంధమును వదలుకొనిన యా గృహస్థులను, నేను బిమ్మట చాలకాలము పఱకును దర్శింపలేదు. నా మీఁదఁ గోపముచేతనే కల్యాణమ్మ నన్నుఁ బంపివేసెనని మొదట నేను విచారించితిని. కాని, ఆమె కోపము నా మీఁదఁగాక, అపవాదములు కల్పించిన జనుల మీఁదనే యని యిపుడు స్పష్టమయ్యెను. తన శీలమును సంశయించినట్టు గానఁబడిన పెనిమిటి మీఁదను ఆకలికి కినుక వహించి యుండును. పనిలేని పేరంటముగ నేను వారి యింటికిఁబోవుచు వారిబంధువుల యీర్ష్యకుఁ బాల్పడుటవలనఁగదా, ఆ సుచరితమీఁద నీ వాదులు దొరలినవని నే నెంతయు వంతఁ బొందితిని. ఆదంపతులు నాతో నిఁక మాటాడకున్నను, నాకుఁదెలిసిన సత్యము వారికి విన్నవించుట యుక్తమని నేనెంచి, నాఁటి సాయంకాలము ఫ్రాఁదోటలో నేను వినిన సంభాషణమంతయుఁ బూస గ్రుచ్చినట్టుగ భానోజీరావు పంతులుగారి కొక లేఖ వ్రాసి తెలిపితిని. సత్యము దైవమున కెఱుక. ప్రస్తుతము విపరీత పరిస్థితుల ననుసరించి నాయెడఁ దటస్థభావముతో నున్నను, పూర్వము నన్నెంతో దయతోఁ జూచిన యా దంపతులయెడ నేను గృతజ్ఞతగలిగి, వారి శ్రేయస్సును గోరుచుందును.

ఇప్పటికి నేఁ గల్యాణమ్మనుజూచి పది సంవత్సరములైనది. ఈలోపున లోకమున పెక్కుమార్పులు గలిగినవి. భానోజీరావు పంతులు చాలకాలముక్రిందటనే డెప్యూటీ కలక్టరుపదవి నందెను. విద్యాపరిపూర్తియై నేను బ్రభుత్వోద్యోగమునఁ బ్రవేశించితిని. నాకుఁ జేకూరిన సకలశుభములందును, ఆ పుణ్యదంపతులను స్మరించుచుందును. కాని నాకును వారికిని కంటిచూపులు తప్పిపోయినవి. ఉత్తరప్రత్యుత్తరములును లేవు. ఇటులుండ మాగృహమున నిటీవల జరిగెడి యొక శుభకార్యసందర్భమున లేఖలు వ్రాయుచుండు నపుడు, నా బాల్యపుప్రాపకు లగు వీరిసంగతి జ్ఞప్తివచ్చెను. గృహస్థుల మర్యాద ననుసరించి వీరికిని శుభలేఖవ్రాసితినే కాని, వారు వచ్చెదరని నేఁ దలంపలేదు. జిల్లాలు దాఁటి పోయి దూరమున నున్నవారిని నా యింట జరుగనున్న యీ స్వల్ప శుభకార్యమునకు శ్రమపడిరావలయుననుట కూడ నా తలంపు కాదు.

ఇట్లుండఁగా, శుభకార్యదినమున మా బంధువులతో నొకస్త్రీ బండిచేసికొని, తన యిద్దఱు పిల్లలతో మాయింటికి వచ్చెను. మాయింటనుండు స్త్రీ లామెను గుఱుతింపలేక, యొకరిమొగ మొకరు చూచుకొనఁజొచ్చిరి. వీ రెవరో కనుగొనెదమని నేను బోయితిని. సుమారు ముప్పదియేండ్ల వయస్సుగల యా స్త్రీని నే నెన్నఁడో చూచినట్లు తోఁచెను. నిదానించి చూచి, కల్యాణమ్మయని యానవాలుపట్టి, 'కక్కా' యని పిలిచి, యామెపాదములకు మ్రొక్కితిని. "నాయనా, మనోహరమా! బాగానున్నావా?" అని నానేమ మడిగి యామె నన్నాశీర్వదించెను. ఇన్నియేండ్లకు తిరిగి యిట్టి మిత్రదర్శన మైన యీ దినము నిజముగ శుభదినమని నాకుఁ దోఁచెను. ఆ సాయంసమయమునఁ దీఱికఁ జేసికొని నేనును మాకక్కయు వెనుకటిసంగతులు ముచ్చటించుకొంటిమి. చెడుకలవలె వచ్చిన యా యాకాశరామన్నజాబులవలన మా సంతోషమున కానాఁడు భంగము గలిగెనుగదా యని మేము పరితపించితిమి. కాని, యీ యపనిందయే మా శీలమును జక్కగ శోధించెననియు, నీతివర్తనమును దిట్టపఱిచెననియు మేము కనుఁగొంటిమి. ఈ పాడుకలగనినపిదప తాను మరల మనసార నవ్వి యెఱుఁగనని మా కక్క చెప్పి, కంట నీరు తెచ్చికొనినపుడు, పసిబాలునివలె నేనును వెక్కి వెక్కి యేడ్చితిని!

చేటభారతమువలె నున్న నా యుత్తరమును ఆనాఁడు భానోజీరావుగారు మరల మరలఁ జదువుకొనిరఁట! కపటమును, కల్మషమును జంటగ నుండుననియెంచి, నాయనమాయకత్వమే నానిర్దోషిత్వమున కమోఘచిహ్నమని యాయన విశ్వసించెను. ఇదిగాక నాజాబు మూలమున దోషారోపకుల పేరులిపుడు కొన్ని బయలుపడెను గాన, దూరపు బంధువగు బిందుమాధవుని, వాని యనుచరులను ఆయన యిపుడు గనుఁగొని పరీక్షింపఁగా, పశ్చాత్తప్తులై వారు నిజమంతయు నొప్పుకొనిరి. పతిప్రేమవిశ్వాసముల కావలఁ దాను మరలఁ బాత్రమనైతినని కల్యాణమ్మ చెప్పినపుడు నాకుఁ గనుల నీరు గ్రమ్మెను. నా సహచరులు నుపాధ్యాయులును నా యకళంక వర్తనమును గుఱించి నొక్కి చెప్పుటచేత ఆ దంపతులు వెనుకటివలెనే నాయందు సదభిప్రాయము గలిగియుండిరి. కాని, యిది జరిగిన స్వల్పకాలమునకే వారు దూరదేశము వెడలిపోయిరి. ఆ పట్టణమునఁ జదువుచాలించుకొని నేనును వేఱొక తావునకు వెడలిపోతిని. అందువలననే వారు నన్ను మరలఁ గలిసికొన లేకపోయిరఁట. నాతో నుత్తరప్రత్యుత్తరములు నడుపుటకును వారికి వలనుపడకుండెను. ఉత్తర ప్రత్యుత్తరములు లేకయే కొంత కాలము గడచిపోవుట యుక్తమని వా రూరకుండిరి. కాని, యిటీవల వారికి నామీఁద మరల ప్రేమ వాలెను. ఇంతలో నాశుభలేఖ కూడ వారి కందెను. నా యాహ్వానమును మన్నించి పంతులుగారు, తమ భార్య నీ నాఁడు మా యింటికిఁ బంపిరి. పరిస్థితు లిట్లు పరిణమించుటకు నే నీశ్వరుని గీర్తించితిని.

ఒకసంగతి మాకక్క నడుగవలయునని నే నాత్రముతో నుంటిని. నా విద్యాపరిపూర్తియు, ఉద్యోగసంపాదనమును గుఱించి యోజించుచుండు మొదటిదినములలో, మండలన్యాయాధిపతి కొలువులో నొకపని 'ఖాళీ' యయ్యెను. దానికొఱకై నాకంటె విద్యాధికులు, ననుభవశాలులు నగు నుమేజువార్లు పెక్కండ్రు ప్రయత్నించుచుండిరి. పెద్దవారి ప్రాపులేని నేను దీని కాసించుట అందనిమ్రాని పండ్ల కఱ్ఱులుసాచుట యని తలంచుచుంటిని. ఇట్లుండ నొకనాఁటి ప్రాతఃకాలము, ఆన్యాయస్థానమునందలి పెద్ద యధికారియొద్దనుండి పరిచారకుఁ డొకఁడువచ్చి, నన్ను వారు పిలువనంపిరని చెప్పెను. నేను వారిదర్శనము చేయఁగా, వారి ప్రియమిత్రు లొకరికోరిక ననుసరించి నాకుఁ దా మీయుద్యోగ మీయ సంసిద్ధులుగ నుంటిమని వారు చెప్పిరి. ఎదురుచూడని యీ భాగ్యమున కెగిరి గంతువైచి, నే నానాఁడే యాపదవిని జేకొంటిని. ఆయధికారి దయయే యుద్యోగమున నే నిటు లభివృద్ధినొందుటకుఁ గారణమయ్యెను. వారిచే నా కీసహాయముచేయించిన మిత్రునిపేరు తెలిసికొనవలయునని నే నెంత యత్నించినను, సాధ్యము కాలేదు. నీ కేమైనఁ దెలియునా యని నే నడుగఁగా, కల్యాణమ్మ, మందహాసమునఁ దన సుందరవదనము సొబ గొందుచుండఁగా, ఎంతయో గుట్టుతో నుంచవలయునని తన పతిచేసిన యీ స్వల్పసాహాయ్యమును తన యక్కకొడు కీ విధమున రచ్చకీడ్పించుట పాడిగాదని చెప్పివైచెను!

ఊరక యుద్యోగములు గావు; కారణములేక యేకుటుంబమునఁగాని నామకరణములును గలుగనేరవు. మఱునాఁటి సాయంకాలమున నేను వ్రాఁతపని చూచుకొనుచుండఁగా, అనతిదూరమున నాఁడువారి ప్రసంగములు వీనులకు సోఁకెను. కల్యాణమ్మ పెద్దకుమారుని ముద్దులాడుచు నా భార్య "నీ పేరేమని" యడిగి, "చిన్న మనోహర" మను వాని ప్రత్యుత్తరమున కచ్చెరు వొంది, "నీయన్న పేరెవరోయి?" యని యడుగఁగా, 'మనోహర' మని వాఁడు చెప్పి, నన్నుఁ జూపించెను! మాటాడుట కదను దొరకెనా పిల్ల లూరకుండువారు కారు. "నా పేరు కూడా చెప్పనా?" యని నా చిన్ని కూఁతు రంత కల్యాణమ్మ యొడిలోఁ జేరి, ఆమె చెవిలో 'కల్యాణి' యని రహస్యముగఁ జెప్పెను! "నీ కెవరిపేరు పెట్టినారమ్మా?" యని మా కక్క యడుగఁగా, మాటకారి యగు నీబాలిక, "మా చిన్న బొమ్మ పేరు పెట్టినార" ని చెప్పివైచెను! ఆనంద బాష్పములు తనసుందర నయనములనుండి స్రవించుచుండ, మా కక్క యా బాలిక నక్కున నదిమి ముద్దాడెను. నిజము దాచుట కెవరి వశము?

సంపూర్ణము




[వెనుకటి సంచిక తరువాయి]

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

జొంపము లట్లు పుట్టి కడుఁజోద్యముగాఁ గనుపట్టి యంతటన్
సొంపుగ నంచులన్ వెలసి చూరులుగట్టి నితాంతమున్ నిగా
రంపు వినీలిమన్ బెనఁగి రమ్యతఁజూపి యనుక్షణంబ వే
గంపు మరుత్ప్రసార మెసగం బొలివోవుదు ప్రావృడబ్దమా!

మ. ఎలమిన్ బ్రోషితభర్తృకల్ గనుఁగొనన్ శృంగారమున్ గర్జితం
బులతో మించెదునీవి వీరరసమున్ బ్రోత్తుంగసీల ప్రభా
వళులన్ మిన్నఖిలమ్ముఁ గ్రమ్ముకొను తేవన్ రౌద్రమున్ వాతచం
చలతన్ దూలి భయానకంబు నిడు దిచ్ఛన్ బ్రావృషేణ్యాభ్రమా!

ఉ. నల్లనిపిట్ట లాకసమునన్ నిను డాసి భవద్రుచిప్రవా
హోల్లసితోర్ములన్ మునిఁగెనో యనఁ గానఁగరావు నల్పులన్
దెల్లని ధూమపుంజములు తీర్చినయట్లుగఁ గ్రాలుచుండెడిన్
గొల్లలుగాఁ బ్రమోదములు గూరు నినుం గనఁ బ్రావృడభ్రమా!

శా. కల్యాణచ్ఛవితాన్వు, కర్షక మనఃకాసార సారప్రభా
కల్యస్ఫూర్జితసూర్యదీధితి, లసత్కాదంబశాఖాగ్రపు
ష్పాళ్యావిర్భవకారణంబు, భవదీయాకార మాలోక సా
ఫల్యాపాదన సాధనం బగుఁగదా ప్రావృట్పయోవాహమా!

ఉ. పాయలు పాయలై పెనఁగి భవ్య వినీలరుచిం జలాంచల
స్థాయ ముదారవల్లికలు చక్కఁదనంబుల కిక్కలై తగన్
బాయని సాంద్రదీధితుల ప్రన్నఁదనంబున మధ్యభాగ రే
ఖాయత వేదికల్ వెలయ నచ్చెరువిచ్చెదు వర్షుకాభ్రమా!

ఉ. పక్కన నవ్వినట్లు విరిబంతుల దొంతర నిల్పినట్లు నీ
టుక్కల క్రింద సూర్యుఁడు గడిందిగ దివ్యమరీచికావళిన్

జక్కని యంచలమ్ములకు సారెకుఁ దార్చుచునుండ మింటిపై
కెక్కుచునుండు నీ చెలువ మెంతయు వింతగుఁ బ్రావృడభ్రమా!

ఉ. పావనచంద్రికారుచి విభాసి విశాల దిశాంతరాళ శో
భావితతప్రసారముల భద్రతరాకృతివై ముదావహం
బౌ విమలాంతరిక్షమున హాయిగ నొక్కెడఁ జిన్నరూపుతో
భూవలయంబుఁ దన్పఁగల పోడిమి నుండెదు ప్రావృడభ్రమా!

చ. మదమునఁగూయు బర్హిణుల మంజుళకంఠనినాదమాధురీ
నదుల మనంబు మున్గఁగఁ గనద్ద్యుతిరాజిత పల్లవావళీ
సదనములైన వృక్షముల చక్కఁదనంబును మెచ్చుకొంచు నిన్
జదలునఁ గాంచు కాలమునఁ జాలుకొనున్ మది వర్షుకాభ్రమా!

ఉ. స్వాంతరతాపహారకవిహార రసానుభవంబులన్ వియ
త్కాంత శుభాంగకంబు పులకప్రకరంబులఁ దాల్చెనో యనన్
వింతగ బార్లుగట్టి యుడువీథి విహంగము లొప్ప సంజకుం
బొంతలనుండి నీవు రసపోష మొనర్చెదు వర్షుకాభ్రమా!

ఉ. తెల్లనిమేని యీశ్వరుని దివ్యవినీలగళమ్మునందు ర
మ్యోల్లసితప్రభాపటలయుక్త భుజంగ ఫణామణీఘృణీ
వల్లిక యొప్పు చొప్పెసఁగఁ బాపురె! శుభ్రనభస్థలిన్ గనున్
నల్లని నీశుభాకృతిఁ గనంబడుఁ జంచల వర్షుకాభ్రమా!

చ. గుబురులుగాఁ గడుం బొదలి కొండలుకొండలుగాఁ దలిర్చి చా
ల బెళుకులొప్పఁగా మెఱుపులన్ వెలయించుచు నేగుచుండుటల్
కుబుసము దీసినట్లు నెలకొన్న వినీలత దూల ధూమమవా
చుఁ బెఱుఁగుటల్ భవత్సహజసుందరలీలలు ప్రావృడబ్దమా!

ఉ. పొంకపు వర్షబిందుతతి భూవనితా పరితాప మార్చి ని
ష్పంక హృదంతరంబొలయ సారము చాలఁ గ్రహింప నేగు నిన్
శంక యొకింతలేక గగనంబున వాయువు తూలఁదోల నే
వంకల కేగుదో పలుచవారి వడంకుచుఁ బ్రావృడబ్దమా!





# ఆంధ్ర సామ్రాజ్యము

[వెనుకటి సంచిక తరువాయి]

ఆంధ్ర శేషగిరి రావు గారు (సారస్వతసమాజము)

(క్రీ.పూ. ౩-వ శతాబ్దిమొదలు క్రీ. త. ౩-వ శతాబ్దివఱకు)

౫

## తరువాతి ఆంధ్ర రాజులు

## వాసిష్ఠీపుత్ర శ్రీపులమాయి

ఇతడు గౌతమీపుత్ర శాతకర్ణికిని వాసిష్ఠిరాణికిని జనించినవాడు. పులమాయి క్రీ. త. ౧౩౮ మొదలు ౧౭౦ వరకు ముప్పది రెండు సంవత్సరములు రాజ్యము చేసెను. ఈతని కాలమునాటి శాసనములు అమరావతి, కార్లి, నాసికపట్టణములలో కానవచ్చుచున్నవి. నాణెములు కూడ కానవచ్చుచున్నవి.[1] గౌతమీ పుత్రుడు ధనకటకమున రాజ్యమేలుచుండ ఈతడు యువరాజుగను రాజప్రతినిధిగను ప్రతిష్ఠానము నుండి పరిపాలన చేయుచుండెను. ఈ కాలమున పరిపాలన విషయములో పులమాయికి ముత్తవతల్లి (నాయనమ్మ) గౌతమీబాలశ్రీ తోడ్పడి యుండవచ్చును. ఈమె శాసనము నాసికలో కలదు. అందీమె ప్రేరణముననే నాసిక పట్టణములోని కొండ చివరనున్న గుహాలయము నిర్మింపబడి భద్రాయనీయ శాఖలోని బౌద్ధబిక్షువులకు వాసిష్ఠీ పుత్ర శ్రీపులమాయిరాజుచే పందొమ్మిదవ పరిపాలన సంవత్సరమున అర్పణ చేయబడెనని చెప్పబడియున్నది.

తండ్రివలె ఇతడును బహు పరాక్రమశాలి. తాను ప్రతినిధిగ నుండినప్పుడే తండ్రికి ఈతడు యుద్ధములో బాసటయైయుండువాడు. జనకుని మరణానంతరమున పులమాయి ధాన్యకటకమున పట్టాభిషేకము పొందెను. ఆంగ్ల చక్రవర్తి మరణానంతరము వేల్సు యువరాజు చక్రవర్తి యయ్యెడునట్లే ఆ కాలమున ధాన్యకటకమున ఆంధ్రరాజు చనిపోవుటతోడనే ప్రతిష్ఠాన నగరమున రాజ్యమేలుచుండెడి యువరాజులు సింహాసనమెక్కుచు వచ్చిరని ఊహింపవలయును.[2]

పులమాయికాలమున మాళవదేశ ప్రతినిధులు తిరుగుబాటు చేసినట్లు కనిపించుచున్నది. వాసిష్ఠీ పుత్ర పులమాయి ప్రతిష్ఠానమునందును, చష్టనుడు ఉజ్జయినీ నగరమునందును రాజ్యము చేయుచు సమకాలీనులై యుండిరని 'టోలిమీ' వ్రాయుచున్నాడు. పులమాయి ధాన్యకటకమున అఖిలాంధ్రసామ్రాజ్య భారమును పూనిన తరువాత కొంతకాలమునకు చష్టనుడు చనిపోవుటయు, ఆతని కుమారుడు జయదాముడను క్షేత్రపస్వామి ఉజ్జయినీ రాజ్యమునకు పాలకుడగుటయు జరిగియుండును. అనంతరము జయదాముడుఆంధ్రరాజులపై తిరుగుబాటు చేసి సేనలను కూర్చుకొని ప్రతిష్ఠానముపై దండెత్తివచ్చెను. ఈ జైత్ర యాత్రలో జయదాముడు తెలుగు జోదుల కత్తివాడి రుచిచూచుటయేకాక జీవితమును కూడ గోల్పోయెను. శ్రీపులమాయి, జయదాములకు జరిగిన ఈ యుద్ధమును పురస్కరించుకొని శాలివాహన విక్రమార్కుల విచిత్రగాథలు అల్లబడియెనని వీరభద్రరావు ఊహ.

---

1. Rapson's Catalogue of Indian Coins, Pages, 20, 23.
2. Bhandarkar History of Deccan, P. 33.

# గోతమిపుత్రుని సామ్రాజ్యము




1. పాటలీపుత్రము
2. విదిశా
3. ఉజ్జయిని
4. మహిష్మతి
5. ప్రతిష్ఠానపురము
6. అమరావతి
7. కాంచీపురము
8. కొల్హాపురము

# ముఖ్యపట్టణములు : వర్తకమార్గములు




ఈ సంచికయందు ముద్రితమైన 'ఆంధ్రసామ్రాజ్యము' అనువ్యాసమునకు జేర్చిన పటము

వర్తకమార్గములు

1. భరుకచ్ఛము (బ్రోచి)
2. దేవగిరి
2. నాసిక
4. సూర్పారాగము (సోపార)
5. కల్యాణి
6. మహిష్మతి
7. అజంతా
8. ప్రతిష్ఠానపురము
9. కళ్యాణిపురము
10. అమరావతి
11. మాసలపురము (మోటుపల్లి)
12. కొల్హాపురము
13. విదిశా
14. ఉజ్జయిని
15. తామ్రలిప్తి
16. కళింగపట్టణము (అడ్జిటా)
17. దంతిపురము (కోరంగి)
18. ఎల్లోరా

క్షాత్రప జయదామునికుమారుడు రుద్రదమనుడు తన కూతురగు దక్షమిత్ర యను నామెను శ్రీపులమాయి కిచ్చి పెండ్లి చేసెననియు, ఆతడు రెండు సారులు పులమాయిని యుద్ధములో ఓడించినను అల్లుడగుటచే వాని దేశము నాక్రమింపక విడిచిపెట్టెననియు స్మిత్తు వ్రాయుచున్నాడు. ఇది మిక్కిలి అసందర్భముగా నున్నది. దక్షమిత్రయను నామె నహపానుని కొమార్తెయనియు, ఋషభదత్తుని భార్య అనియు నాసిక శాసనము చెప్పుచున్నది. అట్టిచో దక్షమిత్ర రుద్రదమనుని కొమార్తె యనియు, శ్రీపులమాయి రాణిఅనియు స్మిత్తు వ్రాయుట విరుద్ధమే యగును. వసిష్ఠీపుత్ర శాతకర్ణిరాణి మహాక్షాత్రపరుద్రదమనుని కూతురని కన్హేరి శాసనము చెప్పుచున్నది. శ్రీపులమాయి వసిష్ఠీపుత్రుడైనను శాతకర్ణి నామాంకితుడు గాడు. వసిష్ఠీపుత్రుడును శాతకర్ణి నామాంకితుడును నైనవాడే ఆంధ్రరాజులలో క్షాత్రపస్వామి రుద్రదమనుని అల్లుడు కాగలడు.

## శివశ్రీ శాతకర్ణి

ఈతడు పులమాయిఅనంతరము రాజ్యభారమును వహించి క్రీ. శ. ౧౬౦ మొదలు ౧౬౬ వఱకు ఏడేండ్లు పాలన చేసెను. ఇతడును గౌతమీ పుత్రునకును వాసిష్ఠీ రాణికిని జనించినవాడగుట పులమాయి సోదరుడు కావలయును. వసిష్ఠీపుత్రకుడును శాతకర్ణినామధారుడును నగుటచే ఈతడే మహాక్షేత్రపరుద్రదమనుని అల్లుడు కావచ్చును అట్లగుట రుద్రదమనునిచే రెండుసారులుఓడింపబడినవాడు ఇతడేయై యుండవలయును. గుజరాతులోని జూనారు గడమండలి రుద్రమనుని శాసనము ననుసరించి ఆతడు దక్షిణాపథరాజగు శాతకర్ణిని రెండు మాఱులు జయించి, అకరావంతి, అపరాంత, అనూప,సూరాష్ట్ర దేశములను లాగికొని మహాక్షేత్రప బిరుదము వహించి నట్లును, తిరిగి స్వాతంత్ర్య రాజ్యము ప్రతిష్ఠించినట్లును తెలియుచున్నది.

ఇతని కాలమునాటి శాసనములు కన్హేరి, అమరావతి ప్రాంతములందు కనబడుచున్నవి. కన్హేరి శాసనములలో నొకటి ఈతని రాణిదిగా నున్నది.[3] 'శ్రీశివమాకశాత' అను అమరావతిశాసన మీశివశ్రీదై యుండవచ్చును. ఇతనికి వేదశ్రీయను మఱియొక పేరుండినట్లును, వేదశ్రీ అనువాడు పవిత్రములైన ఆహుతులు సమర్పించెననెడు నానాఘట్ట శాసన మాతనిదై యుండునట్లును తెలియుచున్నది. శివశ్రీ వేద సంపత్తుగలవాడైయుండిన కారణమున వేదశ్రీయని పిలువబడియుండునను అభిప్రాయము ఆంధ్రచరిత్రకారుడు వెల్లడించెను. నానా ఘట్ట శాసనములో ఈ వేదశ్రీ తన తండ్రిని 'అంగీయకులవర్ధను' డని పేర్కొనుచున్నాడు. ఇది విమర్శింపవలసియున్నది.

'ఈ శివశ్రీ శైవమతాధిక్యమును గలిగియుండిన బ్రాహ్మణమతమునవలంబించినవాడుగనుండినను బౌద్ధులను బ్రాహ్మణులను తండ్రికివలెనే సమానదృష్టితో చూచినవాడు. ఈ ఆంధ్రరాజుల తల్లులు బ్రాహ్మణమత మవలంబించిన శకరాజులయు, పహ్లవరాజులయు పుత్రికలగుటచే ఆంధ్రరాజులు కూడ కడపటివారు బ్రాహ్మణమతాభిమానులగుచు వచ్చినట్లు కన్పట్టుచున్నది.'[4]

### శివశ్రీతరువాత

## శివస్కంధ శాతకర్ణి

రాజై క్రీ. శ. ౧౬౬ మొదలు ౧౮౪ వఱకు పాలించెను. ఈతని యనంతరము,

## యజ్ఞశ్రీ శాతకర్ణి

రాజ్యభారము వహించెను. ఇతడు క్రీ. శ. ౧౮౪ మొదలు ౨౧౩ వఱకు ఇరువదితొమ్మిది సంవత్సరములు పాలనచేసెను. చీనాదేశచరిత్రకారు లీతనిని 'యజ్ఞాంయ్' అని పేర్కొనుచు ఈతడు హిందూదేశచక్రవర్తి యని చెప్పియున్నారు.

పెక్కువత్సరములు పరిపాలించి విశేషకీర్తిసంపాదించిన ఆంధ్రరాజులలో ఈతడొకడు: ఈతడు గౌతమిపుత్రుడు. ఈతనిశాసనములు కన్హేరి, నాసిక, కృష్ణాజిల్లాలోని చిన్నాయను గ్రామములోను కానవచ్చుచున్నవి. ఈతడు క్రీ. శ. ౨౦౪-వ సంవత్సరములో చీనాదేశముతో రాయబారము నడపెనని తెలియుచున్నది.[5]

---

3. Archealogical Survey, Western India, Vol. V., P.

4. ఆంధ్రులచరిత్ర భా. ౧, పు. ౧౪౫.

5. Muzumdar, Hindu Period.

క్షాత్రపుల నాణెముల ననుకరించియున్న యజ్ఞశ్రీ వెండినాణెములు ఆతను క్షేత్రపులతో యుద్ధము చేసెనని సూచించుచున్నవి మున్ను శివశ్రీకోల్పోయిన అకరావంతి, అనూప, అపరాంత, సురాష్ట్రములలో కొన్నిటి నీతడు తిరిగి జయించినట్లు ఆ యా దేశములలో దొరకుచున్న ఈతని పేరిటి వెండినాణెములనుబట్టి మనము గ్రహింపనగును. ఇతని తూర్పురాజ్యభాగములలో కానన గుచున్న ఇత్తడి సీసపునాణెములనుబట్టి యజ్ఞశ్రీ చిరకాలము రాజ్యము చేసెనని నిర్ణయింపవచ్చును. యజ్ఞశ్రీ నాణెములందు కొన్నిటిపై రెండు తెరచాపకొయ్యలుగల పెద్దఓడలు చిత్రింపబడియుండుటచే నితడు తన అధికారమును భూమిమీదనే కాక సముద్రముమీద కూడ చలాయించియుండునని నిర్ణయింపవచ్చును.6

## విజయశ్రీ శాతకర్ణి

ఇతడు యజ్ఞశ్రీ తరువాత క్రీ. త. ౨౧౩ మొదలు ౨౧౯ వఱకు ఆరేండ్లు రాజ్యపాలన మొనర్చెను. ఈతని కాలమున విజయవాడపట్టణము కట్టబడినదిగ ఊహింపబడుచున్నదనిఆంధ్రచరిత్రకారుడనుచున్నాడు; విశ్వాస్య మగునా?

## చంద్రశ్రీ శాతకర్ణి

తరువాత చంద్రశ్రీరాజై క్రీ. త. ౨౧౯ మొదలు ౨౨౯ వఱకు పదిసంవత్సరములు పాలనచేసెను. వీని పేరుగల సీసపునాణెములు కొన్ని కనబడినవి.7 ఈతని శాసనమొకటి నూతనముగ కనుగొనబడినది. అది పిఠాపురము దగ్గఱ కొడవలి యనుగ్రామమున తిప్పపైని తొలిచిన నూతిగోడమీద ప్రాకృతభాషలో నున్నది.8

## మూడవపులమాయి

చంద్రశ్రీ తరువాత ఈమూడవపులమాయి క్రీ.త. ౨౨౯-౨౩౬ వఱకు రాజ్యము చేసినట్లు కనిపించుచున్నది. ఇతనిని చీనాదేశచరిత్రకారులు 'పౌలోమీన్' (Powlomein), 'హౌలోమీన్' (Howlomein), 'హౌలోమీన్‌తో', అనియు పేర్కొని యున్నారు. హిందూదేశమును వారు పులిమాను దేశమని అర్థమిచ్చునట్టి పౌలోమాన్‌కోవె(Powlomein kove)అనిపిలిచి యున్నారు 9.

ఈపులమాయి శాసనమొకటి (బళ్లారిజిల్లా ఆదోని తాలూకా) మేకదోనిలో కానవచ్చుచున్నది. 10 అతనినాణెములుకొన్ని కాంచీపురతీరమున గన్పట్టుచున్నవి. 11 పులమాయిచక్రవర్తి కాంచీపురరాష్ట్రమునకు శివస్కంధనర్మ నాగశాతకర్ణియను నాగరాజు సేనాధిపతిగను ప్రతినిధిగను ఉండినట్లు తెలియుచున్నది. ఈ శివస్కంధనర్మ నాగశాతకర్ణియను నాగరాజుకొమార్తెను ఒకపల్లవ బ్రాహ్మణుడు వివాహము చేసికొనెననియు, ఆదంపతులకు పుట్టినవానికి శివస్కంధవర్మయని పేరు పెట్టిరనియు, ఆశివస్కంధవర్మ కాలక్రమమున మాతామహుని కాంచీపురరాష్ట్రమునకు రాజైనట్లును తెలియుచున్నది. 12

## అనంతర వృత్తాంతము

ఆంధ్రరాజులలో కడపటిచక్రవర్తియైన ఈ పులమాయి మరణానంతరము దేశ మల్లకల్లోలమయ్యెనని 'డిగెన్సు ఓలానాచెన్' (Degines Olonachen) అను నాతడువ్రాయుచున్నాడు. ఈ పులమాయి క్రింది అధికారులలో నొకడు గంగానదీప్రాంతభూముల నాక్రమించుకొని, చీనాచక్రవర్తియగు 'టెయిట్‌సాంగు' (Taitsong) యొద్దనుండి 'హ్యూంట్జి' (Hiuntse) అనువాడుకొందఱు రాయబారులతో వచ్చుచున్నాడని విని వారలను పట్టుకొనుటకై సేనలను బంపెననియు, బహుకష్టముతో 'హ్యూంట్జి' తప్పించుకొని టిబెట్టుదేశమునకు పారిపోయెననియు, ఆదేశపురాజైన 'యొ

6. Early History of India, V. A. Smith.
7. Rapson's Catalogue of Indian Coins, Pages 32, 33.
8. Epigraphia Indica.
9. ఆంధ్రులచరిత్ర. భా. పు. ౧౯౧.
10. Epigraphy Reports (Madras-1915-1916.)
11. Epigraphy Reports (Madras-1910-1911 Part II.
12. Ancient History of the Deccan by G. T. Dubreuil, Page 108.

త్సోంగ్లాస్తాన్' (Yetsonglostan) అను నాతడు వానికి కొంత సైన్యమిచ్చెననియు, అతడా సైన్యముతో మరలవచ్చి పులమాయి శత్రువునోడించి వానిని చెఱబెట్టెననియు 'డిగెన్సుఓలోనాచెన్' వ్రాసియున్నాడు.[13] దీనినిబట్టి మనము కడపటి ఆంధ్రరాజులకును చీనారాజులకును, మైత్రియుండెననియు ఆమైత్రిని ఉపలక్షించియే చీనారాజులు పులమాయి మరణానంతరము ఆంధ్రసామ్రాజ్యమునకు సంభవించినకల్లోలమును నివారింప బ్రయత్నించిరనియు నూహింపనైయున్నది ఆకాలమున హిందూదేశమునుండి అస్సాముమీదుగా చీనాదేశమున కొకరాచబాట ఉండెనని చరిత్ర తెల్పుచున్నది.[14]

గౌతమీపుత్ర శాతకర్ణ్యాది మహావీరబాహాపరిరక్షితమై, గంగాతరంగములతో నుయ్యాల లూగె, ప్రాక్పశ్చిమవార్ధిఘోషములకు చెవియొగ్గి, కాంచీపురకామాక్షీదీవెనలువడసి, శత్రుదుర్నిరీక్ష్యమై వెలసినప్రాచీనాంధ్ర ప్రాజ్య పూజ్య సామ్రాజ్యము మూడవపులమాయికితరువాత యధాయధలైనట్లు కనుపించుచున్నది. ఉత్తరదేశమున కుషాన్ రాజ్యముకూడ ఈకాలముననే అస్తమించినది.

శకరాజుల నిరంతరవైర మీయాంధ్రసామ్రాజ్యపతనమున కొకకారణము కావచ్చును. దేవగిరి యాదవుల కాకతీయాంధ్రసామ్రాజ్యమును తమనిరంతరవైరముచే భగ్నమొనర్చినట్లే విదేశీయులగు శకరాజులీప్రాజ్య ప్రాచీనాంధ్ర సామ్రాజ్యమును తమ నిరంతరవైరముచే కూలద్రోసిరి. క్రీ. శ. ౨౪౯—లో కాలచుర్యులాంధ్రులనోడించిరి.[15] కాకతీయులయొద్ద సేనానాయకులుగ నుండిన రెడ్డి వెలమనాయకులు కాకతీయాంధ్రసామ్రాజ్యనిర్మూలనముతో స్వతంత్రించి ప్రత్యేకరాజ్యములు స్థాపించినటులనే శాతవాహనరాజుల దగ్గర ఉన్నతోద్యోగ గౌరవములందిన పల్లవులు ఆంధ్రసామ్రాజ్యవిచ్ఛిత్తితో స్వతంత్రించి పల్లవసామ్రాజ్య స్థాపన మొనర్చిరి. శాతవాహనవంశము అంతమొందిన అనంతరము ఆంధ్రసామ్రాజ్యములో చాలభాగము 'చూతు' అనుతెగవారి వశమయ్యెనని కొందఱువ్రాయుచున్నారు.[16] (బొంబాయి రాజధానిలోని ఉత్తరకనరాజిల్లాకు చెందిన) వైజయంతి (వనవాసి) రాజధానిగా ఆంధ్రభృత్యవంశములో నొకతెగయైన 'చూతు' వంశమువారుకొంతకాలము పరిపాలించి కాదంబులచే నోడింపబడిరని కొందఱు వ్రాయుచున్నారు.[17]

ఆంధ్రభృత్యవంశము అంతమొందిన అనంతరమున ఆవంశములోని వేఱొకశాఖకు చెందిన మఱియేడుగురు ఆంధ్రరాజులు పరిపాలింతురని మత్స్యపురాణ మిట్లు వాకొనుచున్నది.[18]

పురాణములు పేర్కొనని ఆంధ్రరాజుల పేళ్లు కొన్ని వినవచ్చుచున్నవి. అట్టి వానిలో రుద్రశాతకర్ణి యను వాని పేరొకటి. ఈతని నాణెములు కొన్ని దొరికినవి.[19] హారితీపుత్రశాతకర్ణి యొకడిట్టివాడు. ఈతని దానశాసనములు బనవాసిలో దొరికినవి.

---

13. Marsden's Asiatic Researches, Vol.IV, Pages 227-229. ఆంధ్రులచరిత్ర. భా. ౧. పు ౧౯౨.

14. S. C. Dutt's 'Ancient World.' P. 57. 'The Satakarni family of Andhra Rajahs also kept up a constant intercourse with China, a good royal road to which existed through Assam; and, on one occasion, the Chinese Government is said to have sent over an army to assist one Andhra Rajah in putting down a rebellion in India.

15. హిందూ మహా యుగము.

16. Ancient History of the Deccan by G. T. Dubreuil, (Page 48).

17. Rapson's Ancient India.

18 'ఆంధ్రాణాం సంస్థితా (తే)? రాజ్యే తేషాం, భృత్యాన్వయేనృపాః, సప్తైవాంధ్రా భవిష్యన్తి.'

ఆంధ్రులచరిత్ర. భా. ౧. పు. ౧౫౬

19. Rapson's Catalogue of Indian Coins, Pages 46, 47.

## ౬
## నా గ రి క త

ఆంధ్రరాజులచరిత్ర ఇంతతో ముగిసినది. ఇక ఆ నాటి నాగరికతను గురించి ఒక్కింతవ్రాసి ఈవ్యాసము ముగించెదను. ఆకాలమున ఆంధ్రనాగరికత కృష్ణాగోదావరీ పుణ్యతరంగిణుల నంటియుండెను.

### భాషాసారస్వతములు

ఆంధ్రరాజులు తమ శాసనములు ప్రాకృతభాషలో వేయించిరి. అవి మౌర్యలిపి (బ్రహ్మలిపి)లో నున్నవి. అప్పటికి మన ఆంధ్రభాషకు రూపేర్పడ నట్లున్నది. కావున ఆకాలమున ప్రాకృతభాషయే ఆంధ్రుల వ్యవహారిక భాషయని చెప్పవచ్చును. పైశాచికూడ వ్యవహారములో నున్నట్లు కన్పట్టు చున్నది. ఆనాటి భాషాస్వరూపము తెలియవచ్చుటకై గౌతమీపుత్ర శాతకర్ణి ఒకశాసనములోని కొంతభాగ మీదిగువ నుదహరింపబడుచున్నది. 1—

'సిద్ధం సెనాయె వెజయంతియె విజయఖ
ధావారా గో వధనస బెనా కటకస్వామి
గోతమిపుతో సిరిసధకణి ఆనపయతి
గోవధనె అమచవిణ్హు పాలితగామె
అపరక ఖడియె యక్షెటం అజకాలకి
యం ఉసభదతె నభూతం లవతనశతాని
బె ౨౦౦ ఎత అంహాఖెతని వతనసతాని......'

హాలుని సప్తశతి; ఆతనిమంత్రి గుణాఢ్యపండితుని బృహత్కథ (ఇది పైశాచీభాషలో వ్రాయబడినది;) కాతంత్రవ్యాకరణము; నాగార్జునుని సుహృల్లేఖ, రతిరమణము, సిద్ధవినోదము, ఆకాలమునాటి సారస్వతము.

ఆకాలమున ధాన్యకటక నగరమున గొప్ప బౌద్ధ విశ్వవిద్యాలయ ముండెను.

### మతము

అశోకుడు ఆంధ్రదేశమున తొలుదొల్త బౌద్ధమతప్రబోధకులను ప్రచారమును కల్గించెను. ఆతని అనంతరము ఆంధ్రరాజులు బౌద్ధమత మవలంబించి బౌద్ధభిక్షువులకు దానధర్మములుచేసి బౌద్ధమతమును పోషించిరి. అట్లుగుట ఆకాలమున బౌద్ధమతము జనసామాన్యమునందు విశేషవ్యాప్తి కాంచియున్నది. వర్తకులు, స్వర్ణకారులు, వడ్రంగులు, ధాన్యపువ్యాపారము చేయువారు, ఓషదివిక్రేతలగు గాంధికులు, సామాన్య గృహస్థులు, స్త్రీలును, బౌద్ధభిక్షువులు చతుర్మాస్యలు జరుపుటకై ఏకశిలామయమైన కొండలను దొలిపించి గుహలను మఠములను, చైత్యములను, నిర్మించుచు వచ్చిరి.2 బౌద్ధభిక్షువులు మతప్రచారమునకై విదేశములకు కూడ వెళ్లు చుండిరి. బౌద్ధమతముతోపాటు బ్రాహ్మణ మతమును వర్ధిల్లుచుండెను. ఆంధ్రరాజులు బౌద్ధ మతావలంబకులయ్యు హిందూమతమునకూడ అభిమానము కలిగియుండిరి. గౌతమీపుత్ర శాతకర్ణివంటి రాజులు వర్ణసంకరము కలుగకుండ కాపాడుచుండిరి. ఇట్టిరాజులు సర్వమతములను సమదృష్టితో చూచుచుండిరి. బౌద్ధ బ్రాహ్మణమతములుకాక ఆకాలమున జైనశైవమతములు కూడ ప్రచారములోనున్నట్లు తెలియుచున్నది.3

### సిద్ధనాగార్జునుడు

అమరావతీవాసుడును, బుద్ధుని యనంతరము, బౌద్ధమతాచార్యులలో ప్రసిద్ధుడును అయిన సిద్ధనాగార్జునుడు4 ఆంధ్రరాజుల కాలపువాడు. అమరావతీ బౌద్ధస్తూపము నాగార్జునునికై ఆంధ్రరాజులనే నిర్మింపబడెనని పురాతత్వ్వఙ్ఞుల వ్రాతలనుబట్టి యూహింపనగును.

నాగార్జునుడు బోధిసత్వుడు. అతిడు త్రికాలజ్ఞుడు. మారణోచ్చాటనాది షట్కర్మలను వశపఱచుకొన్నవాడు.-'తుండి' అనువాడు నాగార్జునుని శిష్యుడు. హీనాయనులని, మహాయనులని బౌద్ధులు రెండుతెగలు.

1. రాజరాజ నరేంద్ర పట్టాభిషేకవర్ధంతి సంచిక, పు. ౫౧.
2. ఆంధ్రులచరిత్ర, భా. ౧, పుట ౧౬౩.
3. Rhys David's Buddhist India.
4. రక్తాక్షి ఉగాదిసంచిక.

అందు మహాయానపద్ధతికి సిద్ధనాగార్జునుడు జనకుడు. ఆతడు ప్రజ్ఞాపరిమితములను మహాయాన సూత్రములకు కర్త.

మతప్రచారమునకై నాగార్జునుడు దేశదేశములు తిరిగెనని తెలియుచున్నది. నాగార్జునుడు కాశ్మీరరాష్ట్రమున ఆరుదినములు సంచరించెనని రాజతరంగిణి చెప్పుచున్నది. రేవాతీరమునందు శాంతినికేతనమను ఒకమనోహరమైన ఆశ్రమమున ఆతడు కొంతకాలముండెనని సిద్ధవినోదమువలన తెలియుచున్నది హిందూదేశముపై క్రీస్తుపూర్వము రెండవశతాబ్దిలో దండెత్తివచ్చిన గ్రీకు మీనాండరుతో నాగార్జునుడు మతవిషయకచర్చ సల్పెనని పాళీగ్రంథమొకటి చెప్పుచున్నది.

నాగార్జునుడు యజ్ఞశ్రీకాలమున జీవించియుండెనని ఆంధ్రచరిత్రకారుని అభిప్రాయము. క్రీ. పూ. ౧౫౦-లో గంగానదిపర్యంతము విజయయాత్ర సల్పిన గ్రీకుమీనాండరుతో మతవిషయమై ఈసిద్ధనాగార్జునుడు చర్చించియుండెనని ఒకపాళీగ్రంథము సాయామున రమేశచంద్రదత్తు నిర్ణయించుటచే ఆంధ్రచరిత్రకారుని వ్రాత సరికాదనవలయును.

'సుహృల్లేఖ' మున్నగుకావ్యములను నిర్మించియు ప్రజ్ఞాపరిమితాది మతగ్రంథములను నిర్మించియు, రసతంత్రముపై గొప్పగ్రంథముల వ్రాసియు, పటుపర్ణి మున్నగు మూలికలసాయమున, నేటికిని బంగారము చేయగల సిద్ధులమూలమునను, అమరావతి, శ్రీశైలము మున్నగుచోట్ల నిర్మితములైన శిలాచిత్రముల పేరుపెట్టియు, నేటికిని, ఎప్పటికిని మనకు సంస్మరణీయుడైయున్న యీనాగార్జునునికి నమస్కారము.[5]

శ్రీశైలమున సిద్ధనాగార్జునుడు నిర్యాణమొందెనని త్రివిష్టపదేశమందలి గాథగ్రంథములు వివరించుచున్నవి.

## శాలివాహనశకము

ఆంధ్రరాజులు మనకిచ్చినవానిలో శాలివాహన శకమొకటి. ఇది దక్షిణహిందూదేశమునందంతటను ప్రచారములో నున్నది. శాలివాహనశకము ఉత్పత్తిని గురించి చరిత్రకారులు భిన్నాభిప్రాయులైయున్నారు. ఈశకమున కాదిపురుషుడు గౌతమీపుత్రుడని కొందఱు[6]; నహపానుడని కొందఱు[7]; చష్టనుడని కొందఱు.[8] నిర్ణయించుచున్నారు. ప్రాచీనశాసనములు శకనృపకాల మనుచున్నవిగాని శాలివాహనశక మనుట లేదు.[9] శాలివాహనశకమునకును ఆంధ్రరాజులలో పదునేడవవాడగు హాలశాతవాహనునకును ఏదియో సంబంధముండినట్లు కనబడుచున్నది. శకనృపులచే ప్రారంభింపబడి ఈశకము హాలశాతవాహనునిచే ప్రోత్సహింపబడినట్లూహింపబడుచున్నది.

## స్థానికపరిపాలన

ఆ కాలమునాటిస్థానిక పరిపాల నాక్రమము చక్కగా నుండినట్లు భట్టిప్రోలు శాసనము, ఋషభదత్తుని నాసికశాసనము చాటుచున్నవి. మతధర్మ కార్యనిర్వాహమునకై నిగమసభలను, పౌరజనోపయోగకారులగు కార్యములు నిర్వహించుటకై పౌరసభలును ఆకాలమున ఉండినవి. పూగశ్రేణులు (Merchant guilds) వర్తక వ్యాపారాభివృద్ధిని గమనించుచుండినవి. నేతగాండ్రు, గాంధికులు మొదలైన ఆయా జాతులవారికి ప్రత్యేకించి పూగశ్రేణులుండెడివి(Craft Guildfs). ఈవర్తకశ్రేణులకు శ్రేణి సభామందిరములు పశ్చిమదేశమందలి కొండలలో తొలవబడి నేటివఱకు గాన్పించుచున్నవి.[10] ఇట్టి మందిరమొకటి జయంతీ నగరవాసియగు నొకనేత కార్లీగుహలలో నిర్మింపచేసెనని చెప్పబడియున్నది. ఆపూగశ్రేణులు క్రమమైన ఏర్పాటులు, నిబంధనలుకలిగి, ప్రజలయొద్ద సొమ్ము తీసికొని అసలు

5. పూర్వోక్తప్రమాణమునుండి.
6. Cunningham.
7. Bhavudaji.
8. Dubreuil.
9. Early History of India.
10. ప్రాచీనాంధ్ర నౌకాజీవన చరిత్ర, పు. ౮౧.

తమయొద్ద శాశ్వతముగ నుంచుకొని వారలకు తరతరములకు వడ్డినిచ్చుచుండెను. ఆకాలమున నూటికైదు మొదలు ఏడున్నరవఱకు మాత్రమే వడ్డి గైకొనబడుచుండెను. దేశములో విక్రాంతి విప్లవములు జరిగినను ఈనిగమసభలు, పౌరసభలు, పూగశ్రేణులు స్థానికస్వపరిపాలనము యథాప్రకారము జరిగిపోవుటకు తోడ్పడుచుండెను.

## స్త్రీలు

ఆకాలమునాటి స్త్రీలు విఖ్యాతలుగా, విద్యావతులుగా గన్పట్టుచున్నారు నాటి స్త్రీల మతాభినివేశమునకు వారి శాసనములే దర్పణములు. గౌతమీ బాలశ్రీ, వాసిష్ఠీపుత్ర శివశ్రీ శాతకర్ణిరాణి, ఇత్యాది ఆంధ్రరాణులు వేయించినశాసనములు వారు రాజ్యపాలనాక్రమమున ఆంధ్రరాజులకు తోడ్పడుచుండిన ఊహింపవచ్చును. గౌతమీపుత్ర శాతకర్ణిరాణి శ్రావకుడను వానిని గోవర్ధనమున పాలకుడుగా నియమించెనని శాసనమొకటి తెల్పుచున్నది.[11]

## సముద్ర వాణిజ్యము

ఆంధ్రసామ్రాజ్యకాలమున విదేశములతోడి సముద్రవాణిజ్యము విరివిగ సాగుచుండినట్లు గ్రీకు, రోమను, చినాచరిత్రకారుల వ్రాతలును, మనదేశమందు దొరకిన పూర్వపు నాణెములును చెప్పుచున్నవి. ఆకాలమున పశ్చిమమున ఆసియా, గ్రీసు, రోము, ఈజిప్టుదేశములతోడను, తూర్పున బర్మా, సయాము, చీనా, ప్రాక్సముద్ర దీపసమూహము మున్నగు దేశములతోడను సముద్రవ్యాపారము సాగుచుండెను.[12] కృష్ణా గుంటూరు మండలములందు విశేషముగ దొరకిన రోమక నాణెములనుబట్టి ఆంధ్రరాజులు ఖండాంతరములతో వర్తకము చేయుచుండిరనియు, రోమక చక్రవర్తుల నాణెము లీదేశమున చలామణీ యగుచుండెననియు మనకు తెలియుచున్నవి.[13] యవనవర్తకులేకాక యవనబాలికలుకూడ ఆంధ్రసామ్రాజ్యపశ్చిమతీరమందలి బెరిగాజ్ అనబడుభరుకచ్ఛము రేవునకు ఓడలలో వచ్చుచుండువారు.[14]

బుద్ధునికి పూర్వమునుండియు గోదావరీ కృష్ణా ముఖద్వారప్రాంత దేశములనుండి ఆంధ్రనావికులు వాణిజ్యార్థము వంగసముద్రము దచ్చికొనివచ్చి, ఐరావతిమీదుగా చీనాదేశమునుండి వచ్చుసువర్ణముతో వర్తకము కావించుచుండిరని పెగుదేశములోని కాలానుగతములైన గాథలును స్థలపురాణములును తెలుపుచున్నవి.[15] యజ్ఞశ్రీకాలమునాటి ఓడముద్రగల నాణెములు ప్రాచీనాంధ్రసముద్ర వాణిజ్యమునకు మఱియొకనిదర్శనము ఆకాలమున కూడూరు, ఘంటశాల మొదలగు తెనుగురేవులనుండియే హిందూనాగరికత బర్మా, మలాకా, కాంబోడియా, అనాము, జావాదేశములకు వ్యాపించెనని చెప్పుచున్నారు.[16] ఆంధ్రభాగ్యముమోయుఆనాటిఆంధ్రనౌకలకు మహాసముద్రము లెన్నియో పాయయొసగినవి. సన్ననినూలుబట్టలవర్తకము ఆకాలమున విశేషముగ నుండెను. అప్పటివర్తకులు సేరులని పిలువబడుచుండిరి. వారు విశేషధనవంతులై దానధర్మము లొనర్చుచుండిరి.

## సముద్రమార్గములు

ఆకాలమున పశ్చిమదేశములనుండియోడలుపశ్చిమసముద్రతీరమందలి భరుకచ్ఛము, సింహపురము, శూర్పారగము (సోపారము), కళ్యాణ మొదలగు రేవుపట్టణములకు వచ్చుచుండెను. అచ్చటినుండి సింహళమునకు, సింహళమునుండి గంగానదీ ముఖద్వారమందుండిన తామ్రలిప్తినగరమునకు సముద్రమార్గము కలదు.[17] తామ్రలిప్తినగరమున బయలుదేరిన యోడలు తూర్పుతీరము

11. ఆంధ్రుల చరిత్ర, భా. ౧, పు. ౧౩౦.
12. Imperial Gazetteer, New Edition, Vol. II, P. 325.
13. ఆంధ్రులచరిత్ర, భా. ౧., పు. [illegible].
14. The Periplus of the Erythrean sea, (Para 49.)
15. History of Burma Phayre, (Page 24.)
16. History of the Ancient Deccan, Dubreuil, P. 86, 88.
17. ఆంధ్రులచరిత్ర, భా. ౧, పు. [illegible].

వెంబడివచ్చి, కళింగములోని గొప్పరేవైన 'అజ్జిటా' నుచూచుకొని, అక్కడనుండి బయలుదేరి గోదావరీముఖ ద్వారముననున్న కోరంగి, బందరు, పలంగ,[18] అనురెండు రేవుపట్టణము లను; కృష్ణాముఖద్వారముననున్న బందరు మచిలీరేవుపట్టణమును; చూచికొని ఆంధ్రదేశమున మాసలపురపురేవు (మోటుపల్లి) మీదుగా సింహళద్వీపమునకు పోవుచుండెను.

## నాటు వర్తకము

సముద్రవాణిజ్యముతోపాటు ఆకాలమున నాటు వర్తకముకూడ సాగుచుండెను. ఈదేశమందలి బట్టలు మొదలగునవి ధాన్యకటకమునుండి ప్రతిష్ఠానపురము దేవగిరిమీదుగా మెట్టదారిని భరుకచ్ఛమురేవునకు గొంపోబడి అచ్చటినుండి పశ్చిమమండలములకు పంపబడుచుండినవి.[19] పశ్చిమఖండములనుండి వచ్చుసరుకులుకూడ భరుకచ్ఛమునుండి మెట్టదారిని ప్రతిష్ఠానపురము మీదుగానే ఈదేశములోనికి కొనిరాబడుచుండెను. భరుకచ్ఛమునుండి ప్రతిష్ఠానమునకు పదిరోజులప్రయాణమని పెరిప్లసు వ్రాయుచున్నాడు.[20]

## నాణెములు

ఆంధ్రచక్రవర్తుల కాలమునాటి నాణెములు, సీసము, రాగి, వెండి, బంగారము మొదలగు లోహములతో చేయబడినవి. వీనిలో పెక్కువేల నాణెములు ధరణికోట, గుడివాడ, ప్రాంతములందును, నెల్లూరు ప్రాంతమందును, ఆంధ్రసామ్రాజ్యములో పశ్చిమభాగమగు మహారాష్ట్రదేశమందును దొరికినవి. పశ్చిమదేశమున దొరికిన ఆంధ్రనాణెముల పైన విల్లునంబులు చిత్రింపబడి యున్నవి. మఱికొన్నిటిపై బౌద్ధధర్మచక్రములును, బోధివృక్షమును, ఏనుగులు, ఓడలు ఇత్యాదులు చిత్రింపబడియున్నవి.

## శిల్పవిద్య

ఆంధ్రరాజులకాలమున శిల్పవిద్య మిక్కిలి అభివృద్ధిలో నుండెను. ఆనాటికుమ్మరులీకాలపునాటి వారికన్న నధికచాతుర్యము కలిగియుండిరి.[21] ఆంధ్రరాజులు అనేకచైత్యములు, స్తూపములు, విహారములు, రాజభవనములు నిర్మించుచుండినవారగుటచే శిల్పులకు చేతినిండ పనియు, వారి అసదృశకౌశల్యమునకు ఉచితోపయోగ్యవృత్తియు కల్గుచుండెను.[22] ప్రత్యేకశిలలతో బట్టబయలున కట్టబడక పర్వతములను, గుట్టలను తొలిచి నిర్మింపబడినబౌద్ధదేవాలయములాకాలమందలి అద్వితీయ శిల్పకళానైపుణ్యమునకు బూరగొమ్ములు. అమరావతీ స్తూపమునందు శిలాస్తంభములపై శిల్పకులుచూపిన పనివానితనము సాటిలేనిది. ఇట్టిస్తూపములు జగ్గయ్యపేట, గుడివాడ, భట్టిప్రోలు, ఘంటశాల మొదలగు స్థలముల కూడ గలవు ఇవి తూర్పుదేశమునకు చెందినవి. పశ్చిమదేశమున కార్లీచైత్యము, అజంతావిహారమును ప్రాచీనాంధ్రులశిల్పవిద్యానైపుణ్యమును ఉపన్యసించుచున్నవి. అజంతా గుహాలయములలో మధ్యభాగమున నుండునవి ఆంధ్రరాజులకాలమున కట్టబడినవని తెలియుచున్నది. ఈప్రాచీనాంధ్రశిల్ప కళాలయములు తిలకించుటదైవప్రసాదములగు మానవనేత్రములకు ఉచితోపయోగ్యవృత్తి.

## ఉపసంహారము

ఆంధ్రులశిల్పవిద్యానైపుణ్య మట్టిది. వారిసామ్రాజ్యనిర్మాణ కౌశల్యమట్టిది. వారిప్రతాపోన్నతియట్టిది. వారిబౌద్ధమతాభినివేశన మట్టిది. వారిసముద్రవ్యాపారవైభవ మట్టిది. వారిప్రతిభాప్రాగల్భ్యము లట్టివి: అట్టి మనప్రాక్తన వైభవమునుగూర్చి పతితస్థితియందున్న మనమిట్లని పాడుకొందము:—

సీ. ఒకనాడు గలదాంధ్ర యువకులు తూరుపు
కనుమ దుర్గములనేలినదినంబు
ఒకనాడుగలదు శిల్ప కళాసరస్వతి
అమరావతిని నృత్యమాడు దినము
ఒకనాడు కలదాంధ్ర సకలప్రపంచమ్ము
కృష్ణాస్రవంతి నూగినదినంబు
ఒకనాడు గలదు నిల్వక పాఱు శత్రుల
నాంధ్రసైన్యంబు వేటాడుదినము
ఒక్కనాడున్న యది యాంధ్రయుద్ధభూమి
కత్తివాడికి రిపులరక్తంబు నదులు
కట్టినదినంబు నేటికి కాలవశత
నస్మదున్నతి తలక్రిందులయ్యెగాని.

——విశ్వనాథ సత్యనారాయణ

18. See map in Cunningham's Ancient Geography of India.
19. ఆంధ్రులచరిత్ర, భా. ౧.
20. Bhandarkar, Early History of Deccan.
21. Archealogical Survey of India, New Imperial Series, Vol. XV.
22. లలితకళలు (కొమఱ్ఱాజు లక్ష్మణరావు)



# భక్తమునిజనహృద్వాస పరమపురుష?

ఖాసీం ఆలీసాగారు

బాల పాపలలోని లీలావికాసంబుఁ, గర్మయోగముచేతఁ గాంచి కాంచి
యోగముద్రోద్వృత్తి రాగులౌ భోగులు, తర్కసిద్ధాంతముల్ తఱచి తఱచి
మాటిమాటికి సురల్ చాటుతేఁటులపాట, తేటలోపలి నిగ్గుఁ దీసి తీసి
అబ్జజాండము మొదలణువుదాఁకనుగల్గు, వేదాంతమార్గముల్ వెదకి వెదకి
ప్రకృతి సృష్టిప్రపంచంబు బయలుగాక, గ్రంథనిర్మాణమును జేయు కవులుగూడ
కనుఁగొనఁగలేరు నీదు సంకల్పములను, భక్తమునిజనహృద్వాస పరమపురుష!

సీ. రాతిలోఁ గప్పకు మేతవేసినచేతఁ, బసులకుఁ గసవులో విసము పెట్టి
కారుమేఘమునందుఁ గానాలనంబుంచి, ఫణిశిరంబునయందు మణి సమర్చి
రమకు లుబ్ధునికాపురముఁ గాపురముచేసి, ధర్మాత్మునింటఁ బెద్దమ్మ నుంచి
మొగలిపూపొదలు పాములకు వాసముచేసి, పద్మాలయముల షట్పదము లుంచి
గారడీవాఁడు జాలంబు గడపుమాడ్కి, నడవఁగాఁ జేతు వీ జగన్నాటకంబు
నీదుసంకల్పములఁ గాంచ నెవరితరము, భక్తమునిజనహృద్వాస పరమపురుష!

సీ. బందిఖానాయందుఁ బడియున్న గోపన్నకన్న భక్తుం డొక్కఁ డున్నవాఁడె
పరమాత్మచే దిగంబరియై చరించు వేమన్నకన్న మహాన్యుఁ డున్నవాఁడె
రాజయోగి మహావిరాగి వీరబ్రహ్మ, గురువరేణ్యునికన్న గురుఁడుగలఁడె
పరమరాజర్షి పావనమహర్షి గాంధిమహర్షికన్న మహాత్ముఁ డవనిఁగలఁడె?
నీదుసంకల్పములఁ గాంచనేరకకట, వారలే చిక్కులను బొందినారి కెవ్వ
రెంతవారలు నీతత్త్వ మెఱుఁగుటకును, భక్తమునిజనహృద్వాస, పరమపురుష!

సీ. కడుదురాత్ముఁడు రావణుఁడె కష్టపడెనంద, మన్న రాముండేల బన్నమందె?
చెడు సుయోధనుఁడె పెన్మడుగునఁ బడెనన్న, ధర్మజుం డడవులఁ దగులనేల?
మతిలేక వాలి దుర్గతులఁ బొందెనటన్న, సుగ్రీవుఁ డద్రిలోఁ జొరఁగనేల?
రాకాసి అల్ల శూర్పణఖ కుందెనటన్న, సాధ్వి సీతాదేవి శ్రమలఁబడదె?
పాపులని భక్తులని భేదభావమేమొ?, కనఁబడఁగనీవు సుమ్మి మా కన్నులకును
నీమహత్త్వం బెఱుఁగు విద్య నేర్వఁగలమె? భక్తమునిజనహృద్వాస, పరమపురుష!



ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవము




[ఈవ్యాసము వ్రాసినవారు బొబ్బిలిసంస్థానజ్యోతిషవిద్వాంసులు. 5, 6 ఏండ్లక్రింద ఈవ్యాసమును వారు నాచేతి కిచ్చిరి ఇది యితరత్ర ప్రకటితమైనదో లేదో! ప్రాంతకాగితములలో నాయొద్దఁబడియున్న దీని నిటీవలఁ గనుఁగొని మంచి విమర్శ మగుటచే ప్రకటింప నొసంగితిని.—వే. ప్ర.]

"౧౯౦౬ సం. జనవరి ౧౨ తేదిగల 'సత్యవాదిని' పత్రికలో కృష్ణదేవరాయమహీపాలుని జయంత్యుత్సవమునందు ప్రచురింపబడిన వ్యాసమునందలి జన్మదినమును వ్యక్తపరచు

"అందలి శాలివాహనశ
కాబ్దము లద్రివసుత్రిసోమములన్
వందితమైన యవ్వికృతి
వత్సరమందలి పుష్యమాసమం
దుం దగు కృష్ణపక్షమున
నుండెడి ద్వాదశి శుక్రవాసరం
బం దుదయించె కృష్ణుఁడు శుభాన్వితుఁ
డా నరసింహమూర్తికిన్."

అనుపద్యమునందు శాలివాహనశకము ౧౩౯౨, వికృతి సం. పుష్య బహుళ ద్వాదశీ శుక్రవార మని యున్నది.

మనవారు శకమువేయుటలో తరుచుగ గతాబ్దమును, నరుదుగ వర్తమానాబ్దమును గనుపరచుచుండుట గలదు. ౧. ఆపద్యమునందలి శకము ౧౩౯౯ వర్తమానాబ్దమగుచో నా సంవత్సరము తారణసంవత్సరముగాని వికృతిసంవత్సరము గాదు. ౨. శకము ౧౩౯౨ గతాబ్దమగుచో నాసంవత్సరము పార్థివ సం. రముగాని వికృతిసంవత్సరము గాదు. కావున విషమముగ నున్నది.

జయంత్యుత్సవమునకు జన్మదిన మావశ్యకము గావున నందలి యధార్థమును మనము విచారించవలయును. అందుకు పద్యమున ముఖ్యాంశములు మూడు:

౧. శకము.

౨. సంవత్సరము.

3. పుష్య బహుళ ద్వాదశి, నాటి వారము.

ముందు శకమునుగురించి విచారించెదము.

౧. శకము ౧౩౯౨ వర్తమాన మగు తారణసంవత్సర మనుచో నాసంవత్సరమున పుష్య బహుళ ద్వాదశి మంగళవారముగాని శుక్రవారము గాదు.

౨. శకము ౧౩౫౭ గతాబ్దమగు పార్థివ సంవత్సర మనుచో నాసంవత్సరమున పుష్య బహుళ ద్వాదశి సోమవారముగాని శుక్ర వారము గాదు.

కావున శకము సరియయిన దనుటకు వీలులేదు.

ఇక సంవత్సరమునుబట్టి విచారించెదము.

ఒక శకమున నొక సంవత్సర మనేక పర్యాయములు సంభవించును గావున నొక సంవత్సరమునకు ననేకశకాబ్దములు గలవు.

అందాకాలమునకు విచారించెదము.

అందలి వికృతిసంవత్సరమునకు శకము ౧౩౮౨ గతమైయున్నది. ఆ సంవత్సరమున పుష్య బహుళ ద్వాదశి శుక్రవారమైనది. కావున నాపద్యమునందలి "శకాబ్దము లద్రివసుత్రిసోములన్" అనువాక్యము "శకాబ్దములన్ ద్వినవత్రిసోములన్" అని సవరణచేయుచో పైని వ్రాసిన శకాదులు మూఁటికి నన్యోన్యవైషమ్యములు లేక సంబంధము కలిగి యుండును. కావున మొదల నాపద్య మటులనే రచియింపంబడి యిటీవల నందలి౧౩౮౨ శకమును వ్యక్తపరచు "శకాబ్దములన్ ద్వినవత్రిసోములన్" అనువాక్యము ప్రమాదము వలన "శకాబ్దము లద్రివసుత్రిసోములన్" అను వాక్యముగను నందలి "ద్వినవ" అను నక్కరములు "ద్రివసు" అని మారినటులను మన మూహించవలసియున్నది. ఏలనన"ద్వి" అను నక్కరమునకు పూర్వమునందు గల "ల" అను నక్కరమునకుగల నకారపొల్లును "ది" అను నక్కరమునందలి "వ" కారమును గలసి "ది" అను నక్కరమునకు రేఫఅగును. "నవ" అను నక్కరములు లేఖకప్రమాదము వలన "వన" అని ముందు వెనుకలను బడుటనుబట్టి యందలి "న" అను నక్కరము "స" అను నక్కరముతో సంబంధించియుండుటవలన "వస" అనియు మారి "శకాబ్దము లద్రివసత్రిసోములన్" అను వాక్యమైనటులను, నందలి "వస"పదమునకు నంకసంజ్ఞలో నర్థములేనందున"వస"పదమునందలి "స"అను నక్కరమునకు గల "ఉ" కారము లోపించినదిగా యోచించి "శకాబ్దము లద్రివసుత్రి సోములన్" అని సవరణకాబడినటులను దోచుచున్నది. కావున నది సవరణ గావలసియున్నది. పయిసవరణ ననుసరించి శకము ౧౩౮౨ వర్తమానాబ్దమని యోచించి యా సంవత్సరము విరోధిసంవత్సర మనుచో నా సంవత్సరమున పుష్యబహుళ ద్వాదశి, శనివారము గాని శుక్రవారము గాదు. కావున నాపద్యమునందలి ముఖ్యాంశము లగు శకాదులు మూఁడును శకము ౧౩౮౨ గతాబ్దమునందు పరస్పరవైషమ్యములు లేక సంబంధించి యుండుటవలన శకము ౧౩౮౨ గతించిన వికృతిసంవత్సర పుష్యబహుళ ద్వాదశీ శుక్రవారమున కృష్ణరాట్ప్రభుని జన్మదినమైనటుల మన మేర్పరచవచ్చునని విశదీకరించెను.

ఆరోజున ద్వాదశి సూర్యోదయాది పది గడియలవఱకును,పూర్వాషాఢానక్షత్ర మను పది ఘడియలవఱకును నున్నవి. ఆదిన మర్ధరాత్రమునకు మకరములో సూర్యునికి భాగా

ది ౨౨-౧౧-౩౫ భుక్తమైనందున నిక మకర మాస మెనిమిది దినములవఱకు నున్నది.

జయంత్యుత్సవమునందు చాంద్రమాన ప్రవర్తకులకు చాంద్రతిథియు, సౌరమాన ప్రవర్తకులకు సౌరమానమునందలి తిథినక్షత్రములును ప్రధానములై యున్నవి.

కావున చాంద్రమానప్రవర్తకులు పుష్య బహుళ ద్వాదశియందును, సౌరమానప్రవర్తకులు మకరకృష్ణ ద్వాదశీ పూర్వాషాఢా నక్షత్రములందును నాచరించుట యుక్తమని విశదపరచెదను. అటులుగాక యందఱు నొకే దినముననే యాచరింపవలయుననుచో నా మహాత్ముడు జన్మించిన దినము క్రీస్తుశకము ౧౮౭౧ సంవత్సరము ౧౬ తేది అయినది; కావున జనవరి ౧౬ తేదిని జరిగించిన నొకేవిధముగ నుండునని విన్నవించెదను.

కొటికలపూడి యజ్ఞేశ్వరగారి నరసింహాశర్మ"



# ఆ వే ద న

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

ఇట్టి దట్టిది యనుచు నూహింపరాక
హృదయ మావేదనంబడి సదమద మగు
నెద్దియో చెప్పఁగాఁ బోవు నేదొ గొంతు
కడ్డపడినట్టులుండి ప్రయాసపడును.

స్మృతికివచ్చినయటులుండి స్మృతికి రావు
నాదు మునుపటివైన జన్మముల కథలు
కానఁబడినట్టులుండియుఁ గాన రాదు
నాభవిష్యచ్చరిత్ర మంతయు నదేమొ!

అలికిడైనట్టులుండు నెయ్యాతఁడు లేఁడు
గుసగుసలుదోఁచు నదియేమొ! గోచరింప
దెదియొ పయిఁబ్రాఁకినట్లుండు నెదియుఁ గానఁ
బడదు; మెయినెదే దూరెనో? చిడిముడియగు

జరుగుచున్నది హృదయగహ్వరమునందు
ఘోరయుద్ధమదేలొ? వాక్రువ్వఁజాల
నపుడపుడు నాదు గదియొద్ద కరుగుదెంచి
నన్నుఁగని కన్నుఁగొలఁకుల నవ్వు దీవు.



# యజ్ఞోపవీతము: దేశీయవస్త్రధారణము

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు

ఇక్కాలమున దేశీయవస్త్రధారణమే యవశ్యకర్తవ్యమని పలువురు తలంచుచున్నారు. కాని వారివారియం దభిప్రాయభేదములు కలవు. స్వరాజ్యప్రాప్తికి దేశీయవస్త్రధారణము ముఖ్యమని రాజకీయధర్మవేత్తలు నుడువుచున్నారు. దేశము భాగ్యవంతమై ప్రజకు సౌఖ్యముగూర్చుటకై యయ్యది యవసరమని యార్థికధర్మవేత్తలు నొక్కి వక్కాణించుచున్నారు. ప్రతివత్సరమును వస్త్రములవిషయమై మన దేశమునుండి యరువదికోట్ల రూప్యములు విదేశములపాలగుచున్నట్లుగా వీరు రుజువుచేయుచున్నారు. నేను రాజకీయరహస్యములను గాని యార్థికసూక్ష్మములను గాని యెఱింగియున్నవాఁడను గాను. కాన నాయావిషయములం గూర్చి ముచ్చటింప ననర్హుఁడను. కొంచెముగనో గొప్పగనో మతధర్మములంగూర్చి యించుక దెలిసికొన మొదటినుండియు బ్రయత్నించుచున్న వాఁడనగుటచే దానింబట్టి మన మెట్టివస్త్రములను ధరింపవలెనో విన్నవించుకొనుచున్నాఁడను.

హిందువులు మతప్రధానులను సంగతి లోకవిదితము. అట్లు ముఖ్యమైయున్న మతధర్మములంబట్టిచూడ స్వదేశవస్త్రధారణము ముఖ్యకర్తవ్యముగాఁ గాన్పించుచున్నది. మతకార్యములకై కర్మభూమిజనితముకాని పరదేశవస్తువుల మతాభిమానులు వాడరుకదా! సమస్తమతరాజ మగు మనహిందూమతము కార్పాసముకు మిక్కిలి పవిత్రములగు మతకార్యములందు వినియోగింప విధించుచున్నది. భక్తిశ్రద్ధలతో వ్రతాదికము నొనరించుచున్నవారు ప్రత్తిని, దాని సర్వపరిణామములతోఁ గూడ మతకార్యములయందు వినియోగించుచున్నారు. వత్తి, ప్రత్తిలేని మతకార్యములు లేవు. ప్రత్తినుండివచ్చు నూలునుగూడ ముఖ్యముగా మత కార్యములందు వాడుచున్నారు

తంతువులు

ప్రత్తినూలు మతకార్యములలో మఱింత ప్రధానతను వహించియున్నది. మిక్కిలి ఘనతను దెలుపు ద్విజత్వమును బోధించుటకై కార్పాససూత్రములు ప్రధానచిహ్నములుగా మనమతముచే నేర్పాటుచేయఁబడినవి. ద్విజత్వసిద్ధికై మనము మెడయందు ధరించు యజ్ఞసూత్రము మూఁడునూఁలుపోచలుకలదై యున్నదనుసంగతి లోకవిదితము. బ్రహ్మతేజస్సు నీపోఁచలుకలిగించునని శాస్త్రములు వక్కాణించుచున్నవి. ఇట్టి ప్రధానవిషయబోధకై నూలును మనవారు వాడుచున్న కారణమును మనము తెలిసికొనవలెను.

కార్పాసము మానమును కాపాడునదిగా నున్నది. శీతవాతాదిబాధలనుండి దేహమును రక్షించు రక్షగా నున్నది. అప్రత్యక్షమగు ఘనతేజస్సును గూర్చునదిగా నున్నది. కాబట్టియే యమూల్యమగు ద్విజత్వమును దెలుపుటకై మూఁడుదారపుపోఁచలమనవారు విధించియున్నారు. యజ్ఞసూత్రమునమూఁడు పోఁచలుండుటకుఁ గలకారణముంగూర్చి పలువురు పలువిధములఁ దలంచుచున్నారు. త్రిగుణములను, త్రిమూర్తులను దెలుపుటకై మూఁడుపోఁచ లేర్పాటుచేయఁబడినవని కొందఱనుచున్నారు. దేశోద్ధరణమునకై మనోవాక్కాయకర్మములచే స్వదేశమున వడుకబడిన నూలునే గౌరవింతుమని ప్రమాణము చేయుటకై మూఁడుపోఁచలు యజ్ఞసూత్రమునకు విధింపఁబడినవని మత రహస్యవేత్తల తలంపు. తాను ప్రాణమునకంటె హెచ్చుగఁ జూచుకొను మతచిహ్నముగా మూఁడు నూలుపోఁచలధరించుహిందువు విదేశవస్త్రధారణ మొనరించుట హాస్యాస్పదమని వేఱుగఁ జెప్పవలయునా? కటకటా! ప్రతివత్సరమును నఱువదికోట్లరూప్యములు మన దేశమునుండి పరదేశములపాలగుచుండినను మన ప్రధాన మతచిహ్నమగు యజ్ఞసూత్రవిషయముననే పరదేశతంతువులనే మనవారు వినియోగించుచున్నప్పు డెట్టి సాహసకార్యమునకైన నొడిగట్టుకొందు రనుటకు సందియము లేదుకదా! వేదపఠనపూర్వకముగాఁ దంతువులవడికి, వేదమంత్రోచ్చారణపూర్వకముగా యజ్ఞసూత్రముల సిద్ధముచేయవలెననియు వానిని మతాభిమానులు ధరించి దివ్యతేజస్సు నందవలెననియు శాస్త్రములు బోధించుచున్నవి. ధర్మమిట్లుండఁగా సీమనూలే యిక్కాలమున యజ్ఞోపవీతమై పూర్వాచారపరాయణుల బుజములమీఁదఁ గూడ నెక్కుచున్నది! ఇది మిక్కిలి శోచనీయాంశముగదా! ఇంక నిక్కమగు ద్విజత్వసిద్ధి యెట్లు కలుగఁగలదు?

వివాహవిషయమునఁ గూడ నూలు ప్రధానచిహ్నముగా నున్నది. వధువుయొక్క ద్విజత్వసిద్ధికి తంతుధారణమే ముఖ్యమగుచున్నది. వివాహములో నూలుపోఁగు లెంతో ముఖ్యమైనవిగానున్నవి. అందుఁగూడ సీమనూలే వాడఁబడుచుండుట వింతకాదా? కమ్మవారు మున్నగువారియిండ్ల జరుగు వివాహములలో వివాహవేదిక కప్పుడు రాట్నము ముట్టి వడికితీసిన నూలు చుట్టఁబెట్టుట ముఖ్యాచారముగా నేఁటికిని సాగుచున్నది. పెద్దలిప్పటికిని యాయా పవిత్రకార్యములకై సీమ నూలును వాడరు.

## వస్త్రములు

నవవస్త్రధారణము మతకార్యములలో ముఖ్యమైనదిగా నున్నది. వ్రతనియమార్థమై నూత్నవధూవరులకు మధుపర్కములు కట్టఁబడుచున్నవి. అట్టివానికిఁగూడ విదేశమునఁ గూర్పఁబడు వస్త్రములనే మనవారు వినియోగించుచున్నారు. ఇది యుచితమా? పితృశ్రాద్ధాదికములందుఁగూడ భోక్తలకిచ్చు వస్త్రములు విదేశీయములుగనే యున్నవి. లోకమంతయు రొట్టకట్టున నాగరకస్థితిలో నున్నప్పుడు మన దేశమున బట్టలు నేయఁబడుచుండె

డిది. బట్టలు నేయువిధానముంగూర్చి వేదమే ముచ్చటించుచున్నది. వస్త్రము పవిత్రమగుటకై చేయవలసిన నియమముంగూర్చి శాస్త్రములు ఘోషించుచున్నవి. ఆరీతిని నేత లేనివి మనహిందూమతముచేఁ బవిత్రమైనవి కానేరవు. ఐనను, మతకార్యవిషయములలోఁ గూడ విదేశవస్త్రముల మనవారు నిరాతంకముగా వినియోగించుట హాస్యాస్పదము కాకపోదు.

### ఉపసంహారము

నూలును బావనమతచిహ్నముగా ధరించు హిందువులెల్లరును త్రికరణశుద్ధిగా స్వదేశవస్త్రధారణము ముఖ్యముగాఁ జేయవలసి యుండునని తెలిసికొని మతరక్షకైనను స్వదేశతంతునిర్మితవస్తువులనే వినియోగింతురని నమ్ముచున్నాను. యజ్ఞోపవీతధారణము లేనివారివిషయమున నేమిచెప్పుదు వందులేని వారైనను మతకార్యములలో మతచిహ్నముగాఁ గ్రొత్తగుడ్డపేలికలనే వాడుకొనుచున్నారు. కాఁబట్టి హిందువులెల్లరును స్వదేశవస్త్రధారణముచేసినంగాని తమ మతకార్యముల సరిగ సాగించుకొనినవారు కానేర రనియు, స్వదేశవస్త్రధారణమే ముఖ్యమనియు, యజ్ఞసూత్రము దీనిని బోధించుచున్నదనియు లోకమునకుఁ దెలుపుకొనుచున్నాఁడను. స్వదేశవస్త్రధారణమేకాని చేయమను పూర్వాచారపరాయణుల బరిహాసింపకుండుటయైన చేయుట మంచిదని మనవిచేయుచున్నాను.

మన దేశమున వస్త్రములకు జిగికలుగుటకు గంజిపెట్టఁబడునట్లే విదేశవస్త్రములకుఁ గ్రొవ్వుపెట్టుదురట. విశేషించి గోవులక్రొవ్వు పెట్టుదురట. వస్త్రములకు వేయఁబడురంగులలో నావుక్రొవ్వుండునట. విదేశవస్త్రముల విషయమై గోహత్యగూడ కొంతజరుగుచున్నట్లు తెలియవచ్చెడిని. వస్త్రధారణమును బవిత్రమతకార్యముగాఁ దలంచు హిందువులు సర్వవిధనిషిద్ధమగు పరదేశవస్త్రములను ధరించుట మతవిరుద్ధకార్యమని వేఱుగఁ జెప్పనవసరములేదని తలంచెదను.






సంగనామాల రామచంద్రరావు గారు

[సంపుటము 3 సంచిక ౭ తరువాయి]

మ. అట సంసారపుగోడె కాని పరకంజాక్షీముఖభ్రూలతల్
జటులోత్కంఠరతిఁజూచు బుద్ధి చనెఁ జంచచ్చంచలశ్రీవిశం
కట నేత్రంబు వెలార్పగాఁ గలుగు విన్నాణంపు లేదేట ము
ద్దుట దాఁటుం గుటిమాపు నిల్కడలకై తోడ్తోఁ బ్రయత్నించితిన్.

చ. కొలిచినవానిఁగాదనక కోరి సుధాంశు ననుంగుఁజెల్లెలు
జ్జ్వలవిభవంబు నేర్పఱుపఁ జాగె నిరంతరమున్ ధనంపురా
సు లెటులో నిరంకుశాధిపవచోవిధి పాలనజాత పాపరా
సులవలె నింటఁ గన్పడఁగఁ జొచ్చె మదంబును వెల్లిగొల్పుచున్.

గీ. భరతమాతను బోలిన బడుగులేదు, శంఖినింబోలు కామవిస్తార లేదు
ప్రజలబాధించి సుఖపడ్డప్రభువు లేఁడు, న్యాయవాదికిఁ బగిది ధనాశ లేదు.

గీ. జఱభివ్యభిచార మట్టు లార్జునపుటాస, యంతముం బొందకుండ దుర్దాంతమయ్యె
బ్రహ్మచర్యవ్రతుఁడు రుచిపట్టెనేని, బడుచునెఱజాణపొందుఁ బోవిడుచు నొక్కొ!

క. నాదు ధనాశాపాశము, బూదిం దిని కూడఁబెట్టఁబూనెను బడుగుం
బేదలకంఠము లీడ్చుచు, నాదెసఁగొనివచ్చి యార్జనము గక్కించెన్.

ఉ. కక్కినకూటి కాసపడి కమ్మనిత్రేపులఁద్రేపికొంచు నా
బొక్కసమెంతొ వర్షపరిపూర్తి సమృద్ధిగఁజేసి కొంటి నా
కొక్కరు లెక్కలేదు కను లూర్ధ్వగతిం గగనంబుఁ జూచెనే
యక్కఱలేక సౌఖ్యకలనాయతదుర్మద సంభృతుండనై.

క. బందుగువచ్చిన డెందం, బాదున లక్ష్యంబు సేయనైతిని బధముం
దందఱుఁగ్రేణి యొనర్పఁగ, సుందరసంచారములను జొక్కితి ననఘా!

మ. సొబగుం గట్టిపిడిం గరాంతరమునం జొప్పించి నానావిధ
ప్రబలక్షేపము లూని మీసపుఁగొనల్ బైపాపటం దీర్చికొం

చు బళీ! యంచు 'బడాయిబచ్చె' నయిరజ్జుల్ వల్కుచుం బల్లెకా
పుబలంబుల్ వెనువెంట రా నడచితిన్ బుద్ధిప్రభావంబునన్.

గీ. "ధనమెమూలము జీవయాత్ర నుభరింప, ధర్మమూలం బనుట సనాతన మతంబు
లోకరీతి ప్రవంతి వెల్లువలు వచ్చి, సరసరను లాగు నిరవశేషంబు గాఁగ."

వ. అని తలపోసి,

క. ధనసంగ్రహణం బొనరిచి, గణనీయైహికపసుఖంబులఁ గొనఁగన్
జననం బొందితి ననుచును, మనమునఁ దనివోతి వెఱ్ఱి మానిసిభంగిన్.

క. ధనసముపార్జనమేకా,ని నిరూఢపరాభియోగ నిర్మలదీక్షా
వినయంబులు లేకుండెను, ధనమద్యవిమూఢబుద్ధి తత్త్వముచేతన్.

మ. అభియోగంబున వాదకౌశలము న్యాయస్థానమందున్ మహా
రభటిం జూపుఁడు రూక లిత్తుమని సంప్రార్థింప నుద్గ్రింథ ఫ
క్కిభజింపన్ బదినూఱు లీవలయు మీగెల్పొ యథార్థంబ—యో
డుభయంబున్నది చిన్నిపొత్తమున నెట్లో "ఫీజు" తాజాయగున్.

("ఉద్గ్రింథ............తాజాయగున్"—పెద్దపుస్తకము ప్రకారముగా వాదించినచో రు 1000 లు ఇవ్వవలెను. గెలుపుమాత్రము నిశ్చయము. చిన్నపుస్తకము ప్రకారము వాదించినచో 'కేసు' ఓడిపో వచ్చును; లేదా గెలువవచ్చును. అనుమానముగా నుండును రెండవవిధమైనచో "ఫీజు" తాజా అగను.)

వ. అని మనోభయంబు గల్పింపఁగా "పెద్దపొత్తంపుఁద్రోవ ననుసరించియే వాదింపుఁడు. దేవా! మీయభీష్టం బించుక సడలింపుఁడనిఁ వారెంత కాళ్లుగడ్డంబులు గఱచినను నే నియ్యకొనక—వేయినూటపదాఱురూప్యంబు లగు శుల్కనిష్ఠకై యాసపడు నాంగ్లవిద్యాభ్యాసి యగు నేఁటిపెండ్లికొమరుని పోలుపున మొండిపట్టుపట్టి మంగళ దేవతామంగళకరాలోకనసువర్ణఖనిని గుత్తకుంగొని వ్యవహారంబు నడుపుచుంటిని, మఱియును క్రింది న్యాయస్థానంబున నొక్కకక్షను బురస్కరించికొని వాదకౌశలంబు నెఱపి యా యభియోగంబుననే యూర్ధ్వన్యాయస్థానంబున నీతి లజ్జా విదూరుండనై తత్ప్రతికక్షపక్షంబున మాటాడి—తిండి యారుల విసరివేతలఁ జూచు నుచ్ఛిష్ట భుక్కుల యాతురంబువంటియాతురంబున ధనంబుఁ బ్రోవుసేసికొనుచుంటి మఱియును.

ఉ. పేరుప్రతిష్ఠ లెక్కుడగు వెంట శతంబులు వేలు "కోర్టు" లో
నారయ గంటసేపు పలుకాడియె కొంటిని గొన్నిపట్ల నే
వేఱుగఁ గార్యముండిచని "ప్లీడరుచిన్న"ను బూచిపడ్డ గం
భీరమహాభియోగమునఁ బ్రేలఁగఁ బంచితి—గొంతు గోసితిన్. (పార్టీని)

శా. వేలున్ వందలు దొంగదోపిడికి నువ్విళ్లూరితిన్ జీవయా
త్రాలక్ష్యంబు మరల్చినన్ మితముగా ధర్మ్యంబుగా నార్జన
వ్యాలోలత్వము డించవచ్చు నది నాభావంబులో నెప్డు లే
నేలే దైహిక సర్వసౌఖ్యకలనా నిశ్శ్రేయసోత్కంఠచేన్.

గీ. దైహిక సుఖంబులం దింత తఱుఁగుఁజూపి, ప్రాణికొక్క పదేనురూప్యములకంటె
మించరాదని యార్జించి మించవలయు, వేలు గడియించుటలు నవివేక మనఘ!

క. స్వకుటుంబరక్షణార్థము, మొకమోటములేక మితముఁ బోఁద్రోచి గడిం
చుకలిమి చౌర్యంబగు నది, సకలంకము గాక యుండఁ జాలదు పుడమిన్.

శా. ఎన్నో కొంపలు గూల్చికాని ధనమం దిట్టుల్ కుబేరత్వముగ
న్నన్నారం గను భాగ్య మబ్బఁగలదే నాతండ్రి! సంతృప్తి లే
కున్నన్ సౌఖ్యములేదు దేహికి నధర్మోపార్జనాశావృతిన్
నిన్నున్ లోనఁ దలంప లేదు క్షణమేనిన్ నేను భక్తప్రియా!

మ. అటు లార్జించిన వేలు ముప్పది కుసీదాపేక్ష రా పాడఁగా
మటుమాయం బొనరింప లోకులకు సామాన్యం బటంచెంచి యు
త్కట భూస్వాములు న్యాయవాదులు ధనోదారుల్ ప్రశంసించు ప్రా
కట నామం 'బలయన్ను బ్యాంకు'గని రక్షానిర్భయోద్వృత్తినై.

గీ. ధనము సంచుల మూఁతులత్రాళ్లఁ దొలఁచి, గాఢసంతోషసౌధ శృంగమున నిలిచి
"బ్యాంకు"లోఁ గ్రుమ్మరించితిఁ బాపకార్య, హస్తగతమైన నాదు నిందార్జనంబు.

వ. ఇట్లందులో వైచి సంవత్సరము గడచనకమునుపే దైవప్రాతికూల్యంబున నా "బ్యాంకు" మునిగిపోయె నంతఁ బంచమాస్పృశ్యతాదోషజనిత కష్టసముద్రంబునం బడి యుడ్డుగుడుచు భారతలక్ష్మిపగిది నేకపుత్త్రునిం గోల్పడిన తండ్రి తెఱంగున నేనును నిరవశేషంబుగా నార్జనంబంతయు నం దొప్పగించి యుండుటచే దుఃఖాగ్నింబడి కమలి మ్రగ్గుచు న్నొడలింతయుఁ దెలియక నేలంబడి పొరలుచు నేమియుం దోఁచకుంటి మఱియును;

శా. ఆహారంబు భుజింపఁగా నితవుగా దావంతయున్ స్నేహిత
వ్యాహారాను నయ ప్రయత్నవిధముల్ వ్యర్థంబులై పోయె ని
ద్రాహీనత్వముతోడి మానసికబాధంగ్లై రోగాంకురం
బాహా! నేఁటికి బుద్ధివచ్చినది దేవా! నిన్నుధ్యానించెదన్.

మ. తెలియంజాలకయుంటినప్పుడుమదాంధీభూతచేతంబునన్
లలి నుచ్చస్థితి నాఁడొసంగి తొలఁగెన్ లక్ష్మీకటాక్షంబు దు
ర్బలతం గూర్చెను దేహజాడ్యమట "కోర్టా"లేదు నాచేతిలో
నిలవా పూజ్య మికేమి చెప్పుదును తండ్రీ! భక్తసారద్రుమా!

శా. చేసేతం బరిచారికావళి సమష్టిం దాళవృంతంబులన్
వాసిన్వీవఁగ మెత్తక్రొంబఱుపుఁ బూఁబక్కన్ గనులుమూసి మెం

తే సౌఖ్యంబున మించు నాలలన నేఁ డేకాకినై యింటిలో
దాసీకార్యములన్ వహించెఁ జనిమేన్ దర్పాభిమానక్రియల్.

గీ. డాబుదర్పంబు లరిగె బడాయి నమసె, జీవితవిధానవృక్షంబు చిగురువేసె
నీశ్వరధ్యానదేశహితేప్సితములు, పుష్పములువేయుఁ ద్వత్కృపాపూరణమున.

క. జ్ఞానంబుగలిగె నేనిఁక, నీనామము జిహ్వయందు నిలుపుచు జన నీ
ప్రాణము వోకుండఁగనే,వా నైర్మల్యజలకణముఁ బట్టెదఁ దండ్రీ!

గీ. ధనమదాంధత చేత నాతండ్రి! నిన్ను, నొకనిమేషంబు దలఁపకయుంటి నపుడు
స్థిరదరిద్రతాభేషజసేవఁ జేసి, మానసస్వస్థతం గాంచఁ బూనినాఁడ.

సీ. అభిమాన దర్పశుష్కారణ్య విటపులఁ, బూనిక నేర్చు చండానలంబు
మానవ సౌభ్రాత్రమతి సుధాకలశంబు, పనివడి చేకూర్చు పాలకడలి
దేశార్థికదరిద్రతాశార్వరీ నైల్య, మడిఁగించు నేత్రాంజనంబు
పరకష్టములఁ జూచి యెరియు మానసనిధి, మానకసమకూర్చు దానమూర్తి
ప్రాజ్ఞులకువాంఛనీయంబు పరమపురుష, నిర్మలధ్యాన దాయకాంచిత గుణంబు
అతులదారిద్ర్యమబ్బె నాకంతమునకు, వేంకటాద్రినివాస, దీవింపవయ్య!

శా. రోగాంకూరము విస్తరించె నది నిర్మూలించి యారోగ్యముం
జాగుంజేయక యిచ్చుచో బ్రదికి యాజన్మాంతముం ద్వత్కృపా
రాగంబుల్ దలఁదాలు వోసికొని యారాధించెదం బల్లవ
శ్రీగేయాంఘ్రి సరోజయుగ్మము మురారీ, వేంకటేశప్రభూ!

మ. యకరంబుల్ గలవొండు రెండు వ్యవసాయాసక్తి క్రేళ్వారు మా
మకజన్మస్థలమేగి భూమికృషిచే మర్యాదతో నుండుఁ దీ
రికవేళన్ వినిపింతు నెల్లరకు నిర్భీతిం బ్రపంచక్షమా
మకుటంబైన స్వదేశమాత యిపు డేమాడ్కిం గుమారిల్లునో.

గీ. నాకుఁ గులకాంత కింక నన్నంబుదొరకు, నున్నమాన్యంబు చెఱుపక దున్నుకొనిన
రాట్నముం ద్రిప్పఁగలము వస్త్రములకొఱకు, గూటికిం గుడ్డకున్న నేకొదువ గలదు?

మ. సకలంకంబులు నాదుచిన్నతనపుం జర్యల్ యథార్థంబు నే
నిఁక సంచారమొనర్చి కట్నములపై నిచ్చల్ విదేశీయు పో
లిక మైదుస్తులు కంఠబంధములు 'కిల్లీ,కాఫీ' యంగళ్లు నా
ర్థికదారిద్ర్యము గూర్చెనంచుఁ బ్రజకుం దెల్పఁ బ్రయత్నించెదన్.

మ. భవదీయాచ్ఛకృపారసౌషధుల నుత్పాటింపు మీ రోగమా
ర్జవమున్ దేశహితైకదీక్షయు నహింసా త్యాగనిష్కామ బు
ద్ధివిశేషంబులు వృద్ధిచేతు నిది కాదే జీవితాదర్శ మా
త్మవికాసంబిడి కావుమా భరతమాతన్ వేంకటేశప్రభూ!




కె. రంగాచారి గారు, యం. ఎ., బి. యల్.

## 3

రాజునకును ప్రజలకును జరిగిన ప్రకృతిక్షోభమునఁ (Civil war) ప్రజలు జయమును బొందిరి. రాజు పట్టువడి యురిఁదీయఁబడెను. చార్లెస్సుప్రభుని వధయైన వారమురోజులలోపలనే "సామంతరాజసభ నిరుపయోగమైనదియు నపాయకరమైనదియుఁ గాన నివర్తింపఁదగినదియును" అను తీర్మానమును సామాన్యజనప్రతినిధులు తమసభలో సాధించి సామంతరాజసభ నుచ్ఛేదించిరి. దీనివెనుకనే సామాన్యజనప్రతినిధులు "ఏకరాజాధిపత్యము ప్రజలస్వాతంత్ర్యమునకును లోకహితమునకును ననవసరమైనదియుఁ, బీడాకరమైనదియు, నపాయకరమైనదియు" అను తీర్మానమును బ్రతిపాదించిరి. ఈయుద్దేశములచేఁ బ్రచోదింపఁబడి ప్రజలు ప్రజాప్రభుత్వము (Democracy) దేశమున దృఢముగ స్థాపించి యేకరాజాధిపత్యము దేశమునఁ గాన్పింపకుండఁగ నొనర్చి సంక్షోభములు లేక నెమ్మదిగ నుందురని రాజ్యతంత్రవేత్తలు నమ్మిరి. కాని యశాంతి దేశమెల్లెడలను వ్యాపించి యుండుటంజేసి రాజ్యతంత్రధురీణుండయ్యును క్రాంవెల్లు (Cromwell) తాను స్థాపించిన రాజ్యతంత్రవిధానమును నిలువఁబెట్టలేక తుదకవశ్యాధికారమును స్వీకరించి చిరజీవియగు శాసనసభను విసర్జించెను. క్రీ. శ. 1653 సం. ఏప్రెలు 20 తేదీని శాసనసభ్యులు సభావిసర్జనమునుగూర్చి తీర్మానింప నుద్యుక్తులైయున్నారని చారులవలనఁ దెలిసికొని కొంతమంది సైనికులను వెంటఁబెట్టుకొనిపోయి క్రాంవెల్లు సభామందిరమును జేరెను. గడబిడ యేమియు లేకుండఁగనే తాను మందిరమునఁ బ్రవేశించి తన యుచితస్థానము నలంకరించెను. సభావిసర్జన విషయక తీర్మానమును గూర్చి సభ్యులయొక్క యంగీకారానంగీకారముల నిర్ణయించుటకు విధ్యనుసారముగ నధ్యక్షుఁడు సభ్యులఁ బ్రశ్నించుసమయమున క్రాంవెల్లు దిగ్గనలేచి శాసనసభ నత్యధికముగ దూషించి యిట్లు నుడువందొడంగెనని యొక చరిత్రకారుఁడు చెప్పుచున్నాఁడు. "లోకహితకరమగు నొక్క కార్యమునైనఁ జేయుట కుద్దేశము లేదనియుఁ బ్రజాపీడనదక్షులగు న్యాయవాదులయొక్కయు ప్రెస్‌బిటేరియన్ సిద్ధాంతావలంబకులయొక్కయు (Presbeterians) దుష్టలాభముకొఱకుఁ బాటుపడుచుండిరనియుఁ, దమయధికారమును స్థిరీకరించుటకుఁ గృతనిశ్చయులై యుండి బలాత్కారము లేనిదె యీసభావిసర్జనశాసనమును దీర్మానింపకుండుట కుద్యుక్తులై యుండిరనియు, సభయం దంగీకరింపఁబడిన యట్టి తీర్మానము నవలంబింపకుండగనేఁ యుందువారలనియుఁ గానఁ బరాత్పరుఁడు సభను నశింపఁజేసి దైవయోగానుసారముగఁ బనుల నిర్వర్తించుటకై సభకంటె శ్రేష్ఠములగు నుపకరణముల నియోగించె"నని నుడువుచు గొంతతడ వూరకుండెను. అంతట సర్ పెటర్ వెంటువర్త్ (Sir Peter Wentworth) అను సభ్యుఁడు దిగ్గనలేచి గంభీరముగ "శాసనసభలలో నిట్టి యయుక్త ప్రలాపములఁ గావింపఁగ మొదటిపర్యాయము నే నిప్పుడు వింటిని. మఱియు శాసనసభవల్ల విస్తారముగ నుపకారములనుబొంది శాసనసభ నమ్మకమునువడసినబంటుచే నిట్టి నిరసంపుఁబల్కులు నుడువంబడుటంజేసి యయ్యవి యతిదారుణములై కాన్పించుచున్నవి." అని భాషింపం దొడంగెను. ఇటులనే యాతఁడు చెప్పియుండియుండును గాని క్రాంవెల్లు సభామందిరమధ్యమునకుం జని "రమ్ము రమ్ము నీప్రలాపముల నంతము పొందించెదను" అనుచు వెఱ్ఱివానివలె మందిరమున రోషావేశముతో నిటునటుఁ

దిరుగుచు "ఇది శాసనసభ కాదని దృఢముగఁ బల్కుచున్నాఁడను; సమావేశమును జాలించెదను. వారలను బిలువుఁడు;" అని కేకలు వేసెను. సైనికులు కొందరు సభామందిరమునఁ బ్రవేశించిరి. అంత నేబదిముగ్గురు సభ్యులను క్రాంవెలొక్కొక్కరుని పేరుపేరుతో నిందించుచుఁ బయటికిఁ దరిమివేసెను. అపుడు తాను గదను జేతితోఁ బట్టుకొని "ఈ యల్పార్థక్రీడనకమును నేమి చేయుదుము? ఇదిగో దీనిని దీసివేయుము" అని యొక సైనికున కాజ్ఞాపించెను. అంత మేజరు జనరలు హేరిసను (General Harrison) అను యోధుఁ డాసనము నధిష్ఠించియున్న లెంథలను నధ్యక్షుని కడకుఁ జని యాతఁ డచటనున్నచో లాభమేమియును లేదని చెప్పెను. ఆ యధ్యక్షుఁడు బలాత్కారమునఁ గాని తా నాసనమును వీడనని నుడివెను. ఆ యోధుఁడు "నీకు నా కరముల నూతగా నిచ్చెదను" అని బదులు చెప్పెను. అప్పుడు లెంథలు తనకరముల నాతని కరములలో దూర్చి యాసనమును విడిచిపుచ్చెను. క్రాంవెలుని యాజ్ఞానుసారముగ సభామందిరద్వారములు మూయఁబడెను. హాస్యగాఁ డొకఁ డా తలుపులపై "ఈగృహమిప్పు డుపకరణాదిరహితముగ బాడుగ కీయఁబడును" అను నొక ప్రకటనపత్రము నంటించెను.

చార్లెసుప్రభువువలెఁ దానుగూడ శాసనసభసాహాయ్యము లేకుండఁగనే కార్యములు నిర్వర్తించుట యసంభవమని తెలిసికొనెను. పదివారములు మాత్రమే సభామందిరద్వారములు మూయఁబడెను. తరువాత క్రాంవెలు కొందఱు సభ్యులను దానే నియోగించి తిరుగ శాసనసభను స్థాపించెను. 'ఆ సభ అల్పశాసనసభ' అను నామమును బడసెను. అచిరకాలములోనే యీ శాసనసభ కావించిన వైపరీత్యములు క్రాంవెలుదొరకు దుఃఖకారణము లాయెను. దశాంశము (Tithes) క్రైస్తవవేదనిషిద్ధములై కొట్టివేయఁబడిన వనియును, వివాహము సంస్కారముగాక వ్యావహారిక నియమమనియును, (Contract) తీర్మానించిరి.

మఱియు నాంగ్లేయన్యాయస్థానములలో నొకటి యగు కోర్టుఆఫ్‌చాన్సరీ (Court of Chancery) అనునది దౌర్జన్యములకు రహస్యస్థానమనియును, గపటభాజనంబనియును నిర్ణయించి యాన్యాయస్థానము నుచ్ఛేదించిరి. తుదకు నియమముల కాధారమైన సేనంగూర్చి యనవసరమైన చర్చఁ గావించుటచే సభ్యులకును, క్రాంవెల్లునకును విరోధము పుట్టెను. ఈవివాద తుదకు క్రాంవెల్లును సర్వాధికారిగ నొనర్చెను. సభ్యులు తమయధికారములను 1653-వ సంవత్సరము డిశంబరు 12-వ తేదీని క్రాంవెల్లున కర్పించిరి. క్రాంవెల్లు ననిష్టమును నటించుచు వెస్టుమినిస్టరుహాలులో (Westminister Hall) రక్షకప్రభువుగ (Protector) వైభవముతో నభిషేకింపఁబడెను.

క్రీ. శ. 1654-వ సంవత్సరము సెప్టెంబరు 3-వ తేదీని శాసనసభ క్రాంవెలుచే నాహ్వానింపఁబడి వెస్టుమిన్‌స్టర్‌లో (Westminster) సమావేశమాయెను. ఈసభ సమావేశమగునపుడు క్రాంవెలు పూర్వరాజుల యాచారము ననుసరించి యొకయుపన్యాసమును జెప్పెను. అందు మూఁడురాజ్యముల పరిపాలనాధికారము సభయందు నివేదింపఁబడుటచే నాసమయ మతివిశిష్టమైనదని నుడివి, శాసనసభ రాష్ట్రీయనిర్మాణసిద్ధికారణ మగునను నాశ తనకుఁగలదని చెప్పి విరమించెను. కాని శాసనసభ తనయాశయముల కనుగుణ్యముగఁ బ్రవర్తింపకుండుటచే సమావేశమైన యైదుమాసములలో నాసభ విసర్జింపబడెను. ఇట్లు సభావిరామమునఁ గొంతకాలమైన పిదప క్రాంవెలు స్పెయినుదేశముతో నప్పుడు జరుగుచున్న యుద్ధమును జయప్రదముగ నిర్వహించుట శాసనసభ సాహాయ్యమువలనఁగాని కాదని తెలిసికొని యొకసభ నాహ్వానించెను. సభ్యుల నతిజాగరూకతతోఁ దానే నిరూపించెను. ఈనూతనసభ్యులు క్రాంవెలున కత్యంత మనువర్తులై సామ్రాజ్యమును స్వీకరింపుమని క్రాంవెల్లును ప్రార్థించిరి. కాని మొదట క్రాంవెలు వారి ప్రార్థనల దృఢముగ నిరాకరింపకపోయినను దుదకు క్రీ. శ. 1687 వ సంవత్సరము మేనెల 8వ తారీఖున నట్టిదానిని దాను గ్రహింపననిమాత్రము స్పష్టపఱచెను. అత్యధికాధికారము లాతని కీయఁబడెను. ఈనూతనవిధానమునకు జూను నెల 26 వ తేదీని యున్నతోద్యోగులచేఁ బరివృతుండై నీలలోహిత పట్టంబులఁగట్టి భక్తిప్రతిపాదకమగు సమయమును జేసెను. సామంతరాజసభానిర్మా

ణము నచిరకాలముననే యనుసరించెను. ఈకార్యమంద ఱకు ననిష్టముగ నుండెను. క్రాంవెలుచేఁ గావింపబడిన యుపాయములలో నిదిమాత్ర మత్యంతాల్ప శుభాన్వితంబును నన్నిపక్షములవారలకును ననిష్టకారకముగను నుండెను. భేదభావలోపకు లధికార విశిష్టవర్గనిర్మాణమున కాతనిపైఁ గోపముం జెందిరి. దేశీయపౌరాణిక గోత్రనామములం దిష్టమును గౌరవమును గలవారలగుటచే భాగ్యవంతు లగు శాకటికనర్మకారాలంకృతంబును, నాహూతపురాణసామంతరాజకుల ప్రధాన నిరాకృతంబును నగు నాసభ ప్రజలకుఁ బరిహాసాస్పదంబాయెను. ఆతనిచే నాహ్వానింపఁబడిన రెండవ సామాన్యజన ప్రతినిధిసభయు వానిని జనరక్షకునిఁగఁబరిగణించియు నాతనికి రాజపదవి నొసంగుట కుద్యుక్తమయ్యెఁ దత్కృతనూతనరాజలోకమును మాత్రము సమ్మానించుట కంగీకరింపలేదు. శాసనసభను విసర్జింప నాతనికి విధిలేకవచ్చెను. "ఈవిషయములో భగవానుఁడే మీకును, నాకును విచారణకర్త"అని యాతఁడు నుడివెనని మకాలె దొరగారు వ్రాసిరి.

ఈ శాసనసభానంతరమున మరణించువఱకును క్రాంవెలుమాత్రము శాసనసభను తిరుగ నాహ్వానించుటకుఁ బ్రయత్నమును సలుపలేదు. ఆయన పుత్రుఁడు రిచర్డు (Richard) అనునాతఁడు పరిపాలన మారంభించినపిదప నాతఁడు పూర్వపుశాసనసభవలెఁ బ్రజలచే నెన్నుకొనఁబడిన ప్రతినిధుల నాహ్వానించి యధికారయుక్తమగు శాసనసభను సమావేశమగునట్లు చేసెను. క్రీ. శ. 1659–వ సంవత్సరము జనెవరి 27–వ తేదీని సమావేశమై లాంబెర్టు (Lambert) అను సేనానిచే నాసంవత్సరముననే యక్టోబరు 13–వ తేదీని యాసభ విసర్జింపఁబడినది. కాని మఱిరెండు మాసములలోనే అనఁగా డిశంబరు 26 తేదీని "చిరంజీవియగు శాసనసభావిశేషము" (Long Parliament) (Rump) ఆసభాజంఘుమనునామమును బడసి యాహ్వానింపఁబడినది. "మంకు" అనుసేనాని (Monk) యనాయత్తశాసనసభాసమావేశమును నిర్ణయింపక క్రీ. శ. 1660 ఏప్రెలు 28–వ తేదీని స్వయంకృతాంతమును జెందెను.

రెండవచార్లసుప్రభువును సింహాసనారూఢునిగ నొనర్చిన "నియమనిర్మితశాసనసభ" (The Convention Parliament) రాజప్రతిపాదనానంతరమున నేడుమాసములవఱకే సమావేశమాయెను. శాసనసభచేఁ గావింపఁబడిన యనేకశాసనము లిప్పటికిని బలోపేతములై యున్నవి; కాని యీసభాసమావేశముమాత్రము రాజప్రతిపాదనార్థము: ఏలయన, నాసభ యట్లుసమావేశము కాకపోయిన రాజు కష్టములు లేకుండఁగ సుఖముగ సింహాసనారూఢుఁ డగుననునది యసంభవము. రాజాజ్ఞాపత్రికలు (King's writs) లేకుండఁగ సమావేశమైనయీసభ ధర్మయుక్తమైనసభయని రాజు పట్టాభిషేకానంతరము శాసనమును సాధించెను. కాని న్యాయవాదు లీశాసనమైనను నాలోపము నంతరింపఁజేసి శాసనసభను యుక్తంబైనదానిఁగ నొనర్పగలదాయని శంకింపఁ నాశంక యతిసూక్ష్మంబయ్యెఁ జాలమంది యట్టిశక్తి దానికిలేదని నుడివి మఱియు నత్యధికాపేక్షవలన రెండవశాసనసభయం దీశాసనసభచేఁ గావింపఁబడిన శాసనములను స్థిరపఱచిరి. అని బ్లాక్స్టను(Blackstone) అను విఖ్యాతధర్మవేత్త వ్రాసెను.

రెండవచార్లెసు మొదటిశాసనసభ క్రీ. శ.1661–వ సంవత్సరముమొదలు 1679–వ సంవత్సరమువఱకును రాజ్యకార్యనిర్వాహముఁ గావించెను. ఈ సభయందున్న సభ్యులు చాలమంది చార్లెసువలననేకాక ఫరాంసుదేశపు రాజువలనఁ గూడ వార్షికములఁ బొందుటఁబట్టి యీసభ నిందాపాత్రమయ్యెను.

సామంతరాజసభయందు వాగ్వివాదములు జరుగుచున్నపుడు రాజు తఱచుగ సభ నలంకరించు చుండెను. ఇట్లు తఱచుగ రాజు సభలకు జనుచుండుటచేఁ గ్రమముగఁబ్రభువునకు సభపై నిరసనభావ ముదయించెను. క్రీ. శ. 1667 వ సంవత్సరమునఁ బ్రభువు శాసనసభను బరిహాసాస్పదము గావించెను.

ఆసంవత్సరము జూలై 25 వ తారీఖున రాజు సభ కాహ్వానము నొసంగెను. ఆసమయమున వ్యవసాయదారులకు బనులు మిక్కుటముగ నుండుటచేఁ దీరికలేకయే యుందురు. పనులతొందర యెంత యున్నప్పటికిని సభ్యులుమాత్రము గుర్వర్థ రాజ్యకార్యముల విషయమై

తమ్ము రాజు పిలిపించెనేమో యని యోచించి నియమితకాలమునాటికి లండనుపట్టణమును జేరిరి. రాజు పనులతొందర యను మిషచే సభ్యులం గలిసికొనకయె నాల్గురోజులవఱకును సభాసమావేశము నాపివేసి యైదవనాడు సభనుగావించెను. గుర్వర్థకార్యములు నిర్వహింపనున్నవని యోచించుటచే వారల నాహ్వానించితినని కాని యట్టికార్యము లేవియు నిప్పుడు కాన్పింపలేదనియుం, గాన వార లక్టోబరుమాసమువఱకును గృహములకుం బోవచ్చుననియుం జెప్పి పంపివేసెను.

రాజుయొక్క యవినీతవ్యాపారములను ఖండించినవారలు సభ్యులలో లేకపోలేదు. సర్ జాన్ కవెంట్రీ (Sir John Coventry) అనుసభ్యుఁడు ప్రభుని దుష్టకృత్యములను ఖండించి యట్టి పాపకార్యములను జేయుటకుం దా మిచ్చుచుండిన యధికధనము వినియోగింపంబడుటచే నంతటినుండియు రాజున కతివిస్తారముగ ధనమీయఁగూడదని సభ్యులకు నివేదించెను. ఈ యుదంతమును విని రా జత్యంతమును గుపితుండై సభ్యునిపైఁ గసిఁ దీర్చుకొనుటకుఁ దన సైనికులను వినియోగించెను. కవెంట్రీ యొకనాటిరాత్రి తనయింటికిఁజనుచుండ ఖడ్గపాణులై సైనికు లాతనిపయింబడిరి. ఆతఁడు ధైర్యములో నాత్మరక్షణము చేసికొనినను నాతని నాసిక నస్థివఱకును నఱికిరి. కవెంట్రీకిట్లు దారుణముగ హానియొనర్చిన వారలను శాసనసభ దేశమునుండి బహిష్కరించుటకుఁదీర్మానమును గావించెను గాని యాఖిలులు పట్టువడకపోవుటచేవారిని దేశమునుండి పంపివేసిన ట్లగపడదు.

రాజునకును శాసనసభకును వైషమ్యము ముదురుచుండెను. శాసనసభ్యులు మతవిషయములలో రాజునకు వ్యతిరేకముగఁ బ్రవర్తించుచుండిరి. మఱియు బొక్కసపు టధికారము శాసనసభ కుండుటచేఁ బ్రభువునకు శాసనసభపైఁ గోపము వృద్ధియయ్యెను. రెండవచార్లెసు ప్రభునికాలములోనే యాంగ్లేయ దేశమున మొన్నటివఱకు రాజ్యకార్యములు నిర్వహించుచుండిన రాజకీయవ్యవహారపక్షములకు హ్విగ్సు (Whigs) టోరీస్ (Tories) అను నామము లీయఁబడెను.

ఈరెండుపక్షులు రెండవచార్లెసుప్రభునియనంతరమున రాజ్యమునకువచ్చిన రెండవజేమ్సు (James II) కాలములోఁ బ్రజాస్వాతంత్ర్యస్థైర్యమునకుఁ గారణములని న్యాయశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. రెండవజేమ్సు రాజ్యమును బరిత్యజించి పలాయనముకావించినపుడు సామంతరాజులు వెస్టుమినిస్టరు(Westminster) శాలలో సమావేశమై యరాజకమైయున్న యాసమయమున దేశమును బరిపాలించి నిజసత్వప్రఖ్యానమును శాసనరూపముగ సాధించిరి. ఆధునికాంగ్ల దేశపరిపాలనావిధానమునకు మూలముగ నీచట్టము పరిగణింపఁబడుచున్నది. కొంతకాలమైనతరువాత వారు రెండవజేమ్సుప్రభుని పుత్రికయగు మేరీరాజ్ఞిని యామెభర్తయగు విలియం(William) అనునాతని బరిపాలకులుగ నెన్నుకొని వారిపట్టాభిషేకమైన వారముగోజులలోఁ దమ సభను శాసనసభయని తీర్మానించి క్రీ. శ. 1690 సంవత్సరము జనేవరి 27 తేదీనా డీసభ విసర్జింపఁబడువఱకును రాజ్యకార్యముల నిర్వహించుచుండెను.

## క్రాంవెలుచరిత్ర

దేశాభివృద్ధికిఁ గారకుఁడైన ఆలివరుక్రాంవెలు (Oliver Cromvell) అనునాతఁ డుత్తమకులసంభూతుండై యుక్తవయస్సువచ్చినతరువాత కేంబ్రిడ్జి (Cambridge) అను విద్యాపీఠమున నొకసంవత్సరముగడిపి న్యాయవాదివృత్తికవసరమైన విద్యల నభ్యసించుటకై లింకన్స్ ఇన్ (Lincoln's Inn) అను న్యాయవాదిసమాజమును జేరెను. యౌవనమున నీతఁడు వ్యసనాసక్తుండై యుండెనని చెప్పుదురు కాని యది యంతవిశ్వసనీయముకాదు. ఏలయన: నీతనిని 21-వ వయస్సునవే శిష్టులగువారలు ధర్మపరుఁడని చెప్పిన ట్లగపడుచున్నది. క్రీ. శ. 1628 సంవత్సరమున హంటిఙ్గ్డను (Huntingdon)ప్రాంతమునకు శాసనసభాప్రతినిధిగ నెన్నుకొనఁబడి మతవిషయములలో మిక్కిలి శ్రద్ధావంతుఁడై పనిచేయుచు శాసనసభయందుఁ బ్రఖ్యాతిని గాంచెను. శాసనసభ విసర్జింపఁబడినపిదప సెంటుఐవ్సు (St. Ives)అను ప్రాంతమునకుంజని యట వాసమునేర్పఱచుకొని పాఢిపాల్యముచే జీవించుచుండెను. క్రీ. శ. 1636-వ సంవత్సరములో నీతనిమాతులుండగు సర్ తామసు స్టూవర్టు(Sir Thomas Stuart) అను నాతఁడు మృతిఁజెందినపుడు

ఇలై (Isle of Ely) అను ద్వీపమున సంవత్సరమున కైదువందలపౌన్లు ఆదాయముగల యాస్తిని మరణశాసన రూపముగ దానమొసంగెను. ఈప్రదేశమునఁ దాను నూతనముగ వాసమును గల్పించుకొని జీవించుచు క్రీ.శ. 1637-వ సం. అమెరికాఖండమునకుఁ బోవ నిశ్చయించి ప్రయాణమునకుఁగావలసిన యేర్పాటులనుగావించుకొనెను. ఇంతలోఁ దాను ప్రయాణము చేయఁబూనిన నావ దేశమునువిడిచిపోఁగూడదని రాజుచే నిషేధింపఁబడెను. అట్లుకాకుండిన దేశచరిత్ర మెట్లుమారియుండునో కదా! క్రీ.శ. 1640 సంవత్సరములో కేంబ్రిడ్జి ప్రాంతమునకుఁ బ్రతినిధిగ నెన్నుకొనఁబడి ప్రజలక్షేమమునకై యత్యధికముగఁ బాటుపడుచుండెను. క్రీ.శ. 1642 వ సంవత్సరములోఁ బ్రజల స్వాతంత్ర్యమునకై శాసనసభ రాజుతోఁ బోరాడుటకు నిశ్చయించుకొనినప్పుడు క్రాంవెలు క్రేంబ్రిడ్జికిఁ జని యచట నాశ్వికదళంబును సమకూర్చి యాబలంబునకుఁ దానె నాయకుండై యుద్ధనైపుణ్య ప్రభావములకు విఖ్యాతిఁజెందెను. మార్స్టన్‌మూర్ (Marston moor) స్టేంఫర్టు (Stamfort) న్యూబెరీ (Newbury) మున్నగుప్రాంతములందు జరిగిన యుద్ధములలో విశిష్టప్రభావమును గనుపఱచుటచేఁ బ్రజారక్షకుఁడను నామమును బడసెను. నేసుబీ (Naseby) మున్నగు ప్రదేశములలో జరిగిన యుద్ధములలోఁ గూడ రాజపక్షమువారిని చెల్లాచెదరగునట్లు పారఁద్రోలెను. అందులకై శాసనసభ యాతనికి రెండువేల యైదువందల వార్షికము నొసంగెను. స్కాట్లండుదేశస్థులు రాజును బట్టి యాంగ్లేయుల కొసంగినప్పుడు క్రాంవెల్లానరపాలకునిఁ దన యాధీనములోనికిఁ దెచ్చుకొనుటకుఁ బ్రయత్నించి యట్టిప్రయత్నముల సఫలమనోరథుండయ్యెను. విండుసరు (Windsor) ప్రదేశములో జరిగిన సభలో సామాన్యనరునియందువలె రాజుపై న్యాయస్థానమునం దభియోగము తెచ్చి నరపాలుని దండింపవలయుననిక్రాంవెల సభలోఁ దీర్మానమును గావించెను. క్రీ. శ. 1649 వ సంవత్సరము జనేవరిమాసములో నరపాలునిపై విచారణ ప్రారంభింపఁబడెను. ఆవిచారణాంతమునఁ బ్రభువునకు మరణదండనమును విధించినవారిలో క్రాంవెలొకఁడు.

అయిర్లాండుదేశములో నుపప్లవములు కలుగుటచే క్రాంవెలాదేశమునకుం జని డ్రాఘీడా (Drogheda) వెక్సుఫర్డు (Wex ford) మొదలగు పట్టణవాసుల నతికఠినముగ శిక్షించి సంక్షోభముల నడఁగఁగొట్టి క్రీ. శ. 1650 వ సంవత్సరములో నాంగ్లేయదేశమునకుఁ దిరిగి వచ్చెను. ఇంతలో స్కాట్లండుదేశస్థులు ప్రథమచార్లెసు పుత్రు నాంగ్లేయదేశమునకు రాజుగఁజేయఁ బ్రయత్నించుచు నాంగ్లేయులతో యుద్ధముచేయుటకై సన్నద్ధులైరి. వీరిని క్రాంవెలు క్రీ.శ. 1650 వ సంవత్సరము డన్‌బార్ (Dunbar) అనుప్రదేశమున జరిగిన యుద్ధములో నోడించెను. ఇదియైన మఱియొకసంవత్సరము నాడు రాజ్యమునకై ప్రయత్నించుచున్న వధియింపంబడిన నరపాలుని కుమారుఁడైన చార్లెసును వర్సెస్టరు (Warcester) ప్రదేశములో నోడించి దేశమునం దెట్టి సంక్షోభమును లేకుండఁజేసెను.

క్రీ.శ. 1654 సంవత్సరము డిశంబరు 16 వ తేదీని దేశరక్షకుఁడుగ నెన్నుకొనఁబడి దేశనామమును విఖ్యాతముగ నొనర్చెను. క్రీ.శ. 1658 వ సంవత్సరము ఆగష్టు మాసములో నాతనిచే నత్యంతము ప్రేమింపఁబడు కూఁతురు మిసెస్ క్లేపోలు(Mrs. Claypole)అనునామె కాలగతిం జెందెను. అందుల కతఁ డత్యంతము దుఃఖితుఁడై తుదకు జ్వరపీడితుఁడై క్రీ. శ. 1658 వ సంవత్సరము సెప్టెంబరు మూఁడవతేదీని మృతిఁజెందెను. ఆతనిశవ మేడవ హెన్రీ ఛాపెలు (Henry Seventh's Chapel) లో బూడ్చఁబడి రెండవచార్లెసుప్రభువు రాజ్యమునకు వచ్చినపిదప నాతని కళేబర మచ్చటినుండి తీసివేయఁబడి సామాన్యఖలుల నురితీయు టిబరన్ (Tyburn) అను ప్రాంతములో వధ్యస్థానముక్రిందఁ బూడ్చఁబడెను.

(సశేషము)






సోమయాజుల వెంకటరామమూర్తి గారు, బి. ఏ., యల్. టి.

రూపవతియైన రామసురూపముఁ గని
పూరుషుఁడు భోగకాంక్షనుఁ బొందు
ప్రేమకా దది; చిత్తవిభ్రమముగాని. [చుంట
ఆకలింగొని "అన్నమో, యయ్యలార!"

యనుచు క్షుద్బాధఁబీడితుం డైనవాని
కన్నముం గన్నఁ గలుగదె, యాస తినుట,
కట్టికోరిక ప్రేమం బదెట్టులగును?
తడిపి లంగోట బిగియించు తాపసులును
కాంత రూపంబుఁజూచి వసంతవేళ
మోహకీలలఁ దపమును బోవఁజేయఁ
గడఁగినవిధంబు మోహంబుగా గణింపఁ
బడున దంతియకాని ప్రేమంబు కాదు.

మృగము ఋతువేళ హరిణికై వగపుదగిలి
విసిగి వేమారు వెదుకంగ వెడలుటయును
కొలఁకులందున కరిణిని గూడి కరియు
లేమృణాలంబు కరమున లీలఁగొనుచు
భోగలాలసభావంబుఁ బూర్ణప్రకట
నంబుఁ గావించు చూపు లందంబుగాను
బాళితోడను ప్రియవైపు పరపుచుండి
వెస మృణాళాంకురంబెత్తి వేడ్కమీఱ
నిచ్చకములాడి ప్రియకు నందిచ్చునపుడు
ప్రకటమగునది ప్రేమ యెప్పటికిఁగాదు
ఇట్టి మోహంపుఁ బుట్టిల్లు నింద్రియములె.

ఇంద్రియంబులలో నయనేంద్రియంబు
ముఖ్యమై యొప్పఁగాన సముజ్జ్వలంబు
నైన మోహంబు జనియించు నయనమునను
నయనములనుండి మోహంబు బయలుపడును.

కవులయందును శ్రేష్ఠుఁడుగా గణింపఁ
బడిన జయదేవుఁడును జగద్వంద్యులైన
కాళిదాస మయూరాదికవులు, మఱియు
పశ్చిమోత్తర ఖండంపు బైరను కవి
ఆదిగాఁగల ధీశాలులైన కవుల
గ్రంథరాజంబులందున గాఢమైన
మోహమే కానవచ్చెడు ముఖ్యముగను.

*  *  *  *

భర్తసౌఖ్యంబునకుఁగాను భార్య తనదు
సౌఖ్యములనెల్ల నిజభావసారమైన
భర్తృచరణద్వయంబునఁ బాదుకొల్పి
పొలుపుమీఱంగఁ దా ధారవోయుచుంట
ప్రేమనా నొప్పుచుండును; ప్రేమమనెడు
పుణ్యతీర్థంబు దాఁజేరఁబోయి భక్తి
స్నానమాడెడువారికి స్వార్థమనెడు
మలినమెల్లను దొలఁగ నిర్మలతఁజెంది
ఆత్మ రాజిల్లుచుండును నతులకాంతి
మానవులయందు స్వార్థంబు మాయమైన
ప్రేమరాజ్యంబు ధరణిని బెంపుగనును

బుద్ధియందునఁ బ్రేమయుఁ బొడమునెపుడు
పేర్మి నాధారమగుబుద్ధి, ప్రేమకుఁ గద;
మంచి గుణముల నాత్మ సమంచితముగ
కట్టుబడి తేజోకాత్మకు గ్రాహ్యమగుచు
ఇను మయస్కాంత సన్నిధి కేగునటులు
గుణము వైపున కేగును ననవరతము;
చేరదీసెడు గుణము నాధారముగొని
భక్తి పూర్వకసేవకు శక్తి పొడము.

ప్రేమ యింద్రియసుఖము లపేక్షగొనదు;
ఇంద్రియ సుఖంబులనుగూర్చు నీప్సితంబు
లెల్లను నశాశ్వతంబులై కల్లలగును.

తిరమె భౌతికదేహంబు దిమిరసుఖము?
శాంతియుతమగు నాత్మ సంసారసుఖము
బేరుకొన దెన్నఁడైనను; ప్రేమతత్వ
మాత్మసంబంధమై యెప్పు నందుచుండు;
మరియు నాధ్యాత్మికంబునై వరలుచుండి
జన్మజన్మాంతరములకుఁ జావులేక
ప్రేమయే నిత్యముగ నిలఁ బెంపునొంది
శాశ్వతంబై వినిర్మలశాంతిఁగూర్చు;
నిండు పున్నమరాత్రి రేయెండపగిది
చల్లఁదనమును సమకూర్చి శాంతినొసఁగు
ప్రణయగీతంబులను కవుల్ పాడినారు,
సేతువాదిగ హిమగిరి చేరువరకు
భారతీయుల మనములఁ జూరగొనుచు
మధుర రసపూర్ణ ఫలచయ భరితమైన
'రామ'చారిత్ర మనెడు నారామమిలను
పాదుకొలిపిన వాల్మీకిమౌని; మరియు
స్ఫటికరుచిపోలె ధవళమై సాటిలేక
శాశ్వతంబగు కీర్తి దిశాంతములను
స్థితముగ నిల్పినట్టి షేక్స్పియరు కవియు
ప్రవిమలప్రేమ తత్త్వంబు ప్రాకటముగ
మానవాన్వయమునకు సన్మానమొసఁగు
రీతిని బ్రసిద్ధిచేసిరి ఖ్యాతిమీఱ.



# గాలిగొల్లఁడు

ఆవంత్స వేంకటరంగారావు గారు

మెఱుపు తీగనునట్టి కొరడానుబూని
జలదంబుల నెడుమందలఁదోలుకొంచుఁ
కొండయండల గాలిగొల్లఁడు మేప
మేఘాలపై నేదొ మెకము గర్జించ
గరుణచే మందల గాపాడ నెంచి
ఋభురాజు చాపాన నభయ మ్మొసంగఁ
జెదిరిన మందలఁ జేరంగఁదీయ
గొంతెత్తి పిలిచెడు గొల్లడుపోలె
మరకత వర్ణంపుఁ జరియలనుండి
కేకికేకలువేసె గ్రీవమ్ము నెత్తి.





# కనిపెట్టుకుఉండడాన్ని గురించి

చింతా దీక్షితులు (సాహితీసమితి)

ఏ కార్యముకోసమైనా ఏ వస్తువుకోసమైనా మరి యేయితరవిషయములకోసమైనా కనిపెట్టుకుఉండడమనేది మానవులకు సహజమని తోస్తుంది. ఏ కాలములోనూ ఏ దేశములోనూ ఏదో ఒకదానికోసమై కనిపెట్టుకు ఉండనివాళ్లు ఉండరు. అట్లా ఉండకపోవడమనేది అస్వాభావికము. మానవసంఘములో కనిపెట్టుకుఉండడమనేకార్యము లోపించినట్లయితే ఆసంఘము నిలిచిఉండదనేతోస్తుంది. బీదవాడు హఠాత్తుగా తనకు ధనలాభము కలుగుతుందని జీవితకాలమంతా కనిపెట్టుకు ఉంటాడు. భారతీయులు స్వరాజ్యలాభానికై నిరూపించడానికి వీలులేనంతకాలము కనిపెట్టుకు ఉంటారు. గ్రంథకర్త కీర్తికోసమై చిరకాలము కనిపెట్టుకు ఉంటాడు. సర్వసంగపరిత్యాగముచేసిన సన్న్యాసి సైతము ముక్తికాంతకోసము ఎదురుతెన్నులుచూస్తూ కనిపెట్టుకు ఉంటున్నాడు. ఇక ఇతరులసంగతి చెప్పడ మెందుకు?

కనిపెట్టుకు ఉండడమనే ఈ కార్యము ఒక్క మానవులలోనే కాకుండా మృగములలోనూ, వృక్షములలోనూ కూడా కానవస్తున్నది. చెట్లు, పూయడానికిగాని, కాయడానికి గాని సరియైన ఋతువువచ్చేవరకూ కనిపెట్టుకొని ఉంటవి. ఈ విషయములోనే కాకుండా యితరవిషయములలోకూడా జంతువులు కనిపెట్టుకొనిఉండడము మనము చూస్తున్నాము. మోకాలిలోతు నీళ్లల్లో నిలబడి తననీడ తాను చూచుకొంటూ కదలకుండా మెదలకుండా ఏకాగ్రచిత్తముతో—కేసులకోసం కనిపెట్టుకొనిఉండే కొత్తక్లీడరులాగ—ఏదైనా ఒక చేప సందర్భపడుతుందా దానిని నోట్లో వేసుకొందామా అని తపస్సుచేసే కొంగ, కనిపెట్టుకొనిఉండడమనేకార్యములో ఆరి తేరి ఉన్నది. ఏకాగ్రచిత్తము, నిశ్చలమైన మనస్సు, ఆశాపూరితమైన హృదయము, శమము, దమము మొదలైన సుగుణము లానమయమున ఆ కొంగలో మూర్తీభవించి ఉంటవనేసంగతి అందరికీ తెలిసినదే. కనిపెట్టుకు ఉండడములో కొంగనుమించినవా రెవరూ సృష్టిలో లేరని చెప్పవచ్చును. ఈజంతువును బట్టే కనిపెట్టుకొనిఉండడమనేది కళ అని మనము గ్రహించవచ్చు. అరవైనాలుగు కళలలోనూ మనపూర్వులు దీన్ని ఒకదాన్నిగా చెప్పకపోవడానికి కారణము ఊహించడము కష్టము. ఆకాలములో జనులకు కనిపెట్టుకు ఉండడము అవసరములేకుండా ఉండేదేమో? ఈసంగతి నిర్ధారణచేసి చెప్పడానికి సరియైన శాసనాదిచారిత్రకనిదర్శనము లేమీ లేనట్లు తోస్తుంది. కాని ఊహానుబట్టిచూస్తే వారు

కనిపెట్టుకుఉండేవారనే తోస్తుంది. ఈ కాలములోకంటె ఆకాలములో తద్దినాలు ఎక్కువ భక్తిశ్రద్ధలతో పెట్టేవారనేవిషయము నిర్వివాదము. అటువంటిసంగతిలో నాటికీ నేటికీ మానవస్వభావములో మార్పులు జాస్తీగా లేవు. కాబట్టి వారు తద్దినపుబ్రాహ్మలకోసము కనిపెట్టుకుఉండలేదని ఎట్లా చెప్పగలము? పెళ్ళిళ్ళల్లో భోజనాలసమయమున వీరువస్తారు వారు వస్తారని పగలూ రాత్రి రెండుజాములు దాటువరకూ కనిపెట్టుకు ఉండలేదని ఎట్లా చెప్పగలము? జాగ్రత్తగా ఆలోచించి చూస్తే చాలావిషయాలలో వారు కనిపెట్టుకు ఉండేవారనే స్పష్టపడుతుంది. కాని యీ కార్యమును వారు చతుష్షష్టికళలలో ఎందుకు చేర్చలేదో? ఒకవేళ ఈకార్యము ఆకాలములో లేదేమో యీకాలములో బ్రిటిషు దొరతనమువల్ల మనకు కలిగిన మేళ్ళల్లో ఇది కూడా ఒకమేలేమో అని మొదట అభిప్రాయ పడేవాను. పైసంగతులనుచూచి తమ అభిప్రాయమును మార్చుకోవలసిఉంటుంది

మనపూర్వులు దీనిని కళగా గ్రహించక పోవడానికి కారణము ఒకటి తోస్తుంది ఈ కాలములో కనిపెట్టుకు ఉండడమంటే దుర్బల శరీరులమైన మనకు చీదరగాఉంది. దేనికోసమైనా కనిపెట్టుకొనిఉండే ఇతరులను మనము చూడడము తటస్థించినప్పుడు వారిలో ఉండే సుగుణములు మనమనస్సుకుతట్టి ఆకార్యమును మనము కళగాభావించడము తటస్థిస్తున్నది. పూర్వముకంటె ఇప్పుడు,—రైలు స్టేషనులదగ్గిరా, పోస్టాఫీసులదగ్గిరా, అధికారుల యిళ్లదగ్గిరా యింకా యితర ప్రదేశములలోనూ కనిపెట్టుకు ఉండడము సంభవిస్తుండడముచేత దాని బాగోగులు మనకు బాగా అనుభవములోకి వస్తూఉన్నవి. పూర్వుల అనుభవములు విరివిగా లేకపోవడము చేత వారీకార్యమును అంతగా లెక్కచేసే వారు కారు. కాబట్టి వారు దీనిని కళగా భావించకపోయి ఉండవచ్చు. కనిపెట్టుకు ఉండవలసివచ్చిందనేజ్ఞానము వారికి లేకపోవడమున్నూ, ఎప్పటి కప్పుడు కనిపెట్టుకు ఉండవలసివచ్చిందే అనేజ్ఞానమూ, తొట్రుబాటూ, దానినిగురించి చింతనా మనకు ఉండడమువల్లనూ వారికీ మనకూ యీకార్యము విషయమై అభిప్రాయభేదము కలిగినదనితోస్తుంది. కనిపెట్టుకు ఉండడమనే జ్ఞానము మనకు కలగడమునకు కారణము నేటి నాగరికత అని చెప్పితే సత్యదూరము కాదు.

కనిపెట్టుకు ఉండడమనే కార్యము సరియైన మార్గమునుబట్టిపోతే కళగా మనము భావించవచ్చును గాని దానిని తప్పాతోవల వెంబడితిప్పితే అది కళ అనిపించుకోదు. కనిపెట్టుకు ఉండడానికి కారణమూ, దానివల్ల కలిగే లాభమూ, ఆకార్యమును నిర్వహించడానికిచూపే చాకచక్యమూ మున్నగు లక్షణాలు పట్టినప్పుడే అది ప్రశంస చేయదగినదవుతుంది. చేపనుపట్టడానికి కొంగా, ఎలకను పట్టడానికి పిల్లి, గోడకుకొట్టిన లాంతరుదగ్గిర పురుగులను పట్టడానికి బల్లి, ఈగలను పట్టుకోవడముకు గూడుఅల్లుకొనికూర్చునే సాలెపురుగూ, సృష్టివిచిత్రములను తెలుసుకోవడముకు

శాస్త్రజ్ఞుడూ, క్లయింట్లను ఆకర్షించడానికి ప్లీడరూ, కనిపెట్టుకుఉండడమనే కళలో చాక చక్యము చూపుతూవుంటారు.

రైలుఘలానా యిన్నిగంటలకు వస్తుందని తెలిసిఉండిన్నీ అంతకుముందుగావెళ్లి రెండు మూడు గంటలకాలము పడిగాపులు పడి కని పెట్టుకొనిఉండేవాళ్లనుచూస్తే ఎవరికి జాలి పుట్టదు? ఇట్టివారు కనిపెట్టుకొని ఉండడము లో అందములేదు. సాలెపురుగు కనిపెట్టుకొని ఉండడమనే కార్యమును ఇట్టివారి కార్యము తో పోల్చిచూచినట్లయితే వీరుచేసేపని కళ అనిపించుకోదని తేలుతుంది.

కాని ఎవ్వరైనా గొప్పవారుకానలెనని ఆశించుచున్నట్లయితే వారు ముఖ్యముగా కనిపెట్టుకుఉండడ మనేవిద్యను నేర్చుకోవలసి ఉన్నది. గొప్పతనము చెందడానికి కావలసిన లక్షణాలు చాలా ఉన్నవని గొప్పవారు చెప్ప కోవడము కద్దు. సత్యసంధత, ధైర్యము, వా క్పాటవము, భూతదయ, భావిదృష్టి,పట్టుదల, కృషి యిత్యాదిగుణములు చాలా ఉన్నవి. ప్రతిగొప్పవాడిలోనూ ఈగుణములన్నీ ఉన్న వనడానికి సందేహములేదు. కాని గొప్పతన మనే సౌధము నెక్కడానికి కనిపెట్టుకు ఉండ డము ఒకమెట్టు. ఈమెట్టుమీదనుంచి ఎక్కి సౌధము చేరుకున్నతరువాత ఇతరులను తమ కోసము కనిపెట్టుకుఉండేటట్లు చేయడము గొప్పతనముయొక్క ప్రధానలక్షణము అవు తూఉన్నది. గొప్పతనానికి అవసరమైన ముఖ్యలక్షణములలో ఇదికూడా ఒకటిగా పరి గణించవచ్చును. ఇరవైరూపాయల గుమా స్తాగా పనిచేస్తూన్నకాలములో కనిపెట్టుకు ఉండడమనే విద్య నేర్చుకొన్న ఒకమానవుడు డిప్టీకలెక్టరీపదవి పొందినట్లయితే ఇతరులను పరీతిగా తనకోసము కనిపెట్టుకు ఉండేటట్లు చేస్తాడో అందరికీ తెలిసినవిషయమే. ఈ విష యములో ముఖ్యముగా తెల్లదొరలు అగ్రేస రులు. ఇతరులు వారికోసము కనిపెట్టుకు ఉండవచ్చునుగాని యితరులకోసము వారు కనిపెట్టుకుఉండజాలరు. తెల్లదొరలను అను కరించే నల్లదొరలసంగతీ యింతే. ఒకఊళ్లో ఒక చిన్న నల్లదొర ఉండేవాడు. ఈయనకు చిన్నఉద్యోగము. ఆ చిన్నఉద్యోగస్తునికింద మరీ చిన్న స్కూలుమేస్టరు లుండేవారు. ఈ చిన్న నల్లదొర పరువు మర్యాదలకోసము పాట్లుపడేజాతి మనుష్యుడు. పరువు మర్యాద లంటే వంశమునకుగాని, తనజాతికిగాని, దేశ మునకుగాని సంబంధించినవికావు. తనఉద్యోగ మునకు సంబంధించినంతవరకే పరువుమర్యాద లు.తనఉద్యోగపదవికి అగౌరవమువస్తే సహిం పజాలడు ఆయన. ఒకనాడు ఒకచిన్నబడిపంతు లు అర్జీపట్టుకొని ఈ చిన్న నల్లదొరదగ్గరకు వచ్చాడు. ఈచిన్ననల్లదొర తలపాగాతో, ముక్కద్దములతో బల్ల వెనక కుర్చీలోకూచుని ముందున్నకాగితాలు దర్జాగా తిలకిస్తూన్న సమయములో బడిపంతులు అర్జీతెచ్చి నమ స్కారముచేశాడు. ఉద్యోగగౌరవము మూర్తీ భవించినట్లు కూర్చున్న ఆనల్లదొరకోసము ఉద్దేశింపబడిన ఆనమస్కారము ముందుబల్లకు తగిలి ఉండవచ్చును. నమస్కరించిన పిమ్మట నడుమువంచి చేతులు చాచి అర్జీని చేతులలో

నుంచి అందిచ్చేటట్టు పట్టుకొని వడుకుతున్నాడాచదువులయ్య. ఎవరినీ గమనించకుండా నల్లదొర తదేకదృష్టితో కాగితములు చూస్తున్నాడు. ఐదునిమిషములు గడచినవి. పదినిమిషములు గడచినవి. పావుగంట గడచినది. బడిపంతులు చేతిలోకాగితము గడగడ వణుకుతున్నది. చివరకు సులోచనములు పైకిలేచినవి. నల్లదొర బడిపంతులకేసిచూచి, అర్జీకేసిచూచి వెనక్కుతిరిగి "ఇప్పుడు కాదు; తర్వాత తర్వాత" అని ఉత్తరువుచేశాడు. బడిపంతులు బుర్రవంచుకువెళ్లిపోయాడు. కనిపెట్టుకుఉండడమంటే అది, కనిపెట్టుకు ఉండేటట్లు చేయడమంటే అది.

కనిపెట్టుకు ఉండడాలు అనేకరకములు. గవర్నమెంటు ఉద్యోగములో ప్రమోషన్ అవుతుందని కనిపెట్టుకుఉండడము, ఉరిశిక్ష పడినవాడు ఉరితాటికోసము కనిపెట్టుకు ఉండడము, ప్రకటించడానికి ఒకపత్రికకు వ్యాసమో, పద్యమో పంపించి అది ఎప్పుడు ప్రకటిస్తారు దైవమా అని కనిపెట్టుకు ఉండడము, స్వరాజ్యముకోసము కనిపెట్టుకు ఉండడము, ఎప్పటికైనా జాతకము బాగుపడదా అని కనిపెట్టుకుఉండడము ఇవికొన్నిరకములు.

మానవులలో రెండుతెగలు: కనిపెట్టుకు ఉండకలిగినవారు, కనిపెట్టుకుఉండలేనివారు. మొదటితెగవారుత్తములు. వారిని సాధారణముగా మనము పెద్దఉద్యోగస్తులయిళ్లముందర చూస్తాఉంటాము. రెండవతెగ మనుష్యులు మధ్యములు. వారికి ఓర్పు మున్నగుమంచిగుణములులేవు. ఇటువంటివారు లోకములో నెగ్గలేరు ఇకకొందరు మనుష్యులు దొరలయిళ్ల దగ్గిర కనిపెట్టుకుఉండడాని కిష్టపడతారుగాని తమతో తుల్యులైనవారికోసము మాత్రము కనిపెట్టుకొని ఉండజాలరు.

మొత్తముమీద కనిపెట్టుకు ఉండడమనేది మంచికార్యమే. దానివల్ల వినయమూ, ఓర్పూ, ఆశాపూరితహృదయమూ, మానవస్వభావమును గ్రహించడానికి తగిన అవకాశమూ, దివాస్వప్నముల కవకాశమూ కలుగుతున్నవి.

---

## నల్లా!

నీవాళ్లు నల్లనని
నీవు బాగుండవని
ఎవ్వరో నినుజూచి
నవ్వుకొన్నారటే!
నీవొంటి నలుపులో
నిగనిగల సొగసెంతో

చూడగా వార్లకు
చూపు లేడవిరా! ౨
నలుపులో నాజూకు
తెలిసి మెచ్చుకొనంగ
నందు నింతికి చెల్లె
నాకె చెల్లెనురా! 3

"తల్లి"



# హైందవ జ్యోతిషశాస్త్ర చరిత్రము

నిడుమోలు కనకసుందరం గారు, బి. ఏ., (ఆనర్సు)

అతి ప్రాచీన కాలమునుండియు మేధావంతుల దృష్టి నాకర్షించుచుండిన శాస్త్రములలో జ్యోతిషము ముఖ్యమైనది. హైందవుల సనాతన నాగరికతయొక్క ఔన్నత్యమును ప్రకటించెడి 'ఋగ్వేదము'నందు 'సోముడు' మొదలగు జ్యోతిర్దేవతల నుద్దేశించి కీర్తించెడి ఋక్కులు అతి మనోహరములై యొప్పుచున్నవి. అటుపిమ్మట బ్రాహ్మణములయందును, ఉపనిషత్తులయందును, బౌద్ధ సారస్వత నిధానములగు 'జాతక'ములయందును, భారత రామాయణాది గ్రంథములయందును, జ్యోతిషశాస్త్రముయొక్క సక్రమ వికాసము స్పష్టముగ కాన్పించుచున్నది క్రీస్తు శకారంభమైన పిదప గ్రీకుల శాస్త్ర సాంప్రదాయములవలన హైందవజ్యోతిషశాస్త్రము కేవల మతైకస్వరూపమును వదలి, కొంతవరకు శాస్త్రలక్షణముల (Scientific Attributes) ను గ్రహించినదియు నిర్వివాదాంశమే.

హైందవులు చిరకాలము క్రిందటనే నిర్మించి పెంపొందించుచు వచ్చిన జ్యోతిష శాస్త్రసౌధము క్రీస్తుశకము పదునేడవ శతాబ్దాంతమందు పాశ్చాత్యదేశీయులదృష్టి నాకర్షించినది. ఈశాస్త్రము హిందూదేశమున నెపుడు జనించినదియు, యెటులు పరిణామమొందినదియు నను విషయములలో సుప్రసిద్ధ పాశ్చాత్యశాస్త్రజ్ఞు లనేకులు వివాదపడసాగిరి. వారు నిరర్థకమగు నీవివాదమును వదలి హైందవజ్యోతిషశాస్త్రమునే పఠించి యందలి రహస్యముల గ్రహించియుండినచో శాస్త్రాభివృద్ధికిని, మానవుని విజ్ఞానాభివృద్ధికిని వారెంతయో సహాయకారు లయ్యెడివారు. అద్భుత మేధాసంపన్నులగు లాప్లేస్, బైలీ, ప్లెఫైర్, డిలాంబర్, సర్ విలియంజోన్సు, జాన్ బెంట్లీ మొదలగు వారెల్లరు, హైందవజ్యోతిష శాస్త్రముయొక్క ప్రాచీనతనుగురించి స్వమతములను సమర్థించుకొనుటయందును, పరమతములను, తత్కర్తలను నిరసించుటయందును తీవ్రవాదముల బయలుదేరదీసిరి. కాని పందొమ్మిదవ శతాబ్దారంభము వరకును, యీశాస్త్రమునకు మూలాధారమగు వేదసారస్వతమును తరచుటకు ప్రయత్నింపరైరి.

హైందవ జ్యోతిషశాస్త్ర విషయములను పాశ్చాత్య దేశములలో ప్రచురించుటకు ప్రప్రథమమున కారకుడు డి లాలూబీర్ అను ఫ్రాంసు దేశీయుడు. ఆతడు 1690 సంవత్సర

ప్రాంతములందు అస్సాంరాష్ట్రమున కొన్ని జ్యోతిషశాస్త్ర సూత్రములను గ్రహించి స్వదేశమున కేగెను. 1691 వ సంవత్సరములో 'క్యాసిని' యను సుప్రసిద్ధ శాస్త్రజ్ఞు డాసూత్రములను పుస్తకరూపమున ప్రకటించి, తన దేశీయుల శాస్త్రాన్వేషణబుద్ధిని, దీనిపైకి ప్రసరింపజేయ గలిగెను. అటుపిమ్మట హైందవ జ్యోతిష శాస్త్రముయొక్క సంగ్రహచరిత్రమును, 365 దినములు 6 గంటలు 12½ నిమిషములుపరిమాణముగలహిందూసంవత్సరమును గూర్చి యూలర్ పండితుడు వ్రాసినవ్యాసమును, బెయర్ రచించిన యొక గ్రంథము (Historia Regni Graecorum Bactriam) న కనుబంధములుగా ప్రకటింపబడెను. శుక్రప్లాఘ్యమున (శుక్రుడు సూర్యబింబమును దాటిపోవుటను) పరిశోధించుటకు లీజంటైల్ 1769 వ సంవత్సరములో పుదుచ్చేరికి వచ్చెను. 1772 వ సంవత్సరములో నతడు, తిరువళ్లూరు పథకము లనబడు వానినిగూర్చియు, హైందవజ్యోతిష శాస్త్రమును గూర్చియు మాతనాంశములను గొన్నిటిని ప్రచురించెను. ఆగ్రంథమును చూచినపిదప సుప్రసిద్ధుడగు 'జేన్ సిల్వియన్ బైలీ'కి యీశాస్త్రమునం దభిరుచి కలుగుటచేత, ఉత్తమమగు వేరొక గ్రంథమును (Traite' de l' astronomie Indienne et orientale) ఆతడు రచించియుండెను. హైందవజ్యోతిష శాస్త్రము అతి ప్రాచీనమైనదని బైలీ దృఢముగ విశ్వసించియుండెను. ఈశాస్త్రముయొక్క పరిణామక్రమము వలన ప్రపంచమున మానవజాతియొక్క నాగరికత వికాసమునొందు విధమునుగూడ నాతడు నిర్ణయింప బూనుకొనెను. ఆతని యూహాలు కొంతవరకు సత్యదూరములుగను, విరుద్ధములుగను లేకపోలేదు. జ్యోతిషశాస్త్రమును సృష్టించినది హిందువులేయని ఆతనిమతము. అందలి పరిశోధనము లన్నియు ప్రత్యక్ష ప్రమాణ సహితములనియు, తత్ఫలితములు సులభములును సత్యములు ననియు నాతని నమ్మకము. ఇందలిగణితపద్ధతులు చిరకాలము క్రిందట నిర్మింపబడుటచే, ఆధునిక పద్ధతులవలె నిర్దుష్టములు కాకపోయినను, టాల్మీ మొదలగు గ్రీకుశాస్త్రజ్ఞుల పద్ధతులకంటె సమంజసములును సులభములుగా నున్నవనియు, అలెగ్జాండ్రియా నివాసులగు గ్రీకులు హిందూశాస్త్ర సాంప్రదాయజ్ఞానముచే లాభమును పొందియు, తత్ఫలితములను తలక్రిందుచేసిలని ఆతడు వాదించెను.

బైలీయొక్క వ్రాతలవలన లాప్లేస్, ప్లేఫైర్ మొదలగువారికిగూడ జ్యోతిషశాస్త్రమునం దభిరుచి జనించెను. క్రీస్తునకుపూర్వము 3102 వ సం.న కూర్చబడిన ట్లగుపడెడి కొన్ని గణిత సూత్రములు ఎక్కువ వ్యత్యాసము లేకనే సరియగుఫలముల నిచ్చుచుండినట్లు లాప్లేస్ మొదట తలచెను గాని 1802 వ సంవత్సరమున నాతడు రచించిన ("Mecanique celeste") యను గ్రంథమున నాతడా యభిప్రాయమును మార్చుకొనెను. "హైందవ పథకములు జ్యోతిషశాస్త్రముయొక్క విశేషాభివృద్ధిని సూచించుచున్నవి. కాని అవి అత్యంతప్రాచీనములు కావని ప్రతివిషయము

వలనను తెలియవచ్చుచున్నది. ఈ సందర్భమునందే నేను నా......మిత్రుని (బైలీ) యభిప్రాయముతో నేకీభవింప జాలకున్నాను..."

'బైలీ' యొక్క గ్రంథమునుగూర్చి ప్రస్తావించుచు, ప్లెఫేర్ 1790-వ సంవత్సరమున నిట్లువ్రాసెను: "అసాధారణములును నూతనములునునగు శాస్త్రవిషయములుమానవుల హృదయములందు కలుగజేయు అపనమ్మకముతో నేనీగ్రంథమును చదువబూనితిని. అందలి గణితపద్ధతులను కారణాంశములనుగడు శ్రద్ధతో బరిశీలింప మొదలిడితిని. తత్ఫలితముగ, నవి సంపూర్ణముగ విశ్వసనీయములని నాకు దోచెను." కాని యటుపిమ్మట ప్లెఫేర్ తనయభిప్రాయమును మార్చుకొనెను. 1817-వ సంవత్సరమున ఆతడు తిరిగి యిట్లు వ్రాసియున్నాడు: "హిందువుల జ్యోతిషపథకములు యూరపునందు ప్రప్రథమమున ప్రకటింపబడినపుడు ప్రాగ్దేశనాగరికతయొక్క చరిత్రమును, ప్రాచీనతయు నిర్ణయించుట కవి సాధనములగునని యెల్లరదృష్టినాకర్షించినవి." శాస్త్రచారిత్రాత్మకమగు నీపరిశోధనము నొనర్చుటకు అనేకు లత్యాతురముతో బూనికొనిరి; కాని వారు ఆరంభోత్సాహవలనను, నూతనదర్శప్రభావముచేతను ప్రమాణరహితములైన నూతనమార్గములను త్రొక్కిరి. హైందవ జ్యోతిషగ్రంథము లతిప్రాచీనములు కావని బాగుగాపరిశీలించిన వారికి దోచునని ఆతడు వ్రాసెను. ఆజ్యోతిషపథకములకు ఆధారములగు సూత్రములు ఏ ప్రాచీనగ్రంథమునందును సూచింపబడియుండ లేదనియు, హిందువులుపరిశోధనములను గావించినటులు గ్రంథస్థములగు ప్రమాణములు లేవనియు నాతడు సూచించెను.

హైందవగణిత, జ్యోతిషగ్రంథములను సంపాదించుటకును, హైందవజ్యోతిష్కులతోగూడి ఆకాశమునందలి జ్యోతిర్గోళములను పరిశీలించుటకును, హిందూదేశమునందున్న పరిశోధనాలయములను, యంత్రపరికరములను సమకూర్చుటకును పూనుకొనవలెనని ప్లెఫేర్ 1792-వ సంవత్సరమున పాశ్చాత్యశాస్త్రజ్ఞులను ప్రోత్సహించి యుండెను. అంతకుబూర్వమే (1789-వ సంవత్సరములో) ఉత్తమహైందవజ్యోతిషగ్రంథమగు 'సూర్యసిద్ధాంతము'ను డేవిస్ సంపూర్ణముగ పరిశీలించి, యందు నిర్వచింపబడిన జ్యోతిషాంగములను గురించి కొంత తర్కమును జరపియుండెను. ఆగ్రంథమునందు ఖగోళముయొక్క విషువవృత్తము(Celestial Equator)నకు క్రాంతివలయము (Ecliptic), అనగా ఆకాశమున సూర్యుడు సంచరించుమార్గము 24 డిగ్రీల ప్రమాణమున నోరగిలబడియున్నదని ఉదహరింపబడియుండుటచేతను, అది 1790-వ సంవత్సరప్రాంతములకు సుమారు 23 డిగ్రీల $28\frac{1}{2}$ మినిట్లుమాత్రమేయున్నటు లగుపడుటచేతను $31\frac{1}{2}$ మినిట్ల ($24^\circ - 23^\circ 28\frac{1}{2}$) వ్యత్యాసము కలుగుటకు గణితసూత్రముల ప్రకారము సుమారు 3840 సంవత్సరములు పట్టుననియు, కావున, 'సూర్యసిద్ధాంత'మను గ్రంథము క్రీస్తునకు పూర్వము 2050-వ సంవత్సరములో రచింపబడియుండవలెననియు సిద్ధాంతీకరించెను.

ఈకాలమున, సర్ విలియం జోన్సుగారు "హైందవ రాశిచక్రముయొక్క ప్రాచీనత" (On the antiquity of the Indian Zodiac) మొదలగు విషయములను గూర్చివ్రాసిన వ్యాసములు గమనింపదగినవిగ నున్నవి. హిందువులు అరబ్బుల వద్దనుండిగాని గ్రీకుల వద్దనుండిగాని రాశిచక్రమును సంగ్రహింప లేదని నేను నిరూపించెదను దేవభాష నెరుగక, వేదార్థజ్ఞానములేని గ్రీకులు, అరబ్బులు, మొగలులు మొదలగు మ్లేచ్ఛజాతులనుండి యీశాస్త్రమును గ్రహించుటకు బ్రాహ్మణులు సహించియుండెడివారు కారు. గ్రీష్మవిషువత్తు మీనరాశియందలి తృతీయభాగమునుండి మేష రాశియందలి ఇరువదియేడవ భాగము వఱకు క్రమక్రముగాజరిగి మరల 7200 సంవత్సర ములలో తిరిగివచ్చునని వారు అభిప్రాయపడు చున్నారు." ఈ సిద్ధాంతమును స్థాపించుటకు క్రీ. పూ. 1181-వ సంవత్సరములో నొక పరిశోధనము కావింపబడెనని ఆతడువ్రాసెను. హైందవ జ్యోతిషశాస్త్రముయొక్క ప్రాచీన తను నిర్ణయించుటకు పూనుకొనుడని ప్రోత్స హించిన ప్లేఫేర్ యొక్క ప్రశ్నలకుకూడ సంవత్సరకాలములో సమాధానముల నీయగ లనని ఆతడు సూచించెను. కాని, కొంతకా లము గడచినపిదప ఆతడు మరల నిట్లువ్రా సెను: "నేను చూపిన నక్షత్రరాసులకు సంస్కృతనామములను తెలిసిన హైందవజ్యో తిష్కులకు గొప్పబహుమతుల నిత్తునని నేను ఆశ కలుగజేసితినిగాని నేను ఇంతవరకును కార్యసాఫల్యము నందలేదు"

1799-వ సంవత్సరములో జాన్ బెంట్లీ యను నతడు "సూర్యసిద్ధాంతము యొక్క ప్రాచీనత- అందలిజ్యోతిషచక్రముల నిర్ణ యము" అను విషయములను గూర్చివ్రా యుచు హైందవ జ్యోతిషశాస్త్రము అత్యంత ప్రాచీనమైనదని నిరూపించుటకు ఆధారములు లేవని వాదించెను. నేటికి వేయిసంవత్సరముల నుండియు సూర్యసిద్ధాంతమే హైందవజ్యోతి ష్కులకు ప్రమాణగ్రంథముగ నుపకరించు చున్నది. అది క్రీ. శ. 1000 సంవత్సరప్రాంత ముల రచింపబడియుండవచ్చునని ఆధునికులు గుణించుచున్నారు. కాని, అది అత్యంతప్రాచీ నమైనదని గ్రంథస్థమగు నీశ్లోకము వెలన స్ఫురించుచున్నది:

"అల్పావశిష్టేతుకృతేర్......గ్రహాణాం
చరితం ప్రాదాన్మయాయ సవితాస్వయమ్"

కృతయుగము కొంచెము మిగిలియుం డగా, సూర్యుడు మయునకు గ్రహచరిత మును (ఈగ్రంథమునవ్రాయబడినరీతిని) ఉప దేశించెనట. ఇది నిజమైనయెడల సూర్యసిద్ధాం తము సుమారు 20 లక్షల సంవత్సరముల క్రిందట రచింపబడియుండవలెను. కాని యీ గ్రంథమందలి జ్యోతిషాంగములనుబట్టి గుణిం చినచో క్రీ. పూ. 3102 సంవత్సరప్రాంతముల అనగా కలియుగారంభమున గ్రహములన్నియు నొకేరాశియం దొకే స్థానముననుండెనని వా డుక కలదు. ఆ సమయమున హైందవజ్యోతి ష్కులు ప్రత్యక్షముగ జ్యోతిషాంగములను పరిశీలించి గుణించియుండిరాయని సందేహింప వలసియున్నది. బైలీ, లాప్లేస్, ప్లేఫేర్ మొద

లగువారిట్టిసందియమునకు తావు లేదని వాదించిరిగాని, ఆకాలమున గ్రహములన్నియు నాకాశమున నొక్కస్థానమున లేవని యీ క్రింది ఫలకమువలన చూడనగును. ఇది క్రీస్తునకు పూర్వము 3102-వ సంవత్సరము ఫిబ్రేవరి 17-18 తేదీల అర్ధరాత్రమున ఉజ్జయినిలో విషువత్తునకు గ్రహములయొక్క దూరమును తెలుపుచున్నది;

| గ్రహము | విషువత్తునకు దూరము. డిగ్రీలలో (సుమారుగా) |
|---|---|
| సూర్యుడు | — 8° |
| బుధుడు | —41° |
| శుక్రుడు | + 25° |
| అంగారక | — 19° |
| బృహస్పతి | + 8½° |
| శని | — 28° |
| చంద్రుడు | — 1½° |

ఈఫలకమును మనము ప్రమాణముగ నెంచుటకు వీలు లేకున్నను, కనీసము, కలియుగారంభమున గ్రహములు ఏకస్థానమున లేవని గ్రహించుటకుమాత్రముఆధారమగుచున్నది. సూర్యసిద్ధాంతము క్రీ. శ. 1000 సంవత్సర ప్రాంతములను రచింపబడెననియు, ఆకాలమున గ్రహములుండిన స్థానములనుండి వెనుకకు గుణించుకొనుచుపోగా కలియుగారంభమునకు గ్రహములు ఏకస్థానమున నున్నటులు తెలియవచ్చునేమోయనియు, ఆధునికశాస్త్రజ్ఞులు ఎంచుచున్నారు.

హైందవులజ్యోతిషశాస్త్రము గ్రీకులశాస్త్రముపై నాధారపడియుండెనను వాదమును 19-వ శతాబ్దారంభమునందే మాంటుక్లా (montucla) యను నతడు బయలుదేరదీసెనుగాని సర్ విలియం జోన్సు దానిని నిరసించెను. 1807 వ సంవత్సరమున కోల్‌బ్రూకుదొరగారు యీ వాదమునకు ప్రాముఖ్యమును తెచ్చిపెట్టిరి. ఆతడిట్లువ్రాసెను: "నేను సంప్రదించిన (హైందవ) జ్యోతిష్కులెవరును వారు పేర్లు పెట్టిన నక్షత్ర రాసులను ప్రత్యక్షముగ ఆకాశమున చూపలేకపోయిరి. హిందువులు వాడుకొనెడి రాశివిభజనమును (కొలదిమార్పుతో) అరబ్బులు ప్రచారములోనికి తెచ్చిరేమోయని నా అనుమానము........" కొన్ని విషయములను పరదేశములనుండి గ్రహించినటులు హిందువులే యొప్పుకొనుచున్నారని అతడు సూచించెను. రాసులకు హిందువులును గ్రీకులును వాడిన పేరులయొక్క సన్నిహిత సంబంధమును, గ్రీకుల 'డెకనాయ్' (dekanoi) హిందువుల 'ద్రేక్కాణము' అను వానిపోలికయు అతని అనుమానమును పెంపొందించెను. హైందవులు పేర్కొనిన యవనాచార్యుడు గ్రీకు (యవన) పండితుడేమో నని ఆతడు తర్కించెను. 1817 వ సంవత్సరములో కోల్‌బ్రూకు అభిప్రాయముల నామోదించుచు డిలాంబర్ వేరొక గ్రంథమును రచించి, బెంట్లీ మొదలగు వారి అభిప్రాయములను నిరసించుటచే, హైందవ జ్యోతిషశాస్త్రము అతి ప్రాచీనమైనదికాదనువాదము ప్రబలమయ్యెను.

నిరర్థకమగు నిట్టి వాగ్వివాదము జరుగుచున్న సమయమునందే, శాస్త్రాభివృద్ధికి సహాయకారులగు పరిశోధనలు వేరొకచోట జరుగుచునే యుండెను. వారణాసి (కాశీ)

యందు జయసింహునిచే నిర్మింపబడిన పరిశోధనాలయమున నుపయోగింపబడు సాధన సామగ్రిని వంగరాష్ట్ర సేనాధిపతియగు సర్ బేకర్ గారు బహుశ్రద్ధతో పరిశీలించిరి. 1795 వ సంవత్సరములో ప్లేఫెర్ పైన వివరింపబడిన పరిశోధనక్రమమును సూచించెను. ఉజ్జయినిలో జయసింహుడు స్థాపించిన పరిశోధన యంత్రముల వర్ణనమును 1799 వ సంవత్సరములో హంటరు ప్రకటించెను. కాని, జయసింహుడు మొగలు సాంప్రదాయములకు బద్ధుడై పరిశోధనాలయములను స్థాపించియుండగా, నతడు హైందవ సాంప్రదాయములకే లోబడియుండెనని యీపరిశోధకులు పొరబడి యుండుటవలన, వారిశ్రమ మిగుల నుపయోగపడలేదు. వీబర్ (weber, 1860-1868) జ్యోతిష వేదాంగమును, విట్నె (Whitney, 1858) సూర్యసిద్ధాంతమును, థిబా (Thibaut, 1877-1889) పంచసిద్ధాంతికమును, సాచా (Sachau, 1888) అల్బిరూని రచించిన 'ఇండియా' యను గ్రంథమును ఆంగ్లభాషయందు ప్రచురించినప్పటినుండియు, పాశ్చాత్య దేశీయులకు హైందవ జ్యోతిషశాస్త్రములో నెక్కువ పరిచయము కలిగినది. ఈగ్రంథముల వలన ఆధునిక హైందవ జ్యోతిషశాస్త్రమునకును, గ్రీకుల శాస్త్రమునకును, సన్నిహిత సంబంధము కలదని ధ్రువపడెను. అటుపిమ్మట నీశాస్త్రము వేదకాలమునందును, తదనంతరమును ఏస్థితియందుండెనో విచారించుటకు శాస్త్రజ్ఞులు పూనుకొనిరి. వేదములలో నుదహరింపబడిన జ్యోతిషాంగములను బట్టిచూడగా, అవి అతి ప్రాచీనములని యగుపడుచున్నవని 1893 వ సంవత్సరములో, తిలకు, జాకోబి మొదలగువారు ప్రకటించిరి. కాని విట్నె, ఓల్డెన్‌బర్గ్, థిబా మొదలగువా రావాదము నొప్పుకొనక, తమవాదములను సమర్థించుకొనుటకై, ప్రతివాదములను నిరసించుటకు పూనుకొనిరి. ఈవివాదమువలన నీయిరుపక్షములవారికిని వైషమ్యములు కలిగినను, దీని మూలముననే, అమూల్యములగు 'ఒరయాన్' (Orion), 'వేదకాలమున ఆర్యుల నివాసస్థానము' (The Vedic Home of the Aryans) మొదలగు గ్రంథములు ప్రపంచమునకు లభించినవని మనము సంతసింపవలసియున్నది.






డాక్టరు గుళ్లపల్లి నారాయణమూర్తిగారు, యల్. యమ్. యస్.

సీ. పాంచాలమానినీ పరిభవానల మహా,జ్వాలానివారణోపాయశక్తి
పరదాస్యవృత్త్యంధ పటలవిచ్ఛన్న మా,ర్గప్రదర్శకశరద్రాజదీప్తి
... ... ... ... ...
భారతజాతీయతారమానేత్ర నీ,రజపత్రవికసనార్క ప్రదీప్తి
పూజ్యమౌ హిందుదేశస్వరాజ్యశక్తి, నిఖిల భారతోద్ధారక నిగమశక్తి
దృఢముగా నాఁటు మొదట నాదివ్యమూర్తి, శాశ్వతసుకీర్తి నౌరోజి చక్రవర్తి.

సీ. హిందూమహాజన సందోహముల సహా,యంబు శ్రీరామ బలంబు కాగ
దేశాభివృద్ధికై దేహదార్ఢ్య విసర్జ,నంబు సంతోష కార్యంబుకాగ
గీర్వాణ భాషాసుకృతిసార సంగ్రహ,ణంబు పానీయతోయంబుకాగ
జాతీయపీఠ సంస్థాపనాది సదుద్య,మంబులే సర్వాశయములు కాగ
సమల హిందూమతాంతరార్థముల బోధ,నంబె ముప్వోళలందు భుక్తంబుకాగ
వెలసి బాలగంగాధరతిలకు ప్రభువు, ఉగ్గుపా ల్పోసిపెంచె నీయుద్యమంబు.

గీ. పెంచి యాయుద్యమం బభివృద్ధిచేయ, గాంధిదేవుని కిడియె గంగాధరుండు
కరము చింతించి యొక మహాధ్వరముకాగ, నదియు నడిపించుచుండె మహాత్మ గాంధి.

సీ. ఆలీసహోదర లాలాజి నెహ్రూ ప్ర,భృతులె ఋత్విక్కులై వెలయుచుండ
అసమాన ధీశాలియైన గాంధీమహా,త్ముం డుపద్రష్టయై ముందు నిల్వ
తనదు సర్వస్వము ధారవోసినయట్టి, చిత్తరంజనుఁడు యాజిగఁ జెలంగ
పరసేవకావ్యథా భరశుష్క భారత, దేశమాతయె సోమిదేవికాగ
లలిస్వరాజ్యమే తత్క్రతుఫలముకాగ,......చరకమే యూపశువునేయు శస్త్రముగను
శాసనసభాస్థలులె యజ్ఞశాలలుగను, వరలుచున్నది యామహాధ్వరము నేడు.

గీ. భరత మాతౄణముక్తికై పాటుపడి త్రి,విష్టపముచేరగా యాజి వెడలిపోయె
భరతమాతౄణముక్తి మీభార మనియె, క్రతుసమాప్తికై లెండు కంకణము పూని.

మ. అదియే భారతశాసనస్థలి, స్వరాజ్య స్థాపనాభ్యర్థి సం
పదకొప్పు నిలయం బదే భరత సామ్రాజ్యాధిలక్ష్మీసతీ
పదనీరేజ నిరంతరస్మరణ సల్పం జెల్లు స్థానంబు మీ
హృదయాక్షుల్ వికసింపజేసి యటులే దృష్టిఁ బ్రసారింపుడీ.

మ. క్రతుశాలల్ మన శాసనస్థలులె సత్కార్యార్థులై వచ్చి త
త్క్రతు సంపూర్తి యొనర్చు నాయకుల నే కాంక్షించి మీహక్కులఁ
ధృతిమై వారి కొసంగుచో క్రతుసమాప్తిఁ జేసె యావెన్క త
త్క్రతుశాలల్ భృగురామ సమ్మతముగా గావింపరే నేర్పుతోఁ.

శా. ఏదీ మీ నిజదేశభక్తిరతి! యేదీ నిర్మలాంధ్రావనీ
పాదాధీన మనోరవిందము! భవత్ప్రాగల్భ్యముల్ ధీరవా
క్యాదుల్ బీరము లేవి? కద్దరునె నిత్యంబుఁ ధరింపంగ తీ
ర్పేదీ? సంఘబలం బదేది? కొనిరండీ యజ్ఞసంపూర్తికిన్.

సీ. ఖాది యనగనేమి? కద్దరా? కాదు! సం,కర ప్రభుత్వవిధాన ఖాదికాని,
ఖాది యనగనేమి? కద్దరా? కాదు!......వాణిజ్య ఖాదికాని,
ఖాది యనగనేమి? కద్దరా? కాదు! ని,ష్కారణ పరదాస్య ఖాదికాని,
ఖాది యనగనేమి? కద్దరా?, కాదు! తత్క్రతుమంటపస్థల ఖాదికాని,
తే. యట్టి ఖాది దీక్షావస్త్రమై చెలంగ, నిలుచు నభ్యర్థులకును హక్కుల నొసంగి
సత్వరము నింపుడీ యజ్ఞశాలలెల్ల, జరుపుడీ హోమముల్ స్వరాజ్యంబు కొఱకు.






(వెనుకటి సంచిక తరువాయి)

గండికోట సత్యనారాయణమూర్తిగారు, యమ్. ఏ.

## 11-వ ప్రకరణము

## ధనమున్ను నాణకతంత్రములున్ను

### ౧. వస్తువులమారకమునకు ధనము సహకారి:

ధనముంగూర్చియు నాణెములంగూర్చియు మొదటిప్రకరణమునందే కొన్నిసంగతులను సంక్షేపముగ సూచించియుంటిమి. ఈశాస్త్రభాగము వినిమయకాండ మగుటంజేసి ఏతద్విషయములను, తత్సంబంధమైన యితరవిషయములను కొంచెము విపులముగా ముచ్చటించవలసియున్నది. మనము సరకులను పరివర్తనము చేయుటలో మన కక్కఱలేనిసరకు నిచ్చివేసి వెంటనే మనకు కావలసినవస్తువు నందులకు బదిలీగా పుచ్చుకొనుచుండుట లేదు. అక్కఱలేనివస్తువును ధనమున కమ్మివేసి ఆధనసహాయమున మనకు కావలసినవస్తువును కొనుచున్నాము. ఇదియే వ్యాపారము. తాత్కాలికవ్యాపారమునకు ధన మెంతయో సహకారిగా నున్నది; లేనిచో వ్యాపారమే జరుగదు. ఒకవస్తువునిచ్చి యింకొకవస్తువును బదిలీగా పుచ్చుకొను సాటాబేరపుపద్ధతి(Barter) యేవస్తుమారకమార్గమైనయెడల మేకనుగలవానికి ఎద్దు కావలసినచో ఎద్దునిచ్చి మేకను బదిలీగా పుచ్చుకొనుటకుద్దేశించినవా డుండవలెను. అట్లువారిద్దరికిని సాటాబేరపుపద్ధతి సమ్మతముగా నున్నను వస్తువులమదింపులో హెచ్చుతక్కువ లున్నచో ఆవ్యాపారము జరుగదు. మూడుమేకల కొకఎద్దునుమాత్రము బదిలీగా ఇచ్చెదనని ఒకనిఅభిప్రాయ మైనప్పుడు ఒకమేకగలవాని కావ్యవహార మెట్లు సమకూడును? ఎద్దును చంపి భిన్నాంకగణితానుసారముగ ఎద్దులో మూడవభాగమును పుచ్చుకొనునా? ఎద్దుగలవానికి మూడుపుట్లబియ్యమున్ను, బియ్యముగలవాని కొకపుట్టెడుసున్నము, సున్నమునమ్మువాని కొకదుప్పటీ, దుప్పటీలనమ్మువాని కొకవందమామిడికాయలు కావలసియున్నప్పుడు ఒకవస్తువు నిచ్చి ఇంకొకవస్తు పుచ్చుకొనేసాటాబేరపుసూత్రము వర్తించుట ఎంతకష్టముగా నుండునో చదువరు లించుక బాగుగయోచించినచో ధనమనెడు సాధనమే లేకుండిన వ్యవహారక్రమము చాల గందరగోళముగా నుండునని బోధపడును కాబట్టియే ఈకాలమందు వ్యవహారపురీతి ననుసరించి మేకలనుగలవాడు మేకలను కోరువానికి అమ్మకముచేసి వానివద్దనుండి అందులకు ప్రతిఫలము ధనరూపముగా పుచ్చుకొని ఆధనసహాయముతో ఎద్దులుదొరికెడుసంతకు బోయి ఎడ్లను కొనుచున్నాడు. ఇట్లే ఇతరవ్యవహారములుకూడ ధనసాహాయ్యమున జరుగుచున్నవి.

### ౨. ధనమున్ను నాణకములున్ను:—

వస్తువులను మారకము చేయుటలో ఒకనిచేతినుండి ఇంకొకనిచేతికి మారకమయే లోహనిర్మితనాణకములున్ను (Metallic coinage), వాటికిబదులుగ చలామణియగుచున్న కాకితపునోట్లున్ను (Paper currency), ధన మనబడుచున్నది. ఈనాణెములు వస్తువులపరిమాణములను వెలలను గుర్తించుచున్నవి. కావుననే వ్యాపారసంబంధమున ఒక డింకొకని కివ్వవలసినసొమ్ము మొత్తములను మదింపులను ధనమే తెలియజేయుచున్నది. ఏదేశమందైనను మొదటినుండియు బంగారము వెండి అనెడు ప్రశస్తలోహములతో (Precious metals) తయారుకాబడునాణెములు లేవు. దేశచరిత్రములనుపరిశోధించినచో, పసువులు, ఉన్ని, ధాన్యము, పొగాకు, తేయాకు, విలువైనలోహములు, గవ్వలు మొదలగువాటి నెన్నిటినో వస్తుమారకసాధనములుగ ప్రజలుపయోగించియుండి

రని తేటపడుచున్నది. అయినను అనేకసదుపాయముల నుద్దేశించి నాగరిక దేశములలో బంగారు నాణెములనే ముఖ్య నాణకములుగ జేయుచు వచ్చిరి. ఏలనన ఇవి చిన్నవిగా నున్నను ఎక్కువమదింపును కొలతచేయగల్గిన సాధనములు. స్వాభావికముగానే బంగారమునకు ఎక్కువ మదింపున్ను ఒకేవిధమగు వెలయున్ను యేర్పడియున్నవి. ఇంతేకాక సువర్ణము శీఘ్రకాలములో నశించెడువస్తువు కాదు. అధికకష్టము లేకుండ బంగారముతో నాణెములను తయారుచేయవచ్చును. మదింపునకు తగినట్లు చిన్న చిన్న నాణెములనుకూడ చేయవచ్చును. అంతేకాదు; బంగారము సులభముగా నెత్తుకొనిపోదగినట్టియు, పోల్చుకొనదగినట్టియు, సుత్తితో బాగుగ సాగకొట్టబడగల్గినదియు అయియున్నది. మరియు ఈలోహము అనేక ప్రదేశములందొకేవిధముగ నుండుస్వభావము గలది. ప్రశస్తలోహముల ముఖ్యగుణము లన్నియు బంగారమునందగపడుచున్నందున బంగారముతోనే ఇంచుమించుగా అన్ని దేశములలోను ప్రమాణనాణ్యములు (Standard coins) తయారగుచున్నవి.

మొదట లోహములను వ్యాపారమార్గమందుపయోగించెడు కాలములో ఇప్పటి నాణెములవలె ఏవిధమైన చిత్రముగు ఆకారమును కల్పింపక లోహపుముక్కలుగాను కడ్డీలుగాను ప్రజ లుపయోగించుచుండిరి. కావుననే వాటితూనిక, పరిశుభ్రత మొదలగు గుణములను త్రాసుతో తూచియు (Currency by weight), నిప్పులో వేసి కాల్చియు తెలుసుకొనుచుండిరి. రాను రాను వాటితూనికయు లోహపరిశుభ్రతయున్ను సరిగానుండునట్లుచేసి లోహమును కొంచెము దళసరిగల వలయాకారపుబిళ్లలుగా చేసి వాటిమీదను ముద్రలు వేయుచూ వచ్చిరి. ఈపనియంతయు దేశమందుండు ప్రజలే మొదట నిర్వహించి నాణెములను కల్పించుచుండిరనుటకు చరిత్రాత్మక నిదర్శనములున్నవి. తదుపరి దేశము నేలెడు రాజ్యాంగమువారే నాణెములను జారీచేయుచు వచ్చిరి. ఇప్పుడు బంగారము, వెండి, రాగి, నిక్కెల్ మొదలగు లోహములతో నాణెములనుగుండ్రముగానుండునట్లుచేసి అందులకొకప్రక్క చక్రవర్తితలయున్ను రెండవప్రక్క ఆనాణెపు మదింపును సింగారముగా నచ్చుముద్రవేసి నాణెపుఅంచులయందుండు లోహమును దొంగతనముగా కత్తిరించుటకు వీలులేనట్లు అందమగు గీటుల వరుసను కల్పించి ఆనాణెములను దొరతనమువారే అనేక కట్టుబాట్లతో ప్రత్యేకటంకశాలల (Mints)లో ముద్రించుచున్నారు. ప్రజలు కల్పించెడు నాణెములకున్ను గవర్నమెంటువారిచే జారీచేయబడు నాణెములకున్ను భేదమేమన: ఈతుదిన పేర్కొనబడిన నాణెములు గవర్నమెంటువారి ముద్రగలవియగుటచే సులభముగా దేశమందంతటను చలామణియగును; అప్పులు తీర్చుటకుగాని, అప్పులను పుచ్చుకొనుటకుగాని, వస్తుమారకమునకు సాధనములుగాగాని ఈయీనాణెములను ప్రజలుపయోగించవలసినదనెడు చట్టనిబంధన లుండుటవలన గవర్నమెంటువారు జారీచేయునాణెములయందు ప్రజలకు ఎక్కువ నమ్మకముండుట సహజము.

సాధారణముగా పూర్వకాలమందు నాణకరూపకమగు ధనమునేసదుపాయమును కల్పించినందులకై దొరతనమువారనేక దేశములలో ప్రజలవద్ద "సీనియరేజ్" (Seigniorage) అనే సుంకమును పుచ్చుకొనుచుండిరి. బజారుధరల ప్రకారము ఒకానొకవెలగలదియు కొన్నివడ్లగింజలతూనిక గలదియునగు బంగారమునో, వెండినో, ప్రజలు నాణెములకొరకు టంకశాలలవద్దకు తీసుకవెళ్లినప్పుడు నాణెములను ముద్రించుటకుపూర్వమో తదుపరియో ఈ "సీనియరేజ్" అనెడుసుంకమును దొరతనమువారు వసూలుచేయుచూ వచ్చిరి. ఇప్పుడు అనేకదేశములలో దొరతనమువారీ "సీనియరేజ్" అనెడుసుంకము నభిలషింపకయే నాణెములను జారీచేయుచున్నారు. "బ్రాసేజ్" (Brassage) అనెడు ఇంకొకవిధమగుసుంకమును నాణకముద్రణార్థమై కొన్నిదొరతనములవారు వసూలుచేయుచున్నారు; ఈసుంకముయొక్క ఉద్దేశమేమన: టంకశాలలను కట్టించుట, ఉద్యోగస్థులను నియమించి వారిద్వారా నాణకనిర్మాణమొనర్చుట, మొదలగుపనులకు గవర్నమెంటువారి కగుఖర్చులను ప్రజలవద్దనుండి గ్రహించుటయే. ఇట్టిసుంకములను ఇంగ్లాండుదేశపురాయల్మింటు (The Royal Mint in England) వద్ద ప్రజలు చెల్లించ నక్కరలేదు. ఆ "రాయల్మింటు" అనగా దొరతనమువారి

టంకశాలకు ప్రజ లెవరైన ఒకఔన్సుతూనికకలదియు, 11/12 ఫైన్ రకములో చేర్చదగినదియు బంగారమును (One ounce of gold, eleven-twelfths fine) తీసుకపోయి ఎట్టిసుంకములను చెల్లించకయే3-143/160 సవరన్లను పుచ్చుకొనవచ్చును; 3-143/160 సవరన్లనగా 3 పౌన్ల 17 షిల్లింగుల 10½ పెన్సులు. అయితే సాధారణముగా ఇంగ్లాడుదేశీయులు టంకశాలకు వెళ్లి ఒకఔన్సు బంగారమునకు మీదచెప్పినధనమును పుచ్చుకొనుటకు బదులుగ ఇంగ్లాండు బ్యాంకునకు పోయి (The Bank of England) 3 పౌన్ల 17 షిల్లింగుల 9 పెన్సులనే పుచ్చుకొనుచుందురు. పైరెండు మొత్తములకు కల 1½ పెన్సులతేడా నాణకసంబంధమైన సుంకముగాదు. టంకశాలవద్ద కనిపెట్టుకొని యుండవలసిన అవశ్యములేకుండ వెంటనే ఔన్సుబంగారమునకు 3 పౌ 17 షి- 9 పె- చొప్పున ప్రజలు నగదుగ్రహింతురు. అట్టిసదుపాయమునకే 1½ పెన్సులుఖర్చు. కొన్ని దేశములలో జనులు టంకశాలాధికారులవద్దకు దీసుకవచ్చిన ప్రశస్త లోహపుమొత్తమును పుచ్చుకొని చట్టనిబంధనల ప్రకారమాలోహమునకు సరియగు నాణెములనుముద్రింపించి దొరతనమువారిచ్చుచున్నారు. దీనినే "ఫ్రీకాయినేజ్" (Free Coinage) లేక స్వేచ్ఛాముద్రణ మనెదరు. "ఫ్రీ" లేక "స్వేచ్ఛగానుండు" అనే పదమునకు "సుంకములేని"అని వ్యాఖ్యానముచేయకూడదు. ఏమన: "ఫ్రీకాయినేజ్" హక్కుఅమలులోనున్న కొన్ని దేశముల దొరతనమువారు "సీనియరేజ్" అనెడు సుంకమును వసూలుచేయుచున్నారు. మరికొన్ని దేశముల దొరతనమువారట్లుచేయుచుండుటలేదు. ఈ"ఫ్రీకాయినేజీ"అనెడు హక్కు ఇప్పుడు బంగారము, వెండి అనెడు రెండు లోహములకుగాని దేశమందుండు అన్ని నాణెముల విషయమునగాని వర్తించదు- ఒక్కబంగారమనెడుప్రశస్త లోహవిషయమందును, సువర్ణనిర్మితమైన ప్రమాణ నాణకములవిషయమునను, "ఫ్రీకాయినేజీ" వర్తించుచున్నది. ఈవాక్యమున కొంకింతవ్యాఖ్యానములేనియెడల కొందరు చదువరులకు విషయవైశద్యము కానేరదు. బంగారము విషయమునసే 'స్వేచ్ఛాముద్రణ'పుహక్కు వర్తించుచున్నదనగా ప్రజలు టంకశాలకు బంగారమును తీసుకవెళ్లినచో చట్టములననుసరించి బంగారునాణెములు జారీచేయబడును. వెండివిషయమున ఈహక్కు ఇప్పుడు వర్తించదు. ఒకానొకప్పుడు అనగా వివిధదేశములలో బంగారునాణెములున్ను వెండినాణెములున్ను ప్రమాణ నాణెములుగా పరిగణింపబడుటయే కాక ఆనాణెముల సహాయమున (బంగారువైననుసరి వెండివైననుసరి) ఎంత ఋణమునైన తీర్చవచ్చుననెడు (Unlimited legal tender) నిబంధన లుండెడికాలములో ఈరెండు ప్రశస్తలోహముల విషయమునను "ఫ్రీకాయినేజ్" అనెడు హక్కు వర్తించుచువచ్చినది. రాబోవు పేరాలలో వ్యక్తీకరింపబడు కారణములంజేసి వెండి నాణెముల ప్రాముఖ్యము పోయి అవి అముఖ్యనాణకములుగ (Token coins) ఎప్పుడు పరిణమించినవో అప్పటినుండియు వెండికి "ఫ్రీకాయినేజ్" లేక 'స్వేచ్ఛా ముద్రణము' లేదు.

### 3. ప్రమాణనాణకములు, అముఖ్యనాణకములు (Standard coins and Tokencoins).

బంగారము, వెండి, రాగి, నిక్కెల్ అనెడు అనేకలోహములతోచేయబడు అనేకనాణకములు ప్రతి దేశములోను చలామణి యగుచున్నవి, అయితే వీటిలో కొన్ని ప్రమాణనాణకము లనిన్ని మరికొన్ని అముఖ్య నాణకములనిన్ని వ్యవహరింపబడుచున్నవి. ఏనాణెమందుండు లోహమును బజారులో అమ్మగా లభించెడువెలకు ఆనాణెము చలామణీ అయేసొమ్ముమొత్తమునకు సమానముగా నుండునో ఆనాణెమే"ప్రమాణ నాణకము"దానినే "స్టాండర్డుకాయిన్" (Standard coin) అనెదరు. ఏదేశమందైనను అట్టి "స్టాండర్డుకాయిన్" లేకప్రమాణ నాణకము"అనునదియే ఎక్కువవిలువగలదిగా నుండును. తక్కిన నాణెములు ఆప్రమాణనాణకముయొక్క చిన్న చిన్న భాగముల విలువలను సూచించునవిగా నుండును. ఈతుదిరి పేర్కొనబడినవే"అముఖ్యనాణకములు" లేక "టోకెన్ కాయిన్స్" (Token coins). ఈ"అముఖ్య నాణకము" లేక "టోకెన్కాయిన్"అను నాణెమందలి లోహమును బజారులో అమ్మగా లభించెడు వెల ఆ నాణెము చలామణీ అయే వెలకన్న చాలతక్కువగా నుండును. ఇంగ్లాండుదేశపు బంగారపుపౌన్ (దీనినే సావరిన్ లేక .కాసు అనిచెప్పెదరు),అమెరికాసంయుక్త



బొబ్బిలి మహారాజుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవ గౌరవార్థము
అతిథులకు తోటవిందునిచ్చుట

రాష్ట్రపుబంగారము డాలర్సు, హాలెండుదేశపు టెన్ ఫ్లోరిన్ పీస్, ఫ్రాన్సుదేశపు ట్వెంటీఫ్రాంకుపీస్ — ఇవి ప్రమాణనాణకములు—అనగా "స్టాండర్డుకాయిన్సు." ఈ యానాణెములందుండెడు బంగారముఖరీదునకు ఆయా నాణెములు చలామణీఅయేవెల సమానముగా నుండును. ఆనాణెములతో ఆయాదేశములందలి జనులు ఎంతఋణమైనను నిరాటంకముగా తీర్చుకొనవచ్చును. అనగా ఆ ప్రమాణనాణకములకు "అన్‌లిమిటెడ్‌లీగల్ టెండర్" గుణము కలదు.(Unlimited Legal tender) పైన పేర్కొనబడిన దేశములందలి జనులు బంగారమును ఆయా దేశముల టంకశాలాధికారులకు ఆయాదేశముల చట్టనిబంధనలప్రకారము దాఖలుచేసినచో ఆబంగారమునకు సరియగు ప్రమాణనాణకములు జారీచేయబడును—అనగా ప్రమాణనాణకములవిషయమున "ఫ్రీకాయినేజ్" లేక "స్వేచ్ఛాముద్రణము" వర్తించుచున్నది. చిల్లరవ్యవహారములకు అనుకూలముగా నున్నట్టియు, ప్రమాణనాణకముయొక్క విలువలో భిన్నాంశములుగా నున్నట్టియు, వాస్తవమైన లోహపుబజారువెల నాణెము చలామణీ అయేవెలకన్న తగ్గియున్నట్టియు నాణెములు అముఖ్యనాణకములు లేక "టోకెన్‌కాయిన్సు" అనబడుచున్నవి. పైన పేర్కొనబడిన దేశములందు ప్రమాణనాణకములు కాని చిన్నచిన్న నాణెములు, మనదేశములో ప్రస్తుతము చలామణీఅగుచున్న రూపాయి, అర్థరూపాయి, పావలా, బేడ, అణా, అర్థణా, కాలణా, దమ్మిడీ మొదలగు నాణెము లన్నియును అముఖ్యనాణకములే — అనగా "టోకెన్ కాయిన్‌సు" అనగా ఆయానాణెములందుండు లోహపుముద్దయొక్క బజారువెల ఆనాణెముల చలామణీ వెలకన్న తగ్గియేయుండును. రూపాయలోనున్న వెండి సుమారు 10అణాల విలువగలది; రూపాయయో 16అణాలకు చలామణీ అగుచున్నది. ఇదేవిధమున తక్కిన "టోకెన్" నాణెములయందుండు లోహపువాస్తవమైన విలువ చలామణీవిలువకన్న తగ్గియుండును. అముఖ్యనాణకములనుకరిగించగా లభించినలోహముతో పాత్రములను చేయించుటకాని ఆలోహమును అమ్మి ధనసంపాదనము చేయనెంచుట కాని లాభదాయకము కాదని చదువరులు గ్రహించుకొనవలెను. వెండి, రాగి, నిక్కెల్ మొదలగు అముఖ్యనాణకపు లోహముల విషయమున ఫ్రీకాయినేజీ వర్తించదు. ఈఅముఖ్యనాణకములతో ఇష్టమువచ్చినంత సొమ్ము మొత్తములవరకు అప్పులు తీర్చుకొనుటకు వీలు లేదు—అనగా గవర్నమెంటువారు అముఖ్యనాణకములకు "అన్‌లిమిటెడ్ లీగల్ టెండరు" (Unlimited Legal tender) గుణము ప్రసాదించలేదు. 1893-వ సంవత్సరమునకు పూర్వము మనహిందూదేశములో వెండివిషయమున "ఫ్రీకాయినేజ్" లేక "స్వేచ్ఛాముద్రణము" హక్కు ఉండెను; అప్పటిరూపాయ ప్రమాణనాణకమే. 1893-వ సంవత్సరమున అనేకకారణములంజేసి మనదేశపుటంకశాలలలో వెండికి స్వేచ్ఛాముద్రణపు హక్కులేదనిన్ని, రూపాయ ప్రమాణనాణకము కాదనిన్ని శాసింపబడెను. ఈ విషయమునుగూర్చియు తత్సంబంధమగు హిందూదేశపునాణ్యతంత్రచరిత్రమునుగూర్చియు కొంచెము విపులముగా మున్ముందొక ప్రత్యేకప్రకరణములో వివరించెదము. రూపాయ అముఖ్యనాణకమైనను, వెండికి ఫ్రీకాయినేజ్ లేకున్నను రూపాయలతో ఈదేశమున ఎంత ఋణమైనను తీర్చవచ్చును. ఇది ఎట్లున్నను "టోకెన్" నాణెములనుగూర్చి సామాన్యవిషయముల గొన్నిటిని ముఖ్యముగా గమనించవలసియున్నది.

## ప్రమాణనాణకనిర్మాణమునకుపయోగించెడు బంగారముతో అముఖ్యనాణకముల నేల తయారుచేయుచుండుట లేదు?

ప్రమాణనాణకములును, టోకెన్‌నాణెములును తయారుచేయుటకు కావలసినంత బంగారము లోకములో లేదు. ఒకవేళ వలసినంతబంగారము లభించినను చిల్లరవ్యాపారములకు ఉపయుక్తముగా నున్న చిన్న చిన్న నాణెములు బంగారముతో చేయబడినయెడల ఆ నాణెము లెంతయో సూక్ష్మాకారముగలిగి పట్టుకొనుటకు వీలులేనంత చిన్నవిగా నుండును. ఇంగ్లాండుదేశపు ప్రమాణనాణకమగుపౌండుస్టెర్లింగు(Pound sterling) వలె అందులో 240-వ భాగమగు పెన్నీ (Penny)అనబడు 'టోకెన్‌కాయిన్' అంతయు అసలు బంగారముతో చేయబడినచో అట్టినాణెము ఒకధాన్యపుగింజలో

సగముఎత్తు తూగును; ఆనాణెము చిల్లరవ్యాపారముల యందు వాడుక కెంతకష్టదాయకముగ నుండునో చదువరులే ఊహించుకొనగలరు. కావుననే అవి తక్కువ విలువ గల్గినట్టియు గట్టిగానున్నట్టియు లోహముతో తయారుకాబడుచుండును.

టోకెన్ నాణెములచలామణి విలువకన్న వాటి నిర్మాణమున కుపయోగింపబడు లోహపువిలువ ఏల తగ్గియుండును? అట్లుండనిచో ప్రజలు వాటిని కరిగించి లోహమును ఇతరవిషయములకై ఉపయోగింతురు; చిల్లర వ్యాపారములకు కావలసిన వస్తుమారకసాధనముల సంఖ్య దేశమందు మిగులతక్కువగా నుండుటయే కాక అముఖ్య నాణకములను జారీచేయు గవర్నమెంటువారికి నష్టము కూడ ఏర్పడును. ఇంగ్లాండుదేశపు "టోకెన్" నాణెముగు "షిల్లింగు" వెండినాణెము. 20 షిల్లింగులను కరిగించగా లభించినవెండియొక్క బజారుధర ఒకపౌను మించినట్లయిన ప్రజలు గవర్నమెంటువారికి నష్టము కలిగించి తాము లాభము నొందెదరు; అదెట్లనిన: 20 షిల్లింగుల వెండికి బదులుగ పౌనునకు గవర్నమెంటు నిర్ణయించిన బంగారముకన్న ఎక్కువబంగారమునే బజారులోసంపాదించెదరు; నిర్ణీతమగుబంగారమును ఇంగ్లాండు రాయల్మింటువారికి దాఖలుచేసినట్లయిన ఒకపౌన్ స్టెర్లింగు రాబట్టవచ్చును; శేషించిన బంగారము లాభము కాదా?

టోకెన్ కాయిన్‌లోనున్న లోహపు వెలకున్ను దాని చలామణీవెలకున్ను విశేషమైనభేద ముంచుట గూడ నాణకతంత్రశాస్త్రవిరుద్ధమనియే చెప్పవచ్చును. కారణమేమన, ప్రజలు కష్టపడిఅయినను దొంగనాణెములను తయారుచేసి లాభమొందుటకు ప్రయత్నింతురు. ఇంకొక ప్రశ్నము. టోకెన్ నాణెములసంఖ్య చాల తక్కువగా నుండుటయేకాక, అముఖ్యనాణకములు లేక "టోకెన్" నాణెములసాహాయ్యమున ఇష్టమువచ్చినంత సొమ్ముమొత్తమువరకు అప్పులుతీర్చుకొనుటకు వీలులేదని గవర్నమెంటువారేల శాసించవలెను? ఏదేశమందైన టోకెన్ నాణెము లసంఖ్యాకములుగ నుండుటయే కాక గవర్నమెంటువారు అముఖ్యనాణకములకు "అన్‌లిమిటెడ్ లీగల్ టెండరు"హక్కునుగూడ ప్రసాదించినచో, నాణకోపయోగవిషయమున ప్రమాణ నాణకములకున్ను టోకెన్ నాణెములకున్ను కలవ్యత్యాస మంతరించి ప్రమాణనాణకములు పరదేశయాత్ర చేయుటయో, వాటియతదున్న ప్రశస్తలోహము దాచిపెట్టబడుటయో తటస్థించును. కారణమేమన: ప్రమాణనాణకములు ప్రశస్తలోహనిర్మితములు; స్వదేశమందైనను, పరదేశమందైనను వాటికి ఒకటే విలువ; అముఖ్యనాణకములందుండు లోహము యొక్క వాస్తవమైన బజారు వెల మిగుల తక్కువ అనిగదా చెప్పియుంటిమి. చదువరుల కింకొకసందేహము కలుగవచ్చును. ప్రమాణనాణకములు లేక "స్టాండర్డు కాయిన్సు"విషయమున "స్వేచ్ఛాముద్రణము" లేక "ఫ్రీకాయినేజీ"వర్తించుచున్నట్లు అముఖ్యనాణకములు లేక "టోకెన్ కాయిన్సు" విషయమునగూడ ఫ్రీకాయినేజీ సూత్ర మేల వర్తించకూడదు? అనగా గవర్నమెంటు వారు నిర్ణయించిన పద్ధతులప్రకారము ఎంతో కొంత బంగారమును ప్రజలు టంకశాలలకు తీసుకవెళ్లినచో టంకశాలాధికారులు అందులకుతగిన బంగారపుప్రమాణనాణకముల నిచ్చువిధమున, వెండి, రాగి, నిక్కెల్ మొదలగులోహములను టంకశాలాధికారులకు దాఖలు చేసినట్లయితే వారేల ఆయాలోహములతో తయారుకాబడు టోకెన్ నాణెములను ప్రజలకివ్వకూడదు? అట్లే టోకెన్ నాణెములకుకూడ ఫ్రీకాయినేజీసూత్రము వర్తించుచున్నదనుకొందము. దాని అంతరార్థ మేమన, గవర్నమెంటు వారు టోకెన్ నాణెములయథార్థపులోహపు విలువకున్ను చలామణివిలువకున్ను కల భేదపుమొత్తమును ప్రజలకు దానముచేసినవా రగుదురు. రాజ్యాంగమువారు ప్రజలకు ఇట్టిబహుమానముల నిచ్చుట ఉచితధర్మమని ఎవరైన వాదింతురేమో కాని, ఎట్టిగవర్నమెంటువారైననుకొలది కాలములో ఫకీరై దివాలాఎత్తుట కిది ఉత్తమమార్గమై యున్న కారణముంజేసియే టోకెన్ నాణెముల విషయమున స్వేచ్ఛాముద్రణపుహక్కు వర్తించకున్నదని చదువరులు గ్రహించెదరుగాక.

## 4. ధనముయొక్కవిలువ (Value of money)

వస్తువుల విలువలను కొల్చెడి సాధనమే ధనము గదా; ధనముయొక్కవిలువ అనగా అర్థమేమి? ధనమునకు విలువ కలదా? ఈసందర్భమున ధనమన్నేపదమునకు అర్థమేమి? ధనముయొక్కవిలువనెట్లునిర్ణయించవచ్చును?

ధనమూల్యనిర్ణయమునకువలయు ముఖ్యవిషయము లెవ్వి? ఈప్రశ్నముల కన్నిటికిని తగినజవాబు లివ్వగలిగినచో ధనముయొక్క విలువ అననేమో విశదమగుటయే కాక వస్తుమారకసాధనంబగు ధనముయొక్క హెచ్చుతక్కువల ననుసరించి వర్తించెడు ఆర్థికన్యాయ మొకటి తేటపడును.

ఈప్రకరణారంభమున ధనమువస్తువులమారకమునకు సహకారియని చెప్పియుంటిమి — అనగా మనకు కావలసినవస్తువులను కొనగలశక్తి ధనమున కున్నది. ఈ శక్తియే ధనమూల్యము. వస్తువులమూల్యములను కొల్చెడు సాధనమే ధనముగదా. అట్టిధనమునకు మూల్యము (లేక విలువ) కలదా యని మనము సందేహించ నక్కరలేదు. ఒకరూపాయికి 2 కుంచములబియ్యము కొనవచ్చు ననుకొందము. రెండుకుంచములబియ్యముయొక్క వెల ఒక రూపాయి; ఒకరూపాయికి రెండుకుంచములబియ్యమును కొనగలశక్తియున్నదని మీదివాక్యమునకు వ్యాఖ్యానము. కారణాంతరములవలన ఒకరూపాయ నిచ్చినచో 1½ కుంచములబియ్యము మాత్రము లభించవచ్చును— అనగా బియ్యమువెల హెచ్చవచ్చును; రూపాయియొక్కవిలువ తగ్గినదని చెప్పవచ్చును; ఒకరూపాయి నిచ్చినచో పూర్వమువలె 2 కుంచములబియ్యముకాక 1½ కుంచము బియ్యముమాత్రమే మనము కొనగలిగినప్పుడు రూపాయవిలువ తగినదనిచెప్పుట సహజమే గదా. పంటలు బాగుగపండినందుననో లేక అన్యప్రాంతములనుండి మనమార్కెట్టునకు ఎక్కువబియ్యపు బస్తాలు ఎగుమతిఅయినకారణముననో బియ్య మతిచౌకగా లభించవచ్చును; ఒకరూపాయికి 3 కుంచముల బియ్యమునుకూడ బజారులో కొనవచ్చుననుకొనెదము. ఈనూతనావస్థయొక్క అభిప్రాయము పైనచెప్పిన విధమునసే వ్యక్తీకరించవచ్చును. రూపాయికి 1½ కుంచముల బియ్యమునకు బదులుగ 3 కుంచములబియ్యము లభించునప్పుడు రూపాయియొక్కవిలువ హెచ్చినదని చెప్పుట వింతకాదు. బియ్యము చౌకగానుండినందునగదా రూపాయికి 3 కుంచములబియ్యము లభించినవి— "చౌకగానున్నవి" అనగా "వెలలుతగ్గినవి" అనిగదా అర్థము. ఇప్పుడు మన మీయుదాహరణములసహాయమున గమనించగల్గినవిషయములను స్పష్టీకరించెదము: రూపాయవిలువ హెచ్చిన దనగా వస్తువులవెలలు తగ్గినవనిన్ని, రూపాయవిలువతగ్గినదనగా వస్తువులవెలలు హెచ్చినవనిన్ని మనము జ్ఞప్తియం దుంచుకొనవలెను.

రూపాయ అనునాణెము, ఇతరనాణ్యములు ధనములో చేరినవే. లోహనిర్మితనాణ్యములేకావు, కాకితముతో చేయబడిన "కరెన్సీనోట్సు" (Currency-Notes), "బ్యాంకినోట్సు" (Bank Notes), చెక్కులు (Cheques), ప్రామిసరీనోట్లు (Promissory-Notes), హుండీలు లేక 'బిల్సు ఆఫ్ ఎక్స్ఛేంజ్" (Bills of Exchange) అనునవి యెన్నియో నాణెములకు బదులుగా వస్తుమారకమునకున్ను అప్పులుతీర్చుటకున్ను ఆదాచేయుటకున్ను ప్రజ లన్నిదేశములలో అను వాడుకచేయుచున్నారు. ధన మనుపదములో పైన పేర్కొనినవన్నిటిని చేర్చవచ్చును. నాణేతరధనముంగూర్చి ఇంకొకప్రత్యేకప్రకరణములో వివరించెదము.

### 5. ధనముయొక్క విలువ నెట్లు నిర్ణయించవచ్చును?

10 వ ప్రకరణములో వస్తువులవిలువ ఎట్లు నిర్ణయింపబడుచున్నదను విషయముంగూర్చి చర్చించి యున్నాము. ఏవస్తువుయొక్కవిలువ నిర్ణయించవలసి వచ్చినను ఆవస్తువుయొక్క "సరఫరా" (Supply) ఎట్లున్నది? దాని "డిమాండు" (Demand) ఎట్లున్నది? అనెడు విషయములను జాగ్రతగా గమనించవలసియున్నది. ఏలనన ఏవస్తువుయొక్క విలువఅయినను దాని సరఫరా—డిమాండుల సమ్మేళనముం జేసియే (Interaction of supply and demand) నిర్ణీతమగుచున్నది. ధనమూల్యనిర్ణయమునకై పరిశీలించవలసిన విషయములు రెండు: (1)ధనముయొక్కసరఫరా(The supply of money) (2) ధనమునకుండు "డిమ్యాండు" (The demand for money).

ధనముయొక్క 'సరఫరా':—ధనము చేయగల్గిన పనులన్నిటిని చేసెడివస్తువుల 'సరఫరా' యే ధనముయొక్క 'సరఫరా.' ధనము చేయగల్గిన పను లెవ్వి? ఆ కార్యములంజేసెడు వస్తువు లెయ్యవి? వస్తుమారకము

నకు సాధనముగానుండుట, సమస్తవస్తు మూల్యములను కొలిచెడు సామాన్యసాధనముగా నుండుట, అప్పులు తీర్చుకొనుటకు ప్రమాణసాధనముగా నుండుట, వస్తువులనుకొనెడుశక్తిని సంగ్రహించి నిలవచేయ గల్గుట (General medium of exchange, common measure of values, standard for deferred payments and store of values) ఈ నాల్గున్ను ధన మొనర్పగల ముఖ్యకార్యములు. లోహనిర్మిత నాణకములనాలుగుపనులను సరిగా చేయగల్గియున్న వనుసంగతి అందరకు తెలిసినదే. నాణెములకు మారుగ చెక్కులు, బ్యాంకునోట్లు, హుండీలు మొదలగుపరపతిసాధనములు కూడా ప్రజ లుపయోగించుచున్నారు. గవర్నమెంటువారొనర్చిన చట్టనిర్ణయములంజేసియో వాణిజ్యసంబంధమున నేర్పడినబ్యాంకులు మొదలగు పరపతిసంఘములవారుచేసిన నిబంధనలం జేసియో, ప్రజలకుండు నమ్మకమునంజేసియో పైన పేర్కొనబడినవన్నియును నాణెములు చేయగల్గిన పనులన్నిటిని చేయుచున్నవి; కావున నాణెములతోపాటు అవికూడ ధనరాశిలో చేరినవే. ధనముయొక్క సరఫరా అనగా నాణెములు, చెక్కులు, బ్యాంకునోట్లు, హుండీలు మొదలగువాటియొక్క సరఫరా. ధనమొనర్చగల కార్యములంజేయుచు లోహనిర్మితనాణకములవలె దేశమందుచలామణి యగుచున్న వస్తువుల సరఫరాయే ధనముయొక్క సరఫరా. ధనముయొక్క సరఫరాలో చేర్చదగినవిషయ మింకొకటి కలదు. అదియే ధనచలనవేగము (Rapidity of Circulation of Money). ధనచలనవేగ మన నేమో దానిని ధనముయొక్క సరఫరాలో ఏల చేర్చవలెనో విచారింపవలసి యున్నది. కొన్ని ప్రదేశములలో కొన్ని సమయములందు ఒకేనాణెము వ్యవహార విషయములలో అనేకపర్యాయములు ఒకనిచేతినుండి ఇంకొకని చేతికి మారుచుండును. మరికొన్ని సమయములలో నాణెమొకటి రెండుమార్లేఒకనిచేతినుండిఇంకొకనిచేతికిమారుచుండును. అనేకవ్యవహారములను చక్కబెట్టగల్గిననాణెమునకు 'ధనచలనవేగము' ఎక్కువగా నున్నదనిన్ని, ఒకటి రెండు వ్యవహారములను మాత్రము జరిపించగల నాణెమునకు చలనవేగ మతితక్కువగా నున్నదనిన్ని చెప్పవచ్చును. వర్తకవ్యాపారములు పోతరించియున్న ఇంగ్లాండు మొదలగు దేశములలో నాణెములకు ధనచలనవేగ మెక్కువగాను, వ్యాపారములు తక్కువగాను ఉన్న దేశములలో నాణెములకు సాధారణముగా చలనవేగము తక్కువగాను ఉండును. పది నాణెములు చేయగల్గినపని ఒకనాణెమే చేసినట్లయిన వాస్తవముగా ఆనాణెము 10 నాణెములకు సమానమనియే చెప్పవచ్చును. ధనముయొక్క సరఫరాను అంచనావేయుటలో ఈవిషయము ముఖ్యముగా గమనించవలసియుండును. యానసౌకర్యములు, వర్తకప్రాబల్యము, ప్రజలవృత్తివిశేషములు, బ్యాంకీసౌకర్యములు ప్రబలియుండుట మొదలగువాటి ననుసరించి ధనచలనవేగ మేర్పడుచుండును. ధనచలనవేగము ఎక్కువగా నుండుప్రదేశములలో ధనముయొక్కసరఫరా తగ్గినను తగ్గవచ్చును.

కొందర ర్థశాస్త్రజ్ఞులు ఒకానొక ప్రదేశమందలి ధనముయొక్క సరఫరా ఇంతయని అంచనావేసి లెక్కచేసెదరుగాని ధనచలనవేగమును సరిగా లెక్కించుట సుకరమైనపని కాదు. బ్యాంకులు మొదలగుపరపతి సంఘములున్ను, గవర్నమెంటువారున్ను జారీచేయు నోట్లుమొదలగువాటిమదింపున్ను, దేశమందు చలామణీ అయ్యేలోహనిర్మితనాణకములమదింపున్ను గణుతించుట సులభమే. ఏమన దొరతనమువారియొక్కయు బ్యాంకులు మొదలగుసంఘములవారియొక్కయు, రికార్డులవలన తెలిసికొనదగు వివరాంశములే అట్టిఅంచనాలకు మూలము. కొందరు విమర్శకులు ప్రశస్తలోహోత్పత్తి సంబంధమైన వివరాంశముల (Statistics of the production of precious metals) సాధారముగా గైకొని ధనముయొక్క సరఫరా ఈవిధమున నుండునని అంచనాలు వేసెదరు, గాని అట్టిఅంచనాలను వేయువారు గమనించవలసినవిషయములు కొన్ని కలవు:—గనులనుండి ఉత్పాదింపబడిన ప్రశస్తలోహరాసు లన్నియు నాణ్యనిర్మాణమునకు మాత్ర ముపయోగింపబడ లేదు. లోహనిర్మితనాణకము లేకాక పరపతిఉపకరణము లగు చెక్కులు, బ్యాంకునోట్లు మొదలగున వెన్నియో ధనమొనర్చెడుకార్యములం జేయుచున్నవి.

## ధనమున కుండు "డిమాండు" (Monetary demand)

ఏదేశమందైనను ప్రజలకు ధనవిషయమునందు "డిమాండు" ఎట్లు ఏర్పడుచున్నది? ఈసందర్భమున గమనించవలసినవిషయము లెయ్యవి? ధనమునకు విక్రయింపబడు వస్తువులయొక్కయు, ఊడిగములు లేక సేవలయొక్కయు సంఖ్యను ప్రతివస్తువుగాని ఊడిగముగాని అమ్మబడువెలను మనము నిర్ణయించినచో ధనముయొక్క "డిమాండు"లో చేర్చదగిన ముఖ్యవిషయమును గమనించినవార మగుదుము. వేర్వేరుబ్యాంకులయొక్కయు, నిధులయొక్కయు "రిజర్వు" లలో (Reserves) నిలవ ఉండవలసిన నాణకరూపక మగు ధనముకూడ "ధనముయొక్క డిమాండు"లో చేరవలసినదే. దేశమందలిజనులవద్ద హాజరుగానుండవలసిన కనీసపుసొమ్ముమొత్తములఅంచనా ఇంకొకవిషయము.

ధనమున కుండు "డిమాండు" దేశకాలపాత్రములం జేసి మారుచుండును. పైన పేర్కొనబడినవి కొన్నిముఖ్యాంశములు. అవికూడ ఎల్లప్పుడు నొకేతీరున నుండవు. ధనముయొక్క "డిమాండు"ను గణుతింపనెంచినవిమర్శకు లట్టిభేదములను జాగ్రతగా గమనించవలసియుండును. ప్రశస్తలోహములయెడల ప్రజలకుండు "డిమాండు"నుబట్టి ధనమునకుండు "డిమాండు"ను నిర్ణయింపనెంచుట సరియైనమార్గము కాదు. ఏమన: బంగారము వెండి యను ప్రశస్తలోహములు నాణకనిర్మాణమునకే కాదు. పాత్రములు, అలంకారములు మొదలగు వస్తువులనుచేయుటకుకూడ ఉపయోగించుచున్నవి.

ఈలోకమందలి ప్రశస్తలోహరాసులలో ఎంత నాణ్యనిర్మాణమునను, ఎంతపరిశ్రమల విషయమునను వినియోగింపబడుచున్న దనెడు విషయములను క్రమప్రకారము విమర్శించి మొత్తములను నిరూపించుట సామాన్యమైనపని కాదు. అనేకవిధములైన రిపోర్టులనుండియు గ్రంథములనుండియు అంచనాలనుండియు సేకరింపబడిన కొన్నివివరాంశములను మాత్రము ఈ దిగువ పట్టీలరూపకముగా ప్రదర్శించుచున్నాము:—

ఈదిగువ "ఏ" షెడ్యూలులో అమెరికా ఖండము కనిపెట్టబడిన 1493-వ సంవత్సరము మొదలుకొని 1875-వ సంవత్సరాంతము వరకు ఈప్రపంచమందు ఉత్పత్తిచేయబడిన బంగారము యొక్కయు, వెండియొక్కయు ఆరెండు ప్రశస్తలోహములయొక్కయు మదింపును తెలియచేసెడు అంకెలు(అన్నిమిలియన్ పౌన్లవిలువగలవి అని భావించవలెను) వేయబడినవి. "బీ" షెడ్యూలులో బంగారపువివరములే యున్నవి. "సి" షెడ్యూలులో 1876-వ సంవత్సరము మొదలు 1916-వ సంవత్సరాంతమువరకు ఈప్రపంచములో ఎన్ని మిలియన్లపౌన్ల విలువగల బంగారమున్ను వెండిన్ని నాణ్యనిర్మాణమున కుపయోగించబడినదో తెల్పెడు అంకెలు వేయబడినవి.

### ఏ—షెడ్యూలు

| సంవత్సరములు | ఎన్ని మిలియన్ల పౌన్ల విలువ గల బంగారము ఉత్పత్తి | ఎన్ని మిలియన్ల పౌన్ల విలువ గల వెండి ఉత్పత్తి | ఎన్ని మిలియన్ల పౌన్ల విలువ గల బంగారమున్ను, వెండిన్ని ఉత్పత్తి |
|---|---|---|---|
| 1493-1600 | 105.3 | 277.3 | 382.6 |
| 1601-1700 | 127.3 | 371.4 | 498.7 |
| 1701-1800 | 265.1 | 532.2 | 797.3 |
| 1801-1850 | 165.3 | 291.4 | 456.7 |
| 1851-1855 | 139.1 | 40.1 | 179.2 |
| 1856-1860 | 140.7 | 41.2 | 181.9 |
| 1861-1865 | 129.1 | 49.8 | 178.9 |
| 1866-1870 | 136 | 59.9 | 195.9 |
| 1871-1875 | 121.3 | 86.2 | 207.5 |

### బీ—షెడ్యూలు

| సంవత్సరములు | ఎన్నిమిలియన్ల పౌన్ల విలువగల బంగారము ఉత్పత్తి |
|---|---|
| 1876-1880 | 120.3 |
| 1881-1885 | 107.9 |
| 1886-1890 | 116.7 |
| 1891-1895 | 162.3 |
| 1896-1900 | 266.1 |
| 1901-1905 | 325 |
| 1906-1910 | 435 |
| 1911-1915 | 458.6 |
| 1916 | 90.8 |
| 1917 | 84.7 |
| 1918 | 72 |

1493—1875 వరకు 1329.2 మిలియన్‌పౌన్ల విలువగల బంగారమున్ను, 1749.5 మిలియన్‌పౌన్ల విలువగల వెండిన్ని ఉత్పత్తిఅయినట్లు రికార్డు నిదర్శనము లున్నవి; రెండుప్రశస్తలోహముల మొత్తపుటుత్పత్తి 3078.7 మిలియన్‌పౌన్ల విలువగలది.

సీ—షెడ్యూలు

| సంవత్సరము | బంగారము | వెండి | సంవత్సరము | బంగారము | వెండి |
|---|---|---|---|---|---|
| 1876 | 42.6 | 25.3 | 1897 | 87.5 | 33.6 |
| 1877 | 40.3 | 22.9 | 1898 | 79.1 | 20.9 |
| 1878 | 37.7 | 32.2 | 1899 | 93.2 | 33.2 |
| 1879 | 18.1 | 21 | 1900 | 71 | 370 1 |
| 1880 | 29.9 | 16.9 | 1901 | 49.6 | 27.8 |
| 1881 | 29.4 | 21.6 | 1902 | 44.1 | 38.7 |
| 1882 | 19.9 | 22.2 | 1903 | 48.1 | 42.4 |
| 1883 | 21 | 21.9 | 1904 | 91.1 | 35.3 |
| 1884 | 19.9 | 19.2 | 1905 | 49.2 | 34.5 |
| 1885 | 19 2 | 25.4 | 1906 | 68 7 | 27.6 |
| 1886 | 18.9 | 25.0 | 1907 | 76.1 | 42.9 |
| 1887 | 25 | 32.7 | 1908 | 80.8 | 36.5 |
| 1888 | 27 | 27 | 1909 | 67 5 | 24 |
| 1889 | 33 8 | 27.9 | 1910 | 84.9 | 18 2 |
| 1890 | 29.8 | 30.5 | 1911 | 76.7 | 16.6 |
| 1891 | 23.9 | 27.7 | 1912 | 74 | 29.1 |
| 1892 | 34.5 | 31.1 | 1913 | 65.5 | 32.6 |
| 1893 | 46.5 | 27.6 | 1914 | 44.8 | 34.4 |
| 1894 | 45.6 | 22.6 | 1915 | 41.4 | 36.5 |
| 1995 | 46.2 | 26.4 | 1916 | 18.4 | 55.7 |
| 1896 | 39 2 | 31.9 | | | |

"బీ" షెడ్యూలుప్రకారము లోకమందు 1876–1916 లో ఉత్పన్నమగు బంగారము అదేకాలములో "సీ" షెడ్యూలు ప్రకారము నాణకనిర్మాణార్థము వినియోగింపబడు బంగారముకన్న చాల అధికరించి యున్నట్లు కానవచ్చుచున్నది. దీని అంతరార్థమేమన; కొంతవరకు సువర్ణరాసులు నాణకనిర్మాణేతర పరిశ్రమలలో వినియోగింపబడుచున్నవి. పైషెడ్యూళ్ల సహాయమునను, ఇతరవిషయముల సహాయమునను మనము గమనించవలసిన మరికొన్నిసంగతు లున్నవి. "సీ"షెడ్యూలు ప్రకారము 1876–1916 వరకు లోకములో జారీచేయబడిన బంగారునాణెములు, వెండినాణెములు ఇవి మాత్రము ఆయాసంవత్సరములలో జరిగిన వ్యవహారము లన్నిటిని చక్కబెట్టినవని తలంచుట తప్పు, ఏమన: టోకెన్‌నాణెములు, సాటాబేరపుపద్ధతులు, పరపతి ఉపకరణములు వీటి సహాయమున ఎంతయో మదింపుగల వ్యవహారములు చక్కబెట్టబడినవి.

## 6. ధనముయొక్క సరఫరా డిమాండుల హెచ్చుతక్కువల అంతరార్థమేమి? ధనపరిమాణ న్యాయము:—

ధనమునకుండు "డిమాండు" ఎట్టిమారుదలను పొందక ఒకేవిధమున నున్నదనుకొందము! అప్పుడు దేశమందలి ధనముయొక్క సరఫరా అతిశయించినచో, ధనముయొక్క విలువతగ్గును; ధనముయొక్క విలువ తగ్గుననగా వస్తువులవెలలు అధికరించును; ధనముయొక్కసరఫరా సన్నగిల్లినయెడల ధనముయొక్క విలువ హెచ్చగును; ధనముయొక్కవిలువ హెచ్చుననగా వస్తువుల వెలలు తగ్గును. ఏదేశమందైనను కొన్ని సందర్భములలో ధనపరిమాణముయొక్క హెచ్చుతక్కువలంజేసి వస్తువుల వెలలయొక్క హెచ్చుతక్కువ లేర్పడునని అర్థశాస్త్రజ్ఞులు సిద్ధాంతీకరించిరి. ఇందులకే "ధనపరిమాణ న్యాయము" లేక "క్వాంటిటీ థియరీఆఫ్‌మనీ" (Quantity Theory of Money) అనిపేరు. తక్కిన ఆర్థికన్యాయములవలె ఈన్యాయముకూడ కొన్ని ప్రత్యేక స్థితిగతులలవడినగాని వర్తించదు. వస్తుమారకసహకారులగు లోహనిర్మిత నాణకములున్ను పరపతిఉపకరణములున్ను దేశమం దతిశయించినచో వస్తువులవెలలు పొడిగించబడునని యనుటకు వాస్తవనిదర్శనములను కనుగొనవచ్చును గాని వస్తుమారకసాధనముల సంఖ్యనే దేశమందైన ద్విగుణించిన ప్రతివస్తువుయొక్కవెల ద్విగుణింపబడునని గాని, ఆసంఖ్యను త్రిగుణించిన వెలలు త్రిగుణింపబడునని గాని చెప్పుటకు వీలులేదు. ధన మధికరించినచో సామాన్యముగా వెలలుకూడ అధికరింపబడుటకే మొగముచూపునని మాత్రము చెప్పవచ్చును. ప్రత్యేక కారణముల ప్రాబల్యమువలన

ఒకానొకప్పుడు దేశమందలిధన మతిశయించినను కొన్ని వస్తువులవెలలు తగ్గియే యుండవచ్చును; ఒకానొక వస్తువుయొక్క సరఫరా 'డిమాండు'ను మించియున్న యెడల దానివెల తగ్గియుండుట వింతకాదు;ధనపరిమాణ న్యాయానుసారము వస్తువులవెలలు సామాన్యముగా అధికరించియుండవలెను గదా ఏదైన వస్తువుయొక్క వెల తగ్గియున్నపుడు ఆన్యాయమే తప్పని వాదించకూడదు. ఏమన 3 వ ప్రకరణము మొదటిపేరాలో చెప్పినట్లు "........ఆర్థికసూత్రము లెప్పుడును ఒకేవిధముగ వర్తింపవు. ప్రత్యేకస్థితిగతు లలవడనిచో ఆర్థికన్యాయ ప్రవర్తనము ప్రచ్ఛన్నముగా నుండును. మరికొన్ని సంగతులు. ఈనాగరికకాలమందుకూడ కొన్ని వ్యవహారములు సాటాబేరపుపద్ధతిననుసరించి నాణకరూపకధనమక్కర లేకయే జరుగుచున్నవి ఇందువలన అవశ్యమగు ధనముయొక్క సరఫరా మారవచ్చును. ధనమునకుండు "డిమాండు" భేదింపక ఒకేరీతిని ఉండవలెను. అమ్మకములు, కొనుబడులు అతిజాస్తిగా నున్నకాలములలో ధనమునకుండు డిమాండుజాస్తిగా నుండునుగదా;అప్పుడు ధనముయొక్క 'సరఫరా' జాస్తిఅయినను, వస్తువుల వెలలు హెచ్చుగానుండక తగ్గియే యుండవచ్చును. ఒకప్పుడు లోహనిర్మితనాణకములసంఖ్య పూర్వముకన్న తగ్గియున్నను, వెలలేమోఅధికముగా నుండవచ్చును; ఏమన: కరెన్సీనోట్లు, బ్యాంకినోట్లు మొదలగువాటి వాడుక జాస్తిగా నుండవచ్చును; వాటిజాస్తి సరఫరాకూడ ధనముయొక్క జాస్తిసరఫరా అనియే భావించవలెను. ధనపరిమాణప్రభావమునకున్ను వస్తువులవెలల జాడలకున్ను కలసంబంధమును గమనించినప్పుడు ధనచలన వేగముయొక్క ప్రభావమును మరువకూడదు; ఏమన, ధనచలన వేగమంజేసి ఒకానొక నాణెము ఎక్కువవ్యవహారములను చక్కబెట్టగల్గినప్పుడు ధనముయొక్కసరఫరా జాస్తిగా నున్నదనియే భావించవలసియుండును.

## 7. "ఇండెక్సునెంబర్లు"న్ను "క్వాంటిటీ థియరీ" యున్ను.

## (Index Numbers and Quantity Theory of Money)

ధనపరిమాణము ఎక్కువైనప్పుడు వెలలు అధికమగు ననెడు సిద్ధాంతమునకు అనుభవ విదితములగు పరిప్రాత్మకనిదర్శనము లున్నవా యని పాఠకమహాశయులు సందేహించవచ్చును. అట్టినిదర్శనముల నిక ప్రదర్శించెదము. ఆనిదర్శనములను గమనించుటకుముందు సామాన్యముగా దేశమందలి వస్తువులవెలలు మొత్తముమీద ఒకానొకకాలపువెలలకంటె ఎక్కువగాగాని తక్కువగాగాని ఉన్నవని గ్రహించుట కుపయుక్తమగు "ఇండెక్సు నెంబర్లు" (Index Numbers) ఏవిధముగా తయారుచేయబడుచున్నవో తెలుసుకొనవలసి యున్నది. సాధారణముగా ప్రజలు వినియోగించెడు వస్తువులవెలలు ప్రతిసంవత్సరమందును ఎట్లుండునో కనుగొనుటకు సాధ్యమైనంతవరకు ఒకేరీతినియుండు (Quality) వస్తువులయొక్కయు, ఒకేపరిమాణముగల (Quantity) వస్తువులయొక్కయు వెలలనుదెల్పెడి పట్టీలు తయారుచేయవలెను; అనగా మొదటిరకము వస్తువులవెలలను ఒకమాసములోను ఐదవరకము వస్తువులవెల లింకొకమాసములోను గమనించి "ఏవరేజ్" లెక్కలు (Average) వేయుట అసందర్భముగా నుండుననిన్ని, కొన్నివస్తువుల వెలలు వీశె 1-కి ఇంతఅనిన్ని అదేరకము మరికొన్ని వస్తువులవెలలు మణుగు 1-కి ఇంతఅనిన్ని లెక్కలు వేయక ఒకేవిధమగు పరిమాణమును ప్రమాణముగా గ్రహించవలెననిన్ని దీనిభావము. ఏయేవస్తువుల వెలలను మనము సంగ్రహించవలసియుండుననే సమస్యకు జవాబు చెప్పుట కొంచెముకష్టముగా నుండును; "ఇండెక్సు నెంబర్ల" ఉద్దేశము వెలలహెచ్చుతక్కువల జాడలను కనుగొని ఆర్థికవిమర్శనము నొనర్చుటకాబట్టి ఆ విమర్శనముల స్వభావము ననుసరించి ముఖ్యమగు వస్తువుల టోకుధరలను (Wholesale prices) మాత్రమే సాధారణముగా సంగ్రహింపబడును; టోకుధరలు లేక "హోల్సేలుధరలు" సాధారణముగా చిల్లరధరల(Retail Prices)వలె విశేషభేదములు కలిగియుండవు; ముఖ్యపదార్థముల వెలలనే గమనింతురుగాని అముఖ్యపదార్థములయొక్కగాని అపురూపముగా నున్నవస్తువుల యొక్కగాని, దేశమందలి తక్కువజనులుమాత్రమే అపేక్షించు వింతవస్తువులయొక్కగాని ధరలను "ఇండెక్సు నెంబర్లను" తయారుచేయువారు గమనించరు. ఈ విధముగ కొన్నిసంవత్సరముల తాలూకు వెలల ఏవరేజిమొత్తముల సంఖ్యలను పట్టీలరూపకముగ తయారుచేయవలెను.

అయితే ఆసంఖ్యలు సాధారణముగా వేలస్థానము వరకును ఒకప్పుడు లక్షలస్థానము వరకును వ్యాపించియుండును. అట్టి పెద్ద పెద్దసంఖ్యలను గమనించుట కష్టమే. అంతేకాక వెలలహెచ్చు తగ్గులజాడలను కనుగొను

టనుతారతమ్యజ్ఞాన మవశ్యముకద. ఫలానిసంవత్సరమందు కన్న వస్తువులవెలలు ఈసంవత్సరమున అధికముగానున్న వనియో లేక సన్నగిల్లి యున్నవనియో చెప్పగల్గినప్పుడే తారతమ్యజ్ఞాన మేర్పడును. అందుకొరకు సామాన్యముగా వస్తువులవెలలు ఏసంవత్సరమున నిలకడగానుండునో ఆసంవత్సరమును ప్రమాణ సంవత్సరముగా గైకొని (Base year) ఆసంవత్సరపు మొత్తపుఏవరేజి వెలలను దెల్పుసంఖ్య 100 అనిభావించి తతిమ్మా సంవత్సరముల మొత్తపుఏవరేజీవెలలను దెల్పుసంఖ్యలనుకూడా అదేవిధమున గణితశాస్త్రానుసారముగా మార్చి ఆయాసంవత్సరములం దెల్పెడు అంకెల సమీపమున ఆయా పెర్సెంటేజీలను (Percentages) దెల్పు అంకెలను వేసినయెడల వెలలయొక్క హెచ్చుతగ్గులజాడలు ఈవిధముగనున్నవని కనుగొనగల్గుటయేకాక ఒకసంవత్సరపు మొత్తపు వెలల కన్న (General-prices) ఇంకొకసంవత్సరపు మొత్తపువెలలు జాస్తీగా యున్నవనిగాని, తగ్గియున్నవనిగాని సులభముగా తెలిసికొనవచ్చును. "ఇండెక్సు నెంబర్సు" (Index Numbers) తయారుచేయు సామాన్య క్రమమిదియే: ఒకానొక ఊరిలోగాని, జిల్లాలోగాని టోకుధరలను మీదజెప్పినక్రమప్రకారము సావధాన మనస్కులై చదువరులు ఓపికతో తయారు చేసినట్లయిన ఆ క్రమమున్ను, అందువలన కలిగెడు లాభములున్ను వారికి అనుభవ విదితము లగును.

వేర్వేరువిధములైన క్రమములను ఈ "ఇండెక్సు నెంబర్ల"ను తయారుచేయు విమర్శకులున్ను దొరతనమువారున్ను అవలంబింతురు; ఆసూక్ష్మభేదములను గణితశాస్త్రపద్ధతులను ఇచ్చట గ్రంథవిస్తరభీతింజేసి పొందు పరచలేముగాని మీదచెప్పిన సామాన్యక్రమమునే(కొన్ని సూక్ష్మభేదములను గమనించలేదు.) ఇంచుమించుగా అందరు విమర్శకులున్ను అవలంబించుచున్నారని చెప్పవచ్చును. వేర్వేరు విమర్శకులు వేర్వేరు దేశములయొక్క ముఖ్యపదార్థముల మొత్తపువెలలను దెల్పెడు ఇండెక్సు నంబర్ల క్రమమందలి సామాన్యపుసూత్రములనవలంబించి తయారుచేసిన ఇండెక్సునెంబర్ల పట్టీలను ఈదిగువ ప్రదర్శించుచున్నాము.

[ఈపట్టీలు యిరోపా మహాసంగ్రామ కాలమందు ప్రచురింపబడిన "టాడ్సును మెకానిజం ఆఫ్ఎక్చేంజ్" అను పుస్తకము 233 వ పేజీనుండి సంగ్రహింపబడినవి; 1900 సంవత్సరము ప్రమాణపుసంవత్సరముగా పరిగణింపబడినందున ఆసంవత్సరపు ఇండెక్సునెంబరు 100 గా భావించబడినది; అంకెలు వేయుటలో డిసమల్ భిన్నాంకములు (Decimal fractions) విసర్జింపబడినవి.

ఇండెక్సునంబర్ల పట్టీలు (Tables of Index-Numbers 1782—1918)

| సంవత్సరము | ఇండెక్సు నంబరు | సంవత్సరము | ఇండెక్సు నంబరు | సంవత్సరము | ఇండెక్సు నంబరు | సంవత్సరము | ఇండెక్సు నంబరు |
|---|---|---|---|---|---|---|---|
| 1782 | 168 | 1816 | 152 | 1850 | 107 | 1884 | 114 |
| 3 | 168 | 7 | 195 | 1 | 110 | 5 | 107 |
| 4 | 156 | 8 | 220 | 2 | 108 | 6 | 101 |
| 5 | 151 | 9 | 187 | 3 | 123 | 7 | 98 |
| 6 | 143 | 1820 | 172 | 4 | 138 | 8 | 101 |
| 7 | 146 | 1 | 157 | 5 | 133 | 9 | 103 |
| 8 | 146 | 2 | 147 | 6 | 137 | 1890 | 103 |
| 9 | 143 | 3 | 148 | 7 | 142 | 1 | 106 |
| 1790 | 146 | 4 | 147 | 8 | 127 | 2 | 101 |
| 1 | 149 | 5 | 172 | 9 | 128 | 3 | 99 |
| 2 | 156 | 6 | 150 | 1860 | 132 | 4 | 93 |
| 3 | 166 | 7 | 150 | 1 | 131 | 5 | 90 |
| 4 | 165 | 8 | 135 | 2 | 135 | 6 | 88 |
| 5 | 196 | 9 | 132 | 3 | 137 | 7 | 90 |
| 6 | 220 | 1830 | 135 | 4 | 140 | 8 | 93 |
| 7 | 185 | 1 | 137 | 5 | 135 | 9 | 92 |
| 8 | 198 | 2 | 130 | 6 | 136 | 1900 | 100 |
| 9 | 218 | 3 | 125 | 7 | 133 | 1 | 96 |
| 1800 | 235 | 4 | 130 | 8 | 132 | 2 | 96 |
| 1 | 233 | 5 | 133 | 9 | 131 | 3 | 96 |
| 2 | 183 | 6 | 143 | 1870 | 128 | 4 | 98 |
| 3 | 208 | 7 | 140 | 1 | 135 | 5 | 97 |
| 4 | 198 | 8 | 140 | 2 | 145 | 6 | 101 |
| 5 | 220 | 9 | 153 | 3 | 151 | 7 | 106 |
| 6 | 217 | 1840 | 145 | 4 | 146 | 8 | 103 |
| 7 | 215 | 1 | 142 | 5 | 140 | 9 | 104 |
| 8 | 242 | 2 | 125 | 6 | 137 | 1910 | 108 |
| 9 | 262 | 3 | 118 | 7 | 140 | 1 | 109 |
| 1810 | 237 | 4 | 115 | 8 | 131 | 2 | 114 |
| 1 | 227 | 5 | 123 | 9 | 125 | 3 | 116 |
| 2 | 202 | 6 | 123 | 1880 | 129 | 4 | 117 |
| 3 | 192 | 7 | 130 | 1 | 126 | 5 | 143 |
| 4 | 190 | 8 | 213 | 2 | 127 | 6 | 186 |
| 5 | 182 | 9 | 107 | 3 | 125 | 7 | 243 |
| | | | | | | 1918 | 269 |

పైపట్టీలను జాగ్రతగాపరిశీలించినయెడల కొన్ని సంవత్సరముల తాలూకు "ఇండెక్సు నంబర్సు" ఎక్కువగాను మరికొన్ని తక్కువగాను ఉన్నట్లు తెలిసికొనవచ్చును; ఈ అంకెలు వస్తువుల మొత్తపువెలల హెచ్చుతక్కువలను సామాన్యముగా గుర్తించుచున్నవి. ప్రత్యేకముగా ఏదైన ఒకవస్తువు తాలూకు వెలలు మీద నుదాహరించిన సంవత్సరములలో ఎట్లున్నవో కనుగొని ఈ పైనవేయబడిన అంకెల హెచ్చుతక్కువలతో తైపారువేసినయెడల విశేషభేద ముండవచ్చును; ఆకారణమునం జేసి ఈ "ఇండెక్సు నెంబర్లు" నిష్ప్రయోజనము లని చదువరులు సిద్ధాంతీకరించకూడదు; మొత్తపువెలలకున్ను (General Prices) ప్రత్యేకపు వెలలకున్ను (Particular Prices) వ్యత్యాస ముండునని ఇదివరకే నొక్కి చెప్పియున్నాము. మనము ముఖ్యముగా గమనించవలసిన కొన్ని చరిత్రాత్మక నిదర్శనములయొక్క వివరములను మాత్రము పొందుపరచెదము:—

19 వ శతాబ్ద మధ్యమున అనగా 1850-1870 వరకున్ను ఆస్ట్రేలియా కాలిఫోర్నియా (Australia and California) దేశములందుల్న గనులనుండి చాల విశేషముగ బంగారము ఉత్పత్తిచేయబడినందున (ఈ ప్రకరణము 5-వ పేరాలో "బీ" షెడ్యూలు చూడవలెను) లోకమందు ముద్రించబడిన బంగరునాణెముల సంఖ్య అధికరించినది; ఘనపరిమాణసూత్రానుసారముగా వస్తువులవెలలుకూడ అధికరించిన వనుటకు ఇండెక్సు నంబర్ల పట్టీయే సాక్ష్యము. ఇండెక్సు నంబర్లప్రకారము 1873-వ సంవత్సరము మొదలు సుమారు ఇరవైమూడు సంవత్సరములవరకు—అనగా 1896-వ సంవత్సరమువరకు వస్తువుల వెలలు తగ్గినట్లు స్పష్టము; 1873లో ఇండెక్సు నంబరు 151; 1896లో 88. వెల లిట్లుక్రుంగుటకు ముఖ్యకారణ మేమన, 1873కు పూర్వము అనేకదేశములలో బంగారముతోను వెండితోను తయారుచేయబడిన ప్రమాణనాణకములు చలామణియగుచూ వచ్చినవి; 1873-వ సంవత్సరమునకు తరుపరి రాబోవు పేరాలలో వ్యక్తీకరింపబడు కారణములవలన వెండితో ప్రమాణనాణ్యములంజేయుట ఉచితేతరమని తోచినందున ఒక్క బంగారముతో చేయబడినప్రమాణనాణకములే చలామణి కావలసివచ్చినది; ఎక్కువబంగారము నాణెములను ముద్రించుటకు కావలసినంతబంగారము లేనందున (బీ, సీ, షెడ్యూళ్లు చూడవలెను) లోహనిర్మితనాణకములసంఖ్య తగ్గవలసివచ్చెను—అనగా ధనముయొక్క విలువ హెచ్చెను; ఇందులకర్థము వెలలు సన్నగిల్లినవని. 1896 మొదలు 1901వరకు వస్తువులవెలలు హెచ్చుచున్నట్లు ఇండెక్సు నెంబర్లు తెలియజేయుచున్నవి; ఇందుల కొకముఖ్యకారణము: దక్షిణఆఫ్రికా, క్లోండైక్ మొదలగు (South Africa, Klondike etc.,) ప్రదేశములందున్న గనులలో సువర్ణరాసులు లభించినందున ప్రపంచమం దంతట ను బంగరునాణెములసంఖ్య అధికరించెను. 1901—1905 లో వస్తువులవెలలు సన్నగిల్లినవి; అందులకు కారణము బోయర్లతో యుద్ధము (The Boer War) జరుగుచున్నందున దక్షిణఆఫ్రికాగనులనుండి కావలసిన బంగారము సరఫరా అడ్డగించబడెను; అందువలననే బంగరునాణెములసరఫరా తగ్గుటయు ధనమువిలువ అధికరించుటయు తటస్థించెను. లోహపునాణెము లతిశయించుటవలననే కాదు పరివర్తిఉపకరణములగు బ్యాంకునోట్లు కరెన్సీనోట్లు మొదలగునవి జాస్తీఅయినప్పుడుకూడా వస్తువులవెల లధికరించును. ఐరోపామహాసంగ్రామకాలమందు (1914—1919) ముఖ్యముగా పేపర్‌కరెన్సీ (Paper currency) ప్రతిదేశమందును అధికరించినది; అందువలననే మహాసంగ్రామకాలమందు వస్తువులవెలలు సాధారణముగా నతిశయించినవి. ఇందులకు నిదర్శనము 1914లో ఇండెక్సు నెంబరు 117; అదేసంవత్సరము ఆగస్టుమాసమునుండి డిసంబరుమాసమువరకు వేయబడిన స్పెషల్ లెక్కలప్రకారము ఇండెక్సు నెంబరు 122; 1918-వ సంవత్సరములో ఇండెక్సు నెంబరు 269. ఇంతఅసాధారణముగా వస్తువులవెల లిదివర కెన్నడును అతిశయించియుండలేదు; 1782 వ సంవత్సరము నుండియు వేయబడిన ఇండెక్సునెంబ రేదియు ఇంతపెద్ద నెంబరు కాదు; నెపోలియానికుయుద్ధ (Napoleonic-War) కాలమందు కూడ ఇంతపెద్ద ఇండెక్సు నెంబరు లేదు.

(సశేషము)

# ప్రాచీనకవిత్వగౌరవము

మ॥ కాపాటి వేంకటరత్నముగారు

నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయినభోజన మూయెలమంచ మొప్పుత
ప్పరయురసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే.

నరవర కృష్ణరాయ కరుణాభరణా యనిచెప్పినట్లు తా
జనుపుకొనంగఁజాలె నలసానిమహాత్ముఁడు పూర్వ మాకవీ
శ్వరవరవంశమూర్తిక మవారితదివ్యకవిత్వతత్త్వసం
భరితుఁడుగాన దత్ప్రభు వపారకృపాకరుఁడున్ రసజ్ఞశే
ఖరమును గీర్తికామియు జగన్నుతిపాత్రమహాంధ్రవాఙ్మయో
ద్ధరణధురీణుఁ డార్యజనతాహృదయాంతరవాసి సత్యశీ
లురతలమానికంబు గుణలుబ్ధుఁడు హైందవరాజిరాజశే
ఖరమును గాన శ్రోతలును గావ్యరసగ్రహణైకనైపుణీ
స్ఫురదురుశేముషీ విభవసూరవతంసులుగాన దేశముం
బరమశుభావహంబయిన బ్రాహ్మణభక్తియుతంబుగాన నీ
వరు లగుసత్కవీశ్వరుల వాక్కుల వెంబడి నర్థజాలముల్
పరువిడెఁగానఁ గాలమును బాపచరితము గాదుగాన ని
ష్ఠురకుకవిప్రశంస చెవిసోకుట యెన్నఁడ లేదుగాన ము
ష్కరబహుభాష లంతటను గాల్కొని బిట్టుగ నాంధ్రభారతీ
శ్వరి సదలంకృతుల్ నెమకి భగ్గముపా డొనరించి తన్మృదు
స్వరహృదయంగమస్థలుల సంధులబంధము లూడ్చివైచి ని
ర్భరనిజదుర్నీతి తిమిరప్రచయోగ్ర మహార్ణవోర్మికాం
తరముల నీడు లేనిసుగుణంబుల రాజిలు తెన్గునేల తీ
వర మిదియంచు బొల్చుకొనుపాటికి నేనియు వీలుగాని వై
ఖరి నడుగంటముంచి యొడికంబుగ సర్వము దామయై వసుం
ధర ననివార్యమై విహరణం బొనరింపఁగలేదుగానఁ గా
వరమున నాంధ్రపుత్రులు శుభప్రదమాతృపదార్చనాధురం
ధరత పరాఙ్ముఖత్వ పరిణద్ధమనస్కులుగారుగాన దు
ర్భరపరతంత్రజీవనము భారతభూమికి లేదు గావునన్.




(మూడవసంపుటము, ఏడవసంచిక తరువాయి)

వ. బలిబంధనా! దేహధారులకు రాగద్వేషంబు లుడుగ నెట్లువచ్చు? బొందితో స్వర్గంబునకుఁ బోయిన ధర్మరాజును నున్నతపదంబున నున్న దుర్యోధనాదులం జూచి కనలిపడియెనట; మేమనంగా నెంతవారము? దేవా! మీరు పంచేంద్రియంబులు బలియ విడిచి, ప్రాణుల నజ్ఞానమున ముంచియెత్తి భ్రమియింపంగా మీతో నెదిరించి వారిని నణంప శక్తులమె? మీకు శరణని మీ నామసంకీర్తన చేయంగ మీచిత్తము! మా భాగ్యము! ఎట్లు చేసిన మీచేతిలోనివారమే; నమోనమ శ్రీవేంకటేశ్వరా! 33

వ. వేదవేద్యా! నీవు లోకవ్యాపారంబున నానాజీవులఁబోషింపుచుండ నేనొక్కవంక నీమూర్తి నామనంబున భావించి చెలికించుకొని నీతో బట్టబయలు మాటలాడుచు నామనోరథంబుం గాలక్షేపంబు నేయుచున్నాఁడను. ఇది నీవు నేయునుద్యోగంబునకుం బరాకునేయుట గాదగదా! కాదులే. విశ్వతోముఖుండవుం గావున అందఱితోమాటలాడ నోపుదువు. పరిపూర్ణుండవుగావున నన్నిచోటుల నుండనోపుదువు. మాకపచారములేదు. అనంతశక్తిధరుండవు, ననేకమహిమలవాఁడవు, నపరిమితోదారగుణుండవుఁ గావున నిట్టి నీ మాహాత్మ్యంబునకు శరణంబు; నమోనమ శ్రీవేంకటేశ్వరా! 3౪

వ. దేవదేవా! నిన్ను నేఁ బలుమారుఁదలఁచిన నీఁడేమి కోరి తలఁచుచున్నాఁడో యని మీచిత్తంబున నుంపునని యొకానొకసారి నిన్నుఁ దలంపుదును. మఱియును మేనిం బడలించి తపంబుచేసిన నంతరాత్మవైన నిన్ను బడలిక సోఁకునో యని యూరకుందును. పేరుకొని నిన్నుఁ బిలిచిన నన్నిపనులు విడిచివత్తువో యని మౌనంబున నుండుదును. జగత్తున నీవుండుట భావించి చూచి నిన్నుశోధించ నెట్లయ్యెడినో యని పరాకుచేసుకొందును. నీ చరిత్రంబులు సారెసారెకు వినంగడంగిన నీ రహస్యంబులు బయలఁబడునో యని యాలకింపుదును. నీ కొలువుచేసి పాదంబులకు మ్రొక్కంగా మందెమేల మయ్యెడినోయని అంతటంతటనుండి సేవించుదును. ఇది యెఱింగి నీవే దయం గావుము; నమోనమ శ్రీవేంకటేశ్వరా! 3౫

వ. వైకుంఠ వరదా! హిరణ్యగర్భాదులకుఁ దండ్రివైన నిన్ను, సనకాదులకు నేలికవైన

నిన్ను, దివిజులకు రక్షకుండవైన నిన్ను, మునులకు వరదుండవైననిన్ను, జ్ఞానులకుఁ బరదైవతంబైన నిన్ను యశోదానందగోపులకుఁ బుత్త్రుం డని తలంచిరి; గోపికా జనంబులకుఁ బతివని తలంచిరి; పాండవులకు బావమఱఁదివని తలంచిరి. వీర లటువంటి మమకారంబు లనుభవించిరి. మఱికొందఱు ముచికుంద దధిభాండ కమలాకర భీష్మాదులు పరతత్త్వమైన నారాయణుండ వని భజియించి బ్రహ్మపదంబును బొందిరి. ఇన్నివిధంబుల వారికి నీ వొక్కండవే గుఱి. ఎటువలె భావించిన నటువలె నౌదువు. వివేకింప నేర్చినవారి పాలిటి నిధానమవుదువు; నమోనమ శ్రీవేంకటేశ్వరా!

వ. సత్యసంకల్పా! ప్రసన్నులైనవారికి మీ దాసుల శ్రీపాదతీర్థంబు శిరసావహించుట సకలపుణ్యనదీస్నానములు; త్రికాలంబుల నాచార్యవందనంబులు సంధ్యావందనంబులు; అభ్యాగత శ్రీవైష్ణవుల నుపచరించిన వాక్యంబులు గాయత్రీమంత్రజపంబు; పూర్వాచార్యోక్తిస్వరూపగ్రంథానుసంధానంబులు వేదపారాయణంబులు; జ్ఞానాజ్ఞానంబులు పురుషునియందుఁ గామక్రోధంబులు వేల్చుట యాగాపాసనంబు; ఆర్తులైనవారికి శ్రీవైష్ణవమార్గంబు లుపదేశించుట యతిథిసత్కారంబులు; తాముత్తమాడియుండుటే దేవపితృసంతర్పణంబులు; మీ తిరువారాధన సేయుట సకలయజ్ఞంబులు చేయుట; వేదోక్తంబైన కర్మఫలంబు నియమంబులు నిటువలె సిద్ధించె; అదియ పరమార్థంబు. నిక్క గెల్వవచ్చు; పాపముం బట్టి నిర్వహింపవచ్చు; నిన్నుముట్టి మెప్పించవచ్చునే! నమోనమశ్రీవేంకటేశ్వరా! ౩౭

వ. నిగమగోచరా! నామంబు ధ్యానయోగంబు సేయంగడంగినఁ జండాలగార్ధభసూకరకాంతలు తలఁపునఁ బారెడిని. అంతట నది విడిచి పురాణంబులు చదువంజూచినఁ దాటకా శూర్పణఖా విరాధకబంధ రావణ కుంభకర్ణాదినామంబులు నోటం దొరలెడిని. అది మాని జపంబు సేయంబూనిన నిద్రయు, నావులింతలు, నలసత్వంబులుఁ బొదలెడిని. అది చాలించి తీర్థయాత్రకు గుతూహలినైన దుష్టచోరవ్యాఘ్రమకరాదిభయంబులు వణఁకంజేసెడిని. ఈ రీతుల నాప్రయత్నంబు లెక్కడ కెక్కు? నే నొకటితలంచిన వేఱొక్కచందంబున నీమాయ భ్రమియింపుచున్నది. ఏయుపాయంబున నిన్ను నావశము చేసికొనియెద? ఈచందము నాకు బోధింపవే. నీవు జగద్గురుండవు; నామర్మము నీచేత నున్నది; నమోనమ శ్రీవేంకటేశ్వరా! ౩౮

వ. నగధరా! తరులతాపాషాణాదులైన కొన్ని జీవశరీరంబులు నరపశుపక్షిమృగాదులైన కొన్ని జీవజంతువులకు నాహారంబులై యున్నవి. విచారించిచూచిన నెవ్వరికెవ్వరు చుట్టము లయ్యెదరు? ఋణానుబంధంబునందగిలిన నాపుత్త్రమిత్త్రకళత్త్రాదులు; ప్రాకృతసుఖంబులకుఁ దోడైనవారలు వీరు. మోక్షసుఖంబునకుందోడైనబంధుండవు నీవు. స్వామీ, మీదాసులై యపరలోహ

కంబులకు సాధనంబులైనవారలు వీరు. మీనామములు సకలదురితనివారణములు; మీయాయుధములు మాకు సర్వరక్షకములు; మీపాదంబులపై భక్తి మాకు వజ్రపంజరము; నమోనమ శ్రీవేంకటేశ్వరా! ౩౯

వ. విష్ణుమూర్తీ! నే నెంతమూఢకఠినచిత్తుండనైన నీవు నామీఁదఁ గృపవెట్టినసాత్త్వికుండ నగుదును; అది యెట్లంటివా? ఱాతిమీఁదం గడుపవెట్టినం గుదురుఁగాదె! గవఁరుసం జవ్వాజిపూసిన పరిమళంబుపుట్టదే! చిల్కకుం జదువుచెప్పినఁ జదువనేరదే! అడవి యిఱ్ఱికి వేఁట నేర్పి నఁబంపుసేయదే! యిట్లుగావున నీవు నామీఁద దయఁదలఁచి తల్లి బిడ్డలం బిలిచి ఆహారంబు పెట్టునట్లు, యజమానుండు తన పసులందోలితెచ్చి యింటఁ బోషించినరీతి నన్ను నీచిత్తంబునఁదలంచి నీకింకరునిగాఁ జేసికొనవే; నమోనమ శ్రీవేంకటేశ్వరా! ౪౦

వ. గోవర్ధనోద్ధారా! నేను గరచరణాద్యవయవంబులు దాల్చి మాతృగర్భంబునందుండి వెడలి పెరిఁగి బుద్ధినెఱింగి యీజగంబులకుం గర్త యెవ్వండొకో యని వెదకి వెదకి పురాణంబులవలన నీవైభవంబులు విని నిన్నుం గనుంగొని శక్యంబుగాక యెవ్వండవొకో యని విచారించి నిన్ను నెఱుంగ నలవిగాక తిరుమలపరుసవెంటం జని వేంకటాచలం బెక్కి గరుడస్తంభంబు చెంత జనులకు నీవు లోసంగఁజూచియుఁ, బాపవినాశనంబునఁ దీర్థంబు లాడువారి పాపంబులు నీరై పారుటం జూచియు, ఆకొండమీఁద వృశ్చికసర్పాదిజంతువులు నిర్గతవిషంబు లగుటంజూచియుఁ జోద్యంబునొంది యచట మీమూర్తి దర్శించి తొల్లింటి యజ్ఞానంబు విడిచి సందేహంబులు మాని నీవే యేలికయనియు నే నీ బంటననియుం దెలిసి శ్రీవైష్ణవుండ నైతి రక్షింపవే; నమోనమ శ్రీవేంకటేశ్వరా!

వ. ఉపేంద్రా! నీవు నాకు దేవరవై నాలోనుండఁగా నే నీదిక్కుచూడక యేకాంతంబున సంసారంబుచేసి బిడ్డలం గంటిని. అదియునుంగాక యేలికవైన నీవు నన్నుఁ జూచుచుండ భ్రమసి యెవ్వరుం గానరని సేయరాని పాపంబులు చేసితిని. మఱియు నీవు నాకుఁ దోడవై రక్షకుండవై యుండఁగా మఱచి యొంటి నున్నవేళ నొక్కండనే యని సంశయించి భూతంబులకు వెఱచితిని. క్రమ్మఱ నీవు నా మనంబులోఁ బంచేంద్రియములలో విహరింపఁగా వెఱవక, మందెమేలమని యెంచక, మంచముపై నిద్రించితిని. ఒక్కొక్కవేళ తలిదండ్రులైన మీరాత్మ భోగంబుల నోసంగుచు బాహ్యాంతరములం గాంచుచుండఁగాఁ గొంచించక సిగ్గువిడచి మలమూత్రంబులు విసర్జించితిని. ఎంచిచూచిన మా యపరాధంబు లెన్నియైనంగలవు; అన్నియును నోర్చుకొనుము. నాతప్పులకుం బ్రాయశ్చిత్తంబుగా దండంబుపెట్టెద; నమోనమ శ్రీవేంకటేశ్వరా! ౪౨

వ. చక్రపాణీ! నీమాయలకు లోనై నేను వ్యసనంబులచేతం జిక్కినప్పుడు నీబంటనని విడిపించుకొనుమీ! ఆశాపాశంబులు నన్ను నలువంకలకుం గుదియఁదీసెనేని ప్రాతవాడనని వెనుక వేసికొనుమీ! కామక్రోధాదులు, సారెసారెకుఁ బట్టఁ గడంగెనేని నీముద్రలు మోచినవాఁడ నని యడ్డంబు రమ్మీ; పురాకృతకర్మంబులు నన్నుఁదగిలెనేని సంకీర్తన సేయువాఁడనని మన్నించి రక్షించుకొనుమీ. నడుమ నడుమ నజ్ఞానంబుఁ జిక్కించుకొనిన దానిం బరిహరించి నన్నుం జేపట్టుకొనుమీ; మనసు పట్టలేక మునుపే విన్నవించితి. నీవు అనాథ నాథుఁడవు; ఆర్త శరణ్యుండవు; సర్వ భూత దయానిధివి; నిర్హేతుకబంధుండవు; నీవు నా హృదయంబులోనివాఁడవు; నాకు దిక్కు నీవేసుమీ; నమోనమ శ్రీవేంకటేశ్వరా!

వ. మాధవా! మీరు అర్జునునకు సాక్షాత్కారమై యుండి భగవద్గీత లేఁడు నూఱు గ్రంథంబులు బోధించితిరి. విశ్వరూపంబు చూపి ప్రమాణంబుచేసి మిమ్మెఱుంగుమని యుపదేశించితిరి. ఇంక మముఁ బోఁటిజీవుల నెన్నిట బోధింపవలయునో యందులకే చింతించెదను. అవులే; ఇంకొక యుపాయంబు విచారించుకొంటి; తొల్లి వాల్మీకి 'రామా' యను రెండక్షరముల నుడివి బ్రహ్మర్షియై మీకృపకుం బాత్రుండయ్యె. నారదుండు మీసంకీర్తనచేసి కృతార్థుఁ డయ్యె. విభీషణుఁడు మీకు శరణు చొచ్చి బ్రతికె. మాకు నిదియే మార్గంబు; నమోనమ శ్రీవేంకటేశ్వరా! ౪౪

వ. నందనందనా! చేయంగలపాపంబులన్నియుఁ జేసితి; నాకర్మం బేమనుచున్నదో యెఱుంగను. దేవర్షిపితృతర్పణంబులు సేయకుండంగను యమకింకరులేమనుచున్నారో యెఱుంగను. ఎక్కడలేని యుద్యోగంబులు సేయుచున్నాఁడను; విధి యేమనుచున్నాఁడో యెఱుంగను. అన్నపానాదిభోగంబులనుభవించుచున్నాఁడను; చిత్రగుప్తుఁ డేమి వ్రాయుచున్నాఁడో యెఱుంగను. బాల్య కౌమార యౌవనగతులం బెరుఁగుచున్నవాఁడను; కాలం బేమనుచున్నదో యెఱుంగను. ఇన్ని యపరాధంబులకు గుఱియైనవాఁడ నగుట నా భయము నివారింతువని నీమఱుఁగుసొచ్చితి. చేయంగల విన్నపంబులెల్లఁ జేసికొంటి, నీచిత్తం బెట్లున్నదో యెఱుంగను; నమోనమ శ్రీవేంకటేశ్వరా! ౪౫

వ. ఆదిమూర్తి! నేను భూలోకంబున నాకర్మంబు లనుభవింపం బుట్టితిఁగాని నిన్ను గుఱుతెఱింగి కొలిచెదనని పుట్టినవాఁడను గాను. ఇంతలో నీవు నిర్హేతుకలీలం గరుణించి నన్ను బంటుగా నేలితివి. నాభాగ్యంబు లేమనిపొగడెద; నిన్నుం బొగడుటకాక నే నేమితపంబు చేసితినో యది దలంపనేల? నీమహిమ దలచుటగాక నా బుద్ధి నేమిమెచ్చుట? దప్పిగొన్నయతండు జలముల వెదకుచుండ భాగీరథీజలం బిచ్చినట్లు, కృషికుండు తనచేను దున్నుచో నాగంటికొన బంగారుకొప్పెర దొరకినట్లు, పులిజూదంబాడెడువాఁడు రాళ్లేరుతటిమా

ణిక్యంబు చేకూడినట్లు నీవు నాకుం దొరకితివి; నమోనమ శ్రీవేంకటేశ్వరా! ౪౬

వ. మత్స్యావతారా, అవధారు! దేవ, నాలోనిపాపపురుషుండు విజృంభించి తరుము కొనిరాఁగా నీమఱుంగు సొచ్చితి. అంతలో నీయభయదానపురుషుండు వచ్చి అతనితో దారుణయుద్ధంబు చేయఁదొడంగె. అరిషడ్వర్గంబులనియెడి చుక్కలు డుల్లె; తాపత్రయంబనియెడి పిడుగులు రాలె; చింతాసముద్రంబు గలంగె; నిర్దయయనెడి ధరిత్రి వణఁకె; దుర్గుణంబు లనియెడి దిక్కులు చలియించె; దురాశాపర్వతంబులు గ్రుంగె; అతిఘోరసమరంబునఁ బాపపురుషుండు నోడిపాఱె; మీయభయదానపురుషుండు గెలిచె; ఈమేలువార్త మీకు విన్నవించితి; నమోనమ శ్రీవేంకటేశ్వరా! ౪౭

వ కమలనాభా! నే నీవేగువాఁడనై విన్నపంబు సేయవచ్చితి; ఏకాంతంబున వినవధరింపుము; భువిలో శరీరం బనియెడి మాయాపట్టణంబు గలదు. అందు కహంకారంబనియెడి రాజు; చలంబనియెడు ప్రధాని; విషయంబు లనియెడితలవరులు; మదమత్సరంబు లనియెడి కరితురంగంబులు; పాపంబులనియెడివీరభటులు; కోరిక లనియెడి కాఁపులు; రతిసుఖంబు లనియెడి ధనధాన్యభండారంబులు గలవు. ఈరీతిఁ గోటలోనివారలు ఆశలనియెడి నిశాసమయంబుల నేమరి నిదురవోవ నీ జ్ఞానంబనియెడి యూడిగపుదొర నన్ను బుద్ధివైరాగ్యశమదమంబు లనియెడి బలము నావెంటఁ గూర్చి యంపితేను ఆకోటగొని అందు ఠాణెం బుండి పగవారి నందఱిని గెలిచి పట్టితెచ్చి అప్పగించెదం బంపు వెట్టవే; నమోనమ శ్రీవేంకటేశ్వరా! ౪౮

వ. సుదర్శనధరా! జీవులుచేసిన పుణ్యపాపంబులు చిత్రగుప్తులు వ్రాయుదురట; నా మీఁద నేమివ్రాయుదురో యెఱుంగను. నేఁజేసిన పుణ్యంబులు మీకు సమర్పించితిని; పాపంబు సేయించిన యింద్రియంబుల నీముందఱం బెట్టితి; మనంబు మీకు నప్పగించితి; భక్తి నీకుం గానుకఁగాఁ బెట్టితి; శ్రీవైష్ణవుండనై మీ దాసుల మఱుంగు సొచ్చితి. అన్నింట నాకొఱంతలు దీర్చుకొంటిని. ఇంక నామీఁదఁ జిత్రగుప్తులు నిలువరు వ్రాయంబనిలేదు. ఇందుకు సాక్షివియు నీవె; ఎఱికయు నీవె; విన్నవించితి;నమోనమ శ్రీవేంకటేశ్వరా.

వ. రంగధామా! నీవు నీటిపై గొండలఁదేలించిన బలవంతుండవని, క్రోఁతులచేత రాజ్యంబు సేయించిన నేర్పరి వని రాతికిం బ్రాణంబు లిచ్చినయుదారుండ వని, కొండ గొడుగుగాఁబట్టిన సత్త్వసంపన్నుండ వని, ఒక గజముమాట విని కాచిన భక్తసులభుండవని, ఆఁటదాని మొరాలకించిన దయాళుండవని, ప్రహ్లాదుని ప్రజ్ఞ చెల్లించిన భక్తపరిపాలకుండవని, పదియాఱువేల నూటయెనమండ్రు దేవుల కందఱి కన్నిరూపులై వినోదించిన నెఱజాణవని నీకు మ్రొక్కితి; నిన్నుం గొల్చితి; భవంబులం గెల్చితి; సంతోషంబున నృత్యంబాడెదను; నమోనమ శ్రీవేంకటేశ్వరా! (స. శే.)



# భాగ్యములు

వెలగపూడి దానయ్య చౌదరిగారు

సంతతి బీరువోకమని సౌఖ్యములన్ గనుచుంట; భాగ్య మ
త్యంతము గాఁగనుండుట; నితాంతముదంబునఁ బౌత్రపౌత్రికా
సంతతి యింటియందుఁ గడుఁ జక్కఁగ నాడుచుఁ బాడుచుంట; సు
స్వాంతత నెల్లరుండుట; విచారణసేయఁగ దల్లి భాగ్యమౌ.

చ. మనమున శక్తియుక్తు లణుమాత్రముఁ దగ్గకమున్నె, పుత్రకుల్
ఘనులయి సర్వకార్యములు కౌతుకమొప్పఁగఁ జేయుచుంట; మ
న్ననమెయి నెల్లకోర్కులను నైపుణితో నెరవేర్చుచుంట; త
త్తనయుల నెల్లరుంగని ముదంబున మెచ్చుట; తండ్రిభాగ్యమే.

ఉ. తల్లియు దండ్రియున్ మిగుల దార్ఢ్యము గల్గినవారలై, సదా
యెల్లపనుల్ బొనర్చుటయు నెక్కుడు కూర్మివహించి యుంటయున్
గొల్లగ ద్రవ్యముండుటయుఁ గోర్కులు దీర్చెడి తమ్ములుంట; స్వాం
తోల్లసనంబుఁ గూర్చుసతి యుండుట; జ్యేష్ఠుని భాగ్యమారయన్.

ఉ. మామయు నత్తయుం గఠిన మానసులయ్యును గూర్మిఁగాంచు; టెం
తో మతిమంతులైన మఱఁదుల్ గణియించుట; యాఁడుబిడ్డలుం
బ్రేమను గాంచుచుంట; తన పెద్దఱికం బది సాగియుంట; యెం
తే మదిమెచ్చు ప్రాణవిభు నెయ్యము; గోడలిభాగ్య మయ్యెడున్.

ఉ. బావమఱంది పిన్నగుట; భార్యయొకర్తె కొమార్తె యౌట; శ్రీ
దేవివసించు నిల్లగుట; తెల్వినశించిన మామయౌట; స
ద్భావము గల్గునత్త గృహభారముఁ బూనిన జాణయౌట; నా
నీవిధులైదునుం గలసి ఘోర్పడు టల్లుని భాగ్య మారయన్.



పండిత మదనమోహనమాలవ్యాగారు　　　　　డాక్టరు మూంజీ గారు





**144** సెక్షనును ధిక్కరించి కలకత్తాలో ప్రవేశించినందులకు వీరిపై దెచ్చిన ప్రాసిక్యూషనును బెంగాలు ప్రభుత్వమువా రుపసంహరించుకొనిరి.

బి. విశ్వనాధ దాసు గారు, (యం. యల్. సి.) గంజాం



వీరిపై దెచ్చిన కేసును మదరాసు హైకోర్టువారు అప్పీలులో కొట్టివైచిరి

ఈజిప్టు ఫకీరు రహమాన్ బే గారు న్యూయార్కు నగరమున జూపిన అద్భుతచర్యలు



3. సముద్రములోనికి దింపకముందు పెట్టెలో నున్నరీతి



2. [illegible] నున్నపుడు పెట్టెలో పెట్టుట



1. రహమాన్ బే గారిని సముద్రములో దింపకముందు పరీక్ష జేయుట




ఈ దిగువఁ జేర్కొనిన గ్రంథములను వందనములతో నందుకొంటిమి

1. శుద్ధాంధ్రనిర్వచన శతకంఠ రామాయణము; నాలుగు ఆశ్వాసములు. గ్రంథకర్తలు: రాళ్లబండి నాగభూషణము, వెంకటప్పయ్య గార్లు. పుటలు 141. వెల 1–4–0. పుస్తకభాండాగారములకు 0–5–0 చీట్లు పంపుకొన్న యెడల రిజస్టరు చేసి పంపబడును. విలాసము: వల్లభనేని రామబ్రహ్మ చౌదరిగారు. జమీగొల్వేపల్లి, పామర్రుపోస్టు, కృష్ణాజిల్లా.

2. సీతాకల్యాణము. గ్రంథకర్త: గూడూరి కోటేశ్వరరావుగారు ఐదంకముల నాటకము. పుటలు 77. వెల 1–0–0. విలాసము: గూడూరు ప్రచురణాలయము. జి. టి. ఆర్. వేజెండ్ల, చేబ్రోలుపోస్టు.

3. రామకుమారాభ్యుదయము. ఏడంకముల నాటకము. గ్రంథకర్త: గార్లదిన్నె సుబ్బారావు గారు, ఆదోని. పుటలు 138. వెల 1–0–0.

4. సుశీల, నవల. సరస్వతీగ్రంథమండలి 7వ అనుబంధము. కర్త: జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారు, బి.ఏ., (ఆనర్సు) పుటలు 163. వెల రు 1.

5. శశిరేఖ, నవల, సరస్వతీగ్రంథమండలి 8వ అనుబంధము. కర్త: గుడిపాటి వెంకటచలముగారు. పేజీలు 223. వెల రు 1–0–0.

6. కెనిల్వర్తు, సర్ వాల్టర్ స్కాట్ గారి ఆంగ్ల గ్రంథమున కనువాదము. అనువాదకుడు: ముడియం సీతారామరావుగారు, బి. ఏ., యల్. టి., చంద్రగిరి. పేజీలు 223. వెల 1–2–0; కాలికో, రు 1–6–0

7. గంగానది. కర్త: ముడియం సీతారామరావుగారు, చంద్రగిరి. పేజీలు 92, వెల 0–9–0.

3· 9- 18

8. కర్మవిజ్ఞానము, ప్రథమభాగము. కర్త: కామఋషి మృత్యుంజయవర్మగారు, పిఠాపురము. పేజీలు 66. వెల రు 2–0–0.

9. బాలకథామంజరి, కర్త: అవసరాల శేషగిరి రావుగారు; ప్రకాశకులు: మాదేటి సన్యాసయ్య అండు సన్సు, రాజమండ్రి. పుటలు 48. వెల రు 0-5-0.

10. హైమవతీవిలాసము, చిదంబరకవిప్రణీతము; మూఁడాశ్వాసముల గ్రంథము. పేజీలు 87. వెల రు 1. విలాసము: చిదంబరగ్రంథమాల, పొన్నూరుపోస్టు, గుంటూరుజిల్లా.

11. అగ్నికులక్షత్రియవంశసంగ్రహచరిత్ర. కర్త: పెదశింగు వెంకటనారాయణగారు; పేజీలు 80. వెల రు 0–8–0

12. మొటపర్తి వెంకటనారాయణ చౌదరిగారి జీవితచరిత్ర. కర్త: మొటపర్తి సోమయ్యగారు. పఠనమందిరములకు ఉచితముగా నీయబడును. విలాసము: కార్యదర్శి, వివేకానందపఠన మందిరము, దెందులూరు, యేలూరు తాలూకా.

13. దారిద్ర్యబంధవిముక్తి, హిందీ వ్యాసానుసారము. కర్త: వ. వెంకటరత్నముగారు. వెల లేదు.

14. ప్రార్థనగీతావళి, కర్త: శనివారపు సుబ్బారావుగారు. పేజీలు 120. వెల 0–4–0.

15. ఉపదేశశతకము; శ్రీగుమానికవి విరచితము. గోవిందరాజు హరిశ్చంద్రరావుగారు వ్రాసిన ఆంధ్ర తాత్పర్యమును గలదు. పేజీలు 24. వెల 0–2–0.

16 (1) శ్రీరాజరాజేశ్వర శతకము, (2) శ్రీ మంగళాద్రి నృసింహశతకము. గ్రంథకర్త్రి: గుడిపూండి

ఇందుమతిదేవిగారు. వెల 0-2-0. విలాసము: కార్యదర్శి విద్యావిలాససభ, బెజవాడ.

17. అష్టోత్తర భగవత్కీర్తనల శతకము. గ్రంథకర్త్రి: గుంటూరి రామమ్మగారు, నరసాపురం. పేజీలు 68. వెల రు 0-8-0.

18. సకలేశ్వరశతకము. కర్త: నందూరు లక్ష్మీనరసింహారావుగారు, నందూరు,గుంటూరుజిల్లా. పుటలు 52. వెల 0-6-0.

10. కమ్మవారి చాటుపద్యరత్నావళి, మొదటి భాగము.సంపాదకులు: సూర్యదేవర రాఘవయ్యచౌదరి గారు, కొల్లూరు. పుటలు 46. వెల 0-8-0.

20. ఆంధ్రోత్కళసమస్య, ప్రహసనము. ప్రహసనకర్త: దుర్గమహాంతి ఆదినారాయణగారు,సోంపేట. వెల 0-0-6.

21. నవల, బాల్యస్నేహము. కర్త: రంగాల నిత్యానందంగారు. పుటలు 34. వెలలేదు.

22. శ్రీసంగమేశ్వరతారావళి. కర్త: కొత్త జగ్గయ్యచౌదరిగారు, సంగంజాగర్లమూడి, తెనాలి. వెల 0-2-0.

23. చంద్రగుప్త (అయిదంకముల నాటకము) శ్రీయుత ద్విజేంద్రలాలు రాయిగారి వంగమూలము యొక్క హిందీఅనువాదమునకు తెనుగు. అనువాదకుడు: శ్రీయుత నందూరి శివరావుగారు.

24. రాణాప్రతాపసింహ (అయిదంకముల నాటకము; శ్రీయుత ద్విజేంద్రలాలురాయిగారి వంగమూలముయొక్క హిందీఅనువాదమున కిది తెనుగు. అనువాదకుడు: శ్రీయుత జంధ్యాల శివన్న శాస్త్రిగారు.

పై రెండుగ్రంథములను ఆంధ్రగ్రంథరత్నాకరపు ౮, ౫, రత్నములు. విలాసము: ఆంధ్రగ్రంథరత్నాకరము, గుడివాడ.

25. మసూరికారోగము, కర్త: వైద్యశాస్త్ర పండిత తాతా రామమూర్తిగారు, విజయనగరము.

26. మయసభ, కర్త: కేశవపట్నాము వెంకరత్నము సూరిగారు ఇచ్ఛాపురము. పేజీలు 100, వెల 0-8-0

27. షట్చక్రవర్తి చరిత్ర' ప్రబంధము. కర్త: రాజా మల్లారెడ్డిగారు పేజీలు 133.

28. ఆంధ్రరాష్ట్రప్రారంభవిద్య, ఆంధ్రవిశ్వవిద్యాలయస్థాపనావసరసంచిక, సచిత్రముగ ప్రకటింపబడినది.

29. ఆంధ్రదేశీయేతిహాసకమండలి వారియొక్క ప్రథమసంచిక. మూడుమాసముల కొకసారి ఇంగ్లీషుభాషలో వెలువడును. చందా సం॥6-0-0 రాజమండ్రి.



# ద్రౌపదీ పరిదేవనము.

బ. కృష్ణప్పగారు

శ్రీరఘూ!ఘధర్మజ! రాజరాజ! యిడుమాయరున్నంబు దూర్వాసుడన్
దనువున్ డస్సె, బలం బడంగె, గలిగెన్ దాపంబు క్షుద్బాధచే
ననుచున్ డాసెను నర్ధరాత్రమున నాహా మౌని, ప్రార్థించెదన్
వనజాక్షుణ! రుక్మిణీరమణ! దేవా! మేలు యోజింపవే.

మ. పరమోదారుడు ధర్మజుండు నదికిన్ బంపెన్ మునిన్ వంటకున్
దెరువింత్తైనం దలంపఁడయ్యె నకటా తీర్థావగాహంబు, స

త్వరతన్ దీఱిచివచ్చుహాని కుడువన్ దైత్యారి! కంసారి! శ్రీ
హరి! యీ యక్షయపాత్రమన్నరహితంబయ్యెన్ గదే యెట్లొకో.

సీ. కాలమా నడురేయి కమలా మనోనాథ! హానిసంతృప్తికి మార్గమెద్ది?
వాసమా విపినంబు వారిజలోచనా! ఛాత్రులన్ దనిపెడు సరణియెద్ది?
బంధులా ఖగములు బంధుచింతామణీ! తెచ్చి యన్నంబిడు తెరు విఁకెద్ది?
మిత్రులా మృగయులు శత్రునిషూదనా! శుద్ధాన్న మర్పించు సూత్ర మెద్ది?
తే. కందమూలంబులను దిని కాననమున, నడలుచుండిన నిడుమలు విడువవయ్యె
నేమిసేయుదు నేమందు నెవరు దిక్కు, కావవే కృష్ణ! యనుజను గరుణతోడ.

శా. సేవల్ సేయుచు మంత్రముల్ చదువుచున్ సత్కారముల్ సేయుచున్
ద్రోవల్ సూపుచు శిష్యు లర్థి నడువన్ దూర్వాసుఁ డన్నార్థియై
వేవచ్చెన్ దగ వేళయయ్యెఁ గృపతో వీక్షించి, నన్ బ్రోవఁగా
రావే, యాపదఁ బాపవే, మనుపవే రాధామనోవల్లభా!

మ. శరధిన్ గూలఁగఁ జేసె నింద్రుని మహైశ్వర్యంబు కోపంబుచేఁ
బరపెన్ గృత్యను నంబరీషనృపుపై బ్రహ్మాండ మల్లాడఁగాఁ
బరమక్రోధ ప్రచండభాషణుఁడు దూర్వాసుండు సామాన్యుఁడే
తెరువున్ జూపి సహోదరిన్ మనుపరాదే భక్తచింతామణీ!

శా. బాలిన్ రుక్మిణి మోహపాశములతో బంధించెనో? త్రోవకున్
గాళిందీసతి యడ్డమై నిలిచెనో? గర్జించుచున్ సత్య, నీ
కేలున్ బట్టి మఱల్చెనో? మనసిజాగ్నిన్ గ్రాలి యారాధ, నీ
చేలంబున్ విడదయ్యెనో? కటకటా! శీఘ్రంబ, రావేల, యో
శ్రీ లక్ష్మీరమణా! భవాబ్ధి తరణా! శ్రీకృష్ణ! నారాయణా!

శా. గర్వాంధుండు సభాస్థలిన్ వసనముల్ గట్టల్క నొల్వంగ, నే
సర్వేశా! ధ్రువరాజపోష! యననే? సంరక్షఁ గావింపవే
దూర్వాసుం డననెంత నీకుఁ గృప నా దుఃఖంబు నాలించి, యో
గీర్వాణార్చితపాద! శ్రీద! మురళీ! గీతప్రియా! రాగదే!

మ. తొలఁగెన్ రాజ్యము దూరమయ్యె సుఖముల్ తోరంబులై యాపదల్
బలమింకించె వనాళిఁ గాయకసురుల్ భక్షించి దైన్యంబుచేఁ
గలఁగెన్ జిత్తము హానివచ్చెఁ దనుపం గానేర, నే దీనతన్
గొలుతున్ సన్నుతిఁ జేతుఁ బ్రోవఁగదవే గోపాలచూడామణీ.




## హిందీ తెలుఁగుకోశము

కర్త: శ్రీయుత జంధ్యాల శివన్నశాస్త్రిగారు.

ప్రకాశకులు: హిందీ సాహిత్యసమ్మేలన ప్రచారక కార్యాలయమువారు, తిరువల్లిక్కేణి, చెన్నపురి

క్రౌనుసైజు; ౮౫౬ పేజీలు. వెల రు. ౨-౮-౦.

ఇందు సుమారిరువదివేల హిందీపదములకుఁ దెలుఁగర్థము గలదు ఉర్దూ, పారసీ, అరబ్బీ మొదలయిన భాషలనుండి కైకొని హిందీభాషయం దుపయోగింపఁబడుచున్న పదములు పెక్కులు ఇందుఁ గలవు. హిందీభాషయందు లింగనిర్ణయము కావించుట మిగులఁ గష్టసాధ్యము అట్టి యుపద్రవము కలుగకుండునట్లు లిందుఁ బ్రతిపదమునకును లింగనిర్ణయము కావింపఁబడినది. ఇట్టి నిఘంటువు హిందీభాషను నేర్చుకొను నాంధ్రులకు మిగుల నుపయోగకరమనుట సత్యదూరము కాదు.

శ్రీ శాస్త్రిగారు రచియించిన 'తెలుఁగు హిందీ కోశము'ను గూడ నీ కార్యాలయమువారే ప్రచురించినారు. అదియు నెల్లవిధములఁ బైదానివలె నుపయోగకరముగ నున్నది. కాని దీనియందు సుమారు పదివేల తెలుఁగుపదములకు మాత్రమే హిందీ అర్థము గలదు. ఈకోశము క్రౌనుసైజున రెండువందలపేజీలు గలిగియున్నది దీనివెల రు. ౧-౮-౦మాత్రమే.

హిందీభాషాపఠన సాంప్రదాయ మెఱిఁగినవారీ రెండునిఘంటువుల సాహాయ్యమునఁ దమ భాషాజ్ఞానము నభివృద్ధిచేసికొనఁగల్గుదురనుటకు సందియము లేదు.

---

# ఎచ్చటికేగెనో యెవ్వరికెఱుక?

గరిగిపాటి రామమూర్తిగారు

మంచు తెమ్మెరలలో మటుమాయమాయె  
మందు వేసఁగికైన మఱలిరాదేమొ?  
తుహినాంశునేవచే దూణమ్ము విడిచి  
ఎచ్చటికేగెనో యెవ్వరికెఱుక?

మధురామృతము నిచ్చి మన సెఱింగింప  
మన గల్గినా నింతమాత్రమ్ము కాని  
ననురోసి ననరోసి వినయంబు వీడి  
చనె నింక మనలేను మనలేను మహిని.

అరుణారుణంబులై మెఱయుచునుండు  
దరహాసదళముల మఱువంగ నెట్లు?  
దరిఁజేరగనె చిమ్ము పరిమళంబులను  
వాసనచూడక వసియించు టెట్లు?

మంచు తెమ్మెరలలో మటుమాయమాయె  
మందు వేసఁగికైన మఱలిరాదేమొ?  
తుహినాంశునేవచే దూణమ్ము విడిచి  
ఎచ్చటికేగెనో యెవ్వరికెఱుక?



# ఎప్పుడూ ఇంతే!

భమిడిపాటి కామేశ్వరరావుగారు

(ఒక ప్రహసనము)

## పాత్రలు:

| | |
|---|---|
| పర్వతాలు, పానకాలు | అన్నా దమ్ముల బిడ్డలు |
| అక్షయం | పైవారికి పినతండ్రికొడుకు |
| హనుమాన్లు | పర్వతాలుగారి ఇంట్లో ఉండి చదువుకుంటూన్న విద్యార్థి. |
| అమృతం (వేషధారి) | |
| ఇద్దరు బాటసార్లు | |

## వేషాలు:

పర్వతాలు:— బిళ్లగోచీ, పంచికట్టు జొత్తాములు పెట్టకుండా చార్ల ఆఫారమ్, పైమీద పాత జల్తారు కండువా, (ఇంట్లో లేనప్పుడు) కాళ్లకి సులకతాడు జోడు, చేతులో పాబ్రహ్మతేజం.

పానకాలు:— వారగోచీ, పంచికట్టు, షర్టు, కోటు, శాలువ, చలవజోడు, స్టిక్కు.

అక్షయం:— కొత్త ఫేషన్లో ఏమైనాసరే కండువామాత్రం అత్తాకోడలు అంచుసిల్కు.

హనుమాన్లు:— (మామూలుగా) అంతా ఖద్దరు, అదే శాలువ.
(భంట్రోతు) గడ్డం, టోపీ, డవాలీ.

అమృతం:— (దొరవేషం) సూటు, హాటు, పిస్తోలు.
(శివుడు వేషం) బట్టముసుగు, నుదుట ఎలెక్ట్రిక్ బల్బు.
(మామూలుగా) మిశ్రమం.

బాటసార్లు:— (ఒకడు) శాలువకప్పుకుని
(రెండవవాడు) తలకి అంగవస్త్రం చెవలమించి చుట్టుకుని, వేటకట్టు వేసుకుని.

## రంగాలు:

౧. పానకాలు ఇంట్లో.
౨. పర్వతాలు ఇంట్లో.
3. ఒకఇంటిముందు వీధిలో, ఆ ఇంట్లో.
౪. ఆ ఇంట్లో.

## ౧-వ రంగము

[పానకాలు ఇంటి సావడి. బల్లా, రెండు మూడు కుర్చీలూ; పానకాలు ఒక కుర్చీమీదకూర్చుని ఆలోచిస్తూ ఉండును. పర్వతాలు గబగబా తొక్కుకుంటూ ఆయాసముతోవచ్చి పానకాల్ని మెడవేసుకుంటాడు.]

ప. అయ్యో! అయ్యో! (అని గొల్లుమని ఏడ్వలంగించుకొనును.

పా. అదేమిరా? ఏమొచ్చి పడిందిరా, పర్వతాలూ? (అని ఏడుపు మొహం పెట్టి మూలుగుతాడు) కూచోరా!

ప. (కూర్చుని) పానకాలూ!

పా. ఓయ్!

ప. పానకాలూ!

పా. చెప్పరా, ఎందుకురా, శోకస్నానాలూ!

ప. మొన్న ఈమధ్యరా!

పా. ఆఁ ఏమిటేమిటి! (అని ఆశ్చర్యపడును)

ప. చాలామందిరా!

పా. (ఏడుస్తూ) ఆఁ;

ప. గొప్పవాళ్లు యాత్రా!

పా. హుఁ. (అని ముక్కును)

ప. బాగు పడుతున్నార్రా!

పా. (మళ్లీ ముక్కును)

ప. పైకొచ్చార్రా!

పా. నిజమే; నిజమే. ఎంతకష్ట మెంతకష్టం! పాప ము శాంతించునుగాక. (కొంచెం తాపీగా) అయితే నీ కీదుఃఖం మనం పైకిరావటంలేదనేనా?

ప. కాదురా!

పా. మరి!

ప. ఇతరులు పైకొస్తున్నారనేరా, కేవలమూనూ!

పా. ఇంతేగద. భాగ్యమా ఏమిటి. ఓసారి మనంగూడా పైకొస్తే సరి.

[ఈ సమయానికి అప్పుడే హనుమాన్లు వీరిమాటలూ, చేష్టలూ, దొంగపోటుగా గమనిస్తూండాలి. సంవర్భాన్నిబట్టి ముక్కుమీదవేలూ, గుండెలమీద చెయ్యీ వగైరా వేసుకుంటూండాలి]

ప. పైకి మూణ్ణిముషాల్లో రావచ్చును గాని, నాకు టైము లేదురా.

పా—ఏం? మనకి పనీ పాపనీ అనిఏమిలేదుగా!

ప—అంచేతే టైములేదూ! (తాపీగా)చూశావు అందుకని, మనం ఉన్నచోటే ఉండవలసి రావడంవల్ల కొందరు పైకెదుతూంటే, మనం కిందికి దిండుకుపోతూన్నట్టు కనిపిస్తుంది. దానికేంగాని, ముఖ్యంగా మన బాబుగారి అక్షయంగాడురా! (అని మళ్లీ మూల్గును)

పా—వాడికేం? వాడికేం? పరోహాటేమీ జరగలేదుగద! కొంపతవ్వి నాలుగైదువేలకి ఇన్సూరు చెయ్యలేదుకద!

ప—నిన్న పొద్దున్నరా!(అనిపెద్దపెట్టున, కుసిల్లి కుసిల్లి ఏడ్చును)

పా—ఊరుకో, పర్వతాలూ! ఇహ మాట విని పించుగోడం అంటూ లేదా ఏమి! ఊరుకో. ఊఁ.[కళ్లు పెద్దవిచేసి, పెదవి బిగించి) ఊరుకోవేఁ? వెనకాలపిల్లలు నాబోటిగాళ్లు వీళ్లు బెంబేలు పడడమేనా? ఏమన్నా ఉందా?

ప—ఉండు చెప్పనీ చివరంటా! నిన్న పొద్దున్నకి నిక్షేపంలా, దిమ్మచెక్కలా ఉన్నాడురా!

పా—ఊఁ. సాయంత్రానికి?

ప—సాయంత్రానికి ఓపుస్తకం రాసేసి ఊరుకున్నాడ్రా.

పా—అస్తమానం అదేపనిరా, రాయడం అబ్బరమా! పోదూ! ఊఁ. తరవాత పోయాడు గావును.

ప—లేదు. పుస్తకమాటే నేఅనేది.

పా—ఓటి చెబుతాను విను పర్వతాలూ. ఇంతేడుపూ, మనవాడొకడు ఏదోపని చూపినందుకు నువ్వు పైకి నాదగ్గిర ఏడిచావుగనక సరిపోయింది. మరోవాళ్ల దగ్గరైతే ఎంతచిక్కు! ఎప్పుడూ పైకి ఏడవకు. అది సౌఖ్యంకాదు. లోలోపల కానీ నాకు మల్లే. చాలామంది చదువుకున్నవాళ్ల అభిప్రాయం ఆచరణా అంతే. అయితేనూ, అక్షయం ఎందుకూ పుస్తకం రాశాట్ట?

ప—ఏమో! మనం ఊరుకున్నప్పుడు వాడుకూడ ఊరుకోవద్దూ! నిత్యం వాడు ఏదోవోటి చేస్తూనే ఉంటాడు. మనం వెనవలం, ఏమిచెయ్యగలం, ఊరుకోరా, అంటే వినడూ! ఏకీభావం లేదూ. వాడు లాభానికో గొప్పకో, కీర్తికో, పేరుకోసమో, ప్రచారం కోసమో!

పా—అంతేనా. నాదీపూచీ. వాడికితగ్గ శాస్తి నిమిషంలో చేస్తా (అని తలపంకించును).

ప—పోనీ, కాఫీ ఇక్కడే పోస్తాం అని వాణ్ణి లాక్కొస్తూ కాస్సేపు కసితీరా ఏడిపిద్దాం.

పా—సరే. వెళ్లి ఇప్పుడే వస్తా.

[అనివెడతాడు. పర్వతాలు కూర్చుని జేబులోంచి కొన్నిసంచులూ, పొట్లాలూ తీస్తాడు హనుమాన్లు ఇంతవరకూ తలపంకిస్తూ ఈ సంభాషణ వింటాడు. విని, "ఆరి, వీళ్లతస్సగొయ్యా, మరీ పేట్రేగిపోయారూ.

ఎవరో అమృతంగారు వచ్చారని రహస్యంగా తెలిసింది. ఆయన్ని కలుసుగుని, వీళ్లు అక్షయాన్ని నిరసించే సమయానికి ఇక్కడికివచ్చి, వీళ్లకి ఏదేనా మందెయ్యాలి" అని చరచరా వెడతాడు. పానకాలు, అక్షయాన్ని వెంటపెట్టుగుని దక్కావచ్చి, కుర్చీమీద కూర్చోమని అతనితో చెబుతాడు. అతడు కూర్చోబోతూంటే, పర్వతాలు ఇంత మెంతి అక్షయం కళ్లల్లోకి కొడతాడు. "అబ్బ" అని అక్షయం కళ్లునూసుగుంటాడు. "మెంతికారం" అంటాడు.]

ప—లేకపోతేనూ! వెనవ వేషాలేస్తావు మాతో చెప్పకుండానూ! మామీద పుస్తకం రాశావుట ఎంగుకూ! మామాటలు తస్కరించావుటగా!

అక్ష—రామరామ, మీమీద రాయలేదు. ఏ ఒక్కడి మీదాకాదు, ప్రకృతినిగురించి రాసినప్పుడు, మీమీద పెట్టుగోడం ఎందుకు?

ప—పోనీ అదే ఆయిరి? ఎందుకురాయటం, అసలు? నీ హృదయంలో అభిప్రాయం ఏమిటి?

అక్ష—కనడం ఎందుకంటే ఏమిటే చెప్పడం?

పా—లాభం లాగుదామనా? (అని వీపుమీద కొట్టును.)

అక్ష—అబ్బె! పుస్తకానికి చదివే దక్షతా యోగ్యతా లేక, లాభం ఉండటంలేదు. కొద్దివాళ్ళూ గొప్పవాళ్ళూ ప్రతీవాళ్ళూకూడా ఎవడి దగ్గిరేనా ఓమాటు అడిగిపుచ్చుకుని చదివేద్దాం అనే గాని కొందామని లేదు. ఈ మధ్యనే ఓఆయన, ఇంట్లో ఏదో డబ్బులొందరొస్తే, మూడునాటకాల కాపీకైటు యాభైరూపాయలకి, చేను మీదే ధాన్యంజట్టీకిచ్చినట్టు, అమ్మకాకుండా రాతలో ఉండగానే అమ్మేశాడు. అందుకని లాభంకోసంకాదు.

ప—పాండిత్యం వెళ్లబోసు కోడానికా; ఎవడిక్కావాలిరా నీచదువూ! పైగా, అన్నీ తప్పులే. ఇదిగో నీపాండిత్యానికి—(అని ముసిముసి నవ్వు నవ్వుతూ అక్షయానికి పంగనామాలు పెడతాడు)

పా—లేకపోతే కీర్తిసంపాదించడానికా?

(అని అక్షయంమీద బొగ్గునీళ్లు చిలకరించును.)

ప—చెప్పవేం? మాట్లాడవేం, బెల్లంకొట్టిన రాయల్లా!

అక్ష—పిచ్చివాణ్ణి, రాశాను.

ప—మదపిచ్చేనా! ఓకవీశ్వరుడు ఇల్లానే అన్నాడు నాతోటి—'కవితోన్మాదంలో ఉండి కవిత్వం చెప్పాను'—అని. ఆపళంగా నేను, "మమ్మల్ని ఉన్మాదం, ఉన్మాదం అంటూ చంపుకు తినబోతే, మన శాస్త్రప్రకారం ముగాడికి తప్పులేదు గనక, ఖర్చునే పెట్టుగుంటాను, చూడలేకుండాఉన్నాం, ఓ నెలపాటు ఎవర్నేనా...ఏది?..." అని నేనన్నాను. నీసంగతికూడా అల్లాఉంది. కాని ఇకముందెప్పుడూ!

(అని అక్షయం చెవి మెలిపెట్టును)

పా—ఎప్పుడూ! ఎప్పుడూ! (అని అక్షయం రెండో చెవిమెలిపెట్టును)

(ఈసమయానికి మార్చింగుచేస్తూ, ఓదొరగారూ, ఓడవాలీ భంట్రోతుసాహెబూ దక్కావస్తారు. వీళ్లని చూసి, పర్వతాలూ పానకాలూ తోకముడిచెయ్యడానికి ప్రయత్నించి వణుకుతారు. సాహేబు వీళ్లని దొరకి చూపించి, "హీళ్లేనండే, సార్, హాళ్లూ! హిస్మంటే హాళ్లనీ హెక్కామూశాను లేదూ, సార్!" అంటాడు. దొరగారు "ఆగు నీవు—నీవుకూడ" అంటారు. అంటే వీళ్లు తెల్లముహాలువేసి ఆగిపోతారు. అక్షయం, ఈపాటి కళ్లుతుడుచుకుని, తెరచి, నిలబడతాడు.)

దొర—వానిని మీరు ఏమిచేయుచున్నారు? నీవు! నీ పేరు?

ప—ఏం? రాసుగుంటావా; రాస్కో, ఏమాత్రం రాస్కుంటావో. నాపేరు పర్వతాలు. భయమనుకున్నావా ఏమిటి? లేకపోతేను! రాసుగుంటాట్ట! ఊహూఁ, మహా! నాదగ్గిరతీశై! అబ్బో! చాలాచూశాం!

దొర—షరే. చెప్పుము, చెప్పుము; పర్వటాలు!

ప—ఏమిటి, చెప్పేది, గోంగూర? మాయిష్టం. మాయింట్లోమేం, తిట్టుగుంటాం, దీవించుగుంటాం. నువ్వెవరు దండించి అడగడానికి?

దొర—నీవుచెప్పుము. (అని పానకాల్ని అడుగుతాడు.)

పా—మేం సంస్కార్లం. నువ్వు మాకు గౌరవం చూపించడంలేదు ఏమీలేదు. ఇదేమిటి! మాటవర్సకి చెప్తాను. మాపర్వతాలు గొప్పవాడు, నేనూగొప్పవాణ్ణె. కాదుట్రా! పర్వతాలూ! ఊఁ, ఊఁ, మాడమా!

దొర—అతడు ఏందుచేత గొప్పవాడూ?

పా—బోలెడున్నాయి. వాడు "అపనా తనా మనా" పాడగల్డు.

ప—మావాడు పరీక్షఫేలయాడు. ఆస్తి కరాంగావుడు అయిపోయింది.

పా—మావాడు అదేమంటుమాట్లాడాడు. ఇచ్చిన ఉద్యోగం అక్కర్లేదన్నాడు.

దొర—చాలు. చెప్పెదరా, పేల్చి వేయనా? (అని తుపాకీతీయును.)

ప—బాబో, బాబో! ఉంది ఇదీ, చెబుతా చెబుతా, ఇది లేదనుకొన్నా(రా బాబూ నీదగ్గిరా! మనిషీమనిషీ పోట్లాటేమో అనుకున్నా(రా! పానకాలూ, నాకు దడగా ఒంది. నువ్వుచెప్పు.

పా—మావాడే ఒకడు ఈమధ్య గ్రంథకర్త అయాడు. కొంచెం వాడిగ్రంథం కనుక్కుంటున్నాం!

దొర—ఓ! కవి! కవి! అటులైన వానిని పూజింపుదు! మెచ్చుకొనుదు!

శక్తిలేదండీ! ఉంటే ఆపూజేనాచేద్దుం. ప్రస్తుతం బడితెపూజే!

పొద్దున్నమాటలు రాస్తూంటే! అసలుజనానికి తిండి సరిగ్గా లేనప్పుడు, కవిత్వమేమిటి? పొట్టగడిచినపిదప గాని, ఈ లోపుగా కవిత్వమెందుకు? కళెందుకు? విలాసవస్తువులు! తమకు తెలిసినదేగా తిండిలేకుంటే!

దొర—వానిని మెయ్యండి. (అని హడావిడిచేసి తుపాకీతో బెదరిస్తాడు)

ప—ఉండరా! ఉండరా! పేల్చి చంపుతావా ఏమిటి! ఉండు, ఉండు. పానకాలూ, ఏదీకర్ర. ఏం జేస్తాం? పట్టు. పానకాలూ! తప్పదు. లేకపోతే వీడు గుండెలమీదుగా తుపాకీబారు చేస్తాడు. (మెల్లిగా) నీకు ఆగ్నేయాస్త్రం రాదేం?

పా—(మెల్లిగా) చాలా తెలుసును. కాని, ఒక్కటీ చెయ్యలేను.

(వాళ్లిద్దరూ అక్షయాన్ని కుర్చీలోకూలేసి, కుర్చీ సందులోంచి కర్రచెక్కి పోనిచ్చి, ఇవతలకొసఒకరూ, అవతలకొస ఒకరూ, చేతుల్లో పెట్టుగుని కుర్చీ లేవనెత్తుతూ)

ప—చంపేస్తానని బెదిరించి ఎంతపని చేయిస్తున్నావురా, నీతుపాకీ ఇదైపోనూ! నిన్నైనా మోస్తుం లెక్కలేకుండా! మావాడైపోయాడు, అదీ మావిచారం, అదీ మా శిరచ్ఛేదం! మావాణ్ణితప్ప విడిచి మరి ఇతరుణ్ణి ఎవణ్ణైనాసరే తెగమోద్దుం చచ్చేవరకూను! సరే, మా కర్మం. మోయిందు, మోయిందు. గోవిందా, గోవిందా! నారాయణ! నారాయణ!

అక్ష—నే జీవించే ఉన్నాను.

పా—(పర్వతాలుతో రహస్యంగా) ఏమిటో అనుకున్నాను, వీడు బలువేరా!

(పానకాలుతో మెల్లిగా) ఆఁ; బతుకున్నవాళ్లు నాకు తేలికేన్సీ.

దొర—వానిని మీరు స్ట్రెచ్చరుచేసి మెచ్చుకొనుడు.

సాహేబ్—పేట్రి, సార్! మీహైట్టీ! మహాత్ముణ్ణి కొల్వడానికి మహాత్ముడే హుండాలా! హిఃస్కం టీ మన్సుల్! థు!

ప—ఓ. తప్పుతుందీ! మెచ్చకేం! అదికవపరుస్తే సమస్తం చెయ్యనూచెయ్యాలి. మావాడు అఖండుడు. మావాడేగా. మేం సామాన్యులమా? ప్రజ్ఞ, బుద్ధి, తెలివి, ఓ, మిాచిత్తం. మావాడు వాచస్పతి. 'తాయీ నీపాట హాయి' అన్నట్టు, 'బేగడరాగం మీగడే' అన్నట్టు, వీడి కవిత్వం కేవలం మైసూరు బాక్!

పా—మావాడు... (సకిలించి)...చిన్నప్పణ్ణించి చూస్తాను... ఎప్పుడూ... ఏది?...(అంటూ ముందా ముత్తైదూ కాకుండా మెచ్చుగుంటాడు.)

(ఈసందర్భంలో, దొర, టోపితీసివేసి, కోటు విప్పేసి (అంటే గుండీలు) సాహేబు కేసిచూసి కనుగలుపుతూ...)

దొర—అయ్యా! క్షమించాలి మేం పగటి భాగోతులం. ఈ ఊరొచ్చి రెండురోజులైంది. ఇదే మొదటివేషం. మళ్లీదర్శనం ఇస్తాం. సెలవ్! ఈపూట భోజనానికి...

(అని నోటికేసి చేయి ఆడించును. పర్వతాలూ పానకాలూ నిర్ఘాంతపోతారు. వేషగాడు సాహేబు గడ్డం తీసివేయును. అతడు హనుమాన్లే అనిన్నీ, అతడే ఎవణ్ణో వెంటబెట్టుకు వచ్చాడనిన్నీ గ్రహించి "ఓరి, వీణ్ణి తెగ్గోయ్యా, హనిమిగాడే" అని పర్వతాలూ పానకాలుకూడా రుసరుసలాడి పోవుదురు. ఆమట్టున వాళ్లిద్దరూ వెళ్లిపోతూవుండగా)

ప—ఓరి, వీడిపగటివేషంమంటరా! ఎంత భయపెట్టాడ్రా! నిజమేమో అనుకున్నాను!

పా—ఈ హనిమిగాడికిదేంరోగమో! తెగమేస్తాను! తేరగా!

ప—అన్నట్టు మరిచిపోయాం, ఇంకా మోతెందుకురా! (అని కుర్చీ కింద కూలేస్తారు.)

ప—ఓరి నీకవిత్వం మాసిపోనూ! మా జన్మాంతర ప్రారబ్ధం మాకెంత తెచ్చిందిరా! మావాణ్ణిమోసిన మాచేతులు ఆపరేషను చెయించుకుంటేనే కాని పనికిరావురా!

అక్ష—ఏదేనామాట మిమ్మల్ని ఆకర్షిస్తే వినండి లేకపోతే అది మీగోసంకాదు, ఊరుకోండి.

ప—చెప్పావ్! పోవోయ్! మాట! నేను లక్షరాస్తును ఈపాటి!

పా—ఇదివరకే రాశానని చెప్పావుగా నాతోటి.

ప—ఇంకా రాస్తునుగాని, టైములేదు. ఇంట్లో సరిగ్గాలేదు. వంట్లోసరిగ్గాలేదు. అందులో మనకి తెగ బద్ధకం. చటుక్కున మెఱుపు తీగెలా అభిప్రాయం చక్కా వస్తూంటుంది. అది రాసేసి పదిలం చేసుగోడం అశ్రద్ధ. లేకపోతేనా!

పా—(అక్షయంతో)సరే. నువ్వెళ్లు, నీమర్యాద తెలిసిందిలే. నీ తరపు వాళ్లని పిలిపించుగుని టుపాకీదూ పెట్టి గ్రంథం మంచి దనిపిస్తావ్?

అక్ష—నాతరపువాళ్లు నే పిలిస్తే రారు, వాళ్లకి తోచి రావాలిగానీ. వెళ్లివస్తా!

ప—వెళ్లువెళ్లు! రాకు! కావలిస్తే, నేనే రాగల్ను. (అక్షయంవెళ్లిపోతాడు)

ప—ఒరేయి, పానకాలూ! మీ యింట్లో ఆమాందస్తా ఉందా? ఉంటే ఓ మాటు మాందూ!

పా—ఏం? ఎందుకు?

ప—అబ్బ! అడిగావు! ఎందుకూఅని? వట్టి శకున పక్షివిరా!

పా—చెబుదూ!

ప—ఉందా!

పా—ఆ.

ప—ఎసుుందీ! కొన్ని పదార్థాలు నూరి కవిత్వం కింద గుండకొట్టాలి. చెబుతాన్నడు. (అని పర్వతాలు పానకాల్ని చేత్తోపట్టుని ఇంట్లోకి తీసుగుపోతాడు.)

## 2-వ రంగము

(పర్వతాలు ఇంట్లో ఒకగది. అమాందస్తా. అందులో నూరినపొడి. పర్వతాలు పట్టుబట్టకట్టుగుని, దగ్గర చెంబుఉంచుకుని, పీటమీద కూర్చునిఉండి, లేచి, ఇటూ అటూ తిరుగుతూ)

ప—సరస్వతీదేవి నాలికచివర తాండవించిపోయేటట్టు చెయ్యడానికి సాధనాలుగా శాస్త్రకారుడు వ్రాసుచ్చినవాటిల్లో కొన్నికొన్ని విన్నా. చాలాఉపాయాలు ప్రొద్దున్న ఆచరించేవే, కాని ప్రొద్దున్న అయితే, ఎవడేనావచ్చి మనరహస్యం కాస్తాపట్టెయ్యొచ్చు. అందుకని, ఈలాగంటి సాయంకాలము సేవించే సారస్వతౌషధమే నేను సేవించదల్చుకున్నది.

బ్రాహ్మి బోడతరంబు పిప్పలియు వసయు
శుంఠియు సమంబులుగదూచి చూరుచేసి
ప్రతిదినము రేపకడ సగబాలు తేనె
గలిపి రూకెత్తుదినిన సూక్తులు ఘటించు.

అని. కాని ఆయనికి జ్ఞానపత్రికూడా ఇందులో పడాలని తెలిసుండదు. అయినా ఈమాటల్లో ఉన్నవస్తువులు యావత్తూనున్నూ తెచ్చి మొత్తగానూరి అప్పుడే ఓ

మోతాదు పుచ్చుకున్నా. ఇక మాఅక్షయంగాడునాతో సరిసమానంగా కవిత్వం ఎల్లా చెప్తాడో చూస్తానుగా! వాడు, తనకిఅదొచ్చుననిగా; మరొకటి నేను అభ్యసిస్తే వాడిమీద పోటీకివీల్లేదు; అందుకని ఇదే నేనూ పట్టుకుంటా! నేనూ ఇందులోఉన్నానని వాడికి తెలియాలి; నాకిది అబ్బకపోయినాసరే. ఈమాట మళ్లీ మా పాన కాలుతో ఛస్తే చెప్పను. వాణ్ణి అల్లాఉంచాలి. వాడికి ఇదికూడా తెలిస్తే,వాణ్ణి పట్టపగ్గా లుంటాయా? దేవుడు కొందర్ని అల్లాఉంచి అట్టేపెడతాడు.

పైగా, ఇహను నాకీవాక్కు వశమయింది గనక, నేను వరంకోరుకో దల్చుకున్న శివుణ్ణికూడా కొంచం గభరాయింపచెయ్యొచ్చు. "శివుడా, నువ్వు నాకు ప్రత్యక్షం అయితేగాని, వీలులేదు" అని నేను ఘట్టిపట్టు పట్టానా, తప్పకుండా అవుతాడు. అక్కడికి ఎందుకైనా మంచిదని చెప్పేసి, రెండు త్తరాలు స్టాంపుకొట్టించి పంపించా; ఒకటి, గాలిపెల్లిగ్రాందొరకి—ఏమనీ— ఓదొరా! నువ్వు తీగలేని టెల్లిగ్రాం ప్రపంచానికి కొడతావుట! నీగాల్ని మేసే పాముని దాల్చిన శివుడికి, నేను ఆయన్ని మూడ దల్చుకున్నానని ఓముక్క పంపి పెడుదూ అనీనీ: రెండోది, నీళ్ల పెల్లిగ్రాందొరకి— ఏమనీ—ఓదొరా! నువ్వు నీళ్లలో పెలిగ్రాం ప్రపంచానికి పంపుతావుట! నీళ్లంటే గంగ. ఆయొక్కగంగ దాల్చినశివుణ్ణి చూడాలని నేను అనుకుంటున్నానని కాస్త చెబుదు అనీనీ. ఓర్! నాభావాలు ఎంతగొప్పవైనాయో ఇప్పుడు! ఇదివరకులేవు. ఇది మందుమహత్తే (అని అమాందస్తా ముద్దుపెట్టుకొనును). అవేనా అందుతాయి. లేక నాకు కనబడితే బంధేలేదు. ఆ రెండు త్తరాలూ మాహానిమిగాడికిచ్చా, పోస్టులో పారెయ్యమని. ఆపగటివేషకాడు భోజనానికి రాకపోడంచూస్తే, వాడు పేరుదాచడానికి పగటిభాగోతిని అన్నట్టుంది. కానీ, దీక్ష అవలంబిస్తా!

(అని నిమీలితనేత్రుడై, తదేకధ్యానంతో కొంతసేపు శివపరంగా జపించుతూ ఉండిపోగా, ఎదురనించి, శివవేషధారి అయిన అమృతం తలకాయలో బుర్ర మినహా ఓళ్లంతాకప్పుకుని, నిమ్మళంగా నడుచుకుంటూ చక్కా వస్తాడు.)

ప—(ఆనందవిస్మయములతో మోకరించి) పెళ్లిగ్రాములు అందిఉంటాయి. లేకపోతే మందుపనో! ఓస్సి! యేమి తేజం,ఏమి తేజం! ఆయనతాలూకు మూడో నేత్రం కాంతి అయిఉంటుంది. ఆయనవంటిమీద పురుగూ బుట్రాపా, కాస్త ఎడం మంచిది. వచ్చారు! మహాప్రభూ! నాకు తెలుసు, నాకు తెలుసు. భక్తులమాటలు మీకు కోర్టుసమను. అసందర్భపుస్తోత్రాలు నాకు తెలియవు ప్రతీదానికీ. టూకీగా చెప్తాను. తమకి ఒక్కద్దం. మనస్సుప్రధానం, ఎక్కడికి దీనికీ.

వే—(శుభము, శుభము, శుభము అనునట్లు ఆశీర్వాదపూర్వకముగా, మూడుసార్లు, చేతులు, పర్వతాలు తలమీద ఆడించును).

ప—ఎందుకు నాకీతరము! అస్తమానం తమ స్మరణే విన్నారో లేదో!

వే—(మూడుమాట్లు చెయ్యివిసిరి, ముందువేళ్లు చూపిస్తాడు).

ప—మూడు వరాలు కోరుకోమని సెలవా! చిత్తం. కటాక్షించాలి, దాసుణ్ణి. నాకు దురాశలేదు, చెప్పద్దూ. ఒక్కటి ప్రసాదిస్తే కొల్లలు, మరేమీ ఒక్కర్లేదు

వే—(సరే, కానీ, అన్నట్టు తలపంకిస్తాడు).

ప—చిత్తం. సెలవైతే నిమిషం కాని, ఉన్న సంగతి తమతో కక్కేస్తున్నాను. మన్లోమనమాట,హాఁ, (వెనక్కి)ఇది మీరు మళ్లా ఎక్కడా అనకండి; బాగుండదు, జనం అసలునామీద కోపంగాఉంటారు, మీరు నాకు కనపడ్డారని.

వే—(సరే అన్నట్టు కళ్లుమూసి తలఊచును).

ప—అయితే కోరుకుంటాను మావాళ్లవాడు ఒకడున్నాడు. మాకు కావలసినవాడు వాడిపేరు అక్షయం.

వే—(చూపుడువేలు మూడుసార్లు పర్వతాలు కేసిపెట్టును).

ప—నన్నుగరించి అడగమనా! మీ కెరుగరు గావును. నాచింత నాకులేదు. నాకు ఏదిఎల్లాపోయినా ఒకటే నావిషయంలో నాకెప్పటికూ పరచేరతే,

నాకు కావలసినది ఇంకోడిసంగతేకాని నాదికాదు అగీ నా స్వార్థత్యాగం.

వే—(కానీ, కానీ అన్నట్టు తొందరపడి చేయి ఊచి కదలును).

ప—ఏమి? ఆతొందర మీకు? నాబోటి భక్తు డెవడేనా పిలుస్తున్నాడా? ఆఅక్షయంగా డున్నాడే వాడు నిక్షేపంలా ఉన్నాడు. వాడు సుబ్బరంగా కుది మట్టంలోకి తిరుక్షౌరం అయిపోయి వొట్టి సన్యాసిపీనుగు అయిపోయేలాగు నాకు వరం దయచెయించాలి.

వే—(ఆశ్చర్యపడి, ముక్కుమీద వేలెట్టుకుని, నువ్వు, నువ్వు, నువ్వు అన్నట్టు సంజ్ఞచేస్తాడు)

ప—అవా! నేను బాగుపడాలని నన్ను కోరుకో మనా, తమరనేది? అయ్యా, ఈవిషయంలో తమకి తెలి యదు. తమరు ఒప్పుకుతీరాలి. ఇల్లాపోనీండి, చెప్పాను గదా, పెద్దముండావాణ్ణి,కొద్దో గొప్పో! అందుకని! ఏది!

వే—(మళ్లీ వెనుకటివలెనే చేయును).

ప—అయ్యా! తమరంటే నాకు ఎక్కడలేని గ్యాతా ఉంది. అయితేం? ఈవిషయంలో తమతో ఏకీ భవించను వీలులేదు. ఏంజేస్తాం! అందుకని నేనుకోరేది మళ్లీ చెబుతున్నా. ఆమొక్క అక్షయం ఉన్నాడే వాడూ కేవలం నాశనం అయిపోవాలి. నాకది చాలు. నేబాగుపడక్కర్లేదు. దుర్యోధనుడికి పైఅంతస్థు నాది. వాడు చేతగానివాడు. ధర్మరాజుకి ఉందనీ,తనకి లేదనీ తనకికూడా కలగాలనీ ఏడిచాడు నేను, నాకక్కర్లేదు ఇంకోడికిపోతే చాలనీ. అందుకని మావాళ్లునాకు అభి నవాంధ్ర దుర్యోధనుడని బిరుదాంకం వద్దంటే మీద పారేశారు. ఇప్పుడు వ్యాసులవారుంటే, 'దుర్యోధనుడు' అనేమాట భారతంలో కొట్టేసి, 'పర్వతాలు' అనిరాసే స్తాడు కాబట్టి, మీరు మరోహాలా చెబితే నే ఒప్పను షీత్రి. నేనూ, దాంతగలెయ్యా, చదువుకున్నవాణ్ణి,"అచ టివిప్రులు మెచ్చరు" అని పెద్దన్న రాసింది మమ్మల్ని గురించే. కనక, ఇల్లాపోనిచ్చి, ఏది?.........

వే—(కోపము సూచించి కొంచెము హడావిడిగా తిరుగును)

ప—ఏమిటండీ, ఊరికేనూ! ఆకోపం, రుస రుసానూ, వరం ఇస్తానని వచ్చి! నా ఇష్టం. ఏమిటి మీ గొప్ప! నలుగురూ ఎన్నుకుంటే. మీరు దేవుడయి ఊరు కున్నారు. రేపు నలుగురూ నన్నే దేవుడనుకుంటే నేనే అయిపోతా, ఎలెక్షనులో అబ్బో! నాదగ్గిఱా!

వే— (అట్లాగే, ఇచ్చా, అన్నట్టుతలఊపి చిరు నవ్వు నవ్వును)

ప—అల్లా, అల్లాగ! కటాక్షించాలి గాని, నేను తక్కువవాణ్ణా. నాకూనెత్తిమీద గంగఉంది చెమట. మీకు హాలాహాలం కంఠాన్ని, నాకు బుగ్గని కారాకిల్లీ ఏమైతేం రెండూకంఠం దిగవు. మీకు చంద్రుడు అనా ర్తవంపు బువ్వ నాతలలో పువ్వు ఇమిటేషన్ గాది, వాడదు అబ్బో! సరే. మీరంటే నాకు గురే. మీరు మంచివారే. రోజూ కంటికిఅందే మానవుణ్ణే నేను నమ్మను. ఎప్పుడో కనిపించి దక్కాపోయే మిమ్మల్ని ఎల్లా విశ్వసించడం; కాస్త వ్రాతమూలం ఉంటే ఎందు కేనా నయం, మీరునాకు వరం ఇచ్చినట్టు. ఈకాగితం ముక్కమీద వ్రాసి సంతకం చేసిఇవ్వండి. ఇదిగో అణా బిళ్ల. (అని కాగితమూ, అణాబిళ్లా, కలమూ, అందివ్వ బోవును. అప్పుడు వేషధారి, బల్బు ఆర్పి తీసివేసి,ముసు గుతొలగించి, పర్వతాలు ఎదట నిలబడను. వాడువెనక వేషం వేసుకొచ్చినవాడే అని పర్వతాలు గ్రహించి "హనుమన్లుగాడు ఉత్తరాలు చింపి దూసినసంగతి వీడి తో చెప్పాడు కాబోలు!" అనుకొనును )

ప—మళ్లీనువ్వేట్రా ! నువ్వెవడవురా ! దేవుడు వేషం వేసుకొచ్చావు? నరకం అనుభవిస్తావులె! (అని ఖంగారుపడును )

వే—దేవుణ్ణి ధిక్కరించి, మనిషికి భయపడ తావేం ?

ప—నాయిష్టం, పోదు! నువ్వెవడవు నన్నడ గడానికి. నీదగా నీవ్యాపారం తెలిసిందిలే. ఎంత మోసం! ఎంతమోసం! ఓరి నిన్ను తగలెయ్యా ! నీమీద పద్యాలు చెప్పా! కకారం అయిదునా, తకారం ఆరు నాపెట్టి నిన్నుతిట్టెయ్యా "ఇదియా నీకత" అనేపద్యం చేస్తాఉండరా నీమీదా!

వే—ఆగవయ్యా ! (అని తుపాకీ తీయును)

ప—అదీ పట్టు గొచ్చావ్, మళ్లీ, అయితే సరే. (కోపంగా) అయితే ఒప్పుగున్నా. ఊరుకోమరి.

నువ్వు మంచివాడవు. కాదుపోనీ, మీరు మంచివారలు వెళ్ళండి.

వే—నీకా శివుడు ప్రత్యక్షమయేది.

ప—ఆఁ. పోనిస్తూ, కాకపోతే మునిగిపోయిందిట, ఆయనమాట ఆయనకే ఉంటుంది. శక్తివంచన లేకుండా ప్రైచేశాం, తరవాత కర్మం.

వే—ఇంతే. ఇల్లానే ఉంటోంది, ఆది నించీ కానీ. (అనివెళ్లిపోవును)

ప—ఓరి వీణ్ణి తగలెయ్యా! వీడు ఇంటోకెల్లా వచ్చాడో! సరిగ్గా ఈసమయానికి! వీడుకేవలం పగటివేషగాడే కాదు, రాత్రివేషగాడు కూడాను. రాత్రిళ్లకొందరు పబ్లికుగా వేషాలేస్తే చాలామంది ప్రైవేటుగా వేషాలు వేస్తారుగావును. మాపానకాలుగాణ్ణి కలుసుకుని, వీడిసంగతి ఆలోచించి, వీడు ఎక్కడబసో కనుక్కుని, ఒక్కసారి చావగొట్టాలి. (అంటూవెళ్లిపోతాడు)

## 3-వ రంగము

(అమృతం, హనుమాన్లూ ఒకఇంటి ఇవతల ఉన్నట్టు కనపడాలి. పర్వతాలూ పానకాలూ నిద్రపోతూ వెనకాల ఉండాలి)

అమృ—ఈఇంట్లోనా వాళ్లుకాపెండి, నన్ను తన్నడానికి? మొత్తానికి నాబసకి దగ్గిర ఇల్లే చూశారే, ఎల్లావెతికారో కాని?

హ—అవునండి. ఇది గుర్నాథంగారి భవనం. గుర్నాథంగారు పొద్దున్నే ఇంటిల్లపాతినీ కదుపుగుని పెళ్లికెడుతూ తాళంచెవి వీళ్లచేతికిచ్చారట.

అమృ—సరే లే. నేను నిజంగా పగటివేషగాణ్ణొ అని ఇంకాచెబుతూండు; వాళ్లతో ఉండు. (అని ఆలకించి) గుర్రువినబడుతోంది. పోట్లాడడానికనివచ్చి, అన్నింటికీమూలం గాఢనిద్రపోతున్నారు. దెబ్బ తియ్యడానికి తయారీ మహాపసందుగాఉంది. నువ్వు గదికి అవతల వేపుకెళ్లి డబ్బాచప్పుడు చేస్తూండు. నేను ఇవతల వేపునుండి నాటకం ఆడిస్తా.

హ—చిత్తం.)

(అని హనుమాన్లు ఎడమకు నిష్క్రమించును. అమృతం ఒకవైపున నిలబడి ఉండాలి. ఎడమవైపున చప్పుడు అవుతుంది. అప్పుడు పర్వతాలు కళ్లునులుముకుంటూ లేచికూర్చుని, కళ్లుమూసుకునేఉండి, ఆవులించి, మళ్లీ పడుకుంటాడు. మళ్లీ చప్పుడవుతుంది. అప్పుడు పానకాలూ పర్వతాలూకూడాఒక్కమాటుగా 'బాబోయ్', 'నాయినోయ్'అనిలేచి,చప్పుడొచ్చే వేపుకేసి చూస్తారు. మళ్లీ చప్పుడై ఒకసకిలింపు వినపడుతుంది. పర్వతాలూ పానకాలూకూడాబొటనవేళ్లమీదలేచినిలబడి,భయపడి)

ప—ఒరేయి, దొంగాడని నాఅభిప్రాయం.

పా—దెయ్యమేమో అని నా ఊహ.

ప—దెయ్యాలున్నాయంటావ్! నాకు నమ్మకం లేదుగాని, మనపూర్వపాళ్లు కొందరు అల్లాఅంటోస్తారు. ఆమధ్య అవిలేవని నేను గాలికబురుగా విన్నాను.

పా—ఈమధ్య మళ్లీ ఉన్నాయన్నార్రా, నువ్వెఱగవ్! మనకి చాలాదూరంగా ఉండేవాళ్లే అన్నారిప్పుడు.

ప—అల్లాఅన్నది దూరంగా ఉండేవాళ్లేగద! అల్లాయితే ఒప్పుగున్నా. ఎంతదూరంగాఉంటే అంత రైటు. ఎంతదగ్గరైతే అంతతప్పూ. వెనక మాతాతయ్యకైములోనూ ఉండేవి. ఆయన భూతవైద్యుడు. అంచేతే భూతాలు మొహమాటంచొప్పున ఉండేవి. ఆయన ఓనాడేం, పాబ్బెత్తం చేత్తోపట్టుకుని, కొంత దూరాన్ని నీడనీడల్నినక్కిఉన్న దెయ్యాన్నిచూసి,—

పా—నువ్వు చూశావురా, దెయ్యాన్నీ?

ప—అబ్బ! లేదు. ఓనాడువెళ్లా. వెడితే ఆవేళ వాటికికూడా ఎలెక్షనుట. ఒక్కటేనా అందలేదు, రాలేదు. ఆపళంగా, మాతాతయ్య దాన్ని చూసి, ఓమహాదారుణభీతావహ......(డబ్బాచప్పుడగును)

బాబో! (అని ఏడ్పుముఖము పెట్టును)

పా—ఉండరా. దండకం కానీ, శాకినీ—తరవాత ఏమిటే?

ప—డాకినీ—

పా—గాలిదెయ్యంబులన్ నీదువాలంబునంజుట్టి (డబ్బాచప్పుడగును)

ప—పా— (ఇద్దరూకూడా 'బాబో' అని ఏడుస్తూ బిక్కమొహాలు వేస్తారు)

పా—దొంగాడేమోరా! తలుపుతీసి కొడదామా ఏమిటి!

ప—దొంగాడంటే నాకు భయంరా. పైగా వాడిదగ్గిర రాళ్లుంటాయి, కత్తిఉంటుంది. చీరి ఎండే స్తాడు. వాణ్ణి పట్టుగోడం బరిమీద సామునిపట్టినట్టే. ఏమోబాబూ! బతికుంటే బలుసాకేరుకు తినవచ్చు! నే రాను బాబూ!

(అమృతం, వీళ్ల అవస్థచూచి, విచారపడి, హుం, అని తలపంకించాలి. "వీళ్లు నన్ను ఎల్లాఎదురుకో వాలనుకున్నారో?" అనాలి)

పా—వాడు గుర్నాథంగారి ఆస్తి కడిగేసిదోచుకుపోతాడేమో!

ప—ఆఁ. పోతేపోతాడు. మనకెందుకుపోదూ! పోతేమనకేం నష్టం, మనం అడ్డుపడితే మనకేం లాభం? ఎందుకు అసలు మనకి, వెధవసంత? కాలిమీదకాలేసుగుని రిసర్వీ రాయిలా కూర్చోక! ప్రతీదాల్లోనూ కలగచేసుగోడం ఎందుకు నాకు తెలియకడుగుతాను!

పా—మనం ఇద్దరంగా! వాడొకడే అయి ఉంటాడు.

ప—ఇద్దరుండడం అవతల వాడికి ఎంతలాభమో తెలుసునా? మనతలకాయలు రెండూ ఓ దానికో టెట్టి డీడిక్కిలుకొట్టి చంపేస్తాడు. పోరా!

పా—పోనీ వీధులో కెళ్లి మొగాళ్లని కేకేసుగొస్తే!

..ప—మనం చాలం అంటావా? (అని మీసం దువ్వును.) అయినా పోనీ ఇద్దరు ముగ్గురు మనకిసాయం ఉండడం మంచిది.

పా—అయితే నే వెళ్లిస్తా! నువ్వు చూస్తూ ఉండు వాడు దాటిపోకుండా.

(డబ్బాచప్పుడగును. వీళ్లుమళ్ల భయపడతారు. అమృతం, తల ఇటూ అటూ తిప్పి, చప్పరించి, పెదవులు బిగిస్తాడు.)

ప—నేనొక్కణ్ణీ ఉండలేనురా! ఎప్పుడూఉండలేదు. (అని పానకాలు చెయ్యిపట్టుకొనును) వాడు తలుపుతోసుగుని ఇవతలకి వచ్చిపడితే?

పా—బట్ట ముసుగెట్టుగుని, ఒక్కమాటు కళ్లు మూసేస్తేసరి. ఇంకా ధైర్యం ఉంటే ఊపిరి స్తంభించెయ్యి. బస్. చచ్చావనుకుని చక్కాపోతాడు. భూమిమీద నూకలుంటే సరిరా ఏదో తోస్తుంది. పోనీ నువ్వెళ్లిరా.

ప—సరే. వాడల్లా తిరిగి ఈవేపు కొస్తే.

పా—డబ్బా చప్పుడు అవుతూండగానే వెళ్లు. అప్పుడువాడు అక్కడే ఉన్నాడన్న మాటగా!

(డబ్బా చప్పుడగును పర్వతాలు కుడివేపుకి వెళ్లడానికి ప్రయత్నించి, రెండుగజాలన్నర అంగలు వేసేసరికి, అమృతం తుపాకీదాచి ఒక అంగ ముందుకువేసి, పర్వతాలుకి ఎదురవుతాడు. పర్వతాలుకి మీది ప్రాణం మీదే ఎగిరిపోయినట్లు అవుతుంది. అతడు తెగకంగారుతో పానకాల్ని కౌగిలించుగోడానికి ఎడమవేపుకి ఎగబడతాడు. డబ్బా గబగబా మోగుతుంది. పానకాలు అక్కడనుంచి కుడివేపుకి ఎగబడతాడు. ఇద్దరూ దంపపట్లు పట్టుకుని మధ్య నిలబడతారు).

ప—నాసెన్సు! అటుజరుగు ఫూల్, కళ్లులేవు ఇవతల వేషాలమనిషి!

పా—అటుజరుగు, రాస్కెల్! చెవులు లేవు? ఇవతల వాయింపు!

(వాళ్లు వెనక్కీ ముందుకీ తోసుగుంటారు).

అమృ—ఏయ్! మీరిద్దరూ ఇట్లారండి. అవతల దొంగాడున్నాడని మీకు తెలుసును. మీరు ఇద్దరున్నారు. పోతుల్లాగ కలిసి వాణ్ణి ఎదురుకుంటారా, పేల్చెయ్యనా ఇదిగో!

(అని తుపాకీతీస్తాడు. వాళ్లు "బాబో, బాబో, మళ్లీ అదే" అని ఓణ్ణి ఒకడు ముందుకుతోసి వెనకాల దాక్కోడానికి ఎవడిమట్టుకివాడు యత్నిస్తాడు).

అమృ—ఏం?

పా—(ముందుకివచ్చి) ఏమిటోయ్, బెదిరింపూ కొడ్తాకొడ్తా అంటూనూ. కొడితేకొట్టు. హాయిగా వీరస్వర్గంజూరగొంటాం. మా శరీరాలకీ ఆత్మలకీ ఎడబాపులు తెచ్చినవాడవు నువ్వవుతావు కాబట్టి, మా తాలూకు పునర్జన్మలు నువ్వే ఎత్తు. భయమనుకొన్నావా? నేనూ

మాపాతవిద్యలు నేరుస్తున్నా ఇప్పుడిప్పుడు. ఇదిగో సమ్మోహనాస్త్రం కూలు

(అని కొంతపొడితీసి ఊత్తాడు. అమృతం పడిపోతూంటాడు. వాళ్లు ఆతడికేసి చూస్తుంటారు. హనుమాన్లు ఎడమపక్కకివచ్చి ఈసంగతి చూసి బెదిరించి చక్కాపోతాడు. తెర పడుతుంది).

## 4-వ రంగము

(పర్వతాలూ పానకాలూ ఓపక్క, శవము ఒకపక్క)

ప—మనం ఇక్కడే ఉందాం. లేకపోతే అనుమాన పడతారు. అమ్మయ్య! కాని, పానకాలూ, ఈవిద్య ఎప్పుడు సంపాదించావు? నాకు చెప్పావు కావేం?

పా—దీని దుంపతెగా! విశ్వరూపభయం. ప్రతీవాడూ పీక్కుతింటాడు. పోదూ! నీకవిత్వం నాకు చెప్పావ్? ఎవడివిద్య వాడిదే. ఒకొక్కడు నచ్చే లోపల చూసిచూసి అడిగినవాడికి చెప్పలేదు.

ప—సరే లే. అయితే, వీడు పాపం గతించాడుగదా, పోనీ కొంచెం వీణ్ణి పొగిడితేం? వింటాడా ఏడుస్తాడా?

పా—బతుకున్నప్పుడు పొగడకూడదేం?

ప—అబ్బే, కూడదు. అది ఎంత ఆయుక్షీణమో నీకు తెలుసునా?

పా—నిజమే. నేనూ లోపల అంతే అనుకుంటాను. ఎవడికేనా కాస్తలాభం, పేరూ, గొప్పాలాంటివి మంచివి ఏంవచ్చినా, "ఆఁ ఏమిటాగొప్ప, చాలాచూశాం, పోదూ!" అనాలి, అని ఆగొప్ప మొదట్లోకి తుంచెయ్యాలి. కాని, ఎవడికేనా నష్టంవస్తే, వాణ్ణి కాస్త పొగిడి, గట్టివాడని వాదించాలి. చచ్చిపోతాడా, మరీ గొప్పవాడనాలి.

ప—అల్లాయితే పోనీ మనం కొంచెంఏడుద్దాం, లేకపోతే బాగుంటుందా? నువ్వు పైకికూడా ఏడవడం నేర్చుకో, అలవాటుంటే, అక్కడక్కడ లాభిస్తుంది.

పా—వీడి పేరూ ఊరూ తెలియదు, ఎల్లాఏడవటం?

ప—ఏదోకొంత దామాషాయిగా ఏడుద్దూ! సరిపోతుంది!

పా—సరే, పట్టు. అయ్యో!

ప—హయ్యో (అని నోరునొక్కుకుంటాడు)

పా—హయ్యో (అని రొమ్ము బాదుకుంటాడు)

ప—బాగానేఉంది, ఇంకేం (అని పానకాలు ఏడుపు మెచ్చుగుని) హయ్యో! (తలబాదుకుంటాడు)

పా—హయ్యో!

ప—అయ్యో! ఎంతమంచిఆయన చచ్చిపోయాడండీ (అని కిల్లీవేసుగుంటాడు)

పా—ఆయన మంచి ఎంతటిదోకాని, మాకు ఏడిచేటప్పుడు ఆయాసమే లేనండి—(మెల్లిగాతాపీగా, పర్వతాలుతో) సోడుం ఉందిరా?

ప—పాపం తెల్లారకుండా, పళ్లుతోముకోకుండానే కాఫీతాగేవాట్టండీ! (వానికేసి చూసి, ఏడుస్తూ) ఏంనాయనా, నువ్విహ కాఫీతాగవూ; కాఫీ డికాక్షను ఇహ నువ్వు ఎక్కున వెయించుకోవూ? పోనీ నేవెయించుకోనా, నీబదులు, అల్లానేలే! ఎంత పాపం బద్దలయింది! కాసికాలం!

(అప్పుడు కళ్లునులుము కుంటూ, ఇద్దరు బాటసార్లు, పక్కఅరుగుమీద పడుకున్నవాళ్లు ఈదీర్ఘాలు ఆలకించి, ఇదేమిటో అని నిద్దరకళ్లతో చూడవస్తారు.)

ప—వీరెవరు?

1.బా—మేం పరదేశులమండి! ఏమండి పాపం అల్లా ఏడుస్తారు?

ప—ఏముంది! అంతా ఎరుగున్నదే! ఓ ఆయన పాపం, పోయాడూ; అది!

2.బా—ఎవరండి ఆయన?

ప—ఏమో, వాణ్ణే అడుగు. ఆ తుపాకీ పుచ్చుగుని కొట్టుగున్నాడు. ఎవరో పరదేశిపాయన. మాకు పనుంది, వెడతాం. ఇక్కడ మీరుండండి.

1.బా—ఇదేమిటండి, మధ్య! మాకేంతెలుసును పరాయి వాళ్లం!

ప—వాడూ పరాయివాడే, అందుకని మీవాడు ఇదేమన్నా, ఇంకోళ్ల అరుగలమీద చేరగా పడుకోడం

అనుకున్నారూ! మేం ఇందాకణ్ణించి ఏడిచాం, కాస్సే పురమాయించండి.

1. బా—ఆయన పరాయి అంటున్నారుపాపం. పోనీ తీసుకుపోయే ఏర్పాటుచేసేస్తే! నలుగురం ఉన్నాం!

ప—ఉదయం అననిస్తావా; అసలు నాకు శవాలంటే భయం బాబూ మాబంధువు ఒకాయన తప్పని సరై, శవాన్ని మోసేటప్పటికి భయమేసిపిచ్చెత్తింది. టుపాకీ మూడుసార్లు నాహృదయంమీదకి బారట్టాడు. వీణ్ణి నే ఎందుకు మొయ్యాలి?

2. బా—చచ్చినవాడి మీదకోపం ఎందుకయ్యా?

ప—ఎందుకేమిటి? బ్రతుకున్న వాడిమీద కోప్పడితే చెప్పుచ్చుకు కొడతాడు. అందుకని. తెలిసిందా?

1. బా—పోనీ మీరండీ!

పా—నాకూ అభ్యంతరం లేదుకాని, ఈ డ్రెస్సు తడిపెయ్యాలి. స్నానాలుచెయ్యాలి. వంట్లోనీరసం నక్షత్రదర్శనం కావాలి, అప్పుడు యజ్ఞోపవీతాలు తగలడి పిండాకుడు ఏడవాలి.

2. బా—ఏమండీ ఏమంటారు?

ప—అన్నట్టు నా పెళ్లాంకడుపుతోందిట. నీ పెళ్లాంమాత్రం కడపటంలేదుట్రా? చెప్పవేంరా? తెలివితక్కువ దద్దమ్మ, ఊరుకుంటావేం?

1. బా—మీరు ఆయనతో చెప్పండీ

పా—వీలు లేదండీ.

1. బా—ఎందుకం?

పా—ఛాతీకొలవాలి వాడిది.

1. బా—ఎందుకూ!

పా—ఎందుకూ ఏమిటి అన్నింటికీ! లేకపోతే కట్టినకటుకు ఇరుకై వచ్చిన మనిషి అమాంతంగా ఖడేరావు అయిపోతాడు. అప్పుడు వాడు మన్ని మోసేస్తాడు కూడాను.

1 బా— ఇల్లా ఇంకా కుతర్కం చేస్తారా తన్నెయ్యమన్నార

ప—ఏమిట్రా అంటావ్? (అని శవముదగ్గఱపడి ఉన్న తుపాకీ లాగి తీస్తాడు. పరాయివాళ్లు 'బాబో' అంటారు.)

ప—(పానకాలుతో, రహస్యంగా) ఒరేయి! పేల్చకపోయినా, వాళ్లు భయపడ్డారు గాని, అయినా ఈతుపాకీ పేల్చడమూ......ఎల్లా?

పా—నాకు తెలుసుసుగాని ఇప్పుడు బాగా జ్ఞాపకంలేదు. జ్ఞాపకం వచ్చినా చెప్పను. నీవిద్య నాకు చెప్పావ్?

ప—ఛీ! చెబుతావా, పేల్చనా? (అని తుపాకీ తల్లకిందులుగా పట్టుగుంటాడు).

పా—ఉండండి బాబూ, జ్ఞాపకం చేసుగుంటాను! అందులో, లావువేపు నాకేసి పెట్టావు. ఇదెంత పేల్తుందోరోయ్!

(ఆపళంగా అక్షయం హనుమాన్లూ గబగబా వస్తారు. పర్వతాలు గక్కురుమంటాడు. అక్షయం తిన్నగా అమృతం దగ్గఱకి పరుగెత్తి చెయ్యెత్తుతాడు. అమృతం, తనచెయ్యి కర్రలాబిగిస్తాడు. అక్షయం చప్పరించేస్తాడు).

అక్ష—ఎంతద్రోహం జరిగిందిరా!

ప—నీకుట్ర తక్కువా! తెలిసిందిలే, నువ్వూ, హనిమిగాడూ ఈవచ్చినాడితో కలిసిచేసిన పన్నాగం. నీప్రాణాలు తిన్నగా చూసుగో. ఇదిగో తుపాకీ జాగ్రత్త.

అక్ష—నువ్వు పట్టుగున్న రీతిచూస్తే, అది నీ మీదే పేల్తుంది.

ప—బాబో! అల్లాయితే నాకెందుకురోయ్ఇదీ (అని పారవేయును).

అక్ష—మీ రెవరండీ!

బా—మేం బాటసార్లం. లోపల ఏడుపులువిని పిస్తే లేచివచ్చాం. ఆయన తుపాకీతో కొట్టేసుగున్నాట్ట. తీసిగెళ్లే ఏర్పాట్లు చేయండి అని మేం అన్నాం. అంటే ఆయన పెళ్లాం గర్భిణీ, రావడానికి వీల్లేదన్నారు!

అక్ష—ఓరి, నీఅబద్ధాలుమండా! నీకు పెళ్లె క్కాడ్రా?

ప—ప్రయివేటు పెళ్లిళ్లు శాస్త్రీయం తెలుసునా గాంధర్వం.

అక్ష—ఆ పరాయివాడు వస్తానంటే, నువ్వు రానంటావ్ మొయ్యడానికి? రేపు నువ్వు ఇటూ అటూ అయితే, అప్పుడు?

ప—ఆ కడం వాళ్లు బాధపడతారు, నాకేం? నేను మొయ్యడేం? నిండుజీవంతో ఉన్న నిన్ను నా చేత మొయిపించావు, ఆవచ్చినాడు సామాన్యుడని చూస్తున్నావా ఏమిటి? నాకేంపట్టింది? నియామకంగా మోసేవాళ్లుంటారు. వాళ్లని కేకెయ్యి ఈడ్చేస్తారు. కొందరు కొందరు ధర్మార్థం డబ్బిచ్చుగోకుండాకూడా తగులడతారు. దీనికి వాళ్లే యములాళ్లు వాళ్లెక్కడ నడిస్తే, అక్కడ శవాలే.

పైగా, పీడూ, అసందర్భంగా చచ్చాడూ! కొత్త మనుష్యుల్ని మాట్లాడుకుని, కొత్తపల్లలు కొనుక్కుని మంచివి, మరీ చావకూడదూ! అన్నింటికీ అశ్రద్ధలూ, వెధన అశ్రద్ధలూ వీళ్లూనూ!

అక్ష—అయితే, ఏమిటి మరి సాధనం?

ప—వాణ్ణే అడుగు!

అమృ—(కదిలి, లేస్తూ) నువ్వు నన్ను మొయ్యవుట్రా!

ప—(అతి ఖంగారు పడిపోయి ఏడుస్తూ) మోస్తానేవ్, మోస్తానేవ్, దెయ్యం! మోస్తానే!

అమృ—(పర్వతాలు కేసి నడచును)

ప—అమ్మయ్యో! నాదగ్గఅకి రాకే, దెయ్యమా? నీయజమాని పానకాలే! అల్లావెళ్లవే!

అమృ—(పానకాలు కేసి నడచును)

పా—(కోపంతో) కంఠం ఆర్చుకు పోయేట్టు నీకోసం రాగాలెట్టాంగదా; మొయ్యడానికి నలుగురు సిద్ధంగా ఉన్నారు. మళ్లీ లేచావాయిరి, ఏమన్న పెద్ద మనిషివి? ఓవేళ మెణుకువ వచ్చినా, మర్యాదా అక్కర్లేదూ? ఎందుకొచ్చింది ఈచావూ, మళ్లీ ఈ బ్రతుకూనూ?

అమృ—సరే. నేను ఎందుకు చచ్చానంటే, లేకపోతే నీఅస్త్రం పట్టివ్వలేదని నువ్వేడుస్తావని. ఇక, నువ్వు బతికే చచ్చిఉన్నావు గనక, నేను చచ్చి బ్రతికి ఉన్నాను. సరే. కని పారెయ్యడం పూచీమీది. చావడం పూచీకూడా శవానిదే. మరోచోట చస్తాను.

(అని వెళ్లిపోవును)

అక్ష—ఎవడో ఈన! చెప్పమంటే చెప్పాడు కాడు! "నేను అమృతాన్ని" అన్నాడు.

(పై సంభాషణ జరుగుతూండేనే, పర్వతాలు బాటసార్లని పక్కకితీసి రహస్యం మాట్లాడతాడు. ఒకడుపెళ్లి ఇంకొనలుగర్ని తీసుగొస్తాడు. వాళ్లువచ్చిన తరువాత, పర్వతాలు, "పానకాలూ, మోస్తావేం,కానీ" అంటాడు. అక్షయం దీపం ఊదేస్తాడు. ఊదేసి పక్కనున్న పర్వతాల్ని జుట్టుటుగువంచి చావగొడతూంటాడు. అంతాకొడతాగు. దొమ్మీ జరుగుతుంది).

(చీకటిగా ఉండగా...

ప—నేబ్రోయి, నన్నుకొడుతున్నార్రోయి!

బా—నువ్వంటే!

1 బా—నేనే: నేను కవినిగాను.

2. బా—మరెవడివి! అదేచెప్పు!

ప—నేను పర్వతాల్ని.

1. బా—అయితే భరించగలవు!

ప—మీదుంపతెగా మా పానకాల్నిగుడాకొట్టండ్రామగీ!

2. బా—ఇదుగో, ఈదెబ్బ వాడికియ్యి పట్టిగల్లి.

ప—సరే. కొట్టండి, కొట్టండి. ముందుజన్మలో మీసంగతి చివరంటా కనుక్కుంటాలెండి, ఈజన్మలో పైను లేదు.

1. బా—వెనక జన్మలో, మమ్మల్ని కొట్టావేమో ఇప్పుడు అనుభవిస్తున్నావు.

ప—అల్లాయితే నే ఎప్పుడూ ఇంతే?

అందరూ—ఆ. ఎప్పుడూ ఇంతే.



గవర్నరుగారికి హిందూమత ధర్మాదాయచట్టమునుగూర్చి నివేదించుటకు వెడలిన రాయబారులు



# సాభిప్రాయ విశేషములు

శ్లో. మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి;
అథచేత్త్వ మహంకారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి.

—భ. గీ. అ. ౧౮, శ్లో. ౫౮.

శ్రీకృష్ణుడు విజయునకు గీతాశాస్త్రము నంతయును బోధించిన తరువాతను చెప్పిన కడపటి యుపదేశము కష్టసమయము లందు ప్రాజ్ఞులకు శరణ్యముగ నున్నది. అహంకారము మానవులకు స్వధర్మనిర్వహణమునకు ప్రతిబంధకముగ నున్నది దురహంకారము స్వధర్మానుష్ఠానమునకు ప్రతిబంధకమగుటయే కాక ఆత్మనాశనమునకు సాధనంబగుచున్నది. విజయుడు తన కులధర్మమును, క్షత్త్రియధర్మమును, మానవధర్మమును, దైవధర్మమును, విడనాడి విషాదయోగమును బూనినపుడు స్వధర్మనిర్వహణము దురారాధ్యమైనది. విజయుని లక్ష్యము లాభమునందు లగ్నమైన విధమున ధర్మమునందు లగ్నము గానపుడు విషాదము, సంశయము, క్లైబ్యము ప్రబలినవి. చిత్తము చలించినది. బుద్ధియోగ మంతరించినది. కర్మయోగము దురారాధ్యమైనది. శ్రీకృష్ణపరమాత్ముడు విజయుని లక్ష్యమును స్వధర్మానుష్ఠానము నందు లగ్నము చేసినపుడు మోక్షసాధనమును గ్రహించి స్వధర్మనిర్వహణమును జేసి పార్థుడు ధర్మవిజయమును బడసి కృతార్థుం డయ్యెను

శ్రీకృష్ణుని గీతాశాస్త్రోపదేశము వర్తమాన విషమదశయందు మానవులకు ధర్మనిర్వహణ సాధనమును నుపదేశించుచున్నను నహంకార మమకారములు ధర్మనిర్వహణమునకు మహా ప్రతిబంధకములుగ నున్నవి. జాతులయందును, మతములయందును, కులములయందును, పక్షములయందును, వ్యక్తులయందును నహంకార మమకారములు పెచ్చుపెరిగి మహాసంక్షోభమును గలుగజేయుచున్నవి ధర్మనిర్వహణమున కేర్పడిన మహాసంస్థలు సయితము స్వలాభవిలసితములై ధర్మాభ్యుదయమునకు నిరుపయోగములుగ నున్నవి. ఇర్విను ప్రభువు హైందవ క్రైస్తవ ప్రతినిధులకును హిందూ మహమ్మదీయసంఘ ప్రతినిధులకును విశదము చేసిన ధర్మలక్ష్యము గీతోపదేశమున కనురూపముగ నున్నది.

“ప్రపంచకల్యాణము సామ్యముగను వ్యక్తులకు గల విద్యాధిక్యతను, గౌరవమును, సంపదలను ననుసరించి గాక వారి ధర్మశీలము ననుసరించి యుండును. ఈ ప్రయోజనములు మానవులు ధరించెడి వస్త్రములవలె విలువను గలిగియున్నను నిజమైనవిలువగలవి కావు. జీవితమునందును, సంసారమునందును బలదుర్బలులకుమూలమై మానవుల పతనమునకుగాని, యుద్ధరణమునకు గాని వినియోగపడునది ధర్మశీలము.”

ఇర్విను ప్రభువు వ్యక్తము చేసిన ధర్మలక్ష్యమును నిరంకుశప్రభుత్వములును నాయకులు గమనించుట యుక్తము.

* * * *

నానాజాతిసమితి

ప్రపంచశాంతి కేర్పడిన నానాజాతిసమితి మహాజాతుల ప్రయోజనములకు వినియోగపడునటులు చిన్నజాతుల ప్రయోజనములకు శాంతిస్థాపనమునకు వినియోగపడుట లేదు. మహాజాతులందు పెచ్చుపెరుగుచున్న మాత్సర్యము జినీవాయందు సెప్టెంబరు మాసారంభమున గూడిన నానాజాతిసమితి సమావేశమునందు ప్రతిబింబించుచున్నది. నానాజాతిసమితియం దన్నిజాతులును స్వలాభమునుగోరుచు సమితిప్రయోజనములను నిరర్థకము చేయుచున్నవి. స్పెయిను శక్తి లేకపోయినను పట్టుదలను విడువకున్నది. సమితియందు స్పెయినునకు స్థిరమైన ప్రాతినిధ్యము గలుగకపోయినది. స్పెయిను తన తాత్కాలిక సభ్యత్వమును వదులుకొనినది; సమితి చర్చలందు పాల్గొనుటకు నిరాకరించినది. స్పెయిను హక్కును చిన్నరాజ్యములు సమర్థించి పెద్దరాజ్యములు నిరాకరించినవి. స్పెయిను పట్టుదలకును పెద్దరాజ్యముల నిర్ణయమునకును స్వప్రయోజనము కారణముగాని ధర్మప్రయోజనము కారణముకాదని వ్యవహారములు విశదము చేయుచున్నవి. జర్మనికి సమితియందు ప్రవేశమును నంగీకరించుట శాంతిస్థాపనమునకు శుభసూచనగనున్నది. జర్మనీ సమితియందు ప్రవేశమును జేసినతరువాతను జరుగనున్నకథను కాలము విశదము చేయగలదు. యూరపు రాజ్యముల స్వప్రయోజనములను సాధించుటకు జర్మని ప్రవేశ మవసరమయినది. జర్మని రుష్యాలు లేనిసమితి భాగ్యవంతమైనను, బలవంతమైనను పాశ్చాత్యరాజ్యముల ప్రపంచయాత్రకు నిరర్థకము. సమితి మహారాజ్యముల వశము చేసిన దేశములందు జర్మని కేమిభాగము సంక్రమించునో కాలము నిర్ణయింపగలదు.

ఇటలియందు ముసులోని ప్రజలయందు లోభమును వృద్ధిచేయుచున్నవిధమును నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. ముసులోనిగా రొకగేటుతో రాజ్యవిధానమును, వారి సాంఘికాచారములను నిర్ణయములను మార్చుచు దేశమునందు సంక్షోభమును గలుగజేయుచున్నారు. ప్రజలు లోభగ్రస్తులై వారి నిరంకుశ నిర్ణయములను ప్రతిఘటించుటకు వెనుకాడుచున్నారు. స్త్రీల వస్త్రధారణవిధానమునందు జేయదలచిన మార్పులెంతవరకు ప్రయోగయోగ్యములో కాలము తెలుపగలదు. స్పెయినును మొరోకో విజయములు నూతన విజయములకు పురిగొల్పుచున్నవి. టేంజీరు సమస్య యూరపు రాజ్యములందు సంక్షోభమును గలుగజేయవచ్చును. రుష్యా, ఇటలీ, పోలాండులు, స్పెయినుహక్కులను సమర్థించుచున్నవి. స్పెయినుసమస్యయందు చిన్నరాజ్యముల పెద్దరాజ్యముల సమస్య ప్రత్యక్షమగుచున్నది. మహాసామ్రాజ్యములైన గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు, ఇటలి, స్వప్రయోజన సంరక్షణార్థము గలుగజేయుచున్న సంక్షోభము

సమితిప్రయోజనములకును ధర్మ రక్షణమున కును ప్రతికూలముగ నున్నది. ప్రతికూలపరిస్థితులందు అమెరికా తటస్థభావమును బూనుటయందు విచిత్రము గనుపడదు.

ఈ సంరంభముల కాద్యంతములు గనుపడవు. నానాజాతిసమితి తెల్లజాతుల ప్రయోజనములకు గొంత యుపచరించినను నల్లజాతుల ప్రయోజనములకు నిరుపయోగముగ నున్నది. మొరోకో స్వాతంత్ర్యము నాశనమైనది. సిరియా సంగ్రామసంక్షోభము ననుభవించుచున్నది. ఈజిప్టు పరాధీన ప్రతిబంధకము ననుభవించుచున్నది. ఆఫ్గనిస్థానమునందు రుష్యారాజ్యతంత్రము ప్రబలుచున్నది. ఆఫ్గనురాజ్యమునకును రుష్యారాజ్యమునకునుజరిగిన సంధి యాంగ్లరాజ్య తంత్రజ్ఞులకువిషాదమును గలుగజేయుచున్నది. ప్రపంచవ్యాప్త సామ్రాజ్యమును నిర్వహించుచున్న బ్రిటీషురాజ్యాధికారులకు సమితి ప్రయోజనములను, ధర్మప్రయోజనములను సంరక్షించుటకు స్వజాతీయ ప్రయోజనములు ప్రతిబంధకములుగ నున్నవి. నానాజాతుల సమితి నానాజాతుల హక్కులను, మానవధర్మములను సంరక్షించుటకు బదులు పెద్దరాజ్యముల ప్రయోజనములను విస్తరింపచేయుటకు మాత్రము వినియోగపడుచున్నవి. జినీవాకు వెడలిన భారతీయ ప్రతినిధులు స్వదేశ ప్రయోజనములను నుద్ధరించుటకు చేయగల దేదియును లేదని సమితి వ్యవహారములు విశదము చేయగలవు.

* * * *

బ్రిటీషురాజ్యాధికారులలక్ష్యము భారత ప్రభుత్వముపట్లను కొంచెమైనను మారలేదని భారత రాజ్యాంగ విధానమును, బ్రిటీషు రాజ్యాంగవ్యవహారములును విశదము చేయుచున్నవి. ఇర్విను ప్రభువుచేసెడి ప్రసంగములు ధర్మప్రతిపాదనమును జేయుచున్నను నిరంకుశాధికారుల హృదయమునందు సంచలనము గలుగలేదని నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. బర్కెను హెడు వింటరుటను ప్రభువుల ప్రసంగములు, చర్యలు, నిరంకుశ విధానము సుప్రతిష్ఠితమై స్థిరముగ నుండగలదని విశదముచేయుచున్నవి. బ్రిటీషుప్రభుత్వము బ్రిటీషుప్రయోజనములకేర్పడినవిధమును బర్కెను హెడుప్రభువు చాటుచున్నాడు. ఇర్వినుప్రభువు ధర్మసమన్వయమును జేయుటకు జేసిన ప్రసంగములు సిద్ధాంతమునందు బాగుగ గనుపడినను ప్రయోగమునందు నిరుపయోగముగ నున్నవి. రాజ్యాంగ విధానమంతయును బ్రిటీషు ప్రయోజనములను, నిరంకుశ విధానమును రక్షించి పోషించుట కనుకూలించునపుడు ఇర్వినుప్రభువర్యుని సద్భావములువ్యవహారములందునిరుపయోగములు. బ్రిటీషుప్రయోజనములకును, భారత ప్రయోజనములకును సంరంభము గలుగునపుడు బ్రిటీషు ప్రయోజనములకు విజయమును, భారత ప్రయోజనములకు పరాజయమును గలుగుచున్నది. కర్రెన్సికమిషను చేసిన నిర్ణయములు భారత ప్రయోజనములకు ప్రతికూలములని సర్ పురుషోత్తమదాసు, ఠాకూరు మొదలగు ప్రముఖులు ప్రతిపాదించినను

భారత ప్రభుత్వము వీరి వాదములను నిరాకరించి ఉపసంఘము చేసిన నిర్ణయముల నంగీకరించినది. నవరనుల మారకమును ఒకషిల్లింగు నాలుగు పెన్నులకు బదులు ఒక షిల్లింగు ఆరు పెన్నులను నిర్ణయించుట వలన బ్రిటీషు వ్యాపారస్థులకును, పెట్టుబడిదారులకును లాభకరముగాని భారత ప్రభుత్వమునకు లాభకరము గాదు; భారతకర్షకులకును లాభకరము గాదు. బంగారునాణెములను వాడుకయందుంచక బంగారునాణెముల చలామణిని నిర్ణయించుట నిరుపయోగము. భారత ప్రయోజనములు బ్రిటీషుప్రయోజనములకు బలిదానము చేయుట సర్వసామాన్యమైనవిషయము. జాతిద్వేషము నాపుటకు భారత ప్రభుత్వము నిర్మించిన శాసనము నిరంకుశాధికార స్వభావమును విశదము చేయుచున్నది. భారతరాజ్యాంగములందు బ్రిటీషుప్రయోజనములకును నిరంకుశవర్గ ప్రతిభకును గల ప్రతిష్ఠ భారత ప్రయోజనములకును, ప్రజాశయములకును లేనివిధమును రాజ్యాంగవిధానములు శాసనసభలు విశదము చేయుచున్నవి. వర్తమాన రాజ్యాంగవిధానముమారనంతవరకును భారతవర్షమునకు మోక్షణసాధనము దుర్లభమని సామాన్యులకు నయితము విశదమగుచున్నది. ఇప్పు డుపసంహారమును బొందుచున్న సామ్రాజ్యశాసనసభయును, రాష్ట్రీయశాసనసభలును నీయుదంతమును వేయినోళ్ళను జాటుచున్నవి.

* * * *

రెండవ సామ్రాజ్యశాసనసభ

మోంటుఫర్డు సంస్కరణములు ప్రసాదించిన రెండవ సభ యంతము నొందినది. మోంటుఫర్డుసంస్కరణములు పనిచేసిన యీ రేండ్లకాలమునందును స్వరాజ్యప్రస్థానమున కాటంకములు గలిగినవిధమున సహాయము గలుగలేదని సభాచారిత్రము విశదముచేయుచున్నది. మొదటిసభయందు సహాయవాదులు, మితవాదులు నిర్బంధముల నిర్మాణమునకు వారిపలుకుబడిని వినియోగించి ప్రజాహృదయములందు ప్రజ్వరిల్లిన స్వరాజ్యోత్సాహమును నిర్మూలము చేయగలిగిరి. పరాధీనజాతులందు ఉద్యోగములు, పదవులు, సంస్కరణములుస్వధర్మానుష్ఠానమును దురారాధ్యము చేయగల విధమును శాసనసభల యుదంతము విశదము చేసినది. గాంధి మహాత్ముడు ప్రజాహృదయమునందు వికసింపజేసిన స్వరాజ్యోత్సాహమును చల్లార్పుటకు నిరంకుశవర్గమునకు మితవాదులు చేసినసహాయము వారి పతనమునకు తోడ్పడినది. శాంతి సంరక్షణవ్యాజమున భారతీయమంత్రులు నిరంకుశవర్గమునకు జేసిన సహాయము భారత రాజ్యాంగచరిత్రయందు సుప్రతిష్ఠను బడసినది. లోకోత్తర పురుషుడును శాంతి దూతయును నైన గాంధిమహాత్ముని ముప్పదివేల శాంతియోధులను నిర్బంధించుటకు తమయధికారమును వినియోగించిన భారతీయ నాయకుల చిత్తవృత్తిని గనుగొనుట బ్రహ్మకైనను సాధ్యముగాదు. మొదటి శాసనసభలతో మితవాదుల ప్రతిష్ఠ యంతరించినది. ఎన్నికల

యందు మితవాదనాయకులు పరాజితులైరి. గెలుపొందినవారు క్రొత్తపక్షములందు చేరిరి. రెండవసభయందు ప్రజలచిత్తప్రవృత్తి ప్రభుత్వమునకును, నాయకులకును విశదమైనది.

*   *   *   *

రెండవ సామ్రాజ్య శాసనసభయందు స్వరాజ్యపక్షప్రవేశము సభకు నూతనశోభను గలుగజేసినది. దేశబంధుదాసు ప్రతిపాదించిన ప్రతిష్టంభనతంత్రమును సామ్రాజ్యశాసనసభయందు స్వరాజ్యపక్ష మవలంబించి నిరంకుశ ప్రభుత్వమును సకలవిధములను ప్రతిఘటించినది; నిరంకుశ ప్రభుత్వమున కెన్నియో సారులు పరాజయము గలిగించినది. స్వరాజ్యపక్షనాయకులు పండిత మోతీలాలు నెహ్రూగారు నిరంకుశ ప్రతిఘటనమునందు జూపిన దక్షత్వము ప్రశంసార్హముగనున్నది. స్వరాజ్యపక్షము మొదటియేడు బడ్జెటును నిరాకరించినది. రెండవయేడు కార్యనిర్వాహక వర్గము కోరిన మొత్తములను నిరాకరించినది. పైని కార్మిక వ్యవస్థలందును, నుద్యోగసమస్యలందును స్వాతంత్ర్యమును ప్రదర్శించినది. మొదటిసభ నిర్మించిన నిరంకుశపాశములను తెగగొట్టుటకు శాసనసభ ప్రయత్నించినది; ముఖ్యముగను భారత స్వాతంత్ర్యాశయములను ప్రకటించి స్వధర్మనిర్వహణమును జేసినది. మోతీలాలుగారి నాయకత్వముక్రిందను స్వరాజ్యపక్షముచేసిన ధర్మనిర్గమనము సభావ్యవహారములందు ప్రతిష్ఠను బడయగలదు.

విఠలభాయి పటేలుగారి యధ్యక్షత సభాప్రతిష్ఠను విస్తరింపజేసినది. పటేలుగారు పరమస్వతంత్రులు. స్వరాజ్యపక్షావలంబకులు. సందిగ్ధస్థితియందున్న పటేలుగారి నిర్ణయములు నిందాపాత్రములు గాక ప్రశంసాపాత్రములగుట స్వధర్మనిర్వహణమునందు భారతీయుల ధర్మపరత్వమును విశదముచేసినది. అన్ని పక్షములవారును పటేలుగారి ధర్మపక్ష్యమును ప్రశంసించిరి. సర్ శివస్వామయ్యరుగారుపటేలుగారు మూడవ శాసనసభ కేకగ్రీవముగ నధ్యక్షులుగ నెన్నుకొనబడవలయు నని కోరుట ప్రశంసనీయముగ నున్నది. సామ్రాజ్యశాసనసభయం దారంభమునందు భారతీయ సభ్యులకుగల సంయోగము సాహచర్యము నానునాను చెడిపోవుట సంతాపకరముగ నున్నది. సంపూర్ణబలము లేని స్వరాజ్యపక్షమునకును, ఇతరపక్షములకును నేర్పడిన సంయోగము క్రమముగ క్షీణించుటయె శాసనసభాదుర్బలత్వమునకు మూలకారణము. స్వతంత్రపక్షము జిన్నాగారి నాయకత్వముక్రిందను ప్రత్యేకమార్గము నవలంబించుట కుపక్రమించినది. స్వరాజ్యపక్షమునందును భేదాభిప్రాయము లేర్పడినవి. పక్షభేదములు, జాతిభేదములు, సాంఘికభేదములు ప్రబలినవి. హిందూమహమ్మదీయవిభేదములు వర్ధిల్లినవి. స్వరాజ్యస్వతంత్ర పక్షభేదము లతిశయిల్లినవి. నిరంకుశవర్గమున కీ విభేదములు సామ్రాజ్యశాసనసభాబలమును భేదించుటకు కలహప్రియునకు వలె వినియోగపడినవి. రెండవ శాసనసభయందు స్వయంసహాయధర్మము క్షీణించినది. పరావలంబన ధర్మము క్రమముగ వర్ధిల్లినది. ప్రతిష్ఠంభనతంత్రమును

ప్రతిపాదించిన స్వరాజ్యపక్షము మిశ్రమవిధానము నవలంబించినది. ఈ పరివర్తనమునకు మూలాంకురములు భారతప్రభుత్వవిధానము నందే కలవని యనుభవము విశదముచేయుచున్నది. పరిమితములైన రాజ్యాంగసంస్కారణములే సాంఘికవిభేదములకు గారణంబులని నాయకుల యభిప్రాయములు విశదముచేయుచున్నవి.

*        *        *        *

సాంఘికపక్ష విభేదములు

హిందూమహమ్మదీయ విభేదముల నంతరింపజేయుటకు గాంధి మహాత్ముడు చేసిన ప్రయత్నము లుభయసంఘముల నాయకులకును జ్ఞానోదయమును గలుగజేయుటకు దగియున్నవి. సమ్మేళనమునకు త్యాగము సాధనముగాని స్వప్రయోజనపరాయణత్వము సాధనము గాదు. హిందూమహమ్మదీయ సమ్మేళనమునకు మహాత్ముడు 20 దినము లుపవాసమును జేసెను. ఢిల్లీయందు నాయకుల మహాసభ గూడినది. రెండు సంఘములకును మిత్రత్వమును సమకూర్చుటకు నాయకులు శపథము చేసిరి. శ్రీమతి సరోజినీదేవి హిందూమహమ్మదీయ సమ్మేళమునకు యావచ్ఛక్తిని వినియోగించుచున్నది. వర్తమాన కాలమునందు ప్రబలిన సాంఘికసంరంభము భయోత్పాదకమై నాయకుల యసహాయస్థితిని, ప్రభుత్వముయొక్క యుపేక్షను విశదము చేయుచున్నది. ఉత్తరహిందూస్థానమునందు వ్యాపకములైన హిందూమహమ్మదీయకలహములు భయంకరరూపమును ధాల్చినవి. గోవుల నిమిత్తమునో, మేళతాళముల నిమిత్తముననో, ఏలేనిపోనికారణముల నిమిత్తముననో హిందువులకు మహమ్మదీయులకు కలహములు వర్ధిల్లినవి. కలహములకు పట్టణములు ప్రధానరంగములుగ నున్నవి. కలహకారకులు స్వప్రయోజన పరాయణులైన నాయకులు గాని ప్రజలుగారని జనశ్రుతి తెలుపుచున్నది. ప్రజలు చెప్పుడుమాటలను, వ్రాతలను నమ్మి యవ్యక్తముగను ప్రవర్తించుచున్న విధమును పట్టణముల వ్యవహారములు విస్పష్టముచేయుచున్నవి. ఉత్తరహిందూస్థానమునందుహిందూమహమ్మదీయ సమస్యరీతిని దక్షిణహిందూస్థానమునందు బ్రాహ్మణబ్రాహ్మణేతరసమస్య కలహకారణం బగుచున్నది. పునహా యందును, చెన్నపురియందును సంప్రాప్తములైన దుండగములు ధర్మాత్ములకు సంతాపమును గలుగజేయుచున్నవి. రాజ్యాంగములందు భేదాభిప్రాయములున్నను దుర్మార్గమునకు చేయూతనొసంగుట సంఘవినాశమునకు గారణంబగునుగాని సంఘసౌభాగ్యమునకు సాధనంబు గాజాలదు. భిన్నసంఘములును, పక్షములును ఈపరమార్గమును గ్రహించుట సంఘాభ్యుదయమునకును, పక్షాభ్యుదయమునకును, దేశాభ్యుదయమునకును ప్రయోజనకరము. వోట్లప్రచారము దేశమునందంతటను కలహ బీజములను వికసింపజేయుచున్నది. సాంఘిక విభేదములవిషయమై సామ్రాజ్యశాసనసభయందు జరిగిన చర్చ ఫలప్రదము గాకపోయినను ప్రభుత్వదృష్టిని, ప్రజానాయకుల దృష్టిని ఆకర్షించుటకు వినియోగపడ దగి

యున్నది. సాంఘికకలహములకు వర్తమాన పరాధీనస్థితియే కారణములని చిరకాలానుభవజ్ఞులైన పండిత మదనమోహన మాలవీయగారును, దత్తగారును చేసిన హితోపదేశము నిరంకుశాధికారుల దృష్టిని నాకర్షింపదగియున్నది. ఉన్నతోద్యోగములు, పదవులు, నిరంకుశాధికారము ప్రజలను స్వప్రయోజనపరాయణులను, నిరంకుశవర్గమునకు దాసులను జేసి సాంఘికద్వేషములను పెంచుచున్నవి. స్వరాజ్యము స్వప్రయోజనపరాయణుల కీయవకాశములను దీసివేసి కలహకారణముల నంతరింప జేయుచున్నది. వివిధపక్షముల వారును, జాతులవారును, మతములవారును, కులములవారును ప్రత్యేకలాభదృష్టిని విసర్జించి సాముదాయికదృష్టిని బూనవలసిన యవసరమును సకలజనులును గ్రహించి దేశక్షేమమును మానవధర్మమును నారాధింతురు గాత !

*　*　*　*

ఎన్నికలు, పక్షములు, సంఘములు

సన్నిహితముగనున్న శాసనసభలయెన్నికలు జాతి పక్ష కుల మతభేదములను తీవ్రతరముచేసి ద్వేషగీతముల బాడుట కధికావకాశములం గలుగజేయుచున్నవి. పత్రికలయందును, ప్రకటనలందును, ప్రసంగములందును ద్వేషగీతము లనంతముగను ప్రత్యక్షమగుచున్నవి. ఎన్నికలకై పత్రికలు పుట్టినవి. కరపత్రములు వెలయుచున్నవి. ప్రచారములు సాగుచున్నవి. ద్వేషగీతములు దిగంతములయందు నిండుచున్నవి. పత్రికలు, ప్రచారకులు స్వపక్షసిద్ధాంతముల నెంతయైనను నుపదేశింపవచ్చును. నిరర్థకమైన వ్యక్తిదూషణలను జేయుటయును, ద్వేషగీతములను బాడుటయును దేశక్షేమమునకు హానికరము. ఈకారణమున గ్రహించియే గాంధిమహాత్ముడు ప్రజలను రాజ్యాంగ సంరంభమునందు వారి ముగ్ధదశయందు నిమగ్నులను జేయుట యనర్థకమని యుపదేశించెను. నాయకులు స్వధర్మమును గ్రహించి ప్రవర్తించుట క్షేమకరము. సాంఘిక నియోజకవర్గములు భారతజాతీయాభ్యుదయమునకు మహాపకారమును గలుగజేసినవి. మహమ్మదీయులు మహమ్మదీయనియోజకవర్గమును స్థిరతరముచేసి విస్తరింపజేయ గోరుచున్నారు. స్థానిక సంస్థలయందును, నుద్యోగములయందును మహమ్మదీయ ప్రాతినిధ్యమును గోరుచున్నారు. యూరపియనులు, ఆంగ్లోహైందవులు, క్రైస్తవులు, నిమ్నజాతులు, మహమ్మదీయుల మార్గము నవలంబించుచున్నారు. బ్రాహ్మణేతర సంఘమునందు ప్రత్యేక ప్రాతినిధ్యము వికారాకృతిని దాల్చుచున్నది. కాపు, కమ్మ, వెలమ, రెడ్డి, దేవాంగ, పిళ్ల, వెల్లాల మొదలగు సంఘముల నాయకులు స్వప్రయోజన పరాయణులై సాంఘికద్వేషమును వృద్ధిచేయుచున్నారు. వెలమ ప్రభుత్వముక్రిందను కమ్మ ప్రభుత్వమునకును, కమ్మ ప్రభుత్వము క్రిందను కాపు ప్రభుత్వమునకును, రెడ్డి ప్రభుత్వమునకును ద్వేషానలము ప్రబలి జాతీయజీవనము దుర్భరమగుచున్నది. విద్వేషవ్యాపనమునకు వ్యక్తులు గారకులుగాని సంఘ

ములు గారణములుగావని యనుభవము విశదము చేయుచున్నవి. ప్రత్యేక సంఘమునందు సైతము నాయకుల భేదాభిప్రాయములు ద్వేషములకు మూలము లగుచున్నవి. ప్రతిసంఘమునందును గ్రామపంచాయతులనుండి శాసనసభలవరకును పక్షములనుగట్టి కలహించుట సంఘదౌర్బల్యమునకును దేశదౌర్భాగ్యమునకును సాధనంబగుచున్నది. స్వసంఘాభిమానులు సాంఘికకలహములను, కక్షలను విసర్జించి సంఘజీవనమును జాతీయజీవనమును సారవంతము చేసి కృతార్థులగుదురుగాక! విజయవాడయందుగూడిన తొమ్మిదవ కమ్మమహాసభ యవలంబించిన మార్గము భిన్నసంఘముల యభ్యుదయమునకును భారతజాతీయాభ్యుదయమునకును నాదర్శప్రదమై వెలయునని నమ్ముచున్నాము.

* * * *

సాంఘికవిభేదములవలె పక్షములవిభేదములునుతీవ్రరూపమునుదాల్చుచున్నవి. శ్రీయుత లాలా లజపతిరాయిగారు స్వరాజ్యపక్షమునకంపిన రాజీనామాయును, లాలాజిగారికిని నేహ్రూగారికిని జరుగుచున్న వాదప్రతివాదములును దేశావృతమైన దురవస్థను విశదము చేయుచున్నవి. ఇరువురు మహానాయకులకొకపక్షమునకు నాయకత్వమును వహించుట సాధ్యము గాదు. లాజపతిరాయి గారికిని, నెహ్రూగారికిని కలకత్తాకాంగ్రెసునుండియును కాంగ్రెసులక్ష్యసాధనములందు భేదాభిప్రాయములు గలవు. హిందూమహాసభపట్లను వీరికి గల భేదాభిప్రాయములు లోకవిదితములు. ఒకవరయందు రెండు వాడికత్తులకు తావు లేదు. లాలాజిగారి కారంభము నుండియును సహాయనిరాకరణమునందును, ప్రతిస్తంభమునందును విశ్వాస మున్నటులు గనుపడదు. లాలాజి జెయిలునుండి గాంధిమహాత్మునకు వ్రాసినజాబీవిషయమును సమర్థించుచున్నది. సామ్రాజ్యశాసనసభయందు లాజపతిరాయిగారు స్వరాజ్యసభ్యులుగజేరి యాసభయందుప నాయకత్వమును వహించిరి. సబర్మతి యొడంబడిక లాజపతిరాయిగారి సమ్మతిని బడసినది. నెహ్రూగారు సబర్మతి యొడంబడిక నొకవిధముగ నామోదించినను అఖిలభారతకాంగ్రెసు సంఘము ప్రతికూలముగ నున్నపుడు నెహ్రూగారు స్వీయాభిప్రాయము నుపసంహరించుకొని సంఘాభిప్రాయమును శిరసావహించిరి. కాన్పూరుకాంగ్రెసు తీర్మానమును లాలాజీ నెహ్రూగారు లామోదించి యుండిరి. ఇంతవరకును కాంగ్రెసుద్వారా ఆ తీర్మానమునకు మార్పు గలుగలేదు. యథోచిత సహకారవాదులు కాంగ్రెసు సమయమునందే ప్రత్యేక పక్షముగ నేర్పడిరి. లాజపతిరాయిగారికి వారియభిప్రాయములను మార్చుకొనుట కితరులకుగల స్వాతంత్ర్యముగలదు. ఆస్వాతంత్ర్యము కాంగ్రెసు తీర్మానమునకు ప్రతికూలముగాని యనుకూలముగాదు. లజపతిరాయిగారు తెల్పిన యితర కారణములు సమంజసములైనను కాంగ్రెసుసిద్ధాంతము నవలంబించకుండుటకుమాత్రము గారణముగాజాలదు. వర్తమాన సందిగ్ధస్థితియందు లాజపతిరాయిగారివంటి మహానాయకులు కాంగ్రెసు

పక్షమునుండి విడిపోవుట దేశదౌర్భాగ్యము. లాలాజీగారి సేవాదీక్ష, విజ్ఞానము,మహోత్యాగము దేశమున కేవిధమున నుపయోగపడగలదో కాలము నిర్ణయింపగలదు.

కాన్పూరు కాంగ్రెసుతరువాత నిప్పటికిని రాజ్యాంగ పరిస్థితులందు మార్పు గలుగలేదని నెహ్రూగారు ప్రతిపాదించినభావము యథార్థముగనున్నది. వ్యక్తులధర్మమును జాతీయధర్మమునం దైక్యముచేయవలసిన యవసరమును నాయకుల ప్రవర్తనము విశదము చేయుచున్నది. నాయకుల యాచరణము సామాన్యులకు ప్రమాణమై యాచరణయోగ్య మగుచున్నది. లాలాజి మాలవ్యగారులును యథోచిత సహకారవాదులునుచేరి స్వతంత్ర కాంగ్రెసుపక్షమును స్థాపించుటకు చేయుచున్న ప్రయత్నము లెంతవరకు సఫలమగునో కాలమునిర్ణయింపగలదు. సిద్ధాంతములందును, ప్రయోగము లందును సామ్యత్వము లేని యథోచిత సహకారపక్షమునకును స్వతంత్రపక్షమునకును సంయోగమసాధ్యమని తోచుచున్నది. మూంజి, జయకరు, కేల్కారు, లాలాజి, మాలవ్యగారలను హిందూమహాసభాభిమాన మేకధర్మపాశబద్ధులను జేసినను రాజ్యాంగరంగమునందు సమానలక్ష్యము రెండుపక్షములకును సాధ్యముగాదు. ఈపక్షభేదము లన్నియును జాతీయదుర్బలమునకు సాధనంబు లగుచున్నవి గాని సౌభాగ్యమునకు సాధనంబు లగుట లేదు. వర్తమాన విషమదశయందు భారతీయుల నేకాశయపాశబద్ధులను జేయుటకు భక్తిపాశము సాధనము గాని, సిద్ధాంత రాద్ధాంతములు సాధనములు గావు. భారత రణరంగమునందు శ్రీకృష్ణోపదేశమును శిరసావహించిన విజయునివలెను భారతనాయకులును కాంగ్రెసునిర్ణయములను పాలించి విజయమును బడయుట ధర్మము. గాంధిమహాత్ముడు యంగుఇండియాయందు ప్రచురించిన నూలుచందాల వివరములు దేశావృతమైన జడత్వము విశదము చేయుచున్నవి. ఆంధ్రు లీవిషయమునను వెనుకబడియున్న విధమును లెక్కలు తెలుపుచున్నది. ఆరంభమునందు 487 సభ్యులు చేరివారిసంఖ్యలో 107 తగ్గుట లజ్జాకరముగ నున్నది. ఆంధ్రులు కార్యశూరులై వారిప్రతిష్ఠను గాపాడుకొనుట యవసరము.

* * * *

ఆంధ్రవిశ్వవిద్యాలయము

ఆంధ్రోద్యమాశయములకు మూలాశయమైన విశ్వవిద్యాలయస్థాపనమున కారంభోత్సవము విజయవాడయందు గతవారమునందు జయప్రదముగ ముగిసినది. చెన్నరాష్ట్ర గవర్నరుగా రారంభోత్సవమును సక్రమముగను జరిపిరి. వైసుఛాన్సలరుగారు విశ్వవిద్యాలయము మోయవలసిన భారమును విశదము చేసిరి. మాతృభాషాముఖమునను విద్యాశిక్షణమును జేయుటయును గూర్చియును, పారిశ్రామిక విద్యాశిక్షణమును గూర్చియును వైసుఛాన్సలరుగారు తెలిపిన భావములు నిరుత్సాహజనకములుగ నున్నవి. ఆంధ్రభాషాభిమానము సంకుచిత హృదయమునకు సాధనంబగునని గోషనుప్రభువు తెలిపిన భావ

ములు సత్యదూరములు. ఆంధ్రభాషాభిమానమును, నాంగ్లభాషా ద్వేషముగ బరిగణించుట యసమంజసము. ఒకదానిని ప్రేమించుట రెండవదానిని ద్వేషించుటగాదు. లోకమునం దెచ్చటను లేనిపరిస్థితులు భరతఖండమునకు సంప్రాప్తములైనవి. బ్రిటీషు విశ్వవిద్యాలయములందు పరభాషా ముఖమునను విద్యాభ్యాసమును జేయుట కాంగ్లేయు లంగీకరించెదరా? ఆంగ్లేయు లవలంబించని విధానమును నితరులేల నిర్బంధముగ నవలంబించవలయునో తెలియకున్నది. ప్రజాసామాన్యమునందు విజ్ఞానమును వ్యాపింపజేయుటకు దేశభాషలు శరణ్యములని యందరును నంగీకరించుచున్నను నుద్యోగముల లాభమున కాంగ్లభాషా ముఖమున విద్యను నేర్పుట కాంధ్రవిశ్వవిద్యాలయమును స్థాపించుట దేశక్షేమమునకు ప్రయోజనకరముగాదు. ఆంధ్రవిశ్వవిద్యాలయము పేరునకు గంభీరముగ నున్నను వ్యవహారమునందు మద్రాసు విశ్వవిద్యాలయమునకు సామాన్యానుకరణముగ నున్నది. మద్రాసు విశ్వవిద్యాలయమునకు గల సంపత్తిగాని, పరపతిగాని ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు గనుపడదు. శ్రీయుత రామలింగారెడ్డిగా రాంధ్రవిశ్వవిద్యాలయావసరముల నేకరువుపెట్టిరి. గవర్నరు రాజమహేంద్రవరము, అనంతపురములందు భవన నిర్మాణములకు ప్రయత్నములు జరుగుచున్నవని తెలిపినను విశాఖపట్టణమునందలి వైద్యకళాశాలవిషయమై తగినసమాధానమును దెలిపియుండలేదు. విజయవాడయందు కార్యాలయనిర్మాణసందర్భములందైనను ఆంధ్రవిశ్వవిద్యాలయమున కనురూపమైన సహాయసంపత్తిని గవర్నరు వ్యక్తము చేసియుండలేదు. కార్యాలయస్థితియే యవ్యక్తముగనున్నపుడు విజయవాడయందు విశ్వవిద్యాలయమును స్థాపించుట విషయమై యోచించుట యనవసరము. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు ప్రభుత్వముచూపిన నిరాదరణమునె ప్రజలునుజూపుట నిరుత్సాహమును ద్విగుణీకృతము చేయుచున్నది. ఆరంభోత్సవమునకు శ్రీమంతులు, ధీమంతులు, రాజులు, మహారాజులు విచ్చేసి నామకరణమహోత్సవమును హృద్యముగను నడిపిరి. విందులు, మోటారుల హడావిడులు, సిండికేటు ఎన్నికలయాడంబరములు, పురాలంకరణములు బాగుగజరిగినను చదివించినకట్నములుమాత్రము స్వల్పముగనున్నవి. శ్రీమంతు చల్లపల్లి రాజాగారు, విజయనగరము మహారాజుగారు రూ 25,000 ల కట్నముల నిచ్చిరి. ఇతరులు చెల్లించినముడుపులు స్వల్పముగనున్నవి. సంపదల్లు, ప్రతిభలేని ఆంధ్రవిశ్వవిద్యాలయ మాంధ్రాశయములను సఫలము చేయుట కెటులు వినియోగపడగలదో యుపాధ్యక్షులకును నగోచరముగ నుండును.

సహాధ్యక్షులైన శ్రీయుత బొబ్బిలి మహారాజుగారి రూ 1,00,000 లు విరాళము వారియుపదేశము వారి యాంధ్రాభిమానమున కనురూపముగనున్నది. మహారాజుగా రాంధ్రహృదయపీఠములందు విహరించెడి తిక్కన పోతనాదిమహాకవుల ప్రతిభను జ్ఞాపకము చేసి యాంధ్రవిశ్వవిద్యాలయ మవలంబింప వలసిన

విధానము నధ్యక్షులకును, నుపాధ్యక్షులకును ప్రేక్షకులకును శ్రుతపరచిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయాశయమాంధ్రులహృదయక్షేత్రములందు ప్రత్యభిజ్ఞానమును గలుగజేసి ప్రజాసౌభాగ్యమును వికసింపజేయుటగాని యుద్యోగలాభము గాదు. ఈయాదర్శము సఫలమగుటకు వర్తమానపరిస్థితులం దవకాశములు లేవని ప్రసంగములు, వ్యవహారములు, పరిస్థితులు, విశదము చేసినవి ఉపాధ్యక్షులు శ్రీయుత రామలింగారెడ్డిగారు విజ్ఞాన సంపన్నులు; విద్యాశిక్షణవిధానములందు విశేషానుభవము గలవారు; ప్రజాక్షేమపరాయణులు; మాతృ భాషాభిమానులు; పరమస్వతంత్రులు. పరిమితములైన పరిస్థితులందు రెడ్డిగారు చేయగలకార్యము గనుపడదు. లబ్ధావకాశములను నుపాధ్యక్షు లాదర్శములను సఫలము చేయుటకు వినియోగింపవలసియుందురు.

ఆంధ్రోద్యమ మారంభమై పదునేడేండ్లు గతించినవి. ఆరంభమునం దాంధ్రసభలు ప్రజాహృదయమునందు పరమోత్సాహమును గలుగజేసినవి. ప్రజా హృదయమునందు దేశభక్తి, భాషాభిమానము వికసించినవి. కవులు జాతీయసంకీర్తనమును జేయుచుండిరి. శిల్పులు జాతీయనిర్మాణముల కుపక్రమించిరి. నాయకులు జాతీయప్రబోధమునకు బూనుకొనిరి. నాయకులదృష్టి విజ్ఞాన రంగమునుండి రాజ్యాంగరంగమునకు మరలినది. ఆంధ్రదేశమున కాంధ్రరాష్ట్ర జాతీయోపసంఘమేర్పడినది. ఆంధ్రరాష్ట్రీయ సభ ఆంధ్రమహాసభాస్థానము నాక్రమించినది. ఆంధ్రోద్యమాదర్శములు రాష్ట్రీయసభాదర్శములందు లీనములైనవి. సహాయనిరాకరణోద్యమము విజృంభించి క్షీణించినది. స్వయంసహాయభావము క్షీణించి పరావలంబనభావము వర్ధిల్లినది. ఆంగ్లవిద్యావిధానమును నిరసించిన చిత్తవృత్తి యాంధ్రవిశ్వవిద్యాలయమునకు విజయధ్వానములతో స్వాగతంబు నొసంగినది. ఆంగ్లవిద్యావంతులప్రాభవ మాంధ్రవిశ్వవిద్యాలయోత్సవ సందర్భము లందు ప్రత్యక్షమైనది. ఉత్సవసందర్భములం దాంగ్లవిద్యావంతులకుగల ప్రతిభ ప్రజాసామాన్యమునకు గలుగలేదు. ఉత్సవప్రకరణము లందును, శృంగారములందును, వస్త్రధారణమునందును, ప్రసంగము లందును, చిత్తవృత్తియందును పరధర్మారాధనమునకు గల ప్రాబల్యము స్వధర్మారాధనమునకు గలుగలేదు. జాతీయజీవితమునం దిట్టి నిమ్నోన్నతములు సహజములు. జాతీయపరికల్పనమునందు వృద్ధిక్షయములను ప్రాజ్ఞులు సమయానుకూలముగను జాతీయోద్యమమునకు వినియోగింపగలరు. విద్యాధరి, విజయవాడపురాధీశ్వరి, శ్రీ కనకదుర్గాదేవి విజయవాడయందు స్థాపితమైన ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు మంగళాశీర్వాదంబుల నొసంగి రక్షించుగాత!




Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty Street, G. T. Madras.


విషయానుక్రమణిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు:—శంకరనారాయణస్వామి, లక్ష్మి.

ఏకవర్ణచిత్రములు:—తంజావూరి (కోట)లోని శిల్పచిత్రములు: ౬, ప్రాచీనాభరణములు ౨, అమినుల్లారాజుగారు, గాంధిమహాత్ముడు దక్షిణాఫ్రికారాయబారులలో నొకరికి బొంబాయినగరమున స్వాగతము నిచ్చుట; జార్జిమైకేలుదొరగారు, కార్సనుదొరసాని-ఇంగ్లీషుచానలును ఈదినవారు. కోయంబత్తూరు వ్యవసాయ,ఆరణ్యక కళాశాలలయందలి ఆంధ్రవిద్యార్థులు; దక్షిణాఫ్రికా రాయబారులు; ఇతర చిత్రములును.



# ప్రాతఃస్మరణము

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు (శతావధాని)

జయజనని, భరతవసుధే! జయ భూయ స్సార్వభౌమజనయిత్రి!
జయ సర్వ సంపదాఢ్యే! జయజయ సుయశఃపవిత్రచారిత్రే!

మాత! స్తవ జన్మభువో వీరవతంసప్రసూతిపూతాయాః,
తేజోమయం స్వరూపమ్ ప్రాచీనం తత్కదా, క్వ, పశ్యేమ?

భీమార్జునభీష్మాద్యైః శూరై ర్వీరై ర్విరాజతే పుత్రైః;
సంతతజయఘోషాఢ్యే! భోమాత! ర్దర్శయ క్వ, తే రూపమ్.

తవ పుత్ర శ్చాణక్యః తవ పుత్ర శ్చంద్రగుప్తధరణీభృత్;
శ్రీహర్షాశోకాద్యా స్తవపుత్రాః కిం, వయంచ తే పుత్రాః?

తవ తేజ స్తవ మహిమా తవ మహితైశ్వర్య మార్యజనసేవ్యమ్;
విస్మృత్య తేఽంబ! కృపయా ముహు రాత్మానం ప్రదర్శయాస్మాకమ్.

# శ్రీ సత్యనారాయణస్తవము

కేతవరపు వెంకటశాస్త్రిగారు

పంచరత్నములు

నీరేజాసన పాకశాసనముఖుల్ నీతత్త్వముం గానఁగా
లేరన్నన్ మఱి మూఢమానసుఁడ నేలీలం గనుంగొందు? ని
న్నేరీతి న్నుతియింపనేర్తుఁ? గృప న న్వీక్షింపవే నానమ
స్కారంబుల్ గయికొంచు రత్నగిరివాసా, సత్యనారాయణా!

మ. భవదీయంబగు దివ్యరూప మెద నిల్పంజాలఁగాలేని మా
నవులం గేవల ముద్ధరింప జగతిన్ బ్రత్యక్షరూపంబుతో
నవతారించితి రత్నశైలమున నీ వత్యంతదీనావనో
త్సవ సంసక్తుఁడవంచు నెన్నఁదగుఁగాదా, సత్యనారాయణా!

శా. సామాన్యంబగు కొండకాల్వ శుచితా సంపూర్ణగంగానదీ
నామంబందెను, ఘోర జంతుతతికిన్ గండ్రాలకున్ ఇండ్లకున్
ధామంబౌ నొకగుట్ట రత్నగిరి నా ధాత్రి న్విరాజిల్లెడిన్
నీమాహాత్మ్యముఁబట్టి; యెన్నఁదరమే నిన్ సత్యనారాయణా!

మ. కలికాలంబు బలంబు పెంపునను గంగన్గల్పి సత్కర్మము,
ల్బొలియంజేసి స్వధర్మముల్, సెడెడి యీ లోకంబు చేకొంచు, దు
ర్బలులౌ వారికిఁ దగ్గ పుణ్యసులభోపాయంబుగా నీవ్రతం
బలరం జేసితిఁగాదె, రత్నగిరివాసా, సత్యనారాయణా!

మ. శతయాగంబు లొనర్చి, నిశ్చల తపశ్చర్యాదులం జేర్చి, సం
తత దానంబులఁజేసి నేమములఁ జెందంజాలఁగాలేని, శా
శ్వతపుణ్యం బొకటం గడింపఁబడు; సుశ్రద్ధాదుల న్గూడి నీ
వ్రతమున్ జేసినయంతమాత్రమున దేవా? సత్యనారాయణా!